# శ్రీవివేకానందస్వామి జీవితము

(ప్రథమ భాగము)

గ్రంథకర్త:

బులుసు వెంకటేశ్వర్లుగారు, బి. ఎ.,

---

పబ్లిషర్సు:

శ్రీరామకృష్ణపూజామందిరము

కొత్తపేట, గుంటూరు.

ద్వితీయ ముద్రణము 1000 ప్రతులు.

కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె

1933



[Price Rs. 0—12—0.

# ఉపోద్ఘాతము.

స్వామివివేకానందుఁడు భారతవర్ష పునర్నిర్మాణకర్తలలో నగ్రస్థానము వహించిన దేశభక్తుఁడు, హిందూమత పునఃప్రతిష్ఠాపన సల్పిన అపరశంకరుఁడు; రెండువేల వత్సరముల వెనుక, మొదటిసారి పశ్చిమఖండమునకు మతసందేశ మొసగిన మహాప్రవక్త; భౌతికాశయ పూరితమగు నీయిరువదవశతాబ్దములో భగవంతుని ప్రత్యక్షదర్శనము గాంచినమహర్షి; నలుబదేండ్లస్ఖలితబ్రహ్మచర్య మనసూనముగానిల్పిన శుకయోగి; దరిద్రనారాయణసేవాసందేశమును దిగ్దిగంతముల ఘోషించిన అపరబుద్ధావతారుఁడు; సర్వమతసామరస్యమును కల్పించిన ధీప్రపూర్ణుఁడు; సర్వసంగత్యాగాగ్నిలో జీవితమాహుతియొనర్చిన సన్యాసచక్రవర్తి; శ్రీరామకృష్ణ మతసంస్థాపనచేసిన ఉత్తమకర్మయోగి. ఆమహామహుని దివ్యచరిత్రము ప్రపంచములో నన్నిదేశములలోను విరివిగా వ్యాప్తమైనది అన్ని ముఖ్యభాషలలో నాతనిసందేశము వెల్లివిరిసినది. వివేకానందుఁడు మహాసమాధిచెంది యిప్పటికి ముప్పదివత్సరములు దాటినది. ఒక్క ఆంధ్రభాషలో నాజాతీయవీరుని జీవితము లేకుండుట, ఆంధ్రులదురదృష్టము, వాభాగ్యము. ఏలన ఆంధ్రులలోఁ బెక్కుమంది వివేకానందభక్తులు, పండితులు, ఆతని జీవితమును వ్రాయఁగల సమర్థులు లేకపోలేదు. అనేక జన్మార్జితపుణ్యవశమున, నీ జీవితరచనాకార్యము, భగవానుఁడగు శ్రీరామకృష్ణ పరమహంస, నాచేఁజేయించి నన్నుఁ గృతార్థునిఁ జేయ, అనన్య సామాన్య దయాంతఃకరణముతో నిప్పటివఱకు వేచియుండుట నాకలభ్యమగు సదృష్టమని నిక్కముగనమ్ముచున్నాను.

రెండు వత్సరముల వెనుక జీవితములోని ప్రథమ భాగమును ప్రకటించినాను. రెండవ భాగ మిప్పటివఱకుఁ బ్రచురింప భగవానుఁడు పూనుకొనలేదు. మొదటిభాగము నాంధ్రసోదరులు మితిలేని యాదరముతో మన్నించి నాకొసఁగిన ప్రోత్సాహమునకు వారికి కృతజ్ఞుఁడను. ఇప్పుడు, గుంటూరులో శ్రీరామకృష్ణ పూజామందిరము నొకటిస్థాపించి, మానవసేవయే పరమావధిగానిడుకొని, శ్రీయుత అవ్వారి హనుమయ్యగారు, స్వామిజీవితమును గైకొని, రెండు భాగముల నచ్చొత్తించినందులకు, వారికి నావందనసహస్రంబులు. శ్రీరామకృష్ణ పూజామందిరము, దినదినాభివృద్ధినంది, ఆంధ్రులకు సేవానిధియై వెల్గొందుఁగాక! ఈజీవితచరిత్ర పాఠకులగు నాంధ్రసోదర సోదరీమణులలో నొక్కరైనను, భారత పుత్రాగ్రగణ్యుఁడగు వివేకానందుని సందేశమును జీర్ణించుకొన్నచో, నాయత్నము సఫలమైనదని గర్వించెదను.

కాకినాడ<br>15-జూన్-1933.

ఇట్లు,<br>బులుసు వెంకటేశ్వర్లు, బి. ఏ.,

# పీఠిక.

ఆంధ్రనవలాసారస్వత నిర్మాతలగు

బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము పంతులుగారు.

మహారాజశ్రీ బు॥ వేంకటేశ్వర్లుగారు వివేకానందస్వామి జీవితములో మొదటిభాగము రచించి, కొంతకాలము క్రిందట నాకడకుఁ గొనివచ్చి కొంతభాగము చదివి వినిపించిరి. ఇప్పుడు రెండుభాగములు కూడఁ బూర్తిచేసి అందు ముఖ్యమైనవల్లు కొన్ని చదివి వినిపించిరి. ఆభాగములు విని నేను మిక్కిలి సంతసించితిని. శైలిగంభీరమై, ప్రశంసనీయమైయున్నది. ఈకాలమున, నవలలకన్న, నాటకములకన్న కథలకన్న, కావ్యములకన్న లోకోత్తరచరిత్రలు గల మహనీయుల జీవితములు లోకమునకును, ముఖ్యముగా మనదేశమునకును చాల గావలసియున్నవి. అందులో వివేకానందస్వామి చరిత్రవంటి పరమపావనచరిత్రము మనదేశమున కిపుడు మిగుల నవశ్యమని వేరుగఁ జెప్పనక్కరలేదు. ఈమహనీయుఁడు హిందూమత మహాసముద్రమును తఱచి, అందలి సారామృతమును వెలికిఁదెచ్చి, భారతవర్షమునకే గాక, ఐరోపా అమెరికామొదలగు పశ్చిమఖండములకుఁ గూడఁ బ్రసారించి, ప్రపంచమునకు మార్గదర్శకుఁడయ్యెను. ఆంగ్లేయభాషయందలి తనవచోమాధుర్యముచేఁ బ్రాచ్యపాశ్చాత్యఖండవాసుల సమ్మోహితమొనర్చెను. నవీననాగరికతాంధకారమగ్నులగు లోకులకుఁ బ్రాచ్యవిజ్ఞానభాస్కరమండలము చూపి వారిని గాఢనిద్రనుండి మేల్కొల్పెను. తన యుపన్యాసమహావాయువులచేతఁ బ్రపంచము

నుయ్యాలలూగించెను. అట్టి వివేకానందస్వామి జీవితము నాంధ్రదేశమునకు సంప్రాప్తింపఁజేసి మన వెంకటేశ్వర్లుగారు, ఆంధ్రమహాజన సేవయు, నాంధ్రసారస్వతసేవయుఁ జేసినారనుట అతిశయోక్తి కాదు. ఈయువకుఁడు వివేకానందస్వామి యుపన్యాసములఁ దెనిగించియు, లోకోద్ధారకులైన యితర మహాపురుషుల జీవితముల రచించియు, నితోధికాంధ్రసారస్వతసేవ చేసి వృద్ధుల యాశీర్వాదమునకును, యువకుల కృతజ్ఞతాపూర్వకవందనములకును పాత్రుఁడగును గాక. పరమేశ్వరుఁ డీయువకునకు దీర్ఘాయురారోగ్యములు ప్రసాదించుఁగాక.

6—7—33,
రాజమండ్రి.

ఇట్లు,
చిలకమర్తి లక్ష్మీనరసింహము.

# పీఠిక.

---

ఆంధ్రభీష్మ న్యాపతి సుబ్బారావుపంతులుగారు.

మ॥రా॥శ్రీ॥ బులుసు వెంకటేశ్వర్లుగారు వివేకానందజీవితము రెండుభాగములు తీసికొనివచ్చి నాకుఁ జదివి వినిపించిరి. వివేకానంద స్వామి హిందూమతమును, తన్మూలమున భారతవర్షమును, ఉద్ధరింప జీవితము నర్పించిన మహాధీరుఁడు. హిందూవంశ సుస్థితి కాయన కన్నీళ్ళు కార్చి, ఆత్మబలమొసఁగు సనాతనధర్మసందేశము నలుదెసల వ్యాప్తినల్పినఁగాని యీదేశమౌన్నత్యము పొందఁజాలదని, తమ వ్రాతలలోను, ఉపన్యాసములలోను బోధించియుండిరి. శ్రీరామకృష్ణ మఠనిర్మాణముచేసి, సనాతన ధర్మవ్యాప్తిచేయు సన్యాసులను వారుకొలదిమందిని తయారు చేసియున్నారు. కాని ప్రస్తుతస్థితిలోఁ బ్రతిపట్టణమున, బ్రతిపల్లెలో జనసామాన్యములో నీసందేశము విరఁజిమ్ముటకు, పెక్కురు యువకు లవసరమైయున్నారు. వారిని తరిఫీదుచేయుటకు అచ్చటచ్చట బ్రహ్మజ్ఞానపాఠశాల లేర్పరచవలసియున్నవి. హిందూమిషనరీలను వేలకొలది తయారుచేసి వేదవేదాంతధర్మములను, వాడవాడల చాటవలసియున్నది. మధురమై, గంభీరమై, నిర్దుష్టమై, ఆవేశ జనకమగు శైలిలో వెంకటేశ్వర్లుగారిచే వ్రాయఁబడిన యీజీవితచరిత్రమును చదువు ప్రతియాంధ్రుఁడు స్వామిసందేశమును గుర్తించి ఆచరింప యత్నించును గాక. ఆంధ్ర సోదరసోదరీమణుల కీ యమూల్యగ్రంథమూలమున, అమితసేవ యొనర్చిన యీయువకుని నేనుమనఃపూర్వకముగా నభినందించి, ఆశీర్వదించుచున్నాను.

6—7—33,
రాజమండ్రి.

ఇట్లు,
న్యాపతి సుబ్బారావు.

---

VI

# పత్రికాభిప్రాయములు.



"ఆవేశపూరితమగు స్వామి వివేకానందునిజీవిత మీపుటలలో నసాధారణమగు సామర్థ్యముతో సత్యాంశములకు లోపములేకుండ వర్ణింపఁబడినది. త్యాగమణియగు స్వామిజీవితము నీ గ్రంథకర్త, నిస్తుల మనోరంజకమగు ధోరణిలోఁ బ్రదర్శించినాఁడు."

"హిందూపత్రిక."



"వీరారాధన పరత్వము పొంగులుదేఱు ధోరణితో గ్రంథకర్త యిదిచాల ప్రశంసార్హముగ రచించినాఁడు. ఇట్టికార్యమునకుఁ దనయర్హతనుగూడ పెక్కుతావుల ప్రకటించుకొన్నాఁడు."

"ఆంధ్రపత్రిక"



# శ్రీ వివేకానందస్వామి జీవితము.

మొదటిభాగము-విషయసూచిక.

నెంబరు:— ॥విషయము॥ పుట:—

ఓం సర్వేశ్వరాయనమః

# శ్రీ వివేకానందస్వామి జీవితము.



## మొదటి అధ్యాయము.

రక్తమాంసాస్థికల్పిత శరీరమును ధరించి, తత్సాహాయ్యమున మోక్షముంబొందుటకు బదులు శరీరము, తదంగములు, అందలి రోమములుగూడ శాశ్వతములని నమ్మి క్షణికశిశ్నోదరతృప్తికై అహంకారమమకారపాశబద్ధులై, కోరినకోర్కెలు ఫలింపమి విచారసాగరమున కెదురీదుచు, నిరంతర సంచలద్ద్వేషతరంగములచే నట్టయుడుగునకుం ద్రోయంబడి యెవరు దిక్కని యట్టులెత్తి యంగలార్చుమానవకోటిని తమ యప్రతిమానధైర్యసాహసములచే నిరుపమానతత్త్వబోధనాపటిమచే నిశ్చంచలనిర్మలపవిత్రనాదర్శములచే నిరహంకారనిరుపమవైరాగ్యజ్ఞానముచేం జేయూంతనిచ్చి లేవనెత్తుటకై అప్పుడప్పుడా పరంజ్యోతిరంశములు లోకమున శరీరములు ధరించుచుండును. అట్టి భగవదంశాసంభూతులలో నగ్రగణ్యుడే స్వామివివేకానందుం డన్నచో నేమిసాహసము! ప్రాచ్యపాశ్చాత్యసంఘముల నెట్లాతండు తన మృదుమధుర వేదాంత సారామృతబిందువులం జల్లి పునీతము చేసెనో ముందుచూచెదము.

కలకత్తాలోని సిమ్లా యనుజిల్లా యీతనివంశమునకు నివాసస్థానము. వీరు కాయస్థకులస్థులు. కాయస్థవంశము వీరశిఖామణులని పేరుగాంచిన క్షత్రియజాతిలో నొకశాఖయై వెలయుచున్నది. వీరి కుటుంబమునకు దత్తుల కుటుంబమని పేరు. ఆదినుండియు నీకుటుంబ మతిప్రఖ్యాతివడసియుండెను. అనేకసంస్థానము లీకుటుంబమునకు

జెందియుండుటేకాక నయ్యది నిరంతరైశ్వర్యములతోఁ దులతూఁగు చుండెడిది. మన కథానాయకుని తటిల్లతావిజృంభణమొనర్చిన మేధా సంపత్తి యెట్లాతనికి చేకూరెనో తెలియఁగోరునెడ నాతని పూర్వ వంశీయులచరిత్ర కొంత తెలియవలయునుగదా ?

ఇరువదియైదుసంవత్సరముల లేతవయసుననే సంస్కృతపర్షి యాభాషలలో గురుత్వము వహించి న్యాయశాస్త్రము కరతలామల కము గావించుకొనియు, నత్యద్భుతకవననైపుణిగల్గియు, వీనిమూల మునఁ బొందనగు భావిజీవనౌన్నత్యమును సడలించివైచి, భార్యాపు త్రమందిరసౌఖ్యములు విసర్జించి, కమండలువు, భిక్షాపాత్ర చేతఁగొ నినసర్వసంగపరిత్యాగచక్రవర్తి దుర్గాచరణదత్తుఁడీతనిపితామహుఁడు. దుర్గాచరణదత్తునితండ్రి, అఖండఖ్యాతిఁగాంచి అధికధనమార్జించిన న్యాయవాది రామమోహనదత్తుఁడు. పిత్రార్జిత ధనరాశికధిపతియైన దుర్గాచరణదత్తుఁడద్దానిని విడిచిపుచ్చు కెట్టివంద్యమైన త్యాగమో చెప్పనవసరములేదు.

దుర్గాచరణదత్తుఁడట్లు సంసారకారాగారవిముక్తుడై యరణ్య మున స్వేచ్ఛావిహారమొనర్చు మృగరాజమురీతి కాశీ, గయా, ప్ర యాగాది తీర్థయాత్రపరుఁడై బయలుదేఱెను. అట్టిచో దుర్గాచర ణుని ధర్మపత్ని భర్తృవియోగయై యేమిచేయుచున్నది ? భర్తృవి యోగ మెవ్వరికి ? శరీరబాంధవ్యులకు. జ్ఞానులకు భార్యాభర్త లొ క్కటే. దుర్గాచరణదత్తుఁడు వారణాశీనగరమునందున్నను, నాతనిధ ర్మపత్నిహృత్పీఠమునందే యున్నాఁడు.

ఏకపుత్త్రుఁడు విశ్వనాథుఁడు దినదినప్రవర్ధమానుఁడగుచుండెను. చిరకాలమునుండి వాంఛించుచున్న కాశీవిశ్వనాథుని దర్శించుటకు మాతాపుత్త్రు లిరువ్వరు నొకపెద్దపడవలో బయలుదేఱిరి. భావి లోకోద్ధరణమందు శ్రీవివేకానందుఁడు జూపిన వీరపురుషోచితశౌ

ర్యసాహసముల బీజములో యన్నట్లు విశ్వనాథదత్తుఁడు తల్లినోట వచింపఁబడినవీరచరిత్రల వినుచుండెను. త్రిలోకశాంతికై శ్రీరాముఁడు పడినపాట్లు, సీతామహాదేవి యోర్చిన దుస్సహరాక్షసకార్యము, శ్రీకృష్ణుని మాయాబాలక్రీడలు నిట్టి వనేకపురుషోత్తముల జీవితములను విశ్వనాథుఁడు మాతృవక్త్రమునుండి విని రంజిల్లుచుండెను. నిజముగు పుత్రవాత్సల్యము తల్లి యిట్లుగదా చూపుట! ఒకనాఁడు విశ్వనాథుఁడు పడవమీఁద పచారుచేయుచు నొక చీకుకొయ్యమీఁద కాలు వేయ నది విరిగి కాలుజారి యాతఁడు నదిలోఁ బడెను. తల్లిదృష్టి కుమారునిమీఁదనే యుండెను. ఆమె కీఁతరాదు. ఆమె దిగ్గున లేచి యొక్కపెట్టున నాయగాధతరంగిణీతరంగములలో దుమికి పుత్త్రుని రెండుచేతులతో బిగియఁబట్టి యుండెను. మాతాపుత్త్రు లిర్వురకు మరణమే నా? అగుచో నద్వైతవేదాంతదుందుభినాదమెట్లు పాశ్చాత్యహృత్కుహరములఁ జిందరవందరఁజేయుట? అంతలో నౌకాజనము దుమికి వారిని రక్షించిరి. పడవ కాశీనగరము జేరెను.

విశ్వనాథజనని విశ్వనాథునితోఁ గాశీవిశ్వనాథుని వీక్షించి, ఆపె నిర్మలహృదయప్రసూనము నావిశ్వేశ్వరపాదారవిందములకడఁ జేర్చెను. ఆమె నిత్యము గంగానదీపవిత్రతోయములలో స్నానమాడుటకై ఆలయమునుండి పోవునప్పు డనేకమంది సాధువుల నామె చూచుచుండెను. ఒకనాఁ డామె విశ్వనాథాలయప్రాంతమున కేగున రికొకవ్యక్తినిఁజూచి, పాదములు గంపింప నేలఁబడి మూర్ఛిల్లెను. వెంటనే యొకసన్యాసి "తల్లిపడిపోయె"నని కేకలిడుచు రివ్వననే తెంచి యామెను లేవఁదీసెను. పరస్పరవీక్షణము జరిగెను ఇరువురిహృదయములలోను భావప్రపంచములు పొంగిపొరలెను. కాని సన్యాసి కేల యీమార్పు? వెంటనే యాతఁ డదృశ్యుఁడయ్యెను.

విశ్వనాథుఁడు, జనని విశ్వేశ్వరసందర్శనభాగ్యమునకు ముదితాంతరంగులై మగిడి స్వగృహమున కేతెంచిరి. విశ్వనాథుఁడు పెరిగి పెద్దవాఁడగుచుండెను. భారతవర్షప్రాచీనౌన్నత్యమును విశదీకరించు వివిధభాషలలో నాతఁడు ప్రవీణుఁడై కులక్రమాగతమగు న్యాయవాదివృత్తి నవలంబించెను. న్యాయశాస్త్రము నం దాతనిశేముషిప్రభావము నలుదెసల వ్యాపించెను. విశ్వనాథుఁ డధికధనార్జకుఁడే కాక, తా నార్జించినవిత్తము నెట్లువ్యయించవలయునో తెలిసినగృహస్థధర్మజ్ఞుఁడు. అందుచేతనే ఆతనిమూలమున దత్తకుటుంబము, దత్తరాజకుటుంబబిరుదమునందెను. జీవితమును సంపూర్ణముగా ననుభవించుటే యాతనిప్రథమాశయము. కాని యీశ్వరజ్ఞానమే విద్యకు పరమావధియనియెఱింగిన పండితశ్రేష్ఠులలో విశ్వనాథదత్తుఁడొకఁడు. ఆతఁడు కర్ణతుల్యవదాన్యమూర్తి. ఒకప్పుడు తెగద్రావి, ఒకలు తెలియక విలపించుచున్న నొకనిఁగాంచి వానికెద్దియోయిచ్చినందున నితరులు తన్ను దూషింపఁగా నాతఁ డుత్తుంగాధ్యాత్మికశిఖరము నధిరోహించి యిట్లనియె, "ఏమిపోయినది. జీవన మతితుచ్ఛమయినది. త్రాగుటకు నుపయోగించిన నట్టిమూర్ఖు నొకనిముసమైన నీ నీచజీవితదుఃఖమును మఱచునట్లు చేయఁగల్గునెడ దానఁ దప్పేమున్నది?" ఆహా! ఏమినిరుపమానకారుణ్యహృదయము! సంస్కరణమునలనఁగాక ననుభవమువలననే జ్ఞానము లభించునని యాతని మతము.

భావివివేకానందుఁ డగు నరేంద్రబాలునివిషయమై విశ్వనాథుఁడెట్టి తాపత్రయము నందలేదు. విశ్వనాథునికి పాకశాస్త్రము బాగుగాఁదెలియును. ఒకనాఁడు నరేంద్రుఁడు తండ్రియొద్దకువచ్చి "నాకేమిచేసితి" వని ప్రశ్నించెను. వెంటనే తండ్రి "అద్దములోఁ జూచుకొ"మ్మని బదులిడెను. కుశాగ్రబుద్ధియగు పుత్త్రుఁడామా

మొదటిభాగము.

ముండై మొహ్వాండాంతరంగికదృష్టి నాత్మజ్యోతిదర్శనారంభుండై స్వప్న స్థితింజెందునో ఆతనికల కల్లగాదు. అది యథార్థప్రతిబింబము. భావి యాథార్థ్యతాటస్థ్యమును ప్రత్యక్షముగాం గాంచుశక్తి లోపించుటే దానికిహేతువు.

మాతభువనేశ్వరి యట్టికలయే గాంచెను. భావియథార్థదృశ్య మామె కప్పుడే ప్రతిబింబితమయ్యెను. దివ్యనక్షత్రములన్నియు ప్రాగ్దిశనుదయించును. నేండునదియే తటస్థించెను. భువనేశ్వరీమాతకుం బుత్త్రుం డుదయించెను. ఆదినము 1862 జనవరి 12 తేదీ. దైవవశమున నది పుష్యమాసాంతమగుట, సంక్రాంతియగుట, వంగదేశమంతయు గంగాపూజలతో బహుళానందదాయకముగ నుండెను. ఆనాండుదయించినబాలుండు భువనైకవంద్యుండగు వివేకానందుండని ఆజనులకుం దెలిసియున్నచో వారియానంద మెట్లుండియుండెడిదో చెప్పనవసరములేదు. హిందూధర్మమును లోకముక్తికై నద్దెసల ననర్గళముగాంజాటి, భగవద్దూతయని ప్రఖ్యాతిగాంచిన యాతనిజన్మదినోత్సవము నీనాండు కోట్లాదిజనులచే నిర్వహింపంబడుచుండెనేగాని ఆజన్మదినమం దాసంగతి యెవరికిం దెలియును? కాని భారతదేశ భావికల్యాణకార్యైకహేతుభూతుండగు నాబాలుం డితరబాలురవలె నవ్యక్తనిజప్రభావుండై నిష్కల్మషప్రేమసాగరమగుతల్లియొడిలోం బండుకొని యుండెను. ఆర్యావర్తవీరశిఖామణులశౌర్యసాహసముల నిరూపించుజాతీయచరిత్రలనిలయమైనభువనేశ్వరీమాతయొడిలోంబవ్వళించి బాలుం డాపిజ్ఞానసారామృతమును మాతృస్తనదుగ్ధములతోం బాటు త్రాగుచుండెను. బాలుండు బాలుండ కాదు అనంతజన్మకృతఫలసామగ్రి లోనిముద్దుకొనిన గణనాతీతవృద్ధవయస్కుండే బాలుండు. అట్టిబాలునిం జూచి కుటుంబములోని వారందఱు దుర్గాచరణదత్తుని పోలిక యుండుగలదనివచించిరి. ఇట్లు కొలది మాసములు గడచినవి.

బాలునికి లోకవ్యవహారార్థము నామకరణముచేయుసమయ మేతెంచి నది. కొందఱుపితామహునినామ మిడఁగోరిరి. కాని భువనేశ్వరి తన యభిప్రాయ మడుఁగఁబడినపుడు బాలునాంతరంగికదృష్టిం బరికించి, ఆశివస్వరూపము లోనిడుకొని ఆస్వరూపమే యిట్లు స్వప్నానుగుణ్యముగా తనగర్భమున జన్మించెననినమ్మి, “వీరేశ్వర” నామమీయ నంగీకరించెను. దానికందఱు సమ్మతించి ముద్దునకాతని “బైలె” యని పిలచుచుండిరి. ఆనామమే నరేంద్రుఁడుగా మాఱెను.

## నరేంద్రుని బాల్యము.

శుక్లపక్షసుధాకరునివలె నరేంద్రబాలుఁడు దినదినప్రవర్ధమానుఁడగుచుండెను. తల్లి యాతనిని చలినీటిధారక్రిందకూర్చుండబెట్టెను. ఆతఁడు కూర్చుండఁడే! వీలయినన్నిసార్లు గృహాంతరాళనిశ్శబ్దత నాతఁడు తన క్రీడాధ్వనిచే భంగపరచుచుండును. తల్లి యాతనిని తిట్టును, కొట్టును. కాని లాభము లేకపోయెను. అప్పుడామె వెండి మొలత్రాడుతో నున్న మూఁడేండ్ల ముద్దుబాలుని శీతలవారిధార క్రిందనుంచి, శివనామోచ్చారణము సలిలనినాదముతో మేళవించి, యింటివారలతో, “పుత్రప్రాప్తికై శివుని బ్రార్థించితిని. కాని శివుఁడాతని రాక్షసగణములో నొకని నాకొసఁగినాఁ”డని వచించుచుండును.

నరేంద్రునకు సాధువులన్నను, భిక్షాటనులన్నను గల ప్రేమ మఱెందును లేదు. వివేకానందపారిజాతము తన నిస్తులదివ్యసౌరభముచే నిఖిలమానవకోటి నాకర్షించినచో బాలనరేంద్రనాథునియశము సాధుభిక్షుకబృందము నాకర్షించుటబ్బురమా? అప్పుడే బాలుఁడు నూతనవస్త్రాలంకృతుఁడయ్యెను. హరినామస్మరణము చేసికొనుచు నొకసన్న్యాసి విశ్వనాథునిగృహమున కరుదెంచెను. నరేంద్రుని హృదయము దుర్భరానందమయమయ్యెను. వెంటనే నరేంద్రుఁడు

నూతనవస్త్రమును దీసి సాధుహస్తములఁ బడవైచెను. ఇతర బాలురం
దఱు పాతగుడ్డల నిచ్చుచుండఁ దాను నవీనవసనము నీఁగల్గితినని
గర్వము ప్రకటించెను. ఈసంగతి తల్లిదండ్రులకుఁ దెలిసి పుత్రుని
దండించిరి. ఆతఁడట్లుచేయకుండ సేవకులను కాపుంచిరి. ఏసన్యాసి
గాని, సాధువుగాని కనఁబడినచో నరేంద్రుని గదిలోఁబెట్టి తాళము
వేయుచుండెడివారు. అట్లైనను నరేంద్రుఁడు తన చేతికి దొరికినవస్తు
వులను దీసి కిటికీలగుండ నవలఁద్రోయును.

నరేంద్రుని సోదరీమణు లాతని బాధలు సహింపలేక అప్పుడప్పు
డాతనిని కొట్టుటకుఁ దఱుముగా నాతఁ డపరిశుద్ధప్రదేశములోని కఁగి
"ఈసారిరమ్ము, ఈసారిర"మ్మని వెక్కిరించుచుండెడివాఁడు. హిందువు
లకు గోవు పరమపూజ్యమగు జంతువు. స్వచ్ఛగోదుగ్ధామృతపానమే
భారతదేశసాత్త్వికసంపత్తికి హేతువు. సురాపానము నేటి యధమ
తామసస్థితికి హేతువైనది. ఇంటిగోవుతో నాతఁడాడుచుండును. కోతి,
మేక, నెమలి, పావురములు, తెల్లచుంచులు, నివికూడ నరేంద్రుని
బాల్యస్నేహితులు. మహాసాగరములు దాటిన యాతఁడు గుమ్మము
దాటు[illegible]? వీధిలోనికి తిన్నఁగ పర్వెత్తి గుఱ్ఱపుబండ్లను, బండీలో
లు వారి[illegible] జూచి యాశ్చర్యపడుచుండును. రెండుగుఱ్ఱముల బండెక్కి,
తోలు[illegible]పుచ్చుకొని తోలుటే నాకోర్కె యని యాతఁడు తండ్రితోఁ
జెప్ప[illegible] నిజమే! వివిధమానవసంఘ తురంగ శకటముల నాతఁడు
నడ[illegible]ండలేదా?

[illegible]కమును ప్రేమించి యుద్ధరించవలెనన్నచో సహజమాతృ
ప్రే[illegible]రుచిచూచి యున్ననే వీలగును. తల్లి సుతునకుఁ జూపుప్రేమ
కన్న[illegible] మానవుఁడెక్కుఁడు ప్రేమ జూపఁజాలఁడు; భువనేశ్వరీమాత
న[illegible]రు నెట్లు ప్రేమించెనో భావివివేకానందుఁడు దీనుల నెట్లుప్రే
[illegible] తెలిసికొన్నచో నెఱుంగనగును. బాలు నలంకరింప భువనేశ్వరి

యత్నించుచో విద్యాలంకారప్రాప్తికే. ఆమెకుఁదెలిసిన యాంగ్లము
లోని యక్షరములు, మహాభారతములోని వీరాగ్రేసరుల దివ్యచరిత
ములు, నూరిపోయుచుండెడిది. భగవద్విగ్రహార్చనము చేయుట, చేతు
లుజోడించి సచ్చిదానందప్రదీపమునకు నమస్కరించుట నరేంద్రుని
చేత భువనేశ్వరి ఉగ్గుపాలతోఁ ద్రావించెను.

శ్రీసీతామహాదేవి, శ్రీరామచంద్రుఁడు, వీరినిగూర్చి తల్లి
వచింపఁగా నరేంద్రుఁడు విని యుండెను. తల్లిదండ్రులు సీతారామ
విగ్రహముల నొకచోనుంచి పూజించుటకూడ నాతఁడు చూచియుం
డెను. ఏమిపూర్వార్జితపుణ్యవాసనయో యాతఁడుకూడ సీతారాము
లఁబూజింపవలెనని తలఁచెను. నరేంద్రుఁడొకనాఁ డొక బ్రాహ్మణ
బాలునితోఁ గలసి కొన్నిపైసలు పుచ్చుకొని బజారునకు వెళ్ళెను. విగ్ర
హములదుకాణపు బల్లమీద శ్రీసీతారాముల విగ్రహము తలయెత్తి
ధగ ధగ మెఱయుచుండుటఁగాంచి వెంటనే యావిగ్రహమును కొని
యింటికేతెంచెను స్త్రీ యంతఃపురమునకుఁ బైనున్న డాబామీది
ప్రక్కగదిలో నావిగ్రహముంచి, బ్రాహ్మణబాలునితో [illegible]ని ముం
దట తలుపుబిగించుకొని కూర్చుండి ధ్యానించుట కారంభించెను.
ధ్యానముతో గంటలుగడచెను. బాలుర తల్లులు పుత్రులు [illegible]కపో
వుటచే సంశయించుచుండిరి. వారిజనకులు పుత్రాన్వేషణార్థ[illegible] వీధు
లన్నియుఁ దిరిగి, యెచటనుగానక యింటికిమగిడిరి. మేడ[illegible]గది
మూసియుండుటగాంచి యొకఁడు కేకలిడనారంభించెను. మో[illegible]క
తోడనే బ్రాహ్మణుడు చకితుఁడై లోపలితలుపు తెఱచుకొ[illegible] పారి
పోయెను భగవద్దర్శనైకాయత్తచిత్తునకు బాహ్యప్రపంచసం[illegible]
ములు, సినాదములు, నెట్లు వినఁబడును ? నరేంద్రుఁడు చలింప[illegible].
వార లంతటతలుపు గట్టిగగుద్దిరి. బదులులేదు. వారికి భీతిహెచ్చె[illegible].
తలుపు పగులఁద్రొబ్బి, చిత్రప్రతిమరీతి నచంచలుడై, యనత జనా[illegible]

ర్జిత తేజఃపుంజములు నేత్రగోళములనుండి పైకుబుకుచుండ నిశ్చలధ్యానపరిపూర్ణుఁడై బ్రహ్మర్షివలెఁ గూర్చుండియున్న నరేంద్రుని వారు గాంచిరి. తట్టి లేవఁగొట్టిరి. కొంచెము స్పృహ తెచ్చుకొని తన్నేకాంతముగా మఱికొంతసేపు పూజసేయనిమ్మని యాతఁడు పల్కెను. చేయునది లేక వారాతనిని విడిచి వెడలిపోయిరి. ఆ రేండ్లబాలుఁడు, పాలుద్రాగుపసిబిడ్డ, నిశ్చలధ్యానముద్రితుఁడై, చలింపకుండుట యిదంతయు వానికెవరు నేర్పిరి? అపూర్వపుణ్యఫలప్రదర్శనమది కాదా!

ఏదైన నొకవిషయము తెలియకున్న నరేంద్రుఁ డింటిలోని వారినడుగఁడు. వెంటనే అశ్వశాలలోని కరిగి బండివానినడుగును. ఎందులకో బండివాఁడు పెండ్లి యనర్థమని చెప్పెను. నరేంద్రుఁడది విని కంపితుఁడయ్యెను. సంపూర్ణ స్వాతంత్ర్యప్రియుఁడగు నరేంద్రునికి సంసారమన్న నజ్ఞానవశముననైన భయమేపుట్టెను. అంత నాతఁడశ్వశాలవిడిచి లోనికి కన్నీళ్ళువిడచుచువచ్చెను. భువనేశ్వరి వానినిఁ జూచి హేతువేమని ప్రశ్నించెను. అతఁడు మాటాడలేదు. కాని విచారము హెచ్చెను. కౌఁగిలించుకొని, దూరముగా దీసికొనిపోయి, తల్లి ఏకాంతముగా ప్రశ్నించెను. అప్పుడు నరేంద్రుఁడామెకు పెండ్లియనిన భయమగుచున్నదని వచించెను. భువనేశ్వరికి ఘాతజ్ఞానజ్యోతి మిర్మిట్లు గొల్పుచుఁ గన్పట్టెను. ఆమె వెంటనే పుత్రునివైపు తిరిగి, "లోకైకనాథుఁడగు శివుఁడు నీయందున్నాఁ"డని యూరకుండెను. అదివిని నరేంద్రుఁడు మెల్లగా సీతారామవిగ్రహములకడకరిగి వానిని నేలఁగొట్టి పాఱవైచెను. సీతారాముల స్థానము శివుఁడాక్రమించెను. శివధ్యానతత్పరుఁడైన నరేంద్రుఁడు విగ్రహము నెదుట నిలఁబడియుండెను.

ప్రపంచమునకు భారతదేశము భగవద్ధ్యానముద్రితుఁడగు మానవరూపము. ఆమానవగర్భమందెట్టి యాధ్యాత్మికాగ్ని నిక్షిప్తమై

యున్నదో యెవ్వఁడెఱుఁగును? తద్గర్భనిక్షిప్తాగ్నిజ్వాలయే బయల్వెడలి లోకమునందలి పరస్పరాసహన, సామ్రాజ్యకాంక్ష, దుర్నయపరిపాలనాదికమహాపాపంబుల దగ్ధపటలము చేసి, యథార్థముగా చైతన్యశూన్యమై తామసాంధపరివృతమైయున్న లోకమును ప్రాణోపేతంబు చేసి ప్రశాంతికూర్పవలసియున్నది. భౌతికశాస్త్రవిజ్ఞానసంపత్తి పరప్రాణఖండనసాధనకుటిలయంత్రనిర్మాణప్రావీణ్యము నాయగ్నిజ్వాలలయందుఁబడి భస్మమైపోవలసినదే. నరేంద్రుఁడట్టిజ్వాలను గర్భమునఁ బెట్టుకొని పుట్టియున్నాఁడు. ఎవరో, నిరంతరము ధ్యానము చేసిన శిరోజములు పెరిగి జడలుగట్టునని చెప్ప విని యాతఁడు దినదినము జపించి, తన తల తడవుకొని జడలుకట్టమి విచారించును. బాల్యక్రీడలలోఁబడి యుండవలసిన శైశవమును నరేంద్రుఁడు శివధ్యానముతోఁ గడపియున్నాఁడు.

---

## మూఁడవ అధ్యాయము.

### కాంతిగోళదర్శనము — అక్షరాభ్యాసము.

మహాపురుషులు చూచునది వేఱు. సామాన్యులు చూచునది వేఱు. సామాన్యులు తమ కట్టెదుట కన్పట్టునద్దానినే చూడఁగలరు. మహాత్ములు సామాన్యులుజూచు నావస్తువుల యాభ్యంతరస్థితిఁ బరికింతురు. పరంజ్యోతియే సర్వవస్తుప్రాణహేతుభూతంబగుట, నాపరంజ్యోతి కిరణాల్పకాంతినైన దర్శింపఁగలవారే యోగిపుంగవులు, మహాత్ములు.

నరేంద్రుఁ డైదేండ్లబాలుఁడు. రాత్రిభుజించి పరుపుమీద పరుండును. కండ్లు మూఁతపడును. బాహ్యప్రపంచజ్ఞాన మంతరించును. శరీరస్మృతి లోపించును. ఒకజ్యోతి, ఒక కాంతిగోళము ఒకబాలుని చేఁదన్నఁబడి తన్ను సమీపించుచున్నట్లు నరేంద్రున కగపడును. ఆకాం

తిపుంజములో నరేంద్రుఁడొక్క మునక వేయును. కాంతియు నతఁడు నేకమగుదురు. నరేంద్రుఁ డేమయ్యెను? ఎవని కెఱుక? ఇదియే నరేంద్రుని నిద్రావిధానము. ప్రతిదినమిట్లే జరుగుచుండును. ఈ విషయ మాతఁ డెవరితోఁ జెప్పియుండ లేదు. కాని చాలకాలము తర్వాత నాతని చెలికానితో నాతఁడు చెప్పియుండెను. అట్టిజ్యోతిని నీ వెన్నఁడైనఁ జూచియుంటివాయని యాతఁడు ప్రశ్నించెను. కాని యాబాలుఁడట్టి దెన్నఁడు నెఱుఁగఁడు. నరేంద్రుఁడు, జ్యోతి, యివి వాని కేమియు నర్థము కాలేదు. జీవితాంతమువఱకట్లే యాజ్యోతి నరేంద్రునకు ప్రత్యక్షమగుచునే వచ్చెను. నరేంద్రుఁడు వివేకానందుఁడైనప్పుడు, తోడి సన్యాసి యొకఁడు తనకు జ్యోతిని చూపుమని యడుగఁగా, వివేకానందుఁడు తనహస్తము నాతని భ్రూమధ్యముననుంచెను. అంత నాసన్యాసికి దృష్టి మార్పుజెంది, బాహ్యప్రపంచమునకుబదు లొక దివ్యజ్యోతిర్మయసాగరము ప్రత్యక్షమయ్యెను.

ఒకనాఁటి సాయంసమయమున, ప్రార్థనామందిరములో నరేంద్రుఁడు ధ్యానముద్రలోఁ గూర్చుండియుండెను. అంత నొకపెద్దసర్ప మాచపటామీఁదఁ బ్రాఁకఁజొచ్చెను. ఇంటిలోని జనులందఱు భయకంపితులై నరేంద్రునొద్దకుఁ బర్వెత్తి యాతనిఁబిల్చిరి. నరేంద్రునికి వినఁబడలేదు. సర్పము పడగనెత్తి నరేంద్రునెదుట నాడనారంభించెను. జనులు గుమిగూడి యుండిరి. ఏమిచేయుట? కేకలిడినచో సర్పమేమిచేయునో? ఊరకున్నచోఁ గఱచునేమో? దైవవశమున నాసర్పము వెనుకంజవేసి నిముసములో నదృశ్యమయ్యెను. అంత వారు నరేంద్రుని లేపి యేమిజరిగినదని యడుగ "నాకేమియుఁ దెలియదు. అనిర్వాచ్యానంద మొక్కటే నాకు లభించిన"దని యాతఁడు బదులు చెప్పెను. నరేంద్రు నత్యద్భుతదృష్టి యందఱ కబ్బురము కల్పించెను.

ఇట్లు జరిగినవెనుక నరేంద్రుఁడు మఱల ధ్యానముద్రావస్థలో నిశ్చంచలుఁడై యుండెను. అంత నొకదివ్యతేజోరాశి యాతనికి గోచరమయ్యెను. ఆతేజోరాశినుండి దండకమండలువులు, కరద్వయంబున ధరించి, పరిపూర్ణానందమయప్రశాంతచిహ్నితంబగు మందహాసము ముఖమున నృత్యము సల్పుచుండ, నొకదివ్యవిగ్రహ మాతనికి ప్రత్యక్షమయ్యెను. ఆమూర్తి యెవ్వరు? ఆస్వరూపము బుద్ధభగవానునదే యని వివేకానందుఁడు చెప్పెను.

అనేకాద్వైతవేదాంతాశ్రమస్థాపనాచార్యుఁడగు నరేంద్రుడాఱవయేట విద్యాభ్యాసనిమిత్తమొక చిన్నచాప చంకక్రిందఁబెట్టుకొని, కాకియాఁకకల మొకటి చేతఁబూని, నూతనవస్త్రముల ధరించి, పాఠశాలకుబయలుదేఱెను. కొన్నినాళ్ళు జరుగుసరికి విద్యాభివృద్ధికి బదులు దుష్టబాలకసహవాసముచే, దుర్భాషలాడుట పూర్తిగా నలవాటయ్యెను. అది చూచి, తల్లిదండ్రులు పాఠశాలకంపుటమాని యొక ప్రత్యేకోపాధ్యాయుని నియమించిరి.

పాఠశాలకంపుటకు ముందు నరేంద్రుని కక్షరాభ్యాసమహోత్సవము జరుపఁబడెను. పురోహితుఁడు సమంత్రకముగా నరేంద్రుని సరస్వతీదేవి కొప్పగించి, బాలుని కుడిచేతితో నొకమసిబొగ్గునుపట్టించి నేలమీఁద క, ఖ, లు వ్రాయించెను.

నరేంద్రుఁడు ప్రేమమయవాక్యములకు లొంగును. కాని క్రోధకలుషితవాక్యములకు రుద్రమూర్తి. ఈపద్ధతియే జీవితాంతమువఱకాతని నడపించినది. నరేంద్రుఁడు తోడిబాలురలో నాపులమధ్య యాంబోతురీతినుండువాఁడు. అన్నివిషయములలో నాయకత్వమతనిదే. పుష్యమాసాంతదినము నరేంద్రుఁడు పుట్టినదినమగుటే కాక, సంక్రాంతి

దినముకూడ నయ్యెను. గంగాభవాని కింబూజలొనర్పవలెనని కోరి నరేంద్రుఁడు తండ్రినడిగి ఖర్చులనిమిత్తము పైకముతీసికొని పెక్కు మంది బాలురను ప్రోవుచేసి, ఉత్సాహచిహ్నములగు పతాకలధరించి, పుష్పమాలలనుగూర్చి, గంగాతటంబునకు భజనచేయుచు నరిగెను. ప్రత్యేకోపాధ్యాయుఁడు పూజసేయింప నియమితుఁ డయ్యెను. వారాపుష్పమాలలను గంగాదేవికర్పించి, స్నానమాడి యింటికి వచ్చిరి. సాయంకాలమున మఱల నంపరపనాసకాయలడిప్పలలో దీపము లునిచి, నీటిలోవిడిచి, యారాధించిరి. ఆదినమంతయు నాబా లురకు మహోత్సాహముగా నడచిపోయెను

జ్ఞానశక్తి నరేంద్రుని కీకాలమందే వృద్ధిపొందెను. గురువు నెదుట శిష్యులందఱిలో చలనములేక, నేత్రములు ముకుళించి నరేం ద్రుఁడు కూర్చుండువాఁడు. గురువునకు నరేంద్రుని మాంద్యమున కాగ్రహము జనించి, చేతులు పట్టుకొని విదళించి, పాఠము నొప్ప గింపుమనెను. ఒక్కనిముసములో నరేంద్రుఁడు పాఠమునొప్పగిం చుటఁ జూచి గురు వది మొదలెన్నఁడాతనిని దూషించలేదు.

రాత్రి నరేంద్రుఁడు బంధువగు నొకముసలితాతయొద్ద పరుం డెడివాఁడు. ఆముదుసలి సంస్కృతవిద్యాపారంగతుఁడు. ప్రతిదిన మాతఁడు నరేంద్రుని, కమరశ్లోకములు చెప్పుచుండువాఁడు. కొన్ని నెలలకే నరేంద్రుఁడు చాలభాగము కంఠస్థముచేసెను. ఈపునాదియే నరేంద్రుని సంస్కృతవిద్యావాచస్పతిని జేసెను. సమస్తప్రపంచ భాషలలో సంస్కృత మతిప్రాచీనమైనది. హైందవతాత్త్వికసాగర రత్నరాశు లాభాషాయోషామణి కమూల్యభూషణములు. ఏనాటి కైన భారతభూమి యేకసూత్రబద్ధము గావలెనన్నచో సంస్కృత భాషామిత పరిచయమొక్కటే సాధనము.

హిందూబాలునిప్రవర్తన మెన్నివిధానములచేఁ బరిష్కృత మగుచున్నదోకదా! ఏదిపాశ్చాత్యులకు విద్యయో హిందువులకది భగవద్దర్శనప్రయోగము. హిందూహృదయ రక్తబిందువులలో నైక్యమై యెన్న డవిభక్తముగా నుండునది యదియే.

బాల్యక్రీడావస్థ.

ఎచ్చట జనులుండిరో, యెచ్చటసంఘములుండెనో, యెచ్చట జ్ఞానము పూజింపబడెనో, యాచోటులనెల్ల మానసనాయకత్వము వహించి పేరెన్నికగన్న భావివివేకానందుఁడు బాల్యమున బాలబృందమునకు నాయకుఁడగు టబ్బురమా? చంద్రునిచుట్టువారు నక్షత్రసమితిరీతి నరేంద్రుని సమవయస్కులగు బాలురందఱు పరివేష్టించియుండువారు. విశేష మేబాలురు నరేంద్రునిబాల్యమున నాయకునిగా శిరసావహించిరో వారే, గంగాతటంబున నాతనిచే నిర్మితమైన రామకృష్ణమఠమున కరుదెంచి, వివేకానందగురూత్తముని పాద సరోరుహముల సేవించి ధన్యులైరి.

ఆటలలో నరేంద్రునిదే యగ్రస్థానము. బాలురందఱు రాజులయినచో నేనే సమ్రాట్టునని యాతఁడు వచించును. పూజామందిరమున నిలఁబడి, తాను చక్రవర్తిని, యిరువుర ప్రధానమంత్రిగను, సేనాధిపతిగను నియమించి, మఱియైదుగుర సామంతరాజులుగా మేడమెట్లమీఁద నిలఁబెట్టెను. మిగిలిన సభోద్యోగులనింకను క్రిందమెట్లమీఁదఁ గూర్చుండుకదవి యొసఁగి, సామంతరాజుల నొక్కరొక్కరినే దర్బారులోనున్న తన చక్రవర్తిత్వపాదముల మ్రొక్కఁజేయును. తరువాత వారంద ఱాతని యెదుటికిరా, వారిక్షేమము సార్వభౌముఁడగు తానడుగుచుండును. ఆవెనుక నొక సేవకుఁ డాచక్రవర్తిసముఖమున కొకనేరస్థుని లాగికొని వచ్చును. "ఈతని నురితీయుఁ" డని చక్రవర్తి యాజ్ఞాపించును. వెంటనే రాజసైన్య మంతయు నా

నేరస్థునిమీఁదఁబడి పట్టుకొనఁబోఁగా నాతఁడు పాఱిపోవును. ఈ విధముగా బాల్యక్రీడలలో నరేంద్రుఁడు రాజ్యాధిపత్యము వహించి ప్రజాపరిపాలనము చేయువాఁడు.

నరేంద్రునిజనకుఁడు న్యాయవాదియగుటచే, ననేకులు యభియోగపుజను లచటికి వచ్చుచుండెడివారు. వివిధవర్ణములవా రొక చోటనే గూరుచుండి హుక్కాలను బీల్చుచుండెడివారు. ఒక మహమ్మదీయుఁడుమాత్ర మొక మూలఁగూర్చుండి "అల్లాహూ అక్బర్" అని హుక్కాపట్టుచుండు వాడు. నరేంద్రుఁడు వారిమధ్య దుమికి, జాతిభేద వివక్షత తెగద్రెంపి, ప్రతివాని హుక్కా నొకసారి పీల్చుచుండెడివాఁడు. మహమ్మదీయుని మామయని పిల్చుట నరేంద్రునకు ముచ్చట. ఆమహమ్మదీయుఁడు పంజాబునుండి ఆఫ్ఘనిస్థానమునకు నొంటెలమీఁద ననేక కష్టములతోఁ జేయు ప్రయాణకథలను రసోచితముగ ముచ్చటించుట నరేంద్రుఁడు విని, "నన్ను నీతోఁ దీసికొని వెడలవా?" యని యడుగ, "ఇంకొక యంగుళము పెరిగినవెనుక" యని యాతఁడు బదులుచెప్పుచుండును. ఆమహమ్మదీయుఁ డాతనికిఁ దనయింటిలోఁ జేసిన మిఠాయి తెచ్చి యిచ్చుటఁ జూచి, యాహార నిష్ఠులంద ఱచ్చుచుండువారు

జాతి, వర్ణమననేమి ? ఒకవర్ణపుజనుఁ డితరవర్ణమువారింటఁ దిన్న నేమి జరుగును ? ఇంటికప్పు కూలి మీఁదఁబడునా ? సద్యోమరణము సంభవించునా ? నరేంద్రుఁ డందఱిహుక్కాలను పీల్చినపు డేమియుఁ జరుగ లేదే !

ఒకనాఁడు నరేంద్రుడు దాగుకొనిన యొకబాలుని వెదక మేడమెట్లమీఁదఁ బరుగులిడుచు కాలుజారి క్రిందఁబడెను. అంద ఱొక్కుమ్మడి బాలుని సమీపించి లేవదీయఁగా భువనేశ్వరి కాఁగిలించుకొని యోదార్చెను. ఆదెబ్బయొక్క మచ్చ కుడికంటికై భాగ

మున జన్మాంతమువఱకుండెను. ఒకనాఁడు రామకృష్ణుఁడు శిష్యుల నుద్బోధించుచు, "నీ కాదెబ్బయే తగులకున్నచో నీవలన లోక మల్లల నాడిపోవు," నని నరేంద్రు నుద్దేశించి పల్కెను.

---

## నాలుగవ అధ్యాయము.

### నరేంద్రుని సద్గుణములు.

నరేంద్రపారిజాతముకుళము వికసింప నారంభింపఁగనే జగన్మోహనైకసుప్రసిద్ధసుగంధము వెల్వడకుండునే? పాఠశాలాప్రవేశమునకు ముందే రామాయణమహాభారతములోని కొన్నిభాగములు నరేంద్రునికిఁ గంఠస్థములు. గానము నాతఁడధికముగాఁ బ్రేమించెను. కాశీపుట్టపు వీధులలో బిచ్చమునకై తిరుగాడు క్షుద్రగాయకులు నరేంద్రునింటిముందర నాగి పాడుచుండెడివారు. నరేంద్రుఁడు వారి యెదుట నిశ్చేష్టుఁడై నిల్వఁబడును. రామాయణశ్లోకములఁ బాడుచు వారొకనాఁడు తప్పఁగా, నరేంద్రుఁడు సవరించుటఁ జూచి వారాశ్చర్యచకితులైరి.

చిన్ననాఁట నరేంద్రునకు రాముఁడే యిష్టదైవతము. రామభక్తాగ్రేసరుఁడగు హనుమంతునియం దాతనికి మిక్కిలి ప్రేమ. ఒకనాఁడాతఁడు హనుమంతుని దర్శింపవలెనని తలఁచి అరటితోటలోనుండునని యొక పౌరాణికుఁడు హేళనగాఁ జెప్ప విని, వెంటనే యొక అరటితోటలోని కరిగి, ఒక చెట్టుక్రింద ధ్యానముచేయ నారభించెను. కాని, విఫలయత్నుఁడై యింటి కేఁచ్చుచుఁజన, 'ఈనాఁడు హనుమంతుఁడు రామకార్యార్థియై యెచటికో వెడలియుండె'నని యొకరు వచింప నూరకుండెను అదైవతాధ్యాపకుండైనపుడు హనుమానాన్మహావీరునిఁగూర్చి, మహోద్రేకముగా ముచ్చటించుచేకాక, నరేంద్రుఁడు,

బేలూరుమఠమున హనుమాన్విగ్రహమును స్థాపించవలెనని కోరుచుండెడివాఁడు.

నరేంద్రునిహృదయమున నొక విధమగు నసంతృప్తి యశాంతియు నావరించుకొని యుండెడివి. ఉన్నపరిస్థితులలో నాతనికిఁ దృప్తి లేదు. బ్రహ్మానందైకలగ్నమానసుల కీలోకమందలి సమస్తపరిస్థితులు నసంతృప్తిమార్గమునే ప్రదర్శించుచుండును. అఖండభూమండలాధిపత్యము నొసఁగిన వారి నసంతృప్తినాదము పట్టుకొని యెద్దియో మహోన్నతము శాశ్వతమునగు నద్దానికొఱకై యత్నింపుమని పురికొల్పుచుండును. అట్టి యసంతుష్టి లేనివాని కీ లోకభోగమే పరమావధియగుటచే నింద్రియబద్ధుఁడై యట్టివాఁడు పతితుఁడగును. ఈ లోకపరిస్థితులందలి తీవ్రాసంతృప్తియే నరేంద్రుని గుణరాజము. ఆటలలోఁ, బాటలలోఁ, జదువులో, మిత్రబృందములో, నాతనికసంతృప్తినాదము వినఁబడుచుండును. ఒకనాఁ డాంగ్లపాఠశాలకేగునపుడు తండ్రి బొసర్లువేసి పంప వానినాతఁడు చించిపాఱవైచెను. గోలీలాడుట, దుముకుట, పరుగెత్తుట, కుస్తీపట్టుట, మున్నగు నాటలన్నియు నరేంద్రుఁడు తఱచుగా నాడుచుండును. ఇద్దఱు బాలురు పెనఁగులాడుచో వారిమధ్య నిలచి శాంతి నెలకొల్పును. కోపము వచ్చిన నాతఁడు కాలరుద్రుఁడు. "చిన్ననాఁటనుండి నా కట్టియావేశమంటచేతనే, చేతఁ గాసైన లేకుండ ప్రపంచపర్యటనము చేసినా"నని యాతఁ డొకశిష్యునితోఁ జెప్పెను.

నరేంద్రుఁ డవ్యాజానుకంపాంతరంగుఁడు. ఒకనాఁడు విల్లియముఫోర్టును చూచుటకనేకమందితో నాతఁ డేగెను. త్రోవలో నొక బాలుఁడు జ్వరముతగిలి బాధపడుచుండెను. బాలురందఱు వానిని విడిచి ముందు కరుగుచుండిరి. నరేంద్రుఁడు వానిని లేవఁదీసి, బాడి మీఁద నింటికిఁ గొనిపోయి, మఱలివచ్చెను. వేఱొకసారి చంటిపిల్ల

నెత్తుకొన్నయొకతల్లి బండిక్రిందఁ బడిపోవుచుండ నాబండిక్రింద దుమికి, వారిని బయటికి లాగి ప్రాణములను కాపాడెను. ఇట్టి కారుణ్యాపూరితకార్యములే నరేంద్రునం దఖండప్రీతిని బాలురలోఁ బుట్టించినవి. దయాదాక్షిణ్యములు నరేంద్రునివంశమునకుఁ బెట్టినదిపేరు. విశ్వనాథుఁడు భువనేశ్వరిపేర నొకమహమ్మదీయునియిల్లు తణఖా వ్రాయించెను. కాలదోషముపట్టుసమయమున నాముసల్మాను కుటుంబము భువనేశ్వరీమాతను ధనమొసఁగ లేమని ప్రార్థింప నామెవిడిచి పెట్టెను.

కరుణ, అసంతృప్తి యీరెండు నరేంద్రుని ముఖ్యగుణములు. ఈయసంతృప్తి నరేంద్రునికే కాక, వంశమున కంతకు నున్నది. ఇట్టి యసంతృప్తిచేతనే అన్నయగు మహేంద్రనాథుఁడు ప్రపంచపర్యటనమునకుఁ దండ్రి యొద్దియు గార్యము లేకయే, అనేక పట్టణములకు విడలినది. జీవితాంతమువఱకు నరేంద్రుఁ డనంతకృపానిధి. పాశ్చాత్యదేశములలో నుపన్యాసములకై తనకుఁ గానుకఁగా లభించినధనమును నిచ్చలవిడిగా నాతఁడు పంచిపెట్టెను.

సప్తమాబ్దమున నాంగ్లవిద్యాభ్యాసమునకై కలకత్తాప్రాథమికపాఠశాల కంపఁబడినప్పుడు నే నాంగ్లమును చదువనని నరేంద్రుఁడు కలహించెను. మొదట జాతీయవిద్యాగ్రగణ్యత వహించి, తరువాత నన్యభాషాభ్యసనము చేయవలయునని యాతని యుద్దేశము. తల్లిదండ్రు లెంతచెప్పిన నాతఁడు వినలేదు. రామచంద్రదత్తుఁడు, నరేంద్రుని పినతాత చెప్పి యొప్పింపలేకఁబోయెను. తరువాత నాలుమాసములకెట్లో అనిష్టముతో నాతఁడు పాఠశాలకేగెను. అచిరకాలముననే యాంగ్లమునం దాతఁడు తీక్ష్ణత వహించెను. పాశ్చాత్యఖండములనల్లలనాడఁజేయు వేదాంతసందేశ మాంగ్లభాషలో నాతఁడొసంగవలసియుండ నాంగ్లభాషనభ్యసింపకున్న నెట్లుపొసఁగును? నూతన

ప్రాపంచికనాగరికతాతరంగములలో నాంగ్లభాషకుఁ దన నిర్దుష్ట నిరుపమానవాగ్రత్నములచే నూతనవికాస మాతఁడు దానముచేసి యున్నాఁడు. ఆంగ్లభాషాప్రావీణ్యము గడించదనిచో నరేంద్రుఁడు వివేకానందుఁడు కాఁబోయెడివాఁడే!

నరేంద్రుని భావౌన్నత్య మీనాఁడే ప్రతిఫలింప నారంభించెను. 1869 వ సంవత్సరమున నరేంద్రుని పినతాత కాళీప్రసాదదత్తుఁ డంత్యావస్థలోనుండి, కుటుంబమును సమీపమునకుఁ బిలచి, భగవత్కాలక్షేపమునకై మహాభారతము చదువుమని కోరెను. చదువ సాహసమెవరికి లేకుండెను. వెంటనే నరేంద్రుఁడు తాతగారినిసమీపించి, గరుడుఁడు వినతాసమేతుఁడై స్వర్గధామమున కేగిన యాభాగము ను తననిర్మలమధురకంఠమునెత్తి చదివెను. కాళీప్రసాదుఁడు సంతసించి, బాలుని దగ్గఱకుఁ బిల్చి "నీకు మహోన్నతభావిదశకలద"ని ప్రాణములు విడిచెను.

నరేంద్రుని గుణరాజములలో ననంతమగు నాత్మశక్తి విశ్వాసమే ప్రధానస్థానము నలంకరించును. నిశ్చంచలంబగు నాత్మవిశ్వాస ప్రేరితులే లోకము నూగులాడించిన ధీరులు. ఆత్మవిశ్వాసప్రేరితము గు శౌర్యమే కార్యభంగమున కొంకితయు జంకనిది. అట్టిశూరశిఖామణులే లోకమేకమైనిల్చిన శరీరము తుత్తునియలైన నెత్తినచేయిని దింపని మహామాన్వితులు. ఆ యఖండాత్మవిశ్వాసమే నరేంద్రుని మూర్తిమత్త్వములో మోహనాకారమును కల్పించి లోకము నరి కట్టనది.

నరేంద్రుఁడు నిరంతరానందమయుఁడు. పూర్వతేజోగోళమూ తనికిఁగన్పట్టుచునేయుండెను. ఒకమిణుగురుపురుగువలెను, తరువాత పెద్దదై త్రిభుజాకృతిగను నాగోళము నరేంద్రుని యెదుట తాండవ మాడుచుండెడిది.

---

## అయిదవ యధ్యాయము.

### పాఠశాలాజీవితము.

స్థానికప్రాథమికపాఠశాలలో నరేంద్రుఁడుచూపిన చాకచక్యము, క్రీడాభిలాష, ప్రేమపూరితప్రవర్తనము, వీనినిఁగూర్చియనేక గాథలుగలవు. తోడిబాలురతో నిరంతరమాడుచుఁ బాడుచు, హాస్యముకల్పించుచుఁ, బెట్టుపేర్లతోఁ దోడివారలఁ బిలచుచు నరేంద్రుఁడు సంతసముగాఁ గాలము గడపుచుండువాఁడు.

ఈకాలమునను సన్యాసులన్న నరేంద్రున కెంతయో ప్రీతి. సన్యాసి కనఁబడిననిమేష మాతనికి సంతోషకాలము. ఎన్నఁడు తాను స్వేచ్ఛావిహృతినందు సన్యాసినయ్యెదనాయని యాతఁడు పరితపించుచుండును. తాను సన్యాసినై యేమిచేయునో, యెచ్చటెచ్చటికరుగునో, మున్నగువిషయము లాడలుమఱచి తోడివారు పులకితాంగులగునట్లు నరేంద్రుఁడువర్ణించును తనపాఠశాలకు నూతనముగ నొకబాలుఁ డరుదెంచుచో నాతనిని "మీయింట నెవరైన సన్యాసము తీసికొనినవార లుండిరా" యని ప్రశ్నించును. ఉండిరన్నచో నాతనిగౌరవభావముతోఁ జూచును. అప్పుడప్పుడు బాలురొండొరుల చేతులలోని రేఖలఁబరీక్షించికొని భావిస్థితి నిర్ణయించుకొనుచుండెడువారు. బాలురందరకు నరేంద్రుఁడే దైవజ్ఞుఁడు. తనచేతినిచూపి, యొకవృద్ధుఁడు తనకుజెప్పినట్లు, "నేనుసన్యాసినగుదు"ననివచించును. ఇఁకసన్యాసులచర్యలఁగూర్చి వారు తర్కించుట కారంభించి, హిమాలయకంటకారణ్యములు సన్యాసులకుఁ దావులనియు, సన్యాసము వలయువారు పర్వతములకేగి డొంకలలోఁబరుండవలయుననియు ముచ్చటించుకొనెడువారు.

కాలక్షేపమునకై నరేంద్రుఁడొక బాలునింటికిఁ దఱచుఁబో వుచుండువాఁడు. అతఁడాయింటియొద్దనున్న చంపకవృక్షశాఖను పట్టుకొని మొగ్గలు వేయుచుండువాఁడు. ఆయింటిముసలితాత గా రాచంపకకుసుమములఁ బూజార్థమై కోసికొనుచుండువాఁడు. నరేంద్రుఁ డావృక్షశాఖ నూఁగులాడుచుంటఁ గాంచి, పుష్పములు రాలిపోవునని భీతితో, నాపని మానుమని నరేంద్రునితో నాముదుసలి చెప్పెను. ఏలమానవలెనని నరేంద్రుఁడు ప్రశ్నించెను. ఆ చెట్టుమీఁద నొకబ్రహ్మరాక్షసి యున్నదని ముదుసలి చెప్పెను. బ్రహ్మరాక్షసి యేమిచేయునని నరేంద్రుఁడు ప్రశ్నింపఁగాఁ జెట్టుముట్టి నవారికుత్తుకలు కొఱికివేయునని ముదుసలి వచించెను. నరేంద్రుఁడు మాటాడలేదు. మనకోర్కె తీరినదికదాయని ముదుసలి వెనకకు మరలినంతనే, మఱలనరేంద్రుఁడు వృక్షశాఖనుపట్టుకొని యూఁగు లాడనారంభించెను. ఆతనిమిత్రుఁడొకఁడు "బ్రహ్మరాక్షసి తప్పక నిన్ను మ్రింగివైచు" ననెను. "ఏమిమూర్ఖుఁడవు. ఒకరేమిచెప్పినఁ జెప్పినంతనే నమ్మెదవు. ఆముదుసలి చెప్పినమాట నిజమేయగుచో నాకుత్తుక చాలదినములక్రిందటనే కొఱుకఁబడియుండవలసిన"దని బదులుచెప్పెను.

ఇట్టిమూఢవిశ్వాసనిర్మూలనాదక్షమగు వజ్రకర్కశహృదయ మే సర్వప్రపంచతాత్త్వికమహాసభావేదికమీఁద, "ఏవిషయమును, పుస్తకముచెప్పినంతమాత్రమునను, వేఱొకరు వచించినంతను, నమ్మ కుఁడు. యథార్థమును మీరే స్వయముగా నిర్ణయించుకొనుఁడు. అదియే జ్ఞాన"మని వివేకానందుని గర్జింపఁజేసినది.

ఆముదుసలి నరేంద్రుని నమితముగఁ బ్రేమించును. ఒకనాఁడు, వ్రేలాడుచున్న నరేంద్రునిఁగాంచి, "యింటింటికిఁ దిరిగి యాడుటతోఁ గాలముపుచ్చెదవా ? ఎన్నఁడు చదువవా?" యని ప్రశ్నించెను.

నరేంద్రుఁడు, "నే నాడెదను; చదివెద"నని వెంటనే బదులు చెప్పెను.

నరేంద్రుని పదునొకండవవత్సరమున కలకత్తారేవులో నాంగ్లనౌకయొకటి చేరినది. నరేంద్రునిమిత్రులు లాయోడను జూడ స్థానికోద్యోగు నాజ్ఞాపత్రము (Pass) ను దెమ్మని నరేంద్రుని బ్రోత్సహించిరి. ఆంగ్లముఖ్యోద్యోగియగు బారాసాహేబును జూచు నిమిత్తము నరేంద్రుఁడు కచేరీగుమ్మముకొద్దకు వెడలినపుడు ద్వారపాలకుఁడు వెనుకకు మఱలుమనెను. అంతనరేంద్రుఁ డత్యావేశకర వశుఁడై, రహస్యముగా గోడదాఁటి, బారాసాహేబుగదిని బ్రవేశించి తనవినతిపత్రముమీఁద సంతకముచేయించుకొని వచ్చుచుండగా ద్వారపాలకుఁడు, "ఎట్లు లోనికిఁబోతి"వని ప్రశ్నింపఁగా, "నాకు మాయాజిక్కు తెలియు"నని నరేంద్రుఁడు బదులుచెప్పెను.

అన్నివిషయములలో నరేంద్రుఁ డితరబాలురతో సమానముగనే యాడుచుఁ బాడుచు నుండువాఁడు. పూర్వానేకజన్మపుణ్యసంపత్తి యప్పుడేచిగురించుచున్న ట్లాతఁడేకాంతస్థితిలో ధ్యానము చేయునప్పుడు, రామభజన సల్పునప్పుడు మాత్రమే తెలియఁగలదు. ఆతనికిఁ దల్లియన్న జగదేకజనని. ఆపవిత్రభావమే యాతనినస్ఖలిత బ్రహ్మచారిగాఁజేసిన దివ్యశక్తి. ఆకాలమున నన్నిపాఠశాలలలోను సమష్టిశిక్ష నొసంగుటాచారమైయున్నది నరేంద్రునివలన నది తొలఁగింపఁబడెను. తరగతిలో నొకబాలుఁ డితరులందఱు నవ్వునట్లు వర్తించును. ఆతని నుపాధ్యాయుఁడు భయపెట్టఁబోఁగా నాతఁడు పక్కున నవ్వెను. దానితో నందఱు నవ్విరి. గురుప్రకృతిసమీపములో నరేంద్రుఁడుండెను. ముందు నరేంద్రునికి, తరువాతనందఱికి దెబ్బలుతగిలెను. అంతనరేంద్రుఁడు పుస్తకములు దీసికొని వెడలుచుండఁగా, "ఈశ్వరచంద్రవిద్యాసాగరుఁ" డచటకరుదెంచెను. ఈశ్వర

చంద్రుఁడఖండపాండితీధురంధరుఁడు. అనేకపాఠశాలలనిర్మాత. సద్గ్రంథకర్త. అతఁడు విషయమును గ్రహించి, సమష్టిశిక్షవలదని యాజ్ఞాపించెను. నరేంద్రునిఁగొట్టినయుపాధ్యాయునివంకకుఁ దిరిగి, "నీవొకమానవుఁడవనుకొంటిని. కాని పశువుగా వర్తించితివే" యని విద్యాసాగరుఁడు నరేంద్రు నోదార్చెను. నరేంద్రునిమిత్రులందఱు నుపాధ్యాయునిమీఁదఁ గ్రోధాగ్ని గురిపించిరి. నరేంద్రుఁడు దెబ్బలుతినుట వారికి సహింపరానిదయ్యెను. ఉపాధ్యాయుఁడు విద్యాసాగరునిచేఁ గఠినముగా దూషింపఁబడినవెనుక వారూరకుండిరి. ఇట్లే నరేంద్రునొకసారి భూగోళమునఁ దప్పెనని గురువుకొట్టెను. కాని తరువాత గురువు తానే తప్పెనని గ్రహించి, క్షమాపణ వేడికొనెను. బాలుఁడైనను నరేంద్రుఁడు నిశ్చలధైర్యమూర్తి. ఈపై రెండుసమయములందు, నరేంద్రుఁడు తల్లిని జేరినపుడు, "నీవు చేసినది తప్పుకానిచో నీకేమిభయము! ఏమిజరిగినను సరే, న్యాయముగానే వర్తింపు"మని యామె బోధించెను. ఈదివ్యసందేశమే నరేంద్రుఁడామరణము నాచరణలోఁ బెట్టెను.

---

## ఆఱవ యధ్యాయము.

### జననీజనకుల పెంపు; బాల్యవిచిత్రములు.

లోకమున నెందఱుతల్లులు లేరు. ఎందఱుపుత్రులు లేరు. కడుపార బాలునిఁగని, సకలసద్గుణముల నుగ్గుపాలతోఁ గలిపిపోసి, లోకకల్యాణహేతుభూతహృదయమును ప్రవర్ధమానముచేసి, అదియే జన్మసాఫల్యమని యెంచిన తల్లియే తల్లి. వివేకానందునితల్లియు నట్టిపూజ్యురాలు. ఓ భువనేశ్వరీ! ఏముహూర్తమున, నరేంద్రుఁడు నీగర్భమునుండి బయటపడెనోకదా! ఎట్టిదివ్యసందేశస్తనదుగ్ధము

లాతని కొనసంగితివోకదా! నేఁడు నీపుత్రు నమృతమయభాగవతవాక్యములువిని, యెన్నికోట్లజను లాత్మశాంతిం గనుచుండిరోగదా! ఎంత మానవకోటి నీసుతుఁడు స్థాపించిన పాఠశాలల, నౌషధాలయముల, సేవాశ్రమముల, బోధనాసీమల, పుస్తకముల, పత్రికల వినుర్శనల ద్వారా జీవనముల వికసింపఁజేసికొనుచుండిరోకదా! ఓతల్లీ! భువనేశ్వరీ! నీదుదివ్యనామస్మరణచే మేము ధన్యులము. నీఋణము లోకు లెన్నటికిఁ దీర్పఁజాలరు.

నరేంద్రునికిఁ దల్లియిట్లుబోధించెను. "తండ్రీ! నీతల ఖడ్గమున కెరమైన నసత్యమాడకుము. హృదయము నిర్మలినము చేయుము. ఉన్నతాశయముల నెన్నఁడు మఱువకుము. ఇతరులతలంపుల నాదరింపుము. ఇతరుల స్వాతంత్ర్యములతో జోక్యము గలుగఁజేసికొనకుము. అత్యంతమృదులమానసుండవు కమ్ము. కాని యవసరమగుచో నఖండధైర్యముచూపుము." ఏమి యమృతబిందువులు. అక్షరమైన దప్పకుండ నరేంద్రుఁ డాజననీబోధనామృతమును ద్రావి, వివేకానందుఁడగుటబ్బురమా!

నరేంద్రుఁడు, "ఇతరుల స్వాతంత్ర్యమునరికట్టకు"మను వాక్యానుసారముగా, నేయేజాతి శిష్యులువచ్చిన వారియాత్మాభిప్రాయానుసారముగా నడచుకొని వృద్ధిపొందుమనెనే కాని, యనవసరాధికారమెన్నఁడు చూపియుండలేదు. మాతృవాక్యము నరేంద్రున కప్రతిహతశాసనము. మారుపల్కుటెన్నఁడును లేదు. జనకునందాతని కమితపూజ్యభావము. కాని, యేదైన చర్చజరిగినచోఁ దండ్రినైన నెదిరించును. అభిప్రాయభేదము మాత్రమే.

చాలమట్టుకు నరేంద్రునిధీనిర్మాత విశ్వనాథుఁడే. పుత్రునితో నాతఁడనేకవిషయములఁగూర్చి చర్చించి బోధించును. కంఠస్థము చేయుటొకటే జ్ఞానసాధనము కాదనియు, నభిప్రాయముల పారస్యము

విడదీసి, వివేకముగా జీర్ణించుకొనుటే ముఖ్యజ్ఞానమనియు బోధించును. ఈహేతువుచేతనే యెన్నిగ్రంథము, లెన్నిమతము, లెన్నిప్రకృతి శాస్త్రములు చదివిననేమియుఁ బ్రయోజనము లేదనియు, యథార్థమనుభవైకవేద్యమనియు వివేకానందుఁడు తనసందేశమును పూరించియున్నాఁడు.

మానుషత్వసంపాదనమే విశ్వనాథునకిఁగల భావము. జాతిమతవిచక్షణలు రెండవ తరగతిలోనివి. ఐనను జాతీయాచారములు మఱువరాదని యాతని తలంపు. ఇవియే నరేంద్రునకుఁబట్టువడెను.

ఆసమయమున క్రైస్తవమతము దేశమున విరివిగా వ్యాప్తమగుచుండెను. మతమునుగూర్చి విశ్వనాథుఁడు నరేంద్రునితోఁ జెప్పుచుఁ గత్తితోడను, శాసనములతోడను చొప్పించిన మతాభిప్రాయములు నిలువనేరవనియు, మానవమానసము బోధనకే వశమగుననియు వక్కాణించును.

'మాతృదేవత నచంచలభక్తితో నారాధించని యేమానవుఁడు కాని గొప్పవాఁడుకాఁడ'ని వివేకానందుఁడు బోధించెను. భారతవర్షమునఁ దల్లియే మొదటఁ బూజింపఁదగినది. భార్యయుఁ బ్రేమింపఁబడును. కాని, మాతృసేవాభావములలో సమస్తస్వకీయభావములు దగ్ధమై సర్వసంగపరిత్యాగబుద్ధి యగ్రగణ్యత వహించును. హిందూ [illegible]ధిష్ఠానదేవతయే జనని. మాతృప్రేమపాత్రతాసంపాదనము [illegible]భసాధ్యమయినది వేఱొండులేదు. అందుచేతనే స్వకీయ [illegible] వృద్ధిపొంది, లోకైక మాతృభావములోఁ జేరెను. [illegible]తృదేవతఁగా దలఁచు టెంత సులభమోకదా!

[illegible]చ్చలమాతృభక్తియే సన్యాసముతీసికొను భావము [illegible]ధినను, దారిద్ర్యపీడితురాలగుచున్న భువనే

శ్వరి దైన్యస్థితింగాంచి, మాతృసంతృప్తికై నరేంద్రునింటనుంచినది. పాశ్చాత్యఖండమున నఖండయశమార్జించి మాతృదేశమునకు వచ్చుచుఁ, దల్లికి జబ్బుచేసినదని విని, వివేకానందుఁడు పరితపించి చెన్నన గరమును జేరగనే, కలకత్తానుండి జనని క్షేమముగానున్నదని తంతి వార్త వచ్చువరకు తృప్తినందలేదు. మాతృసవనవేదికకన్న మిన్న యగు స్థానము హిందూపుత్రుల కాత్మబలియొసంగుటకు లేదు. ఒకా నొక చెన్నగరహైకోర్టుజడ్జీగారు మరణకాలములోఁ బరుండియుం డఁగా, నాతని తల్లి చూచుటకు వచ్చుచు గుమ్మము తగిలి పడిపో వుటఁజూచి, తటాలున మరణతల్పమునుండి లేచి, తల్లిపాదములకడఁ బడి, తనరోగస్థితి యే తల్లినాటిబాధకుఁ గారణమయినదని నుడివి ప్రాణములు విడచెను. ఏమియద్భుతమాతృభక్తి ! అట్టి మాతృప్రేమ పూరితులే, మాతృదేశస్వాతంత్ర్యనిర్మాతలు, వారే భారతీయు లనఁబడుదురు, వారే ఆచంద్రకీర్తి పొందుదురు.

తోడి బాలురను హేళనచేసి యుత్సాహమును రగుల్కొ ల్పుటే నరేంద్రుని కోరిక. పాఠములు చదివి యొప్పగించుట కాతనికి దినమున కొకగంటచాలును. తిరుబండారములకై యాతనికొసఁగినధ నము గోలీకో, బంతులకో, బ్యాట్లులకో వ్యయింపఁబడును. సంవత్సర ములోఁ దొమ్మిదినెల లత్యుత్సాహముతోఁ గాలముగడిపి, పరీక్షముం దేరెండుమూఁడు నెలలోఁజదువును. ఆంగ్లము, దేశచరిత్ర, సంస్కృ తము వీనిలో నరేంద్రుఁడగ్రగణ్యుఁడే. కాని గణితమన్న నాతని హ్యము తండ్రిచెప్పినట్లు "గణితమును కోమటి వృత్తిగా డు దలచుచుండువాఁడు. నరేంద్రుఁడొకనాఁడు నంతకు దేవవిగ్రహములను కొని, చెలికానితోఁ దిరిగివచ్చుచు పడెను. బాలురిరువురు వేఱుపడిరి. ఒకగుఱ్ఱపుబండి దిరిగి హూమహరికి నిత్రుఁడు బండిచక్రముక్రిందఁ

టనే నరేంద్రుఁడు, తనక్షేమము లెక్కసేయక, యాబాలుని పట్టి బయటికిలాగి ప్రాణములు దక్కించెను.

నరేంద్రుఁడొకనాఁడు బాలురతోఁ గలసి నావప్రయాణము చేసెను. నావనెక్కి కొన్నిగజములు పోవుసరి కొకబాలుఁడు జబ్బుచే నావను మలకలుషితము చేసెను. బాలురు నావను వెనుకకుఁద్రిప్పుమనిరి. పడవజనులు నావను కడుగుఁడని బాలుర నిర్బంధించిరి. వలయుచో నెక్కుడుధనమిచ్చెదము, కాని కడుగమనియు, నావను దరిజేర్పుడనియు బాలురు నొక్కిచెప్పిరి. గట్టుమీఁద నిర్వరాంగ్లసిఫాయీలు నడచుచుండిరి. వారితోఁజెప్పి దండనజేయించెదనని నరేంద్రుఁడు సఁరంభము చేయుచుండ నావ యొకప్రక్కకుఁ జేరినది. అదిజూచి నరేంద్రుఁడు వెంటనే గట్టుకుదుమికి పోలీసువారితోఁ జెప్పి వారిని నావకడకుఁ దీసికొనివచ్చెను. తెల్లవానిపేరు విన్నంతమాత్రన గుండెలదరి పడవమనుజులు నావనొడ్డుచేర్చి బాలురను క్షేమముగా దింపి వెడలిపోయిరి. నరేంద్రుని ధీరత్వమును బాలురందఱు ప్రశంసించిరి.

పావురములు, గంటలు కట్టిన చిన్నచుంచులు, చిలుకలు వీనిని నరేంద్రుఁడెంతయుఁ బ్రేమించును. చుట్టుపట్లనున్న గృహస్థులకు నరేంద్రుఁడన్న ముద్దు. పదునేనువత్సరములు వచ్చినను నరేంద్రుఁడు స్వగృహమునందువలెనే పరులయిండ్లలోఁ దిరుగుచుండెడివాఁడు. ఏదోయొక కల్పితకథనుచెప్పి యందఱకడుపుబ్బునట్టు నవ్వించువాఁడు. స్త్రీలనందఱనక్కాయని పిలుచుచుండెడివాఁడు.

చిన్నతనమున నరేంద్రుఁడు వంటలో నందఱను మించవలెనని నమ్మి అందఱచే నొకొక్క పావులా తెప్పించి, తాను కొంతఖర్చుచేసి చిత్రచిత్ర పదార్థములను వండి యందఱకుఁ బంచిపెట్టి, నూతనవిలాసమును కల్పించుచుండెడివాఁడు.

విశ్వనాథుఁడు కలకత్తా విడచి మధ్యపరగణాలలోని రాయ చూరులో నివసించినపు డనేకులుమిత్రు లచటికివచ్చి ప్రసంగించు చుందువారు. ఎంతవృద్ధులయినను తనయాశయములను తూలనాడినచో నరేంద్రుఁడు సహింపఁడు. వంగభాషాప్రవీణుఁడగు నొక మిత్రునితో నరేంద్రుఁడు చర్చలోదిగి, యనేకశ్లోకములు చదివి, యుపన్యసింప నారంభించెను. అద్భుతవివశాంగుఁడై యామిత్రుఁడు "బాలకా! నిన్నువినవలయు దినములు తప్పకవచ్చు"నని వచించెను. ఆతనిజోస్యము సహస్రగుణితముగా ఫలించెను. ఆకాలమున నరేంద్రుఁ డాత్మగౌరవపరిపూరితుఁడైయుండి, తద్భంగము వాటిల్లువాక్యములను తీవ్రముగా ఖండించుచుండువాఁడు. అభిమాను లాత్మగౌరవ నష్టము సహింతురా?

కుస్తీలో నొకటియు, బుద్ధికుశలతకుఁ దరగతిలో నొకటియు బహుమానములు నరేంద్రునకు వచ్చుట బాలురమెప్పునకుఁ బాత్రుఁడయ్యెను. మెట్రిక్యులేషనుపరీక్షలోఁ గృతార్థుఁడైనందులకుఁ దండ్రి యొకచేతిగడియారము నొసంగెను. ఈవిశేషములచే నరేంద్రుఁడు బాలురందఱకు నాయకుఁడయ్యెను.

నరేంద్రుని పదునాల్గవ వత్సరమున, నాతఁడొక నాటకమును జూచుటకు మిత్రులతోఁ బోయెను. నాటకము ప్రదర్శించుచుండఁగా నొకపోలీసు అరెస్టుసమను తీసికొనివచ్చి, నటకునొక్కని పట్టుకొనఁ బోయెను. జనులందఱు పిరికిపందలై యూరకుండిరి. అంతనరేంద్రుఁడు లేచి, సింహగర్జాతుల్యకంఠముతో, "బయటికివెడలుము, నాటకము ముగిసినవెనుకరమ్ము" అని కేకవైచెను. దానితో సభ్యులందఱు కేకలుపెట్టిరి. పోలీసు విని, విసిఁగి, బయటికి వెడలిపోయెను. నరేంద్రునందఱు కొనియాడిరి.

నరేంద్రుఁడు రాయచూరు వెడలినప్పుడు చతురంగమాడుట నేర్చెను. ఆవిద్యయం దాతని నెందఱో గెలువయత్నించి, నిష్ఫలయత్నులైరి. నరేంద్రునికి గాన మన్న మహాప్రీతి. సంగీత మాతని కింట నొకప్రత్యేకోపాధ్యాయునిచే నేర్పఁబడెను. మఱియు నొకస్నేహితు నింటికిఁబోయి, హార్మోనియము, ఫిడల్, వీణ మొదలగునవికూడ నేర్చుకొనెను. ఎచ్చటనున్నను తనమృదుమధురకంఠము నెత్తి పాడి జనుల కాహ్లాద మొదఁగూర్చువాఁడు. తఱచు పదునుండి యెచటనున్న నచట తనగానామృతధారను గురియుచుండువాఁడు. పెరిగి పెద్దవాఁడై తనదివ్యవేదాంతసందేశముచే లోకము నరికట్టుతఱిగూడ వివేకానందుఁ డప్పుడప్పు డుత్సాహపరవశుఁడై శుద్ధపరబ్రహ్మగీతముల నుత్కృష్టకంఠమెత్తి వినోదముగఁ బాడి ప్రజల కానందముచేకూర్చుచుండువాఁడు.

---

## ఏడవ అధ్యాయము.

## విశ్వవిద్యాలయదినములు.

ఆటలతోడను, పాటలతోడను, హాస్యములతోడను, భజనలతోడను సునాయాసముగా నడచిన నరేంద్రుని బాల్యదశ, ఉన్నతాశయములతో, నున్నతగ్రంథములతో, నున్నతగురుసమక్షమున నున్నతజీవనభారములఁ దెలియనగు యౌవనపరిణామస్థితిలోనికి మెల్లఁగా జారెను మెట్రిక్యులేషనుపరీక్షలో కృతార్థుఁడగుటచే నరేంద్రునికీర్తి ద్విగుణీకృతమగు రెండు హేతువులున్నవి. స్థానికపాఠశాలలో నాయేటనే మెట్రిక్యులేషనుతరగతి పెట్టఁబడెను. ఆతరగతిలో నరేంద్రుఁ డొక్కఁడే కృతార్థుఁడయినవాఁడు. రెండవది, 1877వ వత్సరములో నరేంద్రుఁడు తండ్రితోఁగలసి రాయచూరు వెడలినపుడు రెండువత్స

రములు చదువు లేనప్పటికి, బాలురందఱను మించి యొక్కఁడే కృతార్థుఁడగుట నాతని ప్రథను వెల్లడించెను.

రాయచూరు కేగినప్పుడు నరేంద్రుని భాగవతలక్షణము నిరాచ్ఛాదితమై బయల్వడెను. ఆకాలమున నయోమార్గము లేమి వా రెడ్లబండిలోఁ బయనమైరి. ప్రయాణముమధ్య నొకనాఁడు చిత్రముజరిగిది. సాయంసమయమైనది. ఘోరప్రపంచనినాదములన్నియు శాంతిఁ బొందినవి. నరేంద్రుఁడు తనమృదుమధురకంఠమెత్తి ప్రార్థింప నారంభించెను. ఒకక్షణములో బాహ్యప్రపంచదృష్టి నరేంద్రునకుఁ దగ్గిపోయినది. హృదయము పరమేశ్వరలగ్నమయ్యెను. మఱునటి క్షణములో గానములేదు. మాటయు లేను. మూర్ఛిల్లి నేలమీఁదఁ బడెను. ఆతనిముఖమున బ్రహ్మానందరసవిలాసమును దెల్పు చిఱునగవు తాండవమాడుచుండెను. జ్ఞప్తివచ్చినవెనుక నాతఁ డాకసము వంకఁజూచి, నక్షత్రము లప్పుడే వచ్చెనాయని ప్రశ్నించెను. మహాత్ములజీవితము లేక్షణమం దెట్టినిగూఢభావకిరణముల వెలిఁగ్రక్కుచుండునో కదా!

నరేంద్రుఁడు మెట్రిక్యులేషన్ పరీక్షలోఁ గృతార్థుఁడయి, యఫ్. ఏ. తరగతిలోఁ జేరినపుడు వానికిఁ గల పాఠశాలాకార్యక్రమము, పూర్వము చదివినతరువాయి దేశచరిత్ర, గణితము, సంస్కృతము, విపులముచేయఁబడుటే కాక, తత్త్వశాస్త్రము, ప్రత్యేకాంగ్లము మున్నగున వదనముగఁ జేర్పఁబడెను. మొదట నరేంద్రుఁడు ప్రెసిడెన్సీకళాశాలలోఁ జేరినను, కొలదినెలల తరువాతనే జెనరల్ అస్సెంబ్లీకాలేజీలోఁ జేరెను. ఈకాలేజీ స్కాటిష్ జనరల్ మిషనరీవారిచే స్థాపితమయ్యెను. వివేకానందుఁడు పశ్చిమదేశదిగ్విజయయాత్ర సల్పి స్వదేశమునకుఁ దిరిగివచ్చి జమీందారీగుఱ్ఱపు బండిలో జనసముద్రమధ్యనుండి పోవుచుండఁగా పర్వెత్తివచ్చి, గుఱ్ఱములను తొలఁగించి,

స్వభుజములమీఁద స్వామిబండిని గౌరవార్థము లాగిన దీశా లేజీవిద్యార్థులే.

విశ్వవిద్యాలయవిద్యాభ్యాసములో మొదటి రెండువత్సరములు విశేషము చదువుటతోడనే నరేంద్రుఁడును గడపెను. విశేషాంగ్లభాషాప్రావీణ్యము, తర్కశాస్త్రజ్ఞానము, గణితశాస్త్రాభ్యాసము, కడుశ్రద్ధచేసి పాఠశాలాచర్యాసంఘములో విశేషకృషి సల్పి నరేంద్రుఁ డగ్రగణ్యత వహించెను.

పూర్వము స్థానికపాఠశాలలో నరేంద్రున కిదియేవృత్తి. ఒకనా డుద్యోగపరిసమాప్తియై వెడలిపోవుచున్న నొక యుపాధ్యాయుఁడు పాఠశాలకు బాలురకు సల్పిన సేవఁగూర్చి యొక యభినందనసభ గావింపఁబడెను. అఖండమహాప్రవక్తయని పేరు గాంచిన బాబు సురేంద్రనాథబెనర్జీ అధ్యక్షుఁడుగా నుండెను. అట్టిమహాపురుషునెదుట ప్రసంగించుటకు బాలురకేరికి సాహసము చాలదయ్యెను. అంత నరేంద్రుని వారు మాటాడుమని ప్రోత్సహించిరి. సభామధ్యంబునఁ దటాలున లేచి, యెట్లాయుపాధ్యాయునందు బాలురందఱకుఁ బూర్ణగౌరవభావ మున్నదో యాతనివిడఁదలచే బాలు రెంత విలపించుచుంటిరో, మున్నగు విషయముల నించుమించుగా నొక గంటసే పాతఁడు మధురభాషణములతో నుపన్యసించెను. తరువాత సురేంద్రనాథబెనర్జీ తనయధ్యక్షోపన్యాసమిచ్చి నరేంద్రు నత్యాదరముతోఁ బొగడెను. భారతదేశమున నద్వితీయ ప్రవక్త యని పేరొందిన ఆమహాశయుఁడు, నరేంద్రుఁడు ధర్మసందేశవార్తావహుఁడైనప్పుడు భారతవర్షమున వివేకానందుని మించిన ప్రవక్తలు లేరని విన్నవించియున్నాఁడు.

రెండువత్సరములలో యఫ్, ఏ, పరీక్షలో నుత్తీర్ణుడై నరేంద్రుఁడు బి. ఏ. తరగతిలోఁ జేరెను. పర్ఛపీపయమున బాలురె

వరైన మాటాడుచోఁ దన యప్రతిమాన శేముషీప్రకటనవాగ్వి జృంభణముతో వారిని జయించి, తనయభిప్రాయమే గ్రాహ్యమని తేల్చును. అట్లని బాలురతో స్నేహము చేయఁడా? బాలురకాతఁడు హాస్యవిషయములు చెప్పి నవ్వించును. కాలేజీఁ జేరినంతనే నరేంద్రుని కొఱకు బాలురు వెదకికొనుచు వచ్చుచుండువారు. ఎల్లప్పుడును నరేంద్రుఁడు నాయకుఁడే. ఉత్సవమునకేగుచో, నూరేగుచో, భజనసల్పుచో నరేంద్రుఁడు ముందు నిలచును. ఈసమయమున నంరేఁద్రునితో మిత్రత్వము వహించినబాలురు జీవితాంతమువఱకుం జెక్కుచెదరని ప్రేమతో నాతని గౌరవించిరి. బాలురతో నక్షీణ ప్రేమప్రకటనము చేయుట, చెలికాండ్రతో నాశ్చర్యజనకములగు సంగతులఁజెప్పి యుత్సాహపూరితులఁ జేయుట, సోదరభావముచే నందఱ సమానముగాఁ జూచుట యిట్టిగుణములే వివేకానందునిలో నభివృద్ధినందుచున్న లక్షణములు.

ఆదినములలో నరేంద్రుఁడు మాంద్యముమీఁద నగ్నిజ్వాల కురియువాఁడు. అనవసరవస్త్రాలంకారవేషుల నాతఁడు తనవాగ్బాణములకు గురిచేయువాఁడు. దీనులఁగాంచి ప్రేమరస మొలికించువాఁడు. ఒకపట్టపరీక్షావిద్యార్థి కొన్ని నెలలజీతము, పరీక్షానిధి, కట్టకపోవుటచేఁ బరీక్షకుఁ బంపుటకు వీలులేనిస్థితివచ్చినది. ఆవిద్యార్థి విచారమునకు లోనయ్యెను. నరేంద్రుఁడాతని నోదార్చి, "ఆవిషయము నాకు విడిచిపెట్టుము, నీవు పరీక్షకుఁ జనుట మానకు"మని యాతనినంపి, కళాసంఘకార్యదర్శి నొకప్రత్యేకస్థలమున దర్శించి పరీక్షానిధిపత్రముమీఁద నెట్లో చెప్పి, సంతకము చేయించి యావిద్యార్థికిచ్చెను. ఇట్టికరుణారసప్రదర్శనమే నరేంద్రునిజీవితమునకూఁతమై నిల్చినది.

విద్యాభ్యాసమునకు భగవద్దర్శనమే ఫలమైనపుడది విద్యయ నఁదగును. తదితరమగున దెద్దియైన 'నవిద్య'యే.

ఏది నేర్చుకొని . యనుభవించినచో నిఁకఁజదువనరవసము లేదో అట్టిజ్ఞానవిద్యాభ్యసనము నాత్మనుండి యాత్మకు గురుశిష్యరూప మున సిరాఘాటముగాఁ బ్రవహింపఁజేసి, లోకమును బ్రహ్మానంద తరంగములచేఁ దడిపి, పావనముచేయు బ్రహ్మవిద్యావిధానము ప్రాచీన భారతదేశమునకుఁ బ్రాణప్రతిష్ఠఁజేసి, యిప్పటికి, పూర్తిగా నశించినను, జీవసహితంజేసి నిల్పినది. ఒకధనముకొఱకో ఒకవర్తక నైపుణికో, ఒకయుద్యోగమునకో, ఒక యన్యాయ్య పరిపాలనా విధానమును సమర్థించుటకో, బోధింపఁబడుచదువు పైశాచికవృత్తి యనఁ జెల్లును. అట్టిపైశాచికవిద్యయే భారతవర్షమును పిల్చి పిప్పిచేసి నది. లోకమును ఘోరయుద్ధారావములనుండి పైకిఁదెచ్చి, శాంతిరస ములఁ దేల్పవలెనన్నచో, భారతదేశము వెనుకకరిగి, కేవల పరమే శ్వరైకజ్ఞానార్జన సాధనవిద్యావిధానసూత్రముల జపించి తీరవలయును.

నరేంద్రుఁడు కళాశాలాపాఠకార్యక్రమమును నెఱవేర్చుచు మఱియు, సంస్కృతాంగ్లతాత్త్వికశాస్త్రముల నతివిశేషముగఁ చదివి పట్టపరీక్షలోఁ గృతార్థుడయ్యెను. ఆసమయమున నరేంద్రుఁడు గానములోఁ బేరెన్నికఁగనెను. పాఠశాలలో నొకసారి, గురువు వచ్చుటకాలస్యము కాగా నొకగీతము నద్భుతకంఠముతోఁ బాడ నది గురువు దూరమునుండి విని, నరేంద్రునభినందించెను. అట్టి నరేంద్రు నిగానమాధుర్యముచే బ్రహ్మానందవార్ధికి తనహృదయస్రవంతిని ప్రస రింపఁజేసిన మహాత్ముఁ డొకఁడు గలఁడు. ఆతఁడే శ్రీరామకృష్ణుఁడు.

---

## ఎనిమిదవ అధ్యాయము.

### నరేంద్రుని దృష్టి; కష్టములు, దుఃఖములు.

పుస్తకముల నవ్వుల విసరివైచుము. భగవత్సాన్నిధ్యమునఁ బుస్తకములేమిటికి? పట్టకరిశ్రోదినమున నీయభిప్రాయము నరేంద్రునికిఁ గల్గినది. భగవంతునియందు భక్తిపారవశ్యమున హృదయముప్పొంగునపుడు వేయిచదువులేల ?

గీ. భవ దమలసూత్రబద్ధమై వరగుచుండు
విశ్వలోకైకగానమ్ము వినుచు నీవు
దివ్యమౌనాసనమ్మున స్థిరముగాఁగ
వెలయుచుందువు విశ్వేశ, విశ్వజనక !

ఈచరణములు, భగవచ్ఛరణైకార్పితహృత్కుహరుఁడై, బ్రహ్మానందపాథోధి నీదులాడు దివ్యహంసపోలె, కీర్తించుచు సహపాఠకుల గదిగుమ్మమునొద్ద నరేంద్రుఁడు నిల్వఁబడెను. అదిప్రభాతసమయము. బాలురందఱు నిద్రించుచుండిరి. ఆగానమారుతము వీచినంతనే వారు మేల్కాంచి, తలుపులుతెఱచిరి. పుస్తకహస్తుఁడై నరేంద్రుఁడెట్టయెదుట నిలుచుండెను. పుస్తకమానాఁడు తెఱువఁబడలేదు. పరీక్షకొక్కరోజే గడవున్నది. ఆదినమొక్కటి గానముచే నాక్రమింపఁబడెను. అట్లు పాడుచుండినపాట పరమేశ్వరస్తోత్రములోనికిఁ దిగినది.

గీ. విమలకంఠంబు లెత్తి యావిశ్వజనకుఁ,
కీర్తి పాఠంబుపాడుఁడో గిరులు, ఘనులు
పాడుఁడానంద మిగురొత్తఁ బరమపురుషుఁ
జాంద్ర సూర్యులు నక్షత్ర సమితులార !

"ఓయీ నరేంద్రా! పరీక్షాపఠనము పూర్తియయినదా?" యని బాలురు ప్రశ్నింప, "ఓహో" యని బదులుచెప్పి, మఱలఁబాడ నారంభించెను. "ఏలనీపాఠములను పూర్తిచేసి పరీక్షాసన్నద్ధుఁడవు కావు? పరీక్షలో నుత్తీర్ణుఁడవగుచో నీకు సదవకాశములు పెక్కులు గలవే. ఏల యీయనవసరకాలక్షేపము?" అని మఱల ప్రశ్నాపరంపరలు బాలురచేఁ గురిపింపఁబడెను. అంతనరేంద్రుఁడు తలఁద్రిప్పి ప్రాపంచికభోగములపై నాతనికి నెక్కుడాస కలుఁగకఁబోలేదనియు, నాలోచింపగా నవి తృణప్రాయములనియు, సర్వమున నాశనము తప్పదనియు, నశించువస్తువుల ప్రోఁగిడుట పిచ్చియనియు, దీర్ఘోపన్యాసమిచ్చి, "సర్వసంగ పరిత్యాగమే నాకు నిత్యక్షేమంకర మార్గముగాఁ దోఁచెననియు, నదియే యనుపహసించు శక్తి నొసంగు"ననియు వాక్రుచ్చెను. విద్యార్థులు నిశ్చేష్టులై నిల్వఁబడిరి. నరేంద్రుఁడు నూరకుండఁగా నింకొక విద్యార్థివచ్చి, "సన్యాసము నిన్ను, లోకమును గూడఁజెరుచు" నని వచించెను. మఱియు, "ఈతఁడు దక్షిణేశ్వరములో నొకముసలివాని ప్రేరణమున నిట్లు చెడిపోయె"నని యాతఁడు తోడివారలతోఁ జెప్పెను. చిఱునగవే నరేంద్రుని సమాధానము. ఇంతలోఁ జీఁకటిపడినది. దినమంతయు గానముతో నడచిపోయెను. నరేంద్రుఁడు లేచి, మాతామహిగృహముచేరి, తనగదిలోఁ బడి కొంతసేపు విచారించి, లేచి, గానాభినివేశముతోఁ బునరానందపరవశుఁడయ్యెను.

పాఠములు చదువుచు మధ్యమధ్య, నరేంద్రుఁడీగదిలోనే విశేషముగాఁ బాడుచుండును. ఆగృహమున కెదుటియింటిలో నొక బాలవితంతువుగలదు. చాలమాఱులామె నరేంద్రునిగదికిటికీయొద్దకువచ్చి, ఆతనికిఁ దెలియకుండ, గానమునువిని యానందించుచుండెడిది. ఒకనాఁడుమాత్ర మామె ధైర్యమువహించి, నరేంద్రునిగది

గుమ్మముకొద్ద కరుదెంచి, మీాహావివశాంగియై నిల్వఁబడెను. నరేంద్రుఁడదిచూచి, వెంటనే యామెపాదములపైఁబడి, సాష్టాంగ నమస్కారముచేసి, "తల్లీ ! ఎందుల కరుదెంచితివి. నాతల్లికి నీకు భేద ములే"దని, తనపవిత్రహృదయమును వెలిబుచ్చ, నామె గ్రహించి వెడలిపోయెను. మఱుచటిదినమాతఁడు స్థలముమార్చి, మఱెన్నఁడా మెకంటఁబడ లేదు.

నరేంద్రుఁడు సహజదయా ప్రసన్నహృదయుఁడు. తానుజ్వర పీడితుడఁగుచుండెనని మిత్రులు కొంద ఱుదెంచియుండఁ, దాను స్వయముగా లేచి, ఫలుకాలను తయారుచేయఁబోగా, సేవకుఁడు వచ్చి వారించి పంపుకొమ్మనెను. పరులను గౌరవించుటలో నరేంద్రుఁ డద్వితీయుఁడు.

భారమావంత లేని నరేంద్రుని క్రీడావిలాసశోభితహృదయము తానొకమిత్రునింట నుండఁగాఁ గులిశాహతిసదృశదుఃఖవార్త వచ్చి కలగుండుపఱచెను. హృదయరోగముచే విశ్వనాథుఁడు మరణించెనని తెలిసిను నరేంద్రునిబాల్యహృదయము వ్రక్కలైపోయెను. ఇది నిజమైయుండునా ? యని తనలోఁదాను ప్రశ్నించుకొని, వెంటనే గృహోన్ముఖుడయ్యెను. శ్మశానమునకుఁ దీసికొనిపోవుటకు సిద్ధము గానున్నతండ్రిశవము పడియుండెను. తల్లి, అక్కలు, సోదరులు, పొక్కిపొరలుచుండిరి. జనులు నరేంద్రునికై యెదురుచూచుచుండిరి; జ్యేష్ఠపుత్రుఁడగుటచే నాతఁడే కర్మాధికారి; "హరి ! హరి !!" యను నారాయణస్మరణముతో విశ్వనాథునిశవము బంధుజనులచే శ్మశానమునకుఁ గొంపోఁబడెను. తండ్రి చనిపోయెనా ? నిజమా ? రుదతి భూమివచ్చినదే ! నరేంద్రునికన్నీరు కాల్వలై ప్రవహింపఁ జొచ్చెను; కాష్ఠములతోఁ జితియేర్పరుపఁబడెను; శవము దానియందమర్పఁబడెను; నరేంద్రుఁడు స్వహస్తములతో నగ్నిముట్టించెను; సర్వము

జ్వాలామయమయ్యెను; ఆజ్వాలల నవలోకించి, "ఈతగులఁబడునది శరీరము; శరీరములకిట్టి నాశనము సహజముగాదా!" యనుకొని, విశ్వనాథదత్తునిశరీరము దగ్ధమైన నాతనియాత్మ నశించ లేదని నరేంద్రుడు గ్రహించెను; దహనము పూర్తియైన వెనుక నెముకలుతీసి గంగార్పణము చేయఁబడెను.

అద్వైతశాస్త్రానుసారముగాఁ బ్రపంచ మొక మాయాభిప్రాయము. అందుచేఁ బ్రపంచ మసంపూర్ణము. సంపూర్ణత్వమందుటే దాని పరమావధి. మానవుఁడు మాయాకల్పితప్రపంచమునకుఁ జెందియుంట నతనికి నదియే పరమావధి. పరిపూర్ణము లేనిదానికి పరిపూర్ణానంద మెట్లుండఁగలదు? యాతన, మరణము, దుఃఖము నివి తప్పవు. ప్రతిజీవికి నివియే యనుల్లంఘనీయములు. ప్రతిప్రాణి యొకప్పుడు సంసారసౌఖ్యసాగరతరంగడోలికలపై నూగులాడి, మఱొకప్పుడు విచారసాగరాధఃపతితుఁడు గాకతప్పదు. కాని, ఒక్కవిషయము మాత్రము గలదు. ఎన్నిదారిద్ర్యములు, కష్టములు, దుఃఖములు, కోటులు తెటచి మీఁదఁబడినను, దారుణరణరంగమధ్యంబునందుఁ బోలె కృపాణధార, యెర, నీ రెండుతప్ప నెద్దియుఁ జూడని వీరాగ్రేసరునిచందంబున గొందఱుమాత్రమే జ్ఞానకృపాణహస్తులై, ప్రతికష్టవ్యాఘ్రదర్శనముతోడను వేయిరెట్లు ధైర్యమును పెంపుచేసికొని మోక్షపరమావధికే సూటిగా బయనించుచు సమస్తమానవకల్యాణనిర్మాణహేతుభూతులై భగవద్భక్తాగ్రేసరులై, అమలినాదర్శప్రాయులై వెలయుచుందురు. తదన్యులు దుఃఖభూతమునకు దాసానుదాసులై విలపించుచుందురు.

రాజమర్యాదనందిన నరేంద్రునికుటుంబము విశ్వనాథదత్తుని మరణముతో దారిద్ర్యనిలయమైపోయినది. ఆదారిద్ర్యదేవత కష్టములు, దుఃఖములు, మూపున నిడుకొనివచ్చి నరేంద్రునింటఁ జొర

విడిచినది. శ్మశానవాటినుండి యింటికివచ్చి నరేంద్రుఁడు భువనేశ్వరిని సమీపించి, "తల్లీ! నీకు భయములేదు. నన్నునమ్మి ధైర్యమును వహింపు"మని బోధించి యోదార్చెను. తల్లియు నోకించుక ధైర్యమూనెను.

ఇఁక భువనేశ్వరి యనాథయైనది. సర్వసంగములను విసర్జించి నియమనిష్ఠలతోఁ బరమేశ్వరప్రసాదసంపాదనమే జీవనావధిగా నిడి కొను వితంతుజీవన మామె గడపనిశ్చయించుకొనెను. ఇట్లు గొన్ని వారములు గడచినవి. ఒకనాఁడంత భువనేశ్వరి పుత్రునిఁబిలఁచి, "తండ్రీ! భోజనాధారము లేదు. ఏమిచేయుద" మని కండ్లనీరు జల జల గ్రుక్కుచు వచించెను.

అప్పటికిని నరేంద్రుఁడు న్యాయకళాశాలలోఁ జదువుచుండెను. విద్యార్థులందఱిలో నాతనికన్న నిర్ధనుఁడు లేఁడు. ఎంతదూరము వెడలిన నరేంద్రుఁడు నడచియేపోవలెను. తండ్రినాటి గుఱ్ఱపుబండ్లాతని కెట్లువచ్చును? కాలిజోడుకూడ నాతనికిఁ గఱవైపోయెను. ముతుక గుడ్డలే వస్త్రములు. కొన్నిదినములు దారిద్ర్యదేవతమీఁద నాగ్రహించి యాతఁడు నిరశనవ్రతముబూని కళాశాల కేగవలసివచ్చెడిది. ఆ కలిచే నరేంద్రుని సువర్ణదేహమెండి కృశింపనారంభించెను. స్నేహితులీసంగతి గ్రహించి తమగృహముల కాహ్వానించుచుండువారు. నరేంద్రుఁడు మిత్రులయిండ్లకరిగి, మాటలాడి, భోజనము చేయుమన్నంతనే పూర్వస్వగృహవైభవోన్నతి కట్టెదుట ప్రత్యక్షము కాగా వెడలిపోవుచుండెడివాఁడు. ఇంటికిఁబోయి యందఱు మెసవఁగా మిగిలినదేమైన నున్నచోఁ దినువాఁడు. లేకున్న నెచ్చటనో తినివచ్చితినని చెప్పువాఁడు. ఇట్టి కష్టపరంపరలలోఁబడి, నరేంద్రుఁడు స్వకుటుంబపోషణార్థము సోదరమును బిగిఁచుకొనువాఁడు. సర్వప్రపంచ

సోదరజనమోక్షమునిమిత్త మాత్మమోక్షము నటుచేతనున్న వీడిన వివేకానందున కిది గొప్పయే!

ఏదియెట్లున్నను, కాలమును విలాసముగాఁ గడుపు నరేంద్రుని బాల్యచిహ్నములు పూర్తిగ నడుగంటలేదు. తనస్థితి నడుగువారికి సులభముగా నానందముతో బదులు చెప్పి పంపువాఁడు. గోరుచుట్టు మీఁద రోకటిపోటువలె నరేంద్రునిగృహముమీఁద వారసత్వపు దావాయొకటి తేఁబడెను. ఉండుట కిల్లైనను డదాయని భువనేశ్వరి విలపింపసాగెను; కాని నరేంద్రుఁడు వ్యవహారమును ధీరత్వముతో నెదుర్కొనెను. విశ్వనాథునిమిత్రుఁడును పేరెన్నికగన్న న్యాయవాదియునగు డబ్లియు. సి బెనర్జీ నరేంద్రునిపక్షమువహించి సాయము చేయుట కంగీకరించెను. విచారణసమయమున, వాదిపక్షమున నొక యాంగ్లన్యాయవాది, నరేంద్రునిఁ గూర్చి మాటాడుచు నాతఁడొకఁ చేలా యనిపల్కెను. చేలా యన నొకగురువునొద్ద శిష్యుని పేరు. అంత నరేంద్రుఁడు, "అయ్యా! చేలా యననేమో తెలియునా" యని హేళనచేసెను. అగుచో నేను నొక చేలానే యని న్యాయవాది బదులుచెప్పెను. న్యాయవాదియు రామకృష్ణుని శిష్యుఁడే. న్యాయాధిపతి, నరేంద్రుఁడు న్యాయకళాశాలావిద్యార్థియని తెలిసి, "బాలుఁడా! నీవొక మంచిన్యాయవాదివగుదు"వని పలికెను. దావా నరేంద్రునిపక్ష మయ్యెను. నరేంద్రుని యానందమునకు మేరలేదు. వెంటనే యాతఁడు గృహోన్ముఖుఁడై పర్వత్తి తల్లి కీవార్త నెఱిం గించెను. ఆమె యెంతయు సంతసించెను.

సంసారమును దారిద్ర్యమునుండి కాపాడ నరేంద్రుఁడు పెక్కు యత్నములు చేసెను. విద్యాసాగరుని పాఠశాలలోఁ గొన్నినాళ్ళు పనిచేసెను. ఎట్లు కష్టపడినను, విస్తరిలోని కన్నముజేరుట కష్టమై పోయెను. ఆకష్టదినములను నరేంద్రుఁ డెన్నఁడు మఱువలేదు.

భయము, భ్రాంతి, వైకల్యము, దైన్యము, నరేంద్రు నుజ్జాత లూగించినను, నరేంద్రుఁ డజేయుఁడై నిలచెను. వెనుకంజవేయు టాతని ప్రపంచమున లేదు. మాతృప్రేమ, పుత్రవాత్సల్యము నీకష్టములచే స్థిరమై యొప్పెను.

శ్రీరామకృష్ణదర్శన మిదివఱకే నరేంద్రుఁ డనేకమారులు చేసియుండెను. ఆతనిహృదయములో సంసారపరిత్యాగకాంక్ష దినదిన మతిశయింపనారంభించెను. ఆదారిద్ర్యబాధనుండి, ఆకుటుంబపోషణభారమునుండి, ఆయభియోగసమయములో, నావిచారసాగరముప్పొంగువేళ, నెట్లు నరేంద్రుఁడు సంగపాశములను ద్రెంపివైచుట? పరిస్థితులనుండి విముక్తిమార్గ మాతనికి సూదిబెజ్జమంతయైన కన్పట్టలేదు. దైన్య మధికమయ్యెను అతఁడేమియుఁ దోచక, దక్షిణేశ్వరమునకుఁ దారితీసెను. ఆతొందఱలోఁ గాలిజోడు పడిపోవు టాతఁడెఱుఁగఁడు. అట్లు వెడలి, శ్రీరామకృష్ణునిపాదములపైఁబడి, "అయ్యా! నేనేమి చేయుదును? నాకు మార్గము కన్పట్టుటలేదు. నీకు శక్తికలదేని నన్నీదురవస్థనుండి రక్షింపు"మని ప్రార్థించెను. నరేంద్రుని కుటుంబస్థితి శ్రీరామకృష్ణుఁ డెఱుంగును "నరేంద్రా! అదిగో! మాతృదేవ్యాలయము. ఆమెను ప్రార్థించుము. నీకు వలయున వన్నియు నామెయే చూడఁగల"దని రామకృష్ణుఁడు చెప్పఁగా, నరేంద్రుఁ డాలయముఁజొచ్చి నిర్మలప్రార్థనచే ముఖము బ్రహ్మతేజంబు వెలిగ్రక్క బయటికి వచ్చెను. కొంతకాలమువఱకు నరేంద్రుఁ డెట్లు శరీరమానసిక యాతనల ననుభవింపవలసివచ్చెనో ముందు తెలియును. విశ్వనాథదత్త, రామకృష్ణ పరమహంసమరణముల మధ్యకాలము నరేంద్రుని మానసచంద్రగ్రహణకాలము. ఆసంకటస్థితియే నరేంద్రుని భావిలోకమునకు వివేకానందునిగాఁ బ్రదర్శించినది.

---

## తొమ్మిదవ అధ్యాయము.

### జీవితములో మార్పు.

హృదయ మపవిత్రమై, పరిపక్వము గానప్పు డెన్ని యేండ్లుగడచిన నేమి ప్రయోజనము? శరీరము పెరుగవచ్చు; తల నెఱియవచ్చు; పండ్లూడవచ్చు; పండ్లు సడలవచ్చు; భర్తృహరిమహాశయుఁడు చెప్పినట్లు, తృష్ణమాత్రము యౌవనదశలోనే యుండవచ్చును. మరణము ప్రాప్తింపనగును జననము ప్రాప్తింపనగును పునర్మరణము పునర్జననము ప్రాప్తింపనగును. అనంతకోటిజన్మము లిట్లు కడచిపోవచ్చును. కాని యెన్నికోట్లజన్మములయినను జ్ఞానము నొసంగఁజాలవు. కాని మానసము పవిత్రవంతము చేసి, దేహాభిమానము వీడి, నిర్ద్వంద్వమనస్కుఁడై, పరమేశ్వరపాదసేవాలగ్నతం బడయునప్పుడని కనంతాజ్ఞాననిశీథము పటాపంచలై, జ్ఞానప్రభాత ధవళ తేజోరేఖలు ప్రత్యక్షములగును. ఈలోకమునని ప్పుడు చక్షుర్గోచరంబగు పుస్తకయయిన తరువాత, వత్సరములు లెక్కిడి, వీఁడు బాలుఁడు వీఁడు వృద్ధుఁడు ననుట మూర్ఖప్రదర్శనము. ప్రాణి యెప్పుడు పరిపక్వస్థితిం బ్రాపించునో, అప్పుడే గర్భములో నున్నను, నరకముననున్నను, బాల్యదశ యందున్నను, వృద్ధస్థితిలోనున్నను, నాప్రాణియే వృద్ధుఁడు. జ్ఞానహీనతచే నెన్నియేండ్లుగడచినను, నాతఁడు పురిటిబిడ్డయే.

మఱియుఁ బ్రపంచమున మహాపురుషులని పేర్వడసినవా రెల్లరు నూత్నయౌవనులే. అబ్రహాములింకను, నెపోలియన్, అలెగ్జాండరు, మున్నగువారందరు తమయౌవనదశలోనే విఖ్యాతపురుషులై వెడలిపోయిరి. అద్వైతవేదాంతస్థాపకుఁడయి, మహోపనిషద్భాష్యరచయితయై జగత్తునల్లలనాడించిన శంకరాచార్యుఁడు పదునాఱువత్సరముల బాలుడు నరేంద్రుఁడు నట్లే ముప్పది వత్సరములు నిండక పూ

ర్వమే, పాశ్చాత్యఖండముల నద్వైతవేదాంతసందేశముచే మేల్కొల్పి మోక్షోన్ముఖతకుఁ ద్రిప్పెను. అట్టిచో నిరువదినాల్గవవత్సరమున నరేంద్రుఁడు శేముషీప్రపూర్ణతం గాంచెనన వింతయేమి ?

పదునెన్మిది, యిరువదినాల్గువత్సరముల మధ్యకాలము నరేంద్రుని ధీపుష్పవికసనకాలము. కళాశాలలో నేర్పు విద్యతో నాతఁడెన్నఁడు దృప్తివహించియుండలేదు స్వకీయజీవనకార్యక్రమమును స్వయముగా నిర్ణయించుకొని సత్యమార్గమునుబట్టి నడచువాఁడు. హిందూదేశమున బానిసవృత్తి విశ్వవిద్యాలయకళాశాలా కార్యక్రమముతోడనే ప్రారంభమయినదన్నచో నిందింపఁబనిలేదు. "కంఠస్థముచేయుటకంటె నీచవృత్తిలేదు. కృతార్థతాబిరుదముకొఱకే నేను చదివెదను ఉదరపోషణము లభింపమికనుక నదితప్పదు. కళాశాలావిద్యాభ్యసన మింతవఱకే; యథార్థవిద్యాభ్యసన మామరణముండును. కృతార్థతాపత్రము చేతఁబడినంతనే చదువు తుదముట్టెనని తృప్తిచెందు వారిమాంద్యము నేమనిదూషింపను." అని నరేంద్రుఁడు తోడి విద్యార్థులకు బోధించెను.

వార్తాపత్రికలు, సమకాలికరచనలు, నరేంద్రునికి నిత్యభోజనము. నూతనాభిప్రాయమునకై యాతఁ డెదురుచూచువాఁడు. ఆసమయముననే వంగదేశమున నాటకప్రదర్శనము నూతనశకమును సృజించెను. కేశవచంద్రసేనుఁడు రచించిన 'నవబృందావనము' లోని యోగిపాత్రను నరేంద్రుఁ డొకసారి ధరించి యుండెను. సాంఘిక రాజకీయ, మత, జాతీయాశయముల విశాలప్రకటనమునకు నాటకశాలయే మార్గమని నరేంద్రుడు తలఁచెను.

నరేంద్రుఁ డాలోచనాపరిశ్రమచేఁగల్గిన శిరోభారమును శరీరపరిశ్రమలఁ గల్గించు నాటలచేఁ దేలికపఱచసాగెను. తాను స్వయముఁగా నొక వ్యాయామసంఘమును స్థాపించెను. సాముచేయుటలో

నాతఁ డగ్రగణ్యుఁడు. అందు పరుగెత్తుట, దుముకుట, కుస్తీపట్టుట ముఖ్యమే. జీవనకళ నొసంగు శరీరబలము, శరీరమునకు వన్నెదెచ్చు మానసికకృషి, మానసికకృషికి మర్యాదనొసంగు హృదయపవిత్రత, వీనిని నరేంద్రుఁడు సమముగా వృద్ధిచేసెను. వీనియట్టియమగున సత్యము, ధర్మము, పాతివ్రత్యము, బ్రహ్మచర్యము, సహజప్రేమ, నరేంద్రుని కుదయించి, పరిశ్రమావసరము లేకుండ వృద్ధిబొంద నారంభించెను.

నరేంద్రునిమూర్తిమత్త్వము నక్షాలితముచేసి, జగజ్జేగీయమాన పవిత్రతాగ్నిజ్వాలల రగుల్కొల్పి, ప్రజాహృదయమును దుడిచి, పరిశుభ్రముచేసిన సద్గుణరాజ మాతని పవిత్రభావము.(Purity) విశుద్ధత; అంతఃకరణశుద్ధి; హృదయనైర్మల్యము; అఖండ బ్రహ్మచర్యవ్రతదీక్ష. ఆతనిహృదయ మధర్మాంధసమును, అన్యాయకామ్యములను, దుష్ప్రవర్తనా దుర్గంధమును, దహించుటకో నగ్నిజ్వాలగా మారుచుండెడిది. నరేంద్రుఁ డపరప్రహ్లాదుఁడు.

సీ. తనయందు నిఖలభూతములందు నొకభంగి
సమహితత్వంబున జరుగువాఁడు,
పెద్దలపొడగన్న భృత్యునికైవడి
చేరినమస్కృతుల్ జేయువాఁడు,
కన్నుదోయికి నన్యకాంతలడ్డంబైన
మాతృభావముచేసి మరలువాఁడు,
తల్లిదండ్రులభంగి ధర్మవత్సలతను
దీనులఁగావఁ జింతించువాఁడు,

గీ. సఖులయెడ సోదరస్థితిఁ జరుపువాఁడు,
దైవతములంచు గురువులఁ దలఁచువాఁడు,

లీలలందును బొంకులు లేనివాఁడు,
లలితమర్యాదుఁడైన ప్రహ్లాదుఁ డధిప !

హరిపరతంత్రుఁడై హతాన్యతంత్రుఁడగు నరేంద్రుఁడు పరమేశ్వరజ్ఞానసముపార్జనమే పరమావధిగాఁ గైకొని, జీవనమును నడుప నారంభించెను. వేదాంతతత్త్వమును పరిశీలించినకొలదియు బ్రహ్మచర్యము, పవిత్రశీలము లేనిదే యాధ్యాత్మికజీవనము జీవరహితమని యాతఁడు నిశ్చయించికొనెను. పవిత్రత యన (Purity) కామక్రోధలోభాదిశత్రువర్గమును జయించుటే గాదు. సర్వభూతసమదృష్టి, శాశ్వతపదార్థచింతనము, ఆత్మస్వాతంత్ర్యప్రకటనము, పరిపూర్ణ కారుణ్యమయజీవితము, నివియే నరేంద్రుని పవిత్రతార్థములు. పవిత్రతాశక్తియే లోకకర్తృసృజనశక్తియని యాతని మతము. క్రీస్తుమహాశయుఁడు చెప్పినట్లు, "పవిత్రులు పుణ్యాత్ములు ఏలన, వారే భగవద్దర్శనార్హులు." అనుమాటలు నరేంద్రునిజీవితమును వశము చేసికొనినవి.

పవిత్రతాయుతహృద్బలమే వాంఛనీయమని నరేంద్రుని యాదర్శము. కాని నరేంద్రుఁ డింకను నాదర్శమాత్రావేశపరతంత్రుఁడే. ఆతని హృదయము నిర్మలినమే, నిష్కల్మషమే. కాని లోకమును మోక్షమార్గమునకుఁ ద్రిప్పఁగల్గు స్వానుభవజ్ఞానమింకను నరేంద్రునికి లభింపలేదు. స్వానుభవజ్ఞానామృతధారలు శ్రీరామకృష్ణ పరమహంసమేఘమును వర్షించినంతనే, నరేంద్రచకోరము జగద్గురుత్వము వహించెను.

---

## పదియవ అధ్యాయము.

### భగవద్గీతామాహాత్మ్యము; అంతరవలోకనము.

తన యౌవనపరిణామమునుగూర్చి శిష్యులకు వచించుచు వివేకానందుఁ డిట్లు చెప్పెను; "ఆకాలమున నాకు భగవద్గీత పఠించుటభ్యాసమైనది. అందలికొన్ని భావములు నాహృదయమును రాత్రింబవళ్లు వేధింపఁదొడంగినవి."

భగవద్గీత హిందూమతశరీరమునకు ముఖము; మానవాత్మ భగవత్సాన్నిధ్యమునఁ జేసికొను నాత్మప్రకటీకరణమహోపన్యాసము; ముప్పదిమూఁడుకోట్ల భారతీయులు నెప్పుడోయొకప్పుడు తప్పక ధ్యానించి, శరీరనౌకను నడపుకొనుమంత్రరాజము; ఆసేతుశీతనగ భారతీయరక్తబిందువులను చైతన్యప్రభాసితములుచేయు దివ్యామృతధార; భారతమాత ప్రేమపూర్వకముగాఁ బుత్రులకొసంగు జీవస్వాతంత్ర్యస్తనదుగ్ధము; నాస్తికతాప్రేరితనీచవృత్తిచే లోకంబున కుట్టికట్టుకొని యూఁగులాడు స్వార్థపరత్వపాశములను తుత్తునియలు చేసివైచు వజ్రాయుధము; నిఖిలభాషాలంకృతమై ప్రాణోపేతయగు నాదబ్రహ్మరూపము; సర్ ఎడ్విన్ ఆర్నాల్డుచే నాంగ్లభాషాసతి కర్పింపఁబడిన రత్నహారము; మానవలోకమును దరింపఁజేయ లోకమునం దవతరించి ప్రసాదించిన శ్రీమన్నారాయణ ప్రోక్తజీవమహామంత్రము.

తళతళ మెఱయు కరవాలములు కరంబునధరించి, మనోవేగము నపహసించుతురగంబులచే లాగఁబడురథంబు లధిష్ఠించి శత్రుశిరఃఖండనైకలగ్నమానసులై, సమస్తభూత భీకరంబుగా మ్రోగించుచున్న భీషణరణరంగము; ఆరణరంగమధ్యఁ బార్థసారథిచే నప్రతిహతముగా ఱొప్పఁబడుచున్న శ్వేతహయోపేతదివ్యస్యందనము;

ఆస్యందనమందు ఘోరీ గాండీవహస్తుఁడై కూరుచున్న యర్జునమూర్తి; ఆమూర్తియొక్క ముఖమందు కింకర్తవ్యతామాధ్యసంజాతాజ్ఞాన మేఘసంఘాతవిహారము; లీలామానుషవిగ్రహము ధరించిన శ్రీమన్నారాయణజ్ఞానభాస్కరకరములు విమలాత్మపరిజ్ఞానఘూర్ఘూరఘూనిలములచే సందేహమేఘపటలమును పటాపంచలుచేసివైచి, బ్రహ్మానంద ఝురీనికరపరిసరణమొనర్చు దివ్యప్రదర్శనము. హే ! భారతజననీ ! నీవే ధన్యాత్మవు, నీవే సర్వపావనివి, నీవే భువనైకమాతవు, నీస్తన దుగ్ధము లానుభాగ్యమబ్బిన మాబోటి ప్రాణికోటి యెన్నికోట్ల జన్మములు తపించెనోకదా ! భవదమలపాదారవిందములకడ మాతృ సేవైకదీక్షావేశులై, ఆత్మబలియొసంగి, తృప్తి జెందిన జీవకోటి యెంతధన్యతం జెందునోకదా ! "జయభారతమాత" యను శుద్ధప్రేమైక నాదము రసనాగ్రమునఁ దాండవమాడ, భవదైకవేదికాతలమున్నన యజ్ఞపశువులై జీవించుజన్మంబు లెట్టి పుణ్యంపుజన్మంబులో ! ఓ భారత యువకులారా ! యువతులారా ! నిద్రనుండి మేల్కొనుఁడు. సాహసాంచిత రక్తధారల స్రవింపఁజేయుఁడు. గీతాగోమాతృస్తనదుగ్ధామృతబిందువు లాని, మీరు తరించి లోకమును తరింపఁజేయుఁడు.

గీతను చదువుటకుఁ గొన్నిగంటలు చాలును. గీతాసారమును గ్రోలుటకు నెన్నివేల జన్మము లెత్తవలయునోకదా ! గీతామృతము తృప్తిదీరఁగ్రోలి యర్జునుఁడు, రణరంగమున దుమికి అరివర్గము నాహుతిచేసివైచెను; విజయముపొందెను. కాని యాతఁడు యుద్ధము చేయలేదు; చంపలేదు; జయించలేదు.

శ్లో॥ యఏనంవేత్తిహంతారం యశ్చైనం మన్యతేహతం
ఉభౌతౌన విజానీతో నాయంహంతి నహన్యతే.

శ్లో॥ నజాయతే మ్రియతే వాకదాచి
న్నాయంభూత్వాభవితా వా నభూయః

అజోనిత్యశ్శాశ్వతో౽యంపురాణో,
నహన్యతేహన్యమానేశరీరే.

ఎవఁడీయాత్మను వధించువానిఁగాఁదలఁచుచున్నాఁడో, వధింపఁబడువానిఁగాఁ దెలియుచున్నాఁడో, వీరిద్దఱు నజ్ఞానులు. ఏలన, నీయాత్మ వధించునదియుఁగాదు. వధింపఁబడునదియుఁ గాదు. "ఈ యాత్మ యొకప్పుడును పుట్టదు. ఒకప్పుడును చావదు. ఒకప్పుడుండి మఱొకప్పు డుండనిదియుఁగాదు. మును పులేక వెనుకవచ్చినదియుఁ గాదు. ఏలన నిది పుట్టుకలేనిది. చావులేనిది. శాశ్వతమైనది. అనాది యైనది. శరీరము నశించినను, నీయాత్మకుఁ జావులేదు."అని శ్రీకృష్ణుఁడు బోధించియుండలేదా? కేవల స్వధర్మప్రేరితుఁడై యర్జునుఁడు కర్మ శూరతం బ్రకటించెను.

ఎట్టికర్మశూరత్వమును గీతప్రకటించుచున్నదో;

శ్లో॥ "కర్మణ్యేవాధికారస్తే మాఫలేషుకదాచన
మాకర్మఫలహేతుర్భూర్మాతే సంగో౽స్త్వకర్మణి."

భారతీయులారా! ఈవాక్యసారమును మీర క్రియలో లీనమొనర్చుకొని కర్మాచరణోద్యుక్తులై లోకము నుద్ధరింపుఁడు. మీదాస్యవిమోచనమార్గ మిదియే. మీరంద ఱర్జునులకండు. మీరు రణరంగమునకుఁజేరి, గాఢసమాధినిశ్చలతంగాంచుఁడు. ఆత్మ వైరిమథన మొనర్చి యాత్మశాంతిసాగరమున నీఁదులాఁడుఁడు

స్వకుటుంబము దారిద్ర్యపీడిత మగుచున్నపుడు, నిరశనవ్రత సమయములో గీతామృతమే నరేంద్రుని భోజనము. ఒక్కనిముస మైన విశ్రాంతిగానకుండ కార్యరంగమున దింపి, నరేంద్రునిచే ప్రాచ్యపాశ్చాత్యదేశముల మేల్కొల్పి నిరంతరకర్మప్రవృత్తిఁజేయించినదీ స్వధర్మానురక్తియే. ఆత్మస్వాతంత్ర్య దృఢనిశ్చయముచే భీతి, కామము లేక, అనంత కర్మానుష్ఠానోద్యుక్తుఁడయ్యు, నరేంద్రుఁడు నిర్మల

పరిశాంతింగాంచి సచ్చిదానందవార్థిని కేళిసల్పుశక్తి యీతని కొసంగినది గీతయే. చెల్లాచెదరగుచున్న హిందూమత సిద్ధాంతముల మేళవించి హైందవజాతిని, సమస్తలోకమును, సుషుప్త్యవస్థనుండి తన సింహగర్జానినాదములచే మేలుకువ పుట్టించి, కర్మాచరణకుఁగడంగు చైతన్యశక్తిని బోధించిన నరేంద్రుని ప్రేరణశక్తి యీగీతావాక్యమే.

ఒకక్రైస్తవ మతప్రబోధకుఁడు భారతభూమికివచ్చి, విగ్రహారాధనమును నిరసించుచు నుపన్యాస మొసఁగుచుండెను. విద్యావిహీనులగు సామాన్యు లుపన్యాసమును వినుచుండిరి. "మీవిగ్రహమును నాచేతికఱ్ఱతో నొకదెబ్బతీసిన నేమిచేయునని యాతఁడు ప్రశ్నించెను. సభ్యులందఱూరకుండిరి. మిత్రులతో నరేంద్రుఁడటఁ బోవుచునాగి, "మీదేవుని నేను తిట్టినచో నేమిచేయునని" ప్రశ్నించెను. "నీవు మరణించునప్పుడు నరకాగ్నిలోఁ ద్రోయఁబడుదువు" అని యుపన్యాసకుఁడు బదులుచెప్పెను. "నీవుచచ్చినపుడు మావిగ్రహము నిన్నట్లే చేయు"నని వెంటనే నరేంద్రుఁడు తిరిగి బదులుచెప్పెను. ప్రబోధకుఁడు స్తబ్ధుఁడై, శిలావిగ్రహమువలె నిలఁబడెను. సభ్యులందఱు తటాలున లేచి, నరేంద్రునిఁ గూడిరి.

ఆసమయమున సాంఘికజీవనమునుగూడ నరేంద్రుఁడు పరికించుచుండెను "సమస్తాత్మలు భగవద్రూపములేయైనచో నీజాతివర్ణభేదము లేమిటికి?" యని నరేంద్రునిజిజ్ఞాస. నరేంద్రునిమిత్రు నొకని విశ్వనాథదత్తుఁడు బ్రాహ్మణులకు నమస్కరింపుమని బోధించెను. బ్రాహ్మణుల కేల నమస్కరింపవలెనని యాతఁడు ప్రశ్నింపఁగా, "బ్రహ్మముఖసంజాతులు గనుక" యని యావిశ్వనాథుఁడు బదులు చెప్పెను. అప్రత్యుత్తర మాబాలునికి నచ్చలేదు. అంత నాతఁడు నరేంద్రునా ప్రశ్నయే యడిగెను. "ఇదంతయు జ్ఞానహీనత్వప్రదర్శ

నమే! జాతివర్ణభేదము, ఒకజాతి యింకొకజాతిని బీల్చివేయుటకే పుట్టిన"దని నరేంద్రుడు బదులుచెప్పెను. అట్లు నరేంద్రుఁడు తీవ్రముగావచించినను వర్ణాశ్రమధర్మముల నుద్ధరింపవలెనని యాతని నిశ్చితాభిప్రాయమైనది.

అంతరప్రపంచవిచిత్రదృశ్యములనే మహాపురుషుల జీవితములు ప్రకటనచేయును. మానవసామాన్యుల కట్టిదృశ్యములు సంభవింపవు. నిద్రపోవునపుడు శరీరము చలనరహితమై శవంబువలె నుండఁగా మనస్సు కార్యములు చేయుచుండు టందఱెఱింగినదే. అప్పుడు మానసము శరీరము ననేకమార్గములగుండా ననేకమైన చోటులకుఁ ద్రిప్పుచుండును. కాని నిక్కముగా శరీరము కదలుట లేదు. మానసవృత్తి యెట్టిదో తెలియుట కష్టము. నిద్రావస్థలో ననఁగా శరీరాభావసమయములో మానసమునకు విషయవిమర్శనాశక్తి వృద్ధిచెందును. మెలకువసమయమునఁ దెలియని గణితశాస్త్రసమస్యాదు లట్టిస్థితిలో బయల్పడుట జగద్విదితము. దీనింబట్టి శరీరోపేతమగు మానసముకంటె శరీరసంబంధము లేనప్పు డుండుమానసము తీక్ష్ణదృష్టిగలదని తేలుచున్నది. కాని శరీరము నిద్రించునపుడు మానస మెట్లుచ్ఛస్థితిం గాంచునో యట్లే మానసము నిద్రించువేళ మానసాభావస్థితిగూడ నున్నచో, నావెనుక నున్నశక్తియు నచ్ఛస్థితిం గాంచును. శరీరము, మానసము నీరెండు చేతనారహితస్థితిం గాంచుటే మరణము. శరీర మొక్కటే నిద్రించుకాలము మరణముకాఁజాల దేలన, శరీరము నిద్రించుకాలములో మానసము శరీరమును సదా కాపాడుచునే యుండును. రాత్రినిద్రించునప్పుడు తెల్లవారుజామున నైదుగంటలకు లేవవలయునని మానసము నిశ్చయించుకొని, యట్లు శరీరమును లేపుట లేదా! కాని అప్రయత్నముగా సంభవించు నీశరీరమానసగాఢనిద్రావస్థకే మరణమని పేరు కాని ప్రయత్నపూర్వకముగా ననగా జ్ఞాన

ముచేఁగాని యోగముచేఁగాని శరీరమానస్థితుల నధిగమించి, అహంభావము నాత్మైక్యముచేసి, స్వయంప్రభావప్రకాశములచే వెల్గొందు నాస్థితికి నిశ్చలసమాధి, లేక యోగసమాధి యనిపేరు. అనఁగా మరణాతీతస్థితికిఁబోయి, తిరిగి యథాస్థితికి రాఁగల్గుశక్తి యట్టియోగికే యుండును. అదియే సంపూర్ణజ్ఞానావస్థ.

పాశ్చాత్యు లిట్టి విషయము లిప్పు డిప్పుడు కనుఁగొని మానసికశాస్త్రమని పెద్దపేరు పెట్టుచున్నను హిందువుల కిది ప్రతిదినచర్యయే. నరేంద్రునికిట్టి యోగసమాధిస్థితికరతలామలకమైయుండెను. అది యెట్లాతనికి ప్రాపించినదో యెవ్వరికినిఁదెలియదు. ఎన్నిపూర్వానేక సహస్రజన్మములలో నెన్ని యెన్ని ప్రయత్నములఫలితముగా నాతని కిపుడీస్థితి సంభవించినదో చెప్పుట మనకసాధ్యము.

ఈసమయమున నరేంద్రుని దృక్పథమున, రెండుదృశ్యములే గలవు. భార్యాపుత్రులతో, గృహమందిరములతో, ధనరాశులతో, విద్యాభోగములతో జీవితమును లౌకికానందమయముచేయు ననేకవిలాసములతో నిండియుండు దృశ్య మొకతెరమీఁదను, నాది యనునది లేక లభించునది తినుచు, నేయరణ్యములమధ్య నేచెట్లనీడనో నిద్రించుచు భగవదైకలగ్నమానసముతో దూషణభూషణతిరస్కా-రాతీతహృదయముతో, సుఖదుఃఖ సమదర్శనబుద్ధితో బ్రహ్మానందైకరసాస్వాదన మత్తతం జేసి, శరీరము మఱచి, లీలామానుషవిగ్రహాచర్యలం బిలకించుచు యాత్రచేయు సర్వసంగపరిత్యాగదృశ్య మొక తెరమీఁదను నాతనికి స్పష్టముగా చిత్రితములై కన్పట్టెను.

పూర్వేంద్రియైకప్రచారదృశ్యమును నరేంద్రుఁడు, తీవ్రముగా విమర్శించి, ఆశాపాశమునకు వెనుకనున్న యహంభావమును, పదార్థవాంఛ వెనుకనున్న పాపపంకిలమును, వస్తుసంగత్వమునకు

వెనుకనున్న వాస్తవికతాశూన్యత్వమును గమనించి యీదృశ్యము మాయాదృశ్యమని ఆతఁడు నిస్సంశయముగా గ్రహించెను.

ఆ వెనుకనున్న సర్వసంగత్యాగదృశ్యమును నిరీక్షింప, నింద్రియసమూహమును దహించినబూడిద నొడలినిండఁ బూసికొని, కటిస్థలమును కప్పు నొకగోచీపీలిక ధరించి సూర్యకిరణప్రతిబింబములచే దేదీప్యమానములగుచున్న మంచుదిబ్బలచే నొప్పు హిమాలయ శిఖరముల, ప్రేమపూర్వకాహ్వానములచేఁ బొంపారు మనుకారశూన్య, పరమేశ్వరైకార్పిత పరిశుద్ధజీవనపురుషదృశ్యము, తుషారుచేఁ గొట్టఁబడి, తెన్నుగానక విలపించుచున్న నోడను, ప్రదర్శన విద్యుద్దీపకాంతి యాకర్షించిన ట్లాన రేంద్రు నాకర్షించినది.

న రేంద్రుఁడు నిద్రించునప్పుడు భగవంతునెదుట సాష్టాంగము చేయువానివలె బోర్లగిలఁబడి పరుండుచు. నిద్రించునపుడు కూడ, నిద్రాకాలము వ్యయము కాకుండ, పరమేశ్వరు నెదుట నాత్మనొప్పగించి, శరీరస్మృతిని పీడు పద్ధతియో యని యనవచ్చును, కాలుకదిపినచో, జేయి మెదిపినచో, నోరువిప్పినచో, భుజించుచో, నాటలాడుచో, నిద్రించుచోఁ, జనుచో నన్నివేళల న రేంద్రుఁడు పరమాత్మ ప్రభావైకప్రకట నజ్ఞానమార్గములఁగా, మార్చుకొనుచుండెడివాఁడన్నచో నాప్రహ్లాదకుమారుఁడు జ్ఞప్తికి వచ్చుటలేదా ?

శా. "పానీయంబులు ద్రావుచున్ గుడుచుచున్ భాషింపుచున్ హాసలీ
లానిద్రాదులు సేయుచుం దిరుగుచున్ లక్షింపుచున్ సంతత
శ్రీనారాయణ పాదపద్మయుగళీ చింతామృతాస్వాద సం
ధానుండై మఱచె న్సురారిసుతుఁ డేతద్విశ్వమున్భూవరా.

త్రిలోకసామాన్యనేతను, తృణలీలఁ జూచిన నీభగవద్భక్తి పారవశ్యము ప్రహ్లాదున కెట్లు సంభవించెనో, న రేంద్రునికి నట్లే సంభవించెనను టలయొప్పదు? ఈవిధముగా న రేంద్రుఁడు సంసారభారపరి

త్యాగమందు కృతనిశ్చయుఁడై పరమాత్మైకజీవనలబ్ధికై యెదురు చూచుచుండెను.

---

## పదునొకండవ అధ్యాయము.

### శేముషీజ్ఞానప్రభాతము ! ఊహాఝంఝానిలము.

ఆధునికకళాశాలలలోని విద్యాభ్యసనమ్ము గాజుపాత్రలోఁ బెట్టి పెంచిన వృక్షమ్మురీతి, మానసమునకు వికారాకృతిం దెచ్చిపెట్టుచున్నది. అట్టివికారకరవిద్యాభ్యసనముతో నూరకొనక, స్వకీయమానసికవృత్తిని, స్వప్రయత్నముచే, సర్వకళాశోభిత మొనరించుకొనునాతఁడే పూజ్యతముఁడు.

సహజవ్యక్తిత్వవిజృంభణమందు, నరేంద్రుఁడగ్రగణ్యుఁడు. పది రెండవయేటనే ముగ్ధబోధవ్యాకరణ మాతనికిఁ గంఠస్థము. పదునేడవయేట, సంస్కృతములో శ్లోకములు విరివిగా వ్రాయు సాహిత్య మాతనికబ్బెను. మాతృభాషయగు వంగభాషలో నాతఁడు వ్రాసిన గ్రంథము లాభాషకు నూతనాలంకారములై యొప్పుచున్నవి.

నరేంద్రుని మాత, భువనేశ్వరి . యేదైననొక్కసారి విని, తిరిగి వచించుధారణశక్తిగల ప్రజ్ఞావంతురాలు. నరేంద్రుఁడు నట్టి మేకసంతగ్రాహి యేలకాకుండును? ఏకాగ్రచిత్తతయే దానికి ముఖ్యకారణము. భారతదేశమున కిదియొక యద్భుతవిషయము కాదు. సమస్తవిజ్ఞానసారస్వతము, మొదటినుండియు నీదేశమున పుస్తకాపేక్ష లేకయే గురుశిష్యపరంపరగా నవిచ్ఛిన్నమై వచ్చినది. నేఁటికిని పాశ్చాత్యనాగరికతచే మలినీకృతములుగాని కొన్నిగ్రామములలో వేదవేదాంగములన్నియు బోధింపఁబడుచుంట గురుశిష్య హృత్పుస్తకాధారము వలననే, భారతదేశవిద్యయగు వేదములు, నుపనిషత్తులు, మున్న

గునవి పరమాత్మ ప్రాణిసంబంధమును దెలుపు శాశ్వతవాక్యములు గాన, నవి పుస్తకములవంటి యేబాహ్యానశ్యపదార్థముల మీఁద నైన నాధారపడుచో, నశించునోయను భయముచే "నాత్మయాత్మ" కు బోధించు విధానమును కన్గొనఁబడియెను. పాశ్చాత్యవిద్యావిధాన మంతయు సాపాయమగు మేధోవిద్యయే (Brain study). మఱియు హిందువునకుఁ జదివినవిద్య యీజన్మముతో నంతమొందరాదు. ఎన్ని కోట్లజన్మములెత్తిన, ననపాయముగానుంటకై, హృదయముమీఁద ముద్రితమై స్మరణమాత్రమునఁ దెలియునట్లు వచ్చినదాఁకఁ జదివి చచ్చునందాఁక వల్లనచేయు విధానము భారతదేశవిధానము. అట్టి పూర్వజన్మవృత్తిచేతనే పండ్రెండేండ్లబాలుఁడగు శంకరాచార్యుని నోట, జగత్తునల్లలనాడించునద్వైతదుందుభినినాదము స్మరణమాత్ర ముచే వచ్చినది. మఱియుఁ బ్రతిహైందవబాలునికి హృదయమున వేదాంతమునకొకతావు ప్రత్యేకింపఁబడి యున్నది. ఆహేతువుచేత నే, యొకనిముసములో దేశమును మార్చివైచెదమని నచ్చుక్రైస్తవ మతప్రచారకులు, పెదముఖములుత్రిప్పి, నాలుకలు కొఱుకుకొను చుందురు. ఇఁక నరేంద్రుఁడు, కళాశాలలోఁ దత్త్వశాస్త్రమునే ప్రత్యేకభాగముగాఁ జదువుటకు నిర్ణయించుకొనుటలో, ననహజమే మున్నది? అట్లాతఁడు కళాశాలలోఁ దత్త్వశాస్త్రభాగముఁదీసికొని పాశ్చాత్యతత్త్వజ్ఞులగ్రంథముల ననుక్షణముఁ దీవ్రముగాఁ జదువుట కారంభించెను. స్పెన్సర్, కాంటు, షోపెన్హార్, జాన్ స్టూవర్డుమిల్లు, ఆగష్టుకామ్టి, అరిస్టోటల్ మున్నగువారి తత్త్వశాస్త్రములను చదివి తనయద్వైతవేదాంతమునకు హేత్వాధారబోధనవిధానమును గని పెట్టి పాశ్చాత్యమాననమును సులభముగా నరికట్టుటలోఁ గృతార్థుఁ డయ్యెను.

ఈసమయముననే భాష్యకారుల వ్యాఖ్యానముల నాధునిక దృష్టితోఁ జదివి, పాశ్చాత్యసిద్ధాంతము లిదివరకే యందుస్పష్టీకృత ముచేయఁబడుటఁ జూచి యాశ్చర్యమందెను. అట్టి యుత్కృష్ట జ్ఞాన రత్నముల నార్జించి మనకై దాఁచపెట్టిన ఋషీశ్వరులధీశక్తిని మెచ్చుకొని, యట్టి మహాపురుషులసంతతికిఁ జెందు భాగ్య మబ్బినందుకు వారికి మనఃప్రణామము లర్పించుచుండువాఁడు.

దేశచరిత్రలుగూడ నరేంద్రునికి వేదాంతముతో సమానరుచినిఁ గల్గించెను. పాశ్చాత్యదేశసంఘము లెట్లెట్లు మార్పుజెందినవో, వానిజీవనక్రమం బెట్లు భౌతికాశయములతో నిండినదో యాతఁడు పరికించెను. రోమనుశదేచరిత్ర నాతఁడు కంఠస్థముచేసెను. వివేకానందుఁడై రోముదేశమున కేగినపుడు, పాడుపడియుండినరోమను కళాకౌశల్యమును జూచి, పాశ్చాత్యుల కెఱింగించి, వారి కాశ్చర్యమును గలిగించెను. ఆత్మవిశ్వాసబలమే "నెపోలియన్" ను మహాచక్రవర్తిని చేసెనని యాతనియభిప్రాయము. ఆత్మవిశ్వాస బలాధిక్యతయే, నరేంద్రునిమూర్తిమత్త్వమునకు స్వయంప్రకాశమును దెచ్చిపెట్టినది. బలహీనత నాతఁడు తీవ్రముగా నిరసించెను.

మాతృదేశచరిత్ర నరేంద్రునికిఁ బాయసము. వీరవరశిఖామణులగు భారతదేశ రాజన్యులచరిత్రములు చదువునప్పు డాతనిరక్తముద్రిక్తమయ్యెడిది. మొగలాయిచక్రవర్తుల గుప్తసామ్రాట్టుల నాతఁడు వర్ణించునప్పుడు వారి విగ్రహములు కట్టెదుట ప్రత్యక్షమగును.

కవితామతల్లికి నరేంద్రుఁడు పెంపుడుబిడ్డ. వర్డ్సువర్తుమహాకవిరచించిన యధార్థజీవితాశయగానము నరేంద్రుని స్వవశముచేసికొనెను. దేశచరిత్రలు, తత్త్వశాస్త్రములు, కవిత్వములు, మున్నగుసమస్తకళలు, నేకయధార్థమును బ్రకటించు ననేకమార్గములని

రేంద్రుని నిశ్చయము. ఏకళమైనను, జీవిత పరమార్థరహస్యప్రకటన సాధనము గానిచో నది కళావిహీనమే. సత్యప్రకటనమందు, స్వయం వ్యక్తిత్వప్రథ చేర్పఁబొందని యేకళమైనను, వర్జ్యమని నరేంద్రునిదృఢాభిప్రాయము.

మానవమానస మొక యభిప్రాయప్రపంచము. కొన్ని ప్రాచీనాభిప్రాయములు బుద్ధివికసించినకొలఁది కొన్ని నూతనాభిప్రాయములు మానసపీఠికనధిష్ఠించి నప్పుడు సంఘట్టనము బయలుదేరును. ఆసంఘట్టనములో దృఢాభిప్రాయములు నిల్చిపోవును. విశేష మొక దేశమున విదేశపరిపాలనము ప్రవేశమైనప్పుడు విదేశనాగరికతాతరంగములు దేశమానసము నాకర్షించివేయును. విదేశనాగరికతానుగుణ్యముగా స్థాపితములగు విశ్వవిద్యాలయములలో విద్యనభ్యసించునమ్మానవునికి జాతీయాశయములు, విదేశాశయములు రెండును ప్రత్యక్షమై, తీవ్రసంఘట్టనముబయలుదేరుటలో నసహజమేమి? సాధారణముగా నట్టిసంఘట్టన ఫలితముగా, జాతీయాశయములునాశనమై, విదేశీయాశయములే నిల్చుచుండును. అట్టివిదేశీయమైనాశయపూరితులు సంఘసంస్కర్తలైనచో నధయభ్రష్టతయే ప్రాప్తించును. కేవల జాతీయాశ్రయప్రేరితులవలన నంతకన్న నెక్కుడుగాదు. కాని స్వజాతీయవిజాతీయాశయముల రెంటిని, సమానదృష్టిం బరికించి, తత్సారసమ్మేళనము చేసి, స్వయంవ్యక్తిత్వ స్వయంప్రకాశప్రకటీకరణముల చేయు నాపూరుషులే లోకకల్యాణహేతుభూతులు, వారే నూతనసంఘనిర్మాతలు, సత్యవార్తాసందేశకులు. మఱియు సమస్తవిదేశాశయములు, జాతీయవిజ్ఞానభాగములుగాఁగల భారతదేశనాగరికతకు, విదేశీయాశయము లంతగా నవసరమే లేదు. అట్టిచో జాతీయవిజ్ఞానమును మఱచి, విజాతీయవిజ్ఞానము నాధారముగాఁగొని సంఘ

సంస్కర్తలమని ప్రేలు నామూర్ఖుల నేమనవలయునో తెలియకున్నది. ఈయభిప్రాయము లే నరేంద్రుని హృదయము నాకర్షించినది.

స్వజాతీయ విజాతీయాశయములు నరేంద్రునిమానసమందు సోదరభావముతోఁ బెంపొందినవి. పాశ్చాత్యనాగరికతయను గాలిదుమారము నరేంద్రునిమీఁద వీచినను, జాతీయవిజ్ఞానదృఢిమయే నరేంద్రుని కాపాడఁగల్గినది. కాని మాతృదేశము విదేశాశయముల నెట్లు దాస్యవృత్తిచే ననుకరించుచున్నదో గ్రహించి యాతఁడు నీచానుసరణవృత్తి కుగ్రమూర్తియై నిలచెను. పూర్వాచారపరాయణుల సాంఘికజీవనము కూపస్థమండూకసామ్యమున స్వవినాశకరహేతువగుటయు నాతఁడు చూచి, తీవ్రసంస్కారప్రలాపమొనర్పక, దూరదృష్టినొసంగు బోధనభాషణములనే వారిమీఁదను విసరెను. ప్రాపంచికదృష్టి నతితీవ్రముగా విసర్జించు పూర్వాచారపరాయణుల నాతఁడు నిరసించును. ప్రపంచైకభౌతికజ్ఞానముచే సంతృప్తినందుచు, నాధ్యాత్మికచింతనఁ దెగడునవనాగరీకుల నాతఁడు సహింపఁజాలఁడు. పూర్వాచారపరాయణుల యాధ్యాత్మికదృష్టి నవీనాశయపూరితుల ప్రయోజనైకసిద్ధాంతదృష్టితో నతుకుటకే యాతఁడు నిరంతరము తపించెను.

ఈసమయమున నరేంద్రుఁడు విజ్ఞానసారస్వతము నంతను పూర్తిగాఁ జదివి, వానిహేత్వాధారమును జీర్ణించుకొనయత్నించెను. చాలవట్టుకు పాశ్చాత్యవిజ్ఞానసిద్ధాంతములన్నియు కేవలధీశక్తిప్రకటనాపాత్రములే యనియు, నాధ్యాత్మికదృష్టియందు లోపించెననియు గ్రహించి, అట్టియాధ్యాత్మిక ప్రకాశమునకై, యాతఁడు మాతృదేశవిజ్ఞానమునే యూఁతగాఁ గొననిశ్చయించుకొనెను. స్పెన్సర్, మిల్, హీంగల్, మున్నగు తత్త్వజ్ఞుల నాతఁడు సానుభూతితో గౌరవించెను. ఏలన, వారును యథార్థనిశ్చయాభిలాషకే జీవితముల నర్పిం

చిరని యాతని యాశయము. సానుభూతిమాత్రమే వారికి గురుపదవి నొసంగ లేదు. పరిపూర్ణమానవవ్యక్తిత్వప్రకటీకరణావ్యక్తు లందాతని కగపడ లేదు. ఎంత తీవ్రతార్కికావలోకనపటిత్వాధారముత్తై, బుద్ధిని తృప్తిపరుపఁజాలినను, సత్యనిర్ణయసాధన శూన్యములగుటచే వారిగ్రంథము లాతనికి తనివి నొసంగ లేకపోయెను.

“నాకింతకన్న తెలియ”దను ధీరనాస్తికవాదము నరేంద్రునకాగ్రహము తెచ్చిపెట్టెను. తెలియుదను టజ్ఞానప్రదర్శనమే, హృదయదౌర్బల్యమేయని యాతఁడు తలంచెను. ఎన్నెన్ని మహోన్నతాభిప్రాయములున్ననేమి, సందేహవిముక్తి నొసంగఁ జాలనపుడు? పారమార్థికాగ్ని కింధనము నొసంగఁ జాలనపుడు? ఇట్టిసందిగ్ధావస్థలో నేది విడచుట, యేదిగ్రహించుట. యిదియే నరేంద్రునిహృదయమున సంశయఝంఝానిలమును బుట్టించినది ఇట్టిసందేహమహాపాతమే, పాశ్చాత్యనాగరికత దేశమున నడుగుపెట్టినదాది యనేకధీవర్యుల నల్లలనాడించినది. నరేంద్రుఁ డొకించుక విదళితుఁడైనను, ప్రాచీనధర్మసందేశమును నెత్తినిడుకొని, చలింపక నిల్చి, ఘోషింపఁగల్గు చెట్టి ధీరత్వమిం దురూహ్యమగుచున్నది. హిందూదేశమునకేఁ గాక యావత్ప్రపంచమునకు నట్టిహృదయదౌర్బల్యమును బోఁగొట్టి, హృదయవికసనైకసాధనంబగు నాధ్యాత్మికజీవితవృత్తి నెల్లు తా నొసంగి శాంతి గూర్పఁగలనాయని నరేంద్రుఁడు దుర్భరమానసికయాతనలకుఁ బాల్పడి, ఆత్మవిశ్వాసధీరత్వసంపత్తుచే నట్టకేలకు బయల్పడి, ప్రాపంచికమతమహాసభావేదికపై నాధ్యాత్మికసింహగర్జన మొనర్చి విజయలక్ష్మిఁ గైకొనినది;

శ్లో॥ కుతస్త్వాకశ్మల మిదం విషమే సముపస్థితమ్
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికరమర్జున !

క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే,
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప॥

యను మహోపన్యాస మొసఁగిన సాహసముచేతనే యని తెలియఁగలదు.

---

## పదిరెండవ యధ్యాయము.

### గానార్పితకాలము: మానవోత్కృష్టగుణ ప్రవర్ధనము.

పరమేశ్వరుఁడు గానలోలుఁడు. ప్రణవనాదమే పరబ్రహ్మస్వరూపమని తుంబురునారదులు, నాదబ్రహ్మోపాసకులై ముక్తులైరి. ఓంకారమే సర్వజగన్మూలబీజంబని వేదము లుద్ఘోషించుచున్నవి. వేదమునకు స్వరమే ప్రధానము. వేయేల. సర్వప్రపంచగోళపరిభ్రమణసంజాతనాదమే 'ఓం' కారమని నిర్ణయింపఁబడినది. అట్టి హేతువుచేతనే కాఁబోలు, శ్రీకృష్ణుని వేణుగానామృతముచే, చేతనాచేతనపదార్థభేద మంతరించి నిశ్చలసమాధిమగ్నములై, సమస్తప్రాణికోటులు నిల్చిపోయినవి. అట్టి ఆత్మవశీకరణగాననాదముచేతనే, స్వదేహస్మృతులవీడి గోపికాసహస్రములు శ్రీకృష్ణునాశ్రయించిరి. విషయవాంఛాబద్ధురాండ్రెకాను. స్వయంప్రకాశ స్వయంవ్యక్తిత్వరూపుఁడగు నరేంద్రుఁ డిఁక గానము నాశ్రయించు టబ్బురమే ?

మెట్రిక్యులేషన్ తరగతిలోఁ జేరినదాది నరేంద్రుఁడహమ్మద్ ఖాన్, బెనిగుప్తయను నిర్వురుగురువులనుగొని, సంగీతము నేరువ నారంభించెను. విశ్వవిద్యాలయకళాశాలలోనున్న నాలుగైదేండ్ల నాతఁడు గాత్రపరిశ్రమచేసి, సుప్రసిద్ధగాయక బిరుదమునుగాంచెను. ఆతఁ డెచ్చటకుఁబోయినను, పాడుమని జనులాతనిఁ బ్రతిమాలుచుండెడివారు. మఱియు నాతఁడు హైందవపాశ్చాత్యగానములఁ గూర్చి

వ్రాసిన విషయములచే నాతనిగాననైపుణి జగద్విదిత మయ్యెను. మహమ్మదీయగురువులునొద్దనుండి, హిందుస్తాని, ఉర్దు, పర్షియాగీతము లాతఁడు విశేషముగా నేర్చుకొనియుండెను. అభినయశాస్త్రములోఁ గూడ నరేంద్రుఁడు నిపుణతవహించెను. హృదయమున నిగూఢమై యున్న పరమేశ్వరభక్తిప్రకటనము దాతని నృత్యాభినయములు జనవశీకరణములుగా నుండెడివి. ఎచ్చట గానసభ జరిగినను, నరేంద్రుఁడు లేనిచో జనులకుఁ దృప్తికరముగా నుండెడిదిగాదు. కొన్ని వేళల నాతడు లేనిచో సభయే విరమింపఁబడును.

స్వచ్ఛసువర్ణచ్ఛాయం దనరారు నాతనిశరీరవిగ్రహమే జగన్మోహన హేతువయ్యెను. ఏవిధమగు తాపత్రయ మిసుమంతయు లేని యాతని నిర్మలహృదయకాంతి దేహమునకు వన్నె దెచ్చిపెట్టెను. దేహస్పృహమఱచి, హాసలీలలందుఁ బడి, తోడివారల కానందము గూర్చుశక్తి యాతని కమితముగాఁగలదు. వంశానుగతంబైన అతిమూత్రరోగచిహ్నలాతనికి విద్యార్థిదశలోనే కాన్పించెను. తన్నివారణార్థమై, నిరంతరము వ్యాయామము చేయుమని తల్లిదండ్రు లాతనిఁ బ్రోత్సహించుచుండెడివారు. ఐన నాతఁడు రోగమునకు వెఱవలేదు. తన తీవ్రవ్యాయామ విజృంభణముచే రోగము నివృత్తినందునని యాతని దృఢసంకల్పము. ఆతనినిర్విచారదృష్టి, తీవ్రవ్యాయామములే యాతనిశరీరపటుత్వమును గాపాడగల్గెను. స్నానము చేయుచు నాతఁడు పాడనారంభించుచో నచ్చటనే తుడుచుకొనుట మఱచి తన్మయత్వమునొంది యాతఁడు గంటలకొలఁది నిలఁబడువాఁడు ఇట్టి నిరంతరగానపరిశ్రమ చేఁగల్గు గాత్రమాధురిమచే, నాతని యుపన్యాసము కంచుమ్రోగినట్లు మ్రోగుచు నొకవిధమగు నిర్మల మనోరంజకనాద ముద్భవిల్లుచుండెడిది. ఈసమయమున, నాతోపన్యాసములచేఁదన వక్తృత్వపాటవము నాతఁడు వృద్ధిచేసెను.

ప్రతిసాయంకాలమున తన బంధువులొకరు విడచిననొక గుఱ్ఱము నెక్కి నరేంద్రుఁడు స్వారిచేయుచుండువాఁడు. దినమంతయు నాతఁడిట్లు గానములో, హాస్యములో, గబుర్లతో, గుఱ్ఱపుస్వారితోఁ గాలముగడపి, రాత్రి నిశ్శబ్దముగానున్నపు డేకొలఁదికాలమో చదివి, శీఘ్రముగా కంఠస్థముచేసి నిద్రించువాఁడు.

ఈసమయమున నరేంద్రునికి వివాహముచేయఁదల్లిదండ్రులు నిశ్చయించి నరేంద్రు నింగ్లండుకుపంపి, ఐ. సి. యస్. పరీక్షచదివించు దమనితలఁచెడివారు. నరేంద్రునకింగ్లండుప్రయాణమన్నకుతూహల మే. కాని, శ్రీరామకృష్ణుఁ డట్టిప్రయాణము జరుగకుండ నరేంద్రుని మానసము నాకర్షించి, దృష్టివిఱిచివైచెను నరేంద్రుఁడు పట్టపరీక్షకుఁ జదువుసమయమున నిర్మలబ్రహ్మచర్యదృష్టిలోఁబడి కనఁబడిన సన్యాసులఁ బిలచి, వేదాంతవిషయులఁగూర్చి ప్రసంగించుచుండెవాఁడు. ఈసమయమునసే యాతఁడు స్పెన్సరు తత్త్వశాస్త్రమును చదివి, దానిలోఁ గొన్నివిషయములకు వ్యాఖ్యానమువ్రాసి, స్పెన్సరుకుఁ బంపెను. స్పెన్సరది చూచి సంతసించి నరేంద్రునకుఁ బ్రోత్సాహపూర్వకముగా నొకలేఖవ్రాసి, మఱల ముద్రణములోఁ దన యభిప్రాయము లవసరమైనచో మార్చుకొనెదననికూడ వచించెను. ఇది నరేంద్రుని కొంతయు బ్రోత్సాహహేతువయ్యెను

నరేంద్రునిసహపాఠియగు వ్రజేంద్రనాథశీలుఁడు, 1907 వ వత్సరమున వివేకానందునిఁగూర్చి యొక వ్యాసమువ్రాయుచు నాతనిపాఠశాలదినముల బాగుగావర్ణించియున్నాఁడు. ఆసమయమున నరేంద్రుఁడు పాశ్చాత్యతత్త్వశాస్త్రముల నతివివరముగాఁ బఠించి, సందేహవిముక్తుఁడుకాలేక, జాతీయతత్త్వములలో దిగి, స్వబుద్ధిచేఁ దర్కించి, యథార్థనిర్ణయమున దనేకబాధలకులోనగుచుండెననియు,

శ్రీరామకృష్ణుఁడే యాతనిసందియము దీర్పఁగల్గెననియు, విస్పష్టముగా వ్రాసియుండెను.

ఏదేనొకముకుళము వికసింప నారంభింపఁగనే దానివాసన బయల్పడకుండునే? సుగంధము కావచ్చును, దుర్గంధముకావచ్చును. ఆరీతినే మానవమానసబాలముకుళము వికసింప నారంభింపఁగనే సద్గుణదుర్గుణవాసన లేవైనను వ్యాప్తము కాకమానవు. యావనము మానసబీజమునకు దున్నఁబడిన క్షేత్రము అనుకూలవాతావరణమున్నచో నామానసబీజము మొలకెత్తి, తనయనంతశక్తివాసనాన్వితములగు సద్గుణపుష్పగుళుచ్ఛములచే మానవమధుపస ఘంబుల నరికట్టి స్వవశముచేసికొనకమానవు. కాని, కాలకర్మవశమున నేవైనఁ దాపత్రయపూర్వకక్రిమిసమూహ మా వాసనపుట్టినంతనే బయలుదేరి, మానసోల్లాసపత్రములను వెంటనే కొఱికివైచుటయుఁ గలదు. కాని, యీవణక్రిమిసమూహమున కిరవొసంగక, వాంఛాసూర్యాతపంబునకు సుక్కక, భీతియను గాలిదెబ్బకు వెఱచఱవక, తన యపారసుగుణసుగంధపరంపరలచే లోకమును సత్యకాంతామోహపాశములచేఁగట్టి, దివ్యజ్యోతి ప్రదర్శించు నామానసకుసుమమే పవిత్రమయినది, అద్వితీయమయినదియునై, తన యనంతజ్ఞానమకరందామృతబిందుసందోహముచే మానవకోటి కమృతత్వప్రాప్తి నొసంగఁగలదు.

ఏదేనొక నిర్బంధముచే విద్యనభ్యసించు నవసరము తొలఁగిపోయి, యథార్థజ్ఞానసమార్జనైకదృష్టి ఉదయమగుటతోడనే, మానవుఁడు మానవుఁడనంబడును. ఆత్మజీవనవిధానపూర్ణసంస్కారణారంభముతోడనే యట్టిసూచనలు సద్వైనలంబొరును. వెంటనే పరానుసరణవిధాన మంతరించిపోవును.

ఇట్టి యాత్మసంస్కరణవిధానమే నరేంద్రునికి యథార్థ జ్యోతిందర్శించు రాజమార్గముగాఁ గన్పట్టెను. ఎన్ని ఘోరకృత్యము లెన్ని పాపకృత్యములు చేయించినను స్వాతంత్ర్యేతరమార్గ మాతని కసహ్యముగాఁ దోఁచెను. ఆత్మస్వతంత్ర్యమార్గములో నొకా నొకవేళఁ దప్పునొనర్చిన నాతనికిష్టమే. విధిధానముచేనయిన దప్పులుచేయుట తప్పను. కాని స్వాతంత్ర్యవిధాన మాతప్పుల నవ లీలనవరింపఁగలదు. ఈయుద్దేశముతోడనే తప్పులొకానొకవేళ మ హామహోపాధ్యాయపదవి నధిష్ఠించి, పరమేశ్వరసాక్షాత్కార మొన రింపఁగల దివ్యులని వివేకానందుఁడు వచించెను. ఎట్టినాస్తికవాతము లు విజృంభించి మానసమును కూలదోయసమకట్టినను విషయముల చే నోడింపఁబడుమార్గ మతిగర్హ్యమని యాతఁడుద్ఘోషించి యున్నా డు. సత్యము తెలియునిందు; తెలియకుండనిందు; శాంతిరానీయుఁడు; పోనీయుఁడు; జ్ఞానభానుఁ డుదయించనిండు, కారుచీఁకట్లు క్రమ్మ నిండు; విషయవాంఛలచేఁ బట్టువడుట క్షుద్రహృదయునే తెల్పు నని యాతనినిశ్చయము.

ఇట్టి యూహలోనిడుకొని కటికనేలమీఁద బరుండుట, విలు వలేని హీనవస్త్రములకట్టుట, మున్నగు విషయోంద్రియవికాసముల నరికట్టుజీవితక్రమమును నరేంద్రుఁ డభ్యసింపఁదొడంగెను నరేంద్రుఁడు యథార్థమును తెలియని నాస్తికుఁడే యైనను, యథార్థమునుగోరు పవిత్రప్రవర్తనాచార్యుఁడు కుటుంబ మాతనివివాహబంధములచేఁ గట్ట యత్నించినను, దైవవశమున నెద్దియో యొకవిఘ్నమాపాదిల్లు చుండెడిది. తుదకు వివాహము ధ్రువమైనపుడు తండ్రి చనిపో యెను. దైవయత్నమున కెదురెవరు ?

బి. ఎల్ పరీక్ష చదువుచుండఁగా నరేంద్రుఁడొక మిత్రుని తో "ఈపరీక్షాబంధమేలనాకు ? సంపూర్ణస్వాతంత్ర్యమే నాయాశ

య" మని యాతఁడు గర్జించి, పఠించు పుస్తకముల నవ్వలవిసరి, రోగ పీడితుఁడగుచున్న గురువును చూడ కాశీపురమున కేగెను.

భగవద్విషయములో నమ్మకము, హేతురహిత విశ్వాసము నరేంద్రుఁ డంగీకరింపఁడు. కాని తార్కికావనాతీతమగు యథార్థము నాతఁడు తెలిసికొనఁగల్గు దినము తప్పక వచ్చితీరుననియెడి దృఢ విశ్వాసమాతనికిఁ గలదు. సర్వసంగపరిత్యాగమే యథార్థపద బునకుఁ దోడ్కొనిపోవుననియుఁ గానఁ దనజీవితము సన్యాసవృత్తి నవలంబింపకఁ దప్పదనియుఁ గూడ నాతఁడెఱుఁగును. కాని గ్రుడ్డినమ్మకముల కాతఁడు లోఁబడఁడు. నిర్బంధవిద్యావిధాన మాతనికి రోఁత. సమస్తప్రాణికోటికి పరమావధి భగవన్నిర్ణయమే యని యాతఁడు నిస్సందేహముగాఁ దెలిసికొనెను.

---

## పదమూఁడవ అధ్యాయము.

### జ్ఞానదృష్టిలాభము; బ్రాహ్మసమాజము

భగవజ్ఞానము తెలియు నాథక్కాగ్రేసరులజీవితమార్గము లత్యద్భుతములు. వారిపవిత్రదినచర్యలు బ్రహ్మపదంబున కనివార్యముగాఁ గట్టఁబడుమెట్లు. అట్టి సోపానముల వారెట్లు నిర్మింతురో యెట్లధిరోహింతురో తెలిసికొనుజన్మమే ధన్యమయినది.

భగవంతునిఁగూర్చి ప్రకటించు వివిధదేశగ్రంథముల నరేంద్రుడుచదివి, చదివినకొలఁది సందేహబద్ధుఁడగుచు వచ్చెను. ప్రాచ్యపాశ్చాత్యతత్త్వములఁ బరిశీలించకముందు నరేంద్రుఁడు మాతృభక్తుఁడైయుండెను. ఆయావిజ్ఞానముల నేర్చుటతోడనే, సహజముగనే, మాతృభక్తి నమసి, నరేంద్రుఁడు హేతువీమకేగి, యథార్థనిర్ణయమార్గము గానలేక, సంశయములోఁబడెను. అట్టి స్థితిలో నాతనిమానసమజ్ఞానాంధకారముచే నావృతమయ్యెను తత్ఫలితముగా నశాంతి,

యసంతృప్తి, ప్రబలి యాతఁడు సందేహపుసమ్మెటపోటులకు గురియయ్యెను. ఎటుచూచిన నంధకారమే. కాని, జ్ఞానభానూదయసూచన లెవ్వియు నాతనికగపడలేదు. ఆతనిమానస మెందులకో, యెన్నిరీతులనో పరితపించి గాలిలోనిదీపమువలె ప్రచలితము గాఁజొచ్చెను. శాంతిసాధనమార్గ మెద్ది యనియే యాతనియన్వేషణము. ఆత్మప్రశాంతి చూపఁజాలని చదువులన్నియు నాతనికి యమదూతప్రాయములై పొడగట్టెను.

"క. చదివించిరి గురువులు నను
జదివితి ధర్మార్థముఖర శాస్త్రంబులు నేఁ
జదివినవి గలవు పెక్కులు
చదువులలో మర్మమెల్లఁ జదివితిఁ దండ్రీ!"

అని వచించిన ప్రహ్లాదుని సకలవిద్యామర్మము నరేంద్రునికి దెలియలేదు. కాని భూగోళ మాగిపోవక తిరుగుచుండ సూర్యోదయమేలకాకుండనుండగలదు. నరేంద్రుఁడు సంశయసంచలితుఁడై వెనుకంజవేయునా? ఆతనిమానసము రెక్కలుగట్టుకొని పరమావధిని వెదకికొనుచు, సూటిగాఁ బయనించుచున్నది. పరమావధి యెచ్చటనో యాతనికిఁ దెలియలేదు. తెలిసికొని తీరవలెననెడి దృఢాభినివేశ మాతని కనివార్యవేగము నొసంగుచున్నది. ఈసమయమున నెట్టి ప్రాపంచికభోగములైన నాతని కపథ్యములయ్యెను. సృష్టికర్తృపదంబున కెగురు నవ్వానికి సృష్టివస్తువ్యామోహనములేల? సంసారవిషయవ్యాఘ్రము లాతనివైపుఁజూచి, ధైర్యమువీడి, బెదరి, వెనుకకు మఱల నారంభించెను. ఇందాశ్చర్యమేమున్నది?

సీ. మందారమకరందమాధుర్యమునఁ దేలు,
మధుపంబుబోవునే మదనములకు

నిర్మలమందాకినీవీచికలఁదూగు,
రాయంచజమునఁ దరంగిణులకు,
లలితరసాలపల్లవఖాద్యమైచొక్కు,
కోయిలచేరునే కుటజములకు,
పూర్ణేందుచంద్రికాస్ఫురితచకోరక
మరుగునే సాంద్రనీహారములకు,
గీ. అంబుజోదరుదివ్యపాదారవింద
చింతనామృతపానవిశేషమత్త
చిత్త మేరీతి యితరుల జేరనేర్చు
వినుతగుణశీల మాటలు వేయునేల ?

సంశయముచేఁగల్గు సంకటకాల మంతరించినది ? నరేంద్రుని తార్కికసీమ రవికరంబులచేఁ గరగునీహారంబురీతి జ్ఞానాగ్నిజ్వాలచేఁ గరగ నారంభించెను. సర్వసృష్టిహేతుభూతుండు, సవ్యయుండు, సర్వాంతర్యామియు నగు నొక దివ్యశక్తియుండి తీరవలెనని యెడి భారము నరేంద్రునికిఁదట్టి, యీతాటస్థ్యమే జీవితమును మార్చివై చెను. గానమయినది. ఆత్మోపన్యాసము లయినవి. ఆత్మసంస్కారపరివర్తనాభ్యాస మంతరించినది. మానసయాతనలు మాయమైనవి. భగవంతుఁదెలిసికొనయత్నించిన మానసము, వాక్కు, చేత నీత్రికరణములు స్తబ్ధీభూతములైనవి. ఇఁక భగవంతు నాత్మానుభవపూర్వకముగాఁ దెలియు నిర్మలభక్తిమార్గము ప్రారంభమయినది. పరిచలితమైన మానసపరిదీపము నిశ్చలప్రపూర్ణతంగాంచెను. జ్ఞానోదయకాల మరుదెంచెను. నరేంద్రునకే కాదు; నరేంద్రునితోఁబాటు నరేంద్రుమూలమున నశేషమహామండలికి. అది యే మహాపుణ్యకాలము. అతఁడనంతభగవత్ జ్ఞానరసంబుల రుచిచూడ నారంభించెను. మూఢవిశ్వాసము, తార్కికశేముషీప్రౌఢిమ లంతరించి సత్యమార్గా

వలోకనరుచి గన్పట్టిన నూతనచంచలవిశ్వాసము ప్రదర్శితమయ్యె ను "నాకు దెలియ"దను నాస్తికభావము పోయి, "నాకు తెలియు చున్న" దను నిశ్చయభావ మంకురించినది. భగవంతునిఁజూడకపో యినను చూడగలస్థానము నరేంద్రునికి దొరికినది. ఇంద్రియమదంబు నడచి, వివేకజ్వాలను రగుల్కొల్పి, తర్కమార్గము భగవత్ప్రార్థనా చంద్రికలచే వెలుగొందనారంభించెను. సుఖదుఃఖాది ద్వంద్వకలిత జీవనము, "అహంబ్రహ్మాస్మి" జీవితములోఁబడుటకుముందుగల, "త్వం బ్రహ్మైవ" యను మధ్యమార్గములోనికి దిగినది. ఇఁకనొక్కయడు గు మాత్రమే వేయవలసియున్నది.

"శా. శోధింపంబడె సర్వశాస్త్రములు రక్షోనాథవేయేటికిఁ
గాథల్మానవశేముషీసరణి సాంగత్యంబునంగాక దు
ర్మేధం దాటఁగవచ్చునే, సుతవధూ మానోగ్రవాంఛామద
క్రోధోల్లోలవిశాల సంసృతి మహాఘోరానిలాంభోనిధిన్."

అను నరేంద్రపుత్రునకు హిరణ్యకశిపునకు బదులు, రామ కృష్ణుఁడు ప్రత్యుత్తరమీయవలసివచ్చెను. తనభావముల వెడలఁ గ్రక్కుకొనుటకు నరేంద్రున కొకమిత్రుఁడు వలసియుండెను. హృద యము భావములతో నిండి పొరలనారంభించినది. పరంజ్యోతి కిరణజ్ఞాన బీజము నడవేయు నామిత్రుఁడే వలసియుండెను.

నరేంద్రుని హృదయమెట్లు పరివర్తనమందినదో నిశ్చయించు టకు బ్రాహ్మసమాజమును గూర్చి యొకింతఁ దెలిసికొనకతప్పదు.

పాశ్చాత్య నాగరికతాతరంగము హిందూదేశమునఁ బ్రవేశ మై తన నూతనవిజ్ఞానముచే, మతముచే, నాశయములచే, హిందూ మతమును, విజ్ఞానమును, నాశయములను, మొదలంట నుఱ్ఱూత లూ గించి, పెకలింపనారభించినప్పుడు, ప్రాచ్యపాశ్చాత్య విజ్ఞానములచేఁ బూరింపఁబడి, మాతృదేశసముద్ధరణభావములచేఁ బురికొల్పఁబడిన

కొన్ని వ్యక్తులచే, నావిజాతీయతరంగమును మఱలించు నుద్దేశముతో స్థాపితమైనదే బ్రాహ్మసమాజము. సుప్రసిద్ధసంఘసంస్కర్తయగు రాజారామమోహనరాయఁడే బ్రాహ్మసమాజస్థాపకుఁడు. అతని వెనుక బ్రాహ్మసమాజప్రతిష్ఠను నిలఁబెట్టి యఖండఖ్యాతి గాంచిన శేముషీధురంధరులు మహర్షి దేవేంద్రనాథటాగూరు, కేశవచంద్ర సేనులు. ఈమువ్వురు పండితాగ్రగణ్యులనియు, నఖండవిజ్ఞానసంపన్నులనియు, నసమాన శేముషీమంతులనియు, పశ్చిమఖండములుసయితము వారిని పూజించును.

ఏకేశ్వరవాదమే వీరిమతమునకుఁ బునాది. విగ్రహారాధనముగాని, జాతిమతవిచక్షణగాని, గురుచింతగాని లేక, సర్వమానవసౌభ్రాతృత్వమే ముఖ్యాశయముగాఁగల్గి వీరిమత మువనిషత్తులమీఁదనే యాధారమైయున్నది. స్త్రీస్వాతంత్ర్యము, యథేష్టభార్యాభర్తృస్వీకారాధికారము, కర్మకాండాపరిత్యాగము నీమతము బోధించును ఈమతాభిప్రాయములు కేవలపాశ్చాత్యాశయ పూరితములు. ఈమతమునకు జాతీయసాక్షికదృష్టి లేదు ఈహేతువులచేఁ బ్రాచీనాచారపరాయణులకు వీరికి ఘోరసంగ్రామము నాటిల్లినది బ్రాహ్మసమాజము ప్రదర్శించు సంఘసంస్కరణము ప్రాచీన హిందూమానసములకు దుర్భరము, దురూహ్యము నయ్యెను. నరేంద్రుఁ డుపదేశసముద్ధరణాశయములలోఁ జెలగాటము లాడునాసమయమున గేశవచంద్రసేనుఁడు కలకత్తానగరము నేకముఖముగా నాకర్షించిన దివ్యమూర్తి. అతఁడు మహాప్రవక్త. అతని వక్తృతాపాటవమునకు యువకబృందము మోహితమయ్యెను. నరేంద్రుఁడు కేశవచంద్రుని యుపన్యాసములు విని, తాను నాతనివలె మహాప్రవక్త గావలెనని కోరుచుండును. బ్రాహ్మసమాజధర్మములను విపులముగాఁబరికించి, నరేంద్రుఁడు మొట్టమొదట సంశయ మిసుమంతయు లేక సందొర

సభ్యుఁడుగాఁ జేరెను. బ్రాహ్మసమాజముతోఁబాటు నరేంద్రుఁడును వర్ణకాఠిన్యము, స్త్రీదాస్యస్థితి, మున్నగునవి సంస్కరింపఁబడవలెనని గాఢముగా నమ్మెను. కాని, సంస్కరణవిధానమందే యాతఁడు భేదించెను.

మానవమానసశుద్ధి, విశాలాశయములపెంపు, వీనిచేతనే సంస్కరణము సాధ్యమని యాతఁడు దృఢముగా నమ్మెను. బాహ్యానుసరణప్రేరితమగు సంస్కరణము నీచాతినీచమని యాతఁడు తలంచెను. హిందూమతము చెక్కుచెదరరాదు; ప్రాచీనసంఘసూత్రములు విసర్జింపరాదు; జాతీయస్వత్వము తొలఁగవలె; సంస్కారము కావలెను. సంస్కరణ మెవరికొఱకో, వారిహృన్నివసితాశయముల నెరుఁగ్కనుసూత్రములు సంస్కారమును తేఁజాలవని నరేంద్రుఁడు నిశ్చయించికొనెను. ఏసంఘము సంస్కరింపఁబడవలెనో యాసంఘ హృదయములోని యుద్దేశ్యములను ఆసంఘప్రాచీనాచారబోధనపద్ధతి మీఁదనే అసహనము లేకుండ, సంఘటనము లేకుండ, హృదయపరివర్తనము గల్గించవలెనని నరేంద్రుఁడు గ్రహించెను. విజాతీయాశయములలోని మంచిని దీసికొని, జాతీయాశయానుగుణ్యముగా దేశీయుల మనఃఫలకములమీఁదఁ బ్రతిఫలింపఁ జేయవలయునే కాని, "మీపూర్వాచారముల గంగలోఁగలుపుఁడు. ఈనూతనవిషయముల నేర్చికొనుఁ"డను తీవ్రసంస్కరణాభిలాష ధ్వంసాపాదకమని నరేంద్రుఁడు నిశ్చయించి, బ్రాహ్మసమాజమునుండి యట్లుగా భేదించెను. బ్రాహ్మసమాజసంబంధము నరేంద్రుని కొనర్చిన మేలెద్దియు లేదు. ఒక సంస్కరణాభిలాషమాత్రము కల్పించి విడిచెను. విధానములన్నియు నరేంద్రుం డాత్మప్రజ్ఞావిశేషముచేతను, గురుబోధనముచేతను, హిందూతత్త్వాధారముచేతను కల్పించుకొనెను.

---

## పదునాలుగవ అధ్యాయము.

మహాశయా ! నీవు దేవునిఁజూచితివా? హిందూమతధర్మశాస్త్రములు.

బ్రాహ్మసమాజసభ్యుఁడైన నరేంద్రుఁడు, సమాజోద్ధారకులగు పెద్దలతోఁ బరిచయము చేసికొననారంభించెను. ఆసమాజసభ్యులలోఁ జాలమంది విశుద్ధజీవనులనియు, పవిత్రహృదయులనియు నరేంద్రుఁడు గాఢముగా నమ్మెను. వారలతో నాతఁడు ప్రేమపూర్వకముగాఁ గలసిమెలసి తిరుగుచు, వినయముతో వారలఁ గీర్తించుచుండువాఁడు. కాని, యాతనిమానసము నొకవిచిత్రతృష్ణ పట్టుకొని పీడించుచున్నది. భగవంతుఁడన్నచో నాతనికిఁ దృప్తి లేదు. భగవంతునిఁ జూచితీరవలయును. నరేంద్రునియాశయములన్నియు నాదివ్యవాంఛలో నిమిడిపోయెను. సమస్తవిద్యలు, సమస్తభోగైశ్వర్యములు, సమస్తసమాజములు, సమస్తవాంఛలు, భగవంతునిఁ జూపఁజాలకున్న ధూళిగాఁ గన్పట్టెను భగవంతుఁ డెచ్చటనున్నాఁడు ? వాని నెట్లుచూచుట ? వాని నెవ్వఁడు చూపఁగలఁడు? ఇదియే నరేంద్రుని హృదయమునఁ గొట్టుకొనుచున్న విషయము. ఇట్టిహృదయముతో నరేంద్రుఁడు గురుశ్రేష్ఠుఁడని మన్నఁబడుచున్న దేవేంద్రనాథటాగూరుసముఖమునకు వెడలెను. భగవంతుని ప్రార్థించుమనియాతఁడుబోధించి, యొకబోధనాతరగతి నేర్పఱిచి, యందు నిత్యము ప్రార్థనాదికము సల్పుచుండుపద్ధతిని నడుపుచుండెను. ప్రతిదినము సభ్యులు పరస్పరానుభవముల వెలిబుచ్చుకొనుచుండిరి.

నరేంద్రు ననుభవమువంటిది వారికెన్నఁడు తట్టలేదు. ఒక చిన్నకాంతిగోళము గిరగిరతిరుగుచు నరేంద్రుని భ్రూమధ్యమునఁ గన్పట్టి, కొంతసేపటికి నిశ్చలముగాఁ జూపట్టుచుండెడిది. శాస్త్రప్రకారమాకాంతి చర్మచక్షువులకు జీవనకళ నొసంగు జ్ఞాననేత్రరూపమని

తెలియుచున్నది. ఆజ్ఞానాక్షి యెవ్వరికిఁ దెఱువఁబడి స్పష్టముగఁ గాన్పించునో, యాతనికి సర్వసృష్టివిషయములు కరతలామలకములు. ఆసమయమున నరేంద్రునిదృష్టి యాకాంతియందు కేంద్రీకృతమగు సరికయ్యదదృశ్యమగుచుండెడిది.

మహర్షి నరేంద్రు నొకసిద్ధపురుషునిఁగాఁ జూడ నారంభించెను. ఆదినము బ్రాహ్మసమాజమునకు ప్రార్థనాదినము. విశేషశేముషీమంతులని పేరెన్నికఁగన్న సభ్యులందఱు ప్రార్థనామందిరముఁ జేరి, భజన నల్ప ప్రారంభించిరి. నరేంద్రుని భగవత్సాన్నిధమునకుం దోడ్కొనిపోవునాదివ్యపూరుషు నానాఁడు చూచుభాగ్య మబ్బునని సభ్యులెన్నఁడు తలంపలేదు. ఒక్క కాషాయవసనమును కటితలమ్మున ధరించి, చిన్మయానందరసము నిష్కల్మషముఖమునఁ జిలికింపఁబడుచుండ ననంతజన్మార్జితాత్మకృషికాశవిలాస మాతనియాస్యమునుండి తొంగిచూచుచుండ, నరేంద్రదర్శనాభావముచేఁ గల్గిన తాత్కాలికాసంతృప్తిచిహ్నితమగు దృష్టితో నొకవ్యక్తి, పిచ్చివానివలె, విగతచిత్తునివలె, విశ్వలోకసంగవిసర్జన మొనరించిన లీలావిగ్రహమూర్తి యొక్కటి ప్రార్థనామందిరద్వారముకడకు వచ్చి, నిలఁచి, "నరేన్, నరేన్" అని, మృదుమధురరసము తన అవ్యాజానుకంపాతరంగితమై యొప్పార నొకకేకవైచెను సభ్యులందఱు చేతనరహిత విగ్రహంబులకీతి నాతనిపై దృష్టిఁబఱపి నిరీక్షించుచుండిరి. ఈతఁడెవరు? ప్రార్థనాగీతానినాదాంత్యస్వరములతో మేళవించివచ్చిన యాకేకనువిని, నరేంద్రుఁడు బయటికివచ్చి, శ్రీరామకృష్ణవిగ్రహమునుజూచి, యమందాశ్చర్యచకితుఁడై నిలచెను. నరేంద్రునిఁ దిలకించినంతనే యాదివ్యపురుషునిముఖము దివ్యానందజ్వాలామయమయ్యెను. అంత, "నన్నుఁ జూచుట కింతవఱకు రావదేమి? నీరాకకై నేనెంతయుఁ బరితపించుచున్నాను." అనుస్వర మాతని కంఠమునుండి

బయలుదేరుచుండఁగా మఱల నొకభక్తిగీతమును పాడనారంభించిరి. ఆగీతమును విని, శ్రీరామకృష్ణుఁడు భక్తిపారవశ్యమున శరీరస్పృహ మఱచిపోయి, నిశ్చలసమాధినిమగ్నమానసుఁడై చలనము లేక దివ్యజ్యోతిర్గోళములరీతి వెలుఁగొందుచున్నదోయి కాంతిపుంజములఁ గ్రక్కుచుండ నిలబడెను. కొంతసేపటికి మరల స్మృతిదెచ్చుకొని యాతఁడు, "నరేన్! రమ్ము. నీకొఱకు నిరీక్షించుచుంటి"నని వచించెను. నరేంద్రుఁడు వెంటనే సభవదలి బయటికివచ్చి, "ఈముసలి యెవ్వ"డని తలంచి, "సమాజములోనికిఁ బిచ్చివానివలె యీతఁ డేల రావలయు"నని విసిగికొని, యాక్షణముననే గంగయొడ్డున నున్న మహర్షి నొకని సమీపించి, "భగవంతుఁడుండెనా? ఉన్నచో నేను చూచితీరవలె"నని దృఢముగా నిశ్చయించుకొని వాయువేగమున నడచి దేవేంద్రనాథుని ప్రత్యేకపుగదిగుమ్మముకడ కరిగి తలుపు తెఱచెను. గాఢసమాధిమగ్నుఁడై యున్నమహర్షి కనులు తెఱచి నరేంద్రునిఁ జూచెను. నరేంద్రునిముఖము భగవదావేశాగ్నిజ్వాలాకంపితమై యుండెను. అతని నేత్రగోళము లాత్మజ్యోతి వెలుంగు శరీరాలయమందలి కిటికీలవలెఁ గన్పట్టెను. "మహాశయా! నీవు భగవంతునిఁ జూచితివా?" యనెడునాదము తడబడుచు నాతనినోటనుండి బయల్పడెను. నిరంతరసంచలత్తరంగములచే నుల్లోలమగుచుండు సాగరసీమవలె మహర్షిహృదయము విదళితమయ్యెను. ప్రశ్నకు సమాధానమొసఁగ మహర్షి యత్నించెను. మఱల యత్నించెను. మూఁడవసారి యత్నించెను. మహర్షినోట మాట వెడలలేదు. అంత మహర్షి నరేంద్రునిముఖము నవలోకించి, "బాలుఁడా! నీనేత్రములలో యోగాగ్నిగల"దని వచించెను.

ఆవెనుక మహర్షి భగవంతునిఁ జూచియుండలేదని నరేంద్రుఁడు నిశ్చయించుకొనెను. అతనికోర్కె దీర్పఁగలవాఁడెవ్వఁడు? ఇన్నినాళ్ళు

జీవితమును వ్యర్థముచేసి చదివినవిద్య లన్నియు నాతనికి భగవంతునిఁ జూపలేకపోయెనని విచారముకల్గెను. వెంటనే తనగదిలోని పుస్తకములఁదీసి వీధిలో విసరివైచెను. శ్రీరామకృష్ణుఁడు లేఁడా? ఆతఁడు దేవేంద్రనాథునివలెనే ప్రత్యుత్తర మొసంగజాలనిచో నేమిచేయుట? అని తలంచి తత్క్షణమే గృహాము వీడెను. భువనేశ్వరి యెచ్చటికని ప్రశ్నించెను. శ్రీరామకృష్ణునికడకే యని యాతఁడుచెప్పి, గంగానదీతీరముననున్న దక్షిణేశ్వరమున కరిగి, యేకాంతయోగస్థుఁడై పరమేశ్వరతాదాత్మ్యకిరణప్రసరణముచే లోకముల వెల్గొందించుచున్న నాపరమహంసం జేరి, సాష్టాంగప్రణామ మొనర్చి, "అయ్యా! మీరు భగవంతునిఁ జూచినారా?" అని ప్రశ్నించెను. నరేంద్రునినోట నీమాట స్వయముగాఁ బయల్పడు నామహాపుణ్యనిమేషమునకై, నిరంతరప్రార్థనలు సల్పుచున్న యాశ్రీరామకృష్ణునిహృదయ మొక్కుమ్మడి బ్రహ్మానందమహామారుతముచే నుబ్బుఁలూగెను. ప్రశ్నయడిగిననిముసముననే, "పుత్రుఁడా? చూచితిని. నిన్ను నాయెదుట నెంతవిస్పష్టముగాఁ జూచుచుంటినో భగవంతు నంతకన్న వేయిరెట్లెక్కుడు విస్పష్టతతోఁజూచుచుంటిని. వలయుచో నీకును జూపెద" నని సందేహశూన్యగంభీరకంఠముతో బదులుచెప్పెను. ఏధీరసమాధానమునకై నరేంద్రుఁడు సందేహదందహ్యమానుఁడై సమస్తమును తృణలీల విసర్జించి పిచ్చివానివలె పరిభ్రమించుచుఁ దిరుగాడెనో యాధీరవాక్య, మాశాంతివాక్యము, నరేంద్రుని కర్ణకుహరములం బ్రవేశించి హృదయఫలకమునఁబడి శాశ్వతముగా ముద్రితమైపోయెను. "భగవంతుని నేఁ జూచితిని. చూచుచున్నాను. చూపెద" ననెడు శౌర్యాగ్నిజ్వాలోష్ణము నరేంద్రునిహృదయము చేఁదాఁకఁబడెను. నరేంద్రచకోర మమృతధారాధరధారాస్రవముచేఁ దన్మ

యత్వమందినది. కోట్లాదిజన్మములెత్తి చేసిన యాతననోములపంట పరిత్యక్తమైనది.

శ్రీరామకృష్ణ నరేంద్రులకుఁగల్గినసాంగత్య మేరీతిఁబరిణమిం చినదో తెలిసికొనుటకు, హిందూమతాదర్శములఁ గొన్నిపరికింప వలసియున్నది.

హిందూదేశమ దెన్నెన్నిజాతు లెన్నెన్నిభాషలుగలదో అట్లే హిందూమతమం దెన్నెన్నియో ఆత్మాభిప్రాయములు, ప్రార్థనావి ధానములు, నారాధనలుగల్గి, యామత మనంతశాఖోపశాఖాసమన్వి తమై యున్నది. కాని, 'యందఱుభారతీయులు నేకమాతృపుత్రులు' ననుభావముచే నట్లైక్యసూత్రము ప్రబలియున్నదో, వివిధశాఖాభి ప్రాయములు నట్లే వేదాంతసూత్రములచే నేకాధారభూతములై చెలంగుచున్నవి.

భగవంతుఁడొక్కఁడు; నామరూపాదిగుణాతీతుఁడు; సర్వాంత ర్యామి; ఆద్యంతరహితస్వరూపుఁడు; అవాఙ్మానసగోచరుఁడు; అను భవైకవేద్యుఁడు; దేశకాలమిత్రబద్ధమగు నీసృష్టియంతయు మిథ్యా స్వరూపము; మాయాన్వితము; పరమాత్మయే నిత్యుఁడు. భగవం తుఁడొక్కఁడే యైన సగుణుఁడు; సరూపియగు నొకఁడు ప్రత్యేకా త్మాభిప్రాయ మున్నంతవఱకుండును. ప్రత్యేకాత్మాభిప్రాయము సమ యుటలో నాసగుణుఁడే నిర్గుణపరమాత్మగా విదితుఁడగును. ప్రత్య క్ప్రాణియు నాపరబ్రహ్మైక్యముఁ జెందుతీరుదినము తప్పకవచ్చును. ఎప్పుడు ప్రత్యేకాత్మ మాయాన్వితప్రపంచసంగములను విడిచి నిర్గుణపరబ్రహ్మమే తానని నిశ్చయించుకొనునో అప్పుడే యీస్థితి సంభవించును.

సమస్త వస్తుసంతతిలోను ప్రత్యణువునందును నాపరమేశ్వ రుఁ డంతర్యామియై యుండెననియు, నట్లు తెలిసికొని యనుభవించుటే

మోక్షసిద్ధియును వేదాంతాభిప్రాయము ఈయభిప్రాయగ్రహణము తోడనే ద్వైతవిశిష్టాద్వైతభావముల ద్వైతభావముతోఁ గలసిపోవును.

వివిధమానసములు వివిధపరిస్థితులలో నాపరమాత్మనే లోకైకజనకుఁడు, లోకైకజనని, బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుఁడు, లేక యవతారపూరుషుఁడు నని పిలుచుచున్నవి. ఇవన్నియు ద్వైతాభిప్రాయములే. ఇవన్నియుఁ బరమాత్మైక్యభావముకల్గునందాఁక యథార్థములే. ఏలనఁ బరమాత్మ సమస్తరూపాభిప్రాయంబులందు నున్నాఁడు. అందుచేతనే బుద్ధుఁడు, శ్రీరాముఁడు, శ్రీకృష్ణుఁడు, చైతన్యుఁడు మున్నగువారు భగవదవతారపురుషులని నమ్మఁబడుదురు. హిందూదేశమున మతాభిప్రాయములలో విరోధములేదు. ప్రతిహైందవుఁడు నాయాదేవతలందఱను సహజముగాఁ బూజించును. కాని వారలందఱిలోఁ బరమాత్మభావముంచును. అట్టి యేకపరమాత్మభావమే హిందూమతమునకుఁ బునాదియైయున్నది.

భగవంతుఁ డొక్కఁడై, తదితర మెద్దియు లేనప్పు డెవ్వ రెవ్వరిని పూజించుట? యని యద్వైతి ప్రశ్నించును. పూజించువాఁడు పూజ్యుఁడు నొక్కఁడే! ఈవిషయమందే భారతదేశజీవన మొక్కటై నిలచినది.

ఆత్మ, పరమాత్మజ్ఞాన సంపాదనములో ననేక దేవతాభిప్రాయములఁ దలంచును కాని తెలిసికొనువాఁడు, తెలిసికొనఁబడువాఁడు నొక్కఁడే, నిత్యుఁడే. కనుక నీయభిప్రాయములు నిత్యములే. ఆ హేతువుచే నూహాకల్పితమై, అనిత్యమగు నీప్రపంచ మాత్మైక్యజ్ఞానాగ్జనపదవిలో నున్నవారికి పరబ్రహ్మస్వరూపమే మనోవాక్కాయములగు త్రికరణములను శుద్ధిచేసి, పరమాత్మయందే దృష్టినిడి, క్రమాభ్యున్నతిచే నిత్యత్వముంగనుచు, సర్వము నాపరమాత్మగాఁ జూచు నాపూరుషులే యవతారపురుషులని పిలువంబడుదురు. రాముఁడు, కృష్ణుఁడు, చైతన్యుఁడు, క్రీస్తు, బుద్ధుఁడు నట్టివారలే.

అందుచేతనే మతమొక సిద్ధాంతముగాని, యారాధనముగాని యాలయముగాని కాదు. పరమాత్మైక్యభావసంపాదనార్థము ప్రయత్నము చేయు నాత్మావిష్కరణకార్యక్రమమే యని వేదాంతము చెప్పుచున్నది. అందుచే వివిధమతములు భగవద్దర్శనైక మార్గములనియు నానాదేశముల కానామతములే జన్మముచే నాచరణసౌలభ్యములనియు ప్రతిపొందవలెను నమ్మి, సర్వప్రాణులను సమదృష్టితోఁ జూచును.

ఈ సర్వాణుపరమానాభిప్రాయమును రామకృష్ణుఁడనుభవపూర్వకముగాఁ గాంచి వివేకానందునకుఁ జూపఁగలిగెను. అందుచేతనే వివేకానందుఁడు ప్రపంచికమతమహాసభావేదికపైఁ నిలఁబడి, "ఎవరిమతమును వారు విడువకుఁడు. ఇతరమతముల దూషింపకుఁడు అన్నిమతములు నేకప్రయత్నమందె యున్న" వని ఘోషించియున్నాఁడు. ఈమహావేదాంతసూత్రమే సర్వప్రపంచమునకు బోధింపఁదగు మహాసందేశమని, వివేకానందునకు రామకృష్ణుఁడు చూపియున్నాఁడు.

హిందూదేశమున సర్వసాంఘికాచారములు నీవేదాంతమాత్రమును వ్యక్తీకరించునవిగనే యమర్పఁబడి యుంటచే, సాంఘికజీవనమునకు మతజీవనమునకు భేదములేదు. ఏకర్మచేసినను నీయాత్మపరమాత్మైక్యభావమును పునరుద్ధరించుమహాప్రయత్నమే. ఈమహాసందేశమే భారతపుత్రులనోట వెడలి, లోకమును దురంతదుఃఖపంకిలమునుండి కాపాడఁగలదు. ఈభావజ్ఞానమునకై సర్వప్రపంచవాసులు, భారతజాతిపాదములకడ బానిసలై వలవ్రము చేయకతప్పదు. నిగూఢభౌతికశాస్త్రసిద్ధాంతములుగాని, కృత్రిమరాజకీయనైపుణిగాని, సాంఘికస్వాతంత్ర్యముగాని, నానాజాతి సమితులుగాని, ప్రపంచశాంతి నెలకొల్పయత్నించుచో, నాయాసమాజములమధ్య, నీమహాసం

దేశము జన్మముచే గర్భమందు దాల్చి యుదయించిన భారతపుత్రరత్నమును నిలుపుకొని, యాతనికి దాస్యముచేయనిదే సాధ్యము కాదు.

కేవల పక్షపాతదృష్టితో నఖండగర్వప్రేరితులై, చూచునవ్వారల కీసూత్రభావ మెంతతడవులాడిన లభించదు. నరేంద్రుడు బ్రాహ్మసమాజముతోఁ జేరిన దిట్టి సాక్షికదృష్టితోడనే.

శ్రీరామకృష్ణహృదయసారామృతాస్వాదనముతోడనే నరేంద్రునిసాక్షికదృష్టి మారి నిశ్చలవృత్తింగాంచెను. శ్రీరామకృష్ణుఁడు సర్వవేదాంతసూత్రసారనిలయ మగుహృదయము. 'నరేంద్రుఁడు సర్వలౌకికసూత్రసారకాసారము. రామకృష్ణుని పరమాత్మైకసూత్రసారదివ్యామృతమరందబిందువులచే, జీవకళారహితమగు నరేంద్రుని లౌకికశేముషీప్రభావము శుద్ధమై ప్రకాశితము కావలెను.

సహజముగా భగవద్జ్ఞానరసాంబుధియగు రామకృష్ణునిహృదయములో, నసహజ విద్యాభ్యసనమ్ముచేత నజ్ఞానపీడితుఁడగుచున్న నరేంద్రుని శేముషీతరంగిణి పరుగులిడుకొనుచువచ్చి, జేరి, ఐక్యమై సర్వమానవకోటిని పునీతహృదయులఁ జేసి, లోనిముద్చుకొనవలసియున్నది. ఎంతకష్టమో కదా ! లోకకల్యాణమంతయు నీనరేంద్రరామకృష్ణశేముషీహృదయతరంగిణీసాగరసంగమంబుచే బయల్పడినదివ్యామృతసందేశజ్వాలచే గావింపఁబడు పరిసుద్ధ బోధనావిషయముల మీఁద నాధారపడియుండ శ్రీరామకృష్ణవివేకానందులు, నరనారాయణులన నొప్పదే. శ్రీరామకృష్ణుఁడే పరంజ్యోతి, పరమాత్మ వివేకానందుఁడే జీవాత్మ. నరశ్రేష్ఠుఁడు. ఏతజ్జీవాత్మపరమాత్మైక్యముచే నుదయించు నామహాజ్ఞానఫలంబు లోకంబున కనంతముగా స్రవించు నఖండముగాఁ బెచ్చుపెరుగు, ననివార్యముగా విజృంభించు, నవలీల మోహించి, బంధించు, విశుద్ధసందేశమకరందామృతరసము లూరి జీవన్ముక్తులఁ జేయఁజాలదే !

---

# పదునైదవ అధ్యాయము.

## నిర్వికల్పసమాధి.

తత్త్వశాస్త్రమూతయు యథార్థమును ప్రకటింపఁ బ్రయత్నించు బుద్ధినైశిత్యముచేఁ గల్పితమయిన వివేకసూత్రసముచ్చయము మాత్రమే యథార్థమల్లుండును, ఇట్లుండును, నను హేత్వాధారవాక్యములే. వేదాలోకనూతన సత్యాంశ మెద్దియైన నూహింపఁ బడుచోఁ బ్రాంతసిద్ధాంతము త్రోసి వేయఁబడును ఇవన్నియు మానసమును సునిశిత మొనర్చును పైమెట్టుకుఁ దీసికొనిపోవఁజాలవు. కాని శరీరమును, మానసమును, బుద్ధిని కట్టివైచి ఆత్మ సర్వప్రపంచాత్మభావమును బొంది, బ్రహ్మానందరసమును గ్రోలుచు నుండు స్థితికే నిర్వికల్పసమాధి యనిపేరు. సకలక్షేత్రభావములను బంధించి, క్షేత్రజ్ఞుఁడు, సర్వప్రపంచక్షేత్రజ్ఞభావసాగరమున నిశ్చలుఁడై క్రీడించునాస్థితియే నిర్వికల్పసమాధి. అట్టి స్థితిలోనున్నపుడే యాత్మ సర్వశరీరములలోనుండి యుఁ బనిచేయఁగలదు. అట్టి నిర్వికల్పసమాధిలోనుండియే శ్రీకృష్ణుఁడు బ్రహ్మానందసాగరతరంగములచే నీలోకప్రాణికోటియాత్మలఁ గదల్చి తనసమ్మోహనగానమాధురిచే నాకర్షించెను. శ్రీరామకృష్ణుఁడు నట్టి సమాధిలోనుండియే, విశ్వమానవాత్మల నాకర్షించి ముక్తసంగులచేసినది. దానినే స్థితప్రజ్ఞావస్థయని శ్రీకృష్ణుఁడు వచించి యున్నాఁడు.

"ప్రజహాతియదా కామాన్ సర్వాన్ పార్థ! మనోగతాన్
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితః ప్రజ్ఞస్తదోచ్యతే॥
యదాసంహరతేచాయం కూర్మోఙ్గానీవసర్వశః।
ఇంద్రియాణీంద్రియార్థేభ్యస్తస్యప్రజ్ఞాప్రతిష్ఠితా॥

"మనోజాతములగు సమస్తకామములను విడచి, నిజాత్మస్వరూపానుభవముచేఁ దృప్తినందు నాతఁడే స్థితప్రజ్ఞుఁడు.

"ఎవ్వఁడీయోగి, తాఁబేలు తనయవయవములను లోనికిముడుచుకొనునట్లు తనయింద్రియములనన్నిటిని విషయములనుండి, యుపసంహరించుకొనునో, అప్పు డాతనిబుద్ధి స్థిరమైన దనఁగా నట్టివాఁడే స్థితప్రజ్ఞుఁడు"

నరేంద్రుఁ డట్టిస్థితప్రజ్ఞావస్థఁ గాంచుసమయములో ననేకసత్యాంశములను గాంచెను కాని వెంటనే యాతని కనేకసందియములుగల్గి, తాను గాంచిన దేవతాస్వరూపములను, మాయాన్వితములని తోసిపుచ్చెడివాఁడు. కాని శ్రీరామకృష్ణుఁడే యాతనికి స్థిరత్వ మొసఁగిన మహానుభావుఁడు. శ్రీరామకృష్ణుఁడు నట్టిసందియములకు గురియై, అపరిమితయాతనల ననుభవించెను. శ్రీరామకృష్ణుని గౌరవముగాఁ జూచు మార్వారీలతో నాతని మేనల్లుఁడు 'హృదయ్' అను నాతఁడు తన మామగారిభక్తివిశేషములఁ జూచి పొగడుచుండఁగా, విని "అయ్యా! ఈతని మాటలు వినకుడు. నాగొప్పస్థితినిఁ గూర్చి చెప్పుచో మీరు నాకు ధన మొసఁగుదురని యాతఁ డట్లు చెప్పుచున్నాఁడే కాని, నిజముచే,మీరు తలఁచునట్లే నే నొకపిచ్చివాఁడ"నని చెప్పి శ్రీరామకృష్ణుఁడు వచించెను. యథార్థార్జనవృత్తిలో నెన్నఁడైన నెచటనైనవట్టి నిరాడంబరమూర్తిఁ గాంచినారా? అట్టి కేవలసత్యైకప్రకటనాసక్తిచే నిర్మలహృదయము గల్గియుంటచేతనే సత్యజ్యోతి దర్శనానంతర మాతఁడు పలికినపలుకు లమృతరసమును చిలికింపఁగల్గెను. "మహానుభావా! మీజ్ఞానము లోకమునకు బోధచేయ నేలపర్యటనము సల్ప"వని యడుగ, "మకరందమయపుష్పరాజము తేంట్లకొరకు వెదకికొనుచుఁ బోవునే? భగవద్ జ్ఞానమకరందముచే హృత్కుసుమము నిండియున్నపుడు సత్యైకకాంక్షగల మానసమధు

పసంఘుంబుల తమంతట తామే పర్వెత్తి రాకమానునే” యని రామకృష్ణుఁడు బదులు చెప్పెను.

ఇట్టి నత్యైకోన్ముఖతాపరియత్నము, ప్రయత్నపూర్వకముగానైన, నపరియత్నముగానైనఁ బరితపారిశిలో శాశ్వతముగా ముద్రింపఁబడి యున్నది. కవి, కళోపాసకుఁడు, గాయకుఁడు తత్త్వజ్ఞుఁడు, వీరలహృదయములలో సత్య మర్ధచంద్రాకృతి వహించి మినుకుమినుకు మనుచున్నది. కాని యోగీశ్వరునిహృదయకాసారమున నవి సంపూర్ణపూర్ణిమాచంద్రబింబకాంతితో వెలుఁగొందుచుండును

ఏకార్యముచేసిన శక్తిని వ్యయింపకఁదప్పదు. భగవంతుం దెలిసికొనుటకంటె మిన్నయగుకార్యము లేదు. ఎన్నిత్యాగము, లెన్ని కష్టము, లెన్నిదుఃఖయాతన, లెన్నియంధకారజన్మములెత్తినను భగవద్జ్ఞాన మిసుమంతయైన లభించుట దుస్తరము. అట్టితతి నరేంద్రుఁడు నిశ్చలుఁడై భగవంతుం జూచి తీరవలయునను మహావాంఛతో నెన్ని ఘోరనరకయాతనల ననుభవించెనో తెలియదు. వాంఛావిఘాతముచేఁ, గార్యవైకల్యముచేఁ గల్గిన దురంతదుఃఖసాగరనిష్పాగ్నిజ్వాలకు గురియై యింద్రియపాశముల నణఁకి కామ్యముల కకుంఠితుఁడై ధైర్యసాహసముల ననంతముగాఁ బ్రకటించిన నమ్మహామూర్తియే నరేంద్రుని వివేకానందునిఁ జేసినది.

అగ్నిపరీక్ష కాహుతియైపోక నిలబడినన రేంద్రునిమానసధృతి వర్ణనాతీతము. మానసికదురంతయాతనాంబుధిలోని సందేహోత్తుంగ వీఁచికలతోఁ జెలగాటము లాడుచు నరేంద్రుఁడు తన సత్యార్థదృష్టిని వీడక, మాయామరీచికలచే మోహితుఁడుకాక, నిరంతర హేత్వాధారసూత్రిబాణప్రయోగముచే నడుగులను కదల్పుచు ముందు నకేపోయెను. కాని వెనుకంజవేసియెఱుఁగఁడు, తార్కికదృష్టిని, పరిశీలనాదృష్టిని మఱువలేదు. అట్టిస్థితిలోనైనను నరేంద్రునిమానసిక

నాక భ్రాంతిభూతముగాక భయముచేఁ గొట్టఁబడకుండ ముందునకే సత్యపరమావధికే దీసికొనిపోఁవగల్గిన దాతనిహృదయమున నాటుకొనియున్న అప్రతిహత, అవితర్క్య, అప్రతిమాన, అచంచలాత్మ విశ్వాసమే.

---

## పదునాఱవ అధ్యాయము.

## శ్రీరామకృష్ణుఁడు.

వివిధజలాశయములలో వివిధరీతుల ప్రతిఫలించుచున్నను సూర్యుఁడొక్కఁడేకదా! అనేకదేవతాస్వరూపములుగాఁ గన్పట్టుచున్నను పరబ్రహ్మము నొక్కఁడేకదా!

భగవంతుం దెలిసికొనుటయనునది దుర్ప్రలాపము. భగవదితరమైన దెద్దియు లేనప్పు డెవ్వ రెవ్వరినిఁ దెలిసికొనుట? కాని చూచుట, వినుట, తెలిసికొనుట యనునవ న్తేంద్రియకార్యములు దేశకాలనిమిత్తబద్ధములు. దేశకాలనిమిత్తపరిమితాతీతమగు నయ్యద్వితీయమగుటచే నక్కడ చూచుట, వినుట, మున్నగున వెవ్వియు నుండఁజాలవు. కాని ఆద్యంతసహితమగు నీ ప్రపంచసంగమున్న నేమానవుఁడుగాని ఆద్యంతరహితస్థితిం బ్రాపించునందాఁక నాద్యంతసహితవ్యక్తిసంబంధము విడువడు. అట్టిచో సర్వాద్యంతసహితవస్తుజాలములును నాయాద్యంతరహితస్థితిం జేర్చునుపకరణముగాఁ బరిగణింపఁబడవలెను. ఈహేతువుచేతనే విగ్రహారాధనము హిందూదేశమునకు ముఖ్యాధారమై యుగయుగంబులనుండి నిల్చియున్నది. ఇఁక ముందు ననంతముగా నిల్వఁగలదు. వట్టిరాతిముక్కలను, కర్రముక్కలను పూజించి తృప్తినందువారు హిందువు లనుట గుడ్డివాఁడు సూర్యుఁడు లేఁడనుటకన్న నెక్కుడుకాదు. రూపమును నరూపియగు

మానవుఁడు పూజించుట రూపరహితత్వస్థితిం బ్రాపించుమెట్టు. రూపరహితపదార్థముం బ్రాపింప రూపేలయవసర మనువారలకు కోటివందనములు. వలన, నట్టివార లీలోకమునఁ దప్పిజారిపుట్టిన మహాత్రితుల్యులుగాని మానవమాత్రులు కారు. మూఁడునిమునముల లోఁ బుచ్చిపోవు రక్తమాంసాదికల్మషకల్పితశరీరమును ధరించు దుర్భర మరవస్థకు పాలై పాల్పడుటకన్న నీచాతినీచమగు విగ్రహారాధన మేమిగలదు ? మాటాడుట, చూచుట, కర్మచేయుట నివి విగ్రహా రాధనమహాదోషరాశిలోనివే. లక్షలాదిరూప్యములు వెచ్చించి సుం దరమందిరములు కట్టుకొని, ప్రార్థనామందిరములని చెప్పుకొనుట విగ్రహారాధనము కాకపోయి, ఆప్రార్థనామందిరమున నే యొకమూ లనో యొకభగవదాకారము నూహించి నిల్పిన జాతివిగ్రహమున్నచో నయ్యాదంతటితో విసర్జించవలయు, విగ్రహారాధనమయి నరకాంధ మునఁ బడఁద్రొబ్బునా ? విగ్రహారాధన మవసరములేనివారికి మం దిరములేల ? రూపరహితపదార్థస్వరూపమును గ్రహించుటకా ? అట్లైనచో నామందిరమున నొకరూపము ప్రతిష్ఠించి యద్దానిని ప్రేమించి ధ్యానించుటయు నట్టిరూపరహితత్వస్థితిం బ్రాపించుటకే యని తెలియకుండు టెంత వెఱ్ఱి !

విగ్రహారాధనైకమార్గముచే నెట్లు విగ్రహరహితపరబ్రహ్మ ముం గాంచనగునో, శ్రీరామకృష్ణుఁడు, దిగ్భేద్యగంభీరకంఠముతో జగంబునకుఁ జాటియున్నాఁడు. ప్రతిహైందవుఁడు నట్లు చూచుటకు యత్నించుచున్నాఁడు. ఆద్యంతరహితస్వరూపుఁడగు పరబ్రహ్మము, జాతిముక్క నొక్కటి నిల్పఁగనే, యందుదూరి, యర్చకునితో ఛాయాపటమును తీసికొమ్మని కదలక మెదలక నిల్చియుండి, యుండఁడనియు, నావిగ్రహార్చనాభిప్రాయము, మానసమున, విగ్రి

హాసహితవస్తుజాతానిత్యత్వమును గుర్తించి, రూపరహితపరమేశ్వర విగ్రహమును, నిల్పుకొనుమార్గమే యనియు, భారతదేశమందలి ప్రతిచీమకు దోమకును తెలియనిసంగతి కాదు. అట్టి విగ్రహారాధకులలోఁ గృతకృత్యులైన మానవులలో శ్రీరామకృష్ణుఁ డగ్రగణ్యుఁడు. విగ్రహమును తానెట్లు చర్మచక్షువులతోఁ జూచెనో, సర్వలోకైకకర్తృస్వరూపము నంతకన్న వేయిమడుంగు లెక్కుడువిస్పష్టతతోఁ దాను చూచితినని శ్రీరామకృష్ణుఁడు నరేంద్రున కెఱింగింకలేదా ?

యథార్థమును తెలిసికొనుయత్నములో గల్గినసందేహఝంఝానిలముచే నెట్టెన్ని మానసికయాతనల నరేంద్రుఁ డనుభవించెనో, శ్రీరామకృష్ణుఁడు నట్లే సమస్తయాతనల ననుభవించెను గాని, నరేంద్రునిది మానసికవ్యథ, శ్రీరామకృష్ణుని దాత్మవ్యథ, కాళీస్వరూపముగా జగత్తునంతను జూచునాప్రయత్నములో శ్రీరామకృష్ణుఁడు, తనశరీరము నినుమును సాగఁదీసినట్లు సాగఁదీసి విడచెను. లోకైకజననిఁ జూపని శరీరమే మైన నేమి? అట్లు చూపినఁ జూపకున్న చూచుయత్నమున కడ్డునిలచు నాశరీరము నేమిచేసిన నొప్పదు ?

లోకైకమాతయగు కాళీదేవి యున్నదన్నచో నాతఁడొప్పుకొనఁడు. ఆమె నాతఁడు చూడవలయును, చూచునందాక నామె లేదన్నమాటయే ! తార్కికవాదముకొఱకు కాదట్లు వచించుట ? పరబ్రహ్మస్వరూపదర్శనైకతీవ్రతను కాంక్షంజేసియే !

పరబ్రహ్మస్వరూపమే కాళీదేవియని, యాతఁడామెను మాతృభావముతో ధ్యానింప నారంభించెను. కాళికాదేవి, మరణము నాశము వీనిస్వరూపము. మరణరూపముచే సర్వమును నాశముచేయుటయే యామెవృత్తి. పుఱ్ఱెలదండయే ఆమె కంఠహారము. నఱుకఁబడిన చేతులతోఁ గూర్పఁబడిన మఱొకదండయే యామెకటివస్త్రము.

రక్తము స్రవించుచున్న మానుషశిరమామెచేతిలోని దివ్యాయుధము. ఆమెనిలయము శ్మశానవాటిక. ఏమి భయంకరదృశ్యము! చావన్నచోఁ బ్రతిప్రాణికి మహాభయము. అందుచే నామెను పూజించుటకందఱు భయపడుదురు. మరణమును ప్రార్థించి దెచ్చికొనుట కెంత సాహసము వలయునోకదా! మరణస్వరూపిణియైనను కాళికాదేవి పరబ్రహ్మస్వరూపము. ఈరెండువిషయములచే శ్రీరామకృష్ణుఁడామెను ధ్యానించును. కాళికామాత యెవరిని చంపును? వాంఛాపూర్తులను, యశోలాలసులను మాత్రమే యామె నాశమొనర్చి, దీనులకామె కారుణ్యస్వరూపిణిగాఁ గన్పట్టును. తన్ను ప్రేమించువారలకామె యోగీశ్వరీమాతయై, శాశ్వతానందదాయినియై, చూపట్టును. ఆమె మరణస్వరూపమును జూచి, మరణరహితత్వప్రాప్తికై, యామె నామెభక్తులు కోరుదురు. ఆమెభక్తులు తమభగవదితరపదార్థమును నాశమొనర్చుమని యామెను కీర్తింతురు. సకలేంద్రియవిషయవాంఛాసమన్వితములగు, స్థూల సూక్ష్మశరీరములను ధ్వంసముచేసి, ఆత్మప్రశాంతి నొసంగు భయంకరకారుణ్యమూర్తియే కాళికాదేవి. అందుచేతనే యామె జగదేకజనని. ప్రతిప్రాణియు నామెసంతతి శరీరములన్నియు దేశకాలనిమిత్తసంజాతములు. దేశకాలనిమిత్తాతీతురాలగు నాసకలైకజననీభావము నెఱుఁగు వాఁడే ధన్యుఁడు, కృతకృత్యుఁడు. ఆమె మారకనృత్యము, మానవుల మర్త్యత్వమునుండి, అమర్త్యత్వమునకు, కాలమునుండి, ఆద్యంతరహితస్థితికిఁగొంపోవును. ఇదియే హిందూమతమహాశాస్త్రమాభిప్రాయము. హిందూమతజ్యోతిలోని ప్రధానకిరణము.

ఈకార్యములన్నిటిని, కాళికాదేవి స్వయముగా సల్పుచుండుట శ్రీరామకృష్ణుఁ డద్భుతముగాఁ జూడఁగల్గెను. మాది మరణభీతిని యించి, నిర్వికల్పసమాధిస్థితింగాంచి, అట్టిస్థితియందుండి, కారు

ణ్యరసపరిపూర్ణయగు కాళికాదేవిచేఁ బ్రపంచ మెట్లావృతమైయున్న దో తెలిసి, బ్రహ్మానందసాగరమున, రాయంచవలె నీఁదులాడుచుండెడి వాఁడు. తానే కాళికాస్వరూపమని, రామకృష్ణుఁడు తన్మయత్వమునఁ దాండవమాడెను. సమస్తప్రాణికోటిచేఁ జేయఁబడు సమస్తకాయిక, వాచిక మానసికకర్మలు, మాతృదేవతాలీలలని యాతఁడు తలంచెను.

నరేంద్రున కీయభిప్రాయము లన్నియు మొట్టమొదట నర్థరహితములుగాఁ గన్పట్టెను. కాళికాదేవి నర్చించువానినిగురువు పిచ్చివిగ్రహారాధకుఁడని యాతఁడు భ్రమించెను. ప్రతివిషయమున నరేంద్రుఁడాతనిఁ గఠినముగాఁ దర్కింప నారంభించెను. కాళీప్రసన్నవదనముచేఁ గల్గునానందముచే నీఁదులాడుబాలునివలె, కాళీదేవి పెంపుడుబిడ్డవలె, పెరుగుచున్న రామకృష్ణునికా కోపము? నరేంద్రుడొక్క ప్రశ్నయడుగునప్పటికి శ్రీరామకృష్ణుని కట్టెదుట కాళికాదేవి ప్రత్యక్షమగుచుండెడిది. ప్రశ్నకు త్తరమొసగుటకు బదులు, నరేంద్రునితో, "నీసంశయములు నీయనుమానములు భ్రాంతిపిశాచములని నాతల్లినాకుఁ దెల్పినది. సత్యము నామాత నాకుఁ దెల్పినది" అని వచించును. కాళికావిగ్రహస్వరూపమును నరేంద్రుని కట్టెదుట కట్టిపెట్టి, జ్ఞాననేత్రములు విప్పి, చూపినంతనే నరేంద్రుఁడు కాళికారాధకుఁడై, దేవతాస్వరూపములందు భక్తిఁ గాంచఁగల్గెను.

---

## పదునేడవ అధ్యాయము.

### దక్షిణేశ్వరము; కాళికానిలయము.

రాణిరాస్మణి, దక్షిణేశ్వరములోని కాళికాదేవాలయస్థాపకురాలు. ఆమె జనులకు రాణియై విలసిల్లెను. పేదలను రక్షించుటలో నామె యభినవాన్నపూర్ణాదేవి. ఆమె మహాధనికసంపన్నురాలు. ముఖ్యముగా నామె కారుణ్యము పల్లెప్రాంతములందు బ్రసరించెను. కొన్ని గంగానదీతీరము లామె పల్లెల కుచితముగాఁ గొనియిచ్చెను. హిందూమతమన్నను, మాతృభూమి యన్నను నామెహృదయము పొంగును. ఎన్నెన్ని సంఘకఠినసూత్రములచే స్వాతంత్ర్యమరికట్టఁబడినను, హిందూవనిత, యెట్టివిశాలహృదయమును, నెట్టిమహోన్నతాశయములను పెంపుసేయఁగలదో ముందు చూచెదము.

రాణిరాస్మణి కాళీసేవకురాలు. కాళికాదేవియందామెకు గలభక్తి యెట్టిదో, కలకత్తాకు నాల్గుమైళ్లదూరముననున్న నుత్కృష్టకాళికాలయము తెల్పును. ఆమె భవనమును, కాళికాలయ సమీపముననే, నిరంతరమాతృసేవకు సౌలభ్యముగా నుండునని కట్టించుకొనెను. అచ్చటనే, కాళికార్చనకై వచ్చుయాత్రికులు, భిక్షుకులు, భోజనములు సేయుటకు వందలకొలఁది వసతిగృహము లామెచే నిర్మింపఁబడెను. కాళికాదేవికి, దైనందినపూజాదికములు, నిర్విఘ్నముగా, మహావైభవముగా జరుగుటకై కొన్ని యెకరముల భూమి, దేవాలయముపేర నామె శాశ్వతనిధిగా దానముచేసెను. ఏక్షణములో వచ్చినను, పేదల కన్న మచట లభించును. ఏనిముసముననైన, యాత్రికులు కాళికాదర్శనలాభమును పొందఁగలరు. ఒక పెన్నిధి యాలయనిర్మాణమునకై వెచ్చింపఁబడెను. మఱొక పెన్నిధి దేవాలయావరణభూమికై వ్యయింపఁ బడెను. వేఱొక పెన్నిధి వఱదవచ్చినపు డాల

యమునకు భంగముకలుగకుండ నదీతీరమున మహాకుడ్య నిర్మాణము నకై దానముచేయఁబడెను.

ఆకాశమునంటు సుందరశిఖరములతో హిందూశాస్త్రానుసార ముగా నాలయము నిర్మితమయ్యెను. దానికిఁ గుడిభాగమున నొక విష్ణ్వాలయమును, నెడమప్రక్క నొక నాట్యమందిరమునుగలవు. ఆల యావరణమునకుఁ బశ్చిమదిశ నొకప్రక్క నారును, నింకొకప్రక్క నారును పండ్రెండు శివాలయములుగలవు. ఈకాళికాలయము హిం దూదేశములోని మహోన్నతాలయములలో నొకటిగానున్నది. ఆల యము వెనుక నొక చతురప్రాకారముగల కాంతారము నలువైపుల వివిధ పుష్పరాజములతోఁ గూడిన వృక్షములతో నలరారుచున్నది. ఆలయావరణములోని వృక్షములనీడల భక్తులు నిరంతరము భజనలు సల్పుచుందురు. ఈరోజులలో దక్షిణేశ్వరము కాళికానిలయముకంటె, శ్రీరామకృష్ణాశ్రమమనియే ప్రసిద్ధిచెందినది. ఈనాఁడు వేలాదియా త్రికులాస్థానమునకువచ్చి, శ్రీరామకృష్ణుని స్మరించిపోవుచుందురు. లక్షలకొలఁది ప్రజలాతని నవతారపురుషునిఁగా నీ నాఁ డర్చించుచు న్నారు. శ్రీరామకృష్ణుఁడు కాళికాదేవిచే నాస్తికాగ్నిని గ్రుంగుచున్న లోకమునకు వేదాంతసందేశము నొసఁగుటకే కల్పితుఁడయ్యెను. యాత్రికులు కాళికావిగ్రహమునకుఁ బ్రణమిల్లి, యటనుండి, అరణ్య మధ్యంబుననున్న యొకవృక్షరాజముకడ కరుగుదురు. ఆవృక్షముక్రింద నొక యున్నతాసన మమర్పఁబడి యుండెను. ఆయాసనముమీఁదనే శ్రీరామకృష్ణుఁడు ధ్యానించి కాళీదేవిని దర్శించి ధన్యుఁడయ్యెను. ఆవృక్షమునకు పంచవటియనిపేరు. ఇచట నైదువృక్షము లమధ్య నొక వటవృక్షమున్నది. శ్రీరామకృష్ణుఁడు కాళికాదర్శనము నొందిన వెనుక నాపుణ్యస్థల మపవిత్రము గాకుండుటకుఁగాఁబోలు, నొకవృక్షశాఖ యాభాగమునఁబడి కప్పియుండెను.

శ్రీరామకృష్ణుఁడు మఱియిద్దఱుమాత్రమే యీవృక్షముక్రింది యాసనముపై ధ్యానింపఁగల్గిరి. ఆయాసనమును భైరవమూర్తి కాపాడుచుండునని వాడుక. ఆమూర్తి వివిధభయంకరరూపములతోఁ గన్పట్టి, అచట ధ్యానించువారలను పరీక్షించుచుండును. శ్రీరామకృష్ణు, నద్వైతవేదాంతగురుండగు తోటపూరియును నతఁ డచట ధ్యానించుచుండ, నెద్దియో యొకశక్తి యాతని కష్టువచ్చుచున్నట్లుగాఁ బొడసూప, రామకృష్ణుఁడే వానిని రక్షించెను. నరేంద్రుఁడు నట్లే పూజించుచుండ నాశక్తి యాతనిని భయపెట్టి బెదిరింపఁగా నాతఁడొకకొఱవి తీసికొని నేల బాదినంతనే యాశక్తి పారిపోయి నరేంద్రునకు మనశ్శాంతి కల్గినది.

పంచవటి కొద్దిదూరములో నొక బిల్వవృక్షముగలదు. దాని క్రింద మఱొక యాసనముగలదు. ఇచటఁగూడ రామకృష్ణుడు ధ్యానించెను. ఈయాసనాధోభాగమం దైదుపుర్రెలు గలవు. శవముమీఁదఁగూర్చుండి ధ్యానించుట హిందూసన్యాసులకు ముచ్చట. పంచవటిబిల్వవృక్షములు ప్రజలచేఁ బుణ్యవృక్షములుగాఁ బరిగణింపఁబడుచున్నవి.

దక్షిణేశ్వర వనవాటికాభ్యంతరమున నఖండప్రశాంతి యాటలాడుచుండును. అచట బ్రహ్మానందగంధములు గుప్పున కొట్టుచుండును. ఏలన నచట రెండాత్మలు భగవంతుని మాతృభావమునఁ బ్రేమించి ముక్తులై, పరంజ్యోత్యంశములై లోకము నుద్ధరించినవి. ఇచ్చట శ్రీరామకృష్ణుఁడు నివసించినమందిర మిప్పటికినిగలదు. ఆమందిరకుడ్యములమీఁద నవతారపురుషుల విగ్రహములును, ఒక క్రీస్తుదేవుని చిత్రమునుగలవు. ఈయాలయమున కెట్టయెదుట గంగానది కవ్వలియొడ్డున శ్రీరామకృష్ణమఠము గలదు. ఇప్పుడిది మహాపుణ్యక్షేత్రమై వెలయుచున్నది.

---

## పదునెనిమిదవ అధ్యాయము.

### గురుచరణస్పర్శ; శ్రీరామకృష్ణ జీవితసంగ్రహము.

నరేంద్రుఁడు శ్రీరామకృష్ణసందర్శనమున కేగినపు డిరువురు మాత్రమే గలరు. కాని, అది యిరువురసంఘటనము గాదు. అది సనాతనాభినవభారతవర్ష జాతీయజీవనరసామృతతరంగిణీద్వితయ సంఘటనము. ఈతరంగిణుల కుపనదులును గలవు. బ్రాహ్మసమాజము ఆర్యసమాజము మున్నగున వభినవతరంగిణిలోనివి. ప్రాచీనసాంప్రదాయసమాజములన్నియు సనాతనతరంగిణిలోనివి. నరేంద్రుఁడు శ్రీరామకృష్ణుని కలసినపుడీ ద్వివిధజాతీయ జీవనములు, విచిత్రముగా నైక్యమై భావిభారతజీవనగంగాస్రోతస్సువలెఁ బ్రవహింప నుంకించెను.

నిగూఢతాత్త్వికావలోకనములతో నఖండసర్వసంగపరిత్యాగదీక్షతో, ననంతసత్యస్థిరీకరణములతోఁగూడిన ప్రాచీనభారతమాతృగర్భసంజాత దివ్యఫలమూర్తియే శ్రీరామకృష్ణుఁడు. ఆధునికవివిధజాతీయాశయములతో నూతననాగరికతాధారభూత శేముషీప్రతిభతో, సనాతనమత నూతనార్థకల్పనాప్రదర్శనములతోఁగూడిన అభినవ భారతమాతృగర్భసంజాతఫలమూర్తియే నరేంద్రుఁడు. ఏతద్ద్వితయప్రవాహసమావేశముతో భావిభారతభాగ్యనిర్మాణదివ్యవాహిని హిందూమతపునరుద్ధరణాధారమై సర్వాంగీకారమార్గమై విలసిల్లెను

సమస్తాద్వైత వేదాంతసారము రూపుదాల్చినదో యన్నట్లుదయించిన శ్రీరామకృష్ణుఁడు, సకలాభినవజీవనవిధానవిశేషజ్ఞాన తేజఃపుంజమో యనునట్లావిర్భవించిన నరేంద్రుఁడు, వీ రిరువురు నేకమై నాస్తికాగ్నితాపతప్తంబులై యెండి బీటలువాఱి జీవనరహితములయిన సర్వదేశమానసక్షేత్రముల నవజీవనామృతమయవాక్యబిందుసందో

హాముచే నింపి, అఖండజ్ఞానోపదేశకమలరాజములచే నలంకరించి, యపారపరిశాంతియుతాత్మైక్యవాళములచే నలవరించి, దివ్యవేదాంతసందేశసత్ఫలసంభవకారకులై లోకైకజీవనాధారులై వెలుంగొందుట భగవత్సంకల్పసిద్ధియేయని నమ్మవచ్చును. పాశ్చాత్యపాపవిషయవాంఛానలము నార్పివైచుటకు భారతదేశపరానుసరణదాస్యశృంఖలములం దెగనఱుకుటకు, ప్రత్యేకమతాభివేశాఖండగర్వపర్వతముల నుఱుమునుసిచేయుటకు, సనాతనహిందూతత్త్వవినాశకరబీజంబులనదమదంబు చేయుటకు శ్రీరామకృష్ణనరేంద్రులు మేళవించిరి.

ఈసమావేశహేతుభూతుండు నరేంద్రుని చుట్టమగు రామదా "బైలే! నిక్కముగా మతమును నీవు తెలియఁగోరుదేడ బ్రాహ్మసమాజాదికములకుఁ బోవనేల? దక్షిణేశ్వరములోని శ్రీరామకృష్ణుకడకరుగుము"ని బోధించెను. ఆమాటపట్టుకొని నరేంద్రుఁడు శ్రీరామకృష్ణుని సందర్శించెను. నరేంద్రునివిగ్రహము జూచుటతోడనే శ్రీరామకృష్ణుఁడు పేదవాఁడు పెన్నిధిగన్నట్లు సంతసించి యాతని నత్యంతప్రీతిపూర్వకముగా నాహ్వానించి యొకపద్యమును చదువుమనెను. అంత నరేంద్రుఁడు,

"గీ. చంచలంబగు నీమనః ప్రపంచమందు
నిరతదేశీయువలె నీవ దేలతిరుగ
మఱలు! మఱలుము! నీయాత్మమందిరమును
హృదినినైర్మల్యరత్నంబు పొదివినునస !"

యను చరణములు వీణానినాదమధురకంఠస్వరముతోఁ గీర్తింపనయ్యది శ్రీరామకృష్ణుని నాగస్వరము సర్పరాజమును బంధించురీతి మోహింపఁజేసెను. బ్రహ్మానందముప్పొంగిపడి యానందోద్రేక సంజాత బాష్పబిందువులు నేత్రగోళములనుండి జాలువార నిర్భరపరితోషమాస్యమునకు జీవకళప్రసాదింప "బాలుఁడా! బాలుఁడా! అనేక

వత్సరంబులనుండి నీకొఱకు నేను వేచియుంటిని. తుట్టతుదకు నాయ నేకజన్మార్జితతపఃఫలంబుగా నీ వరుదెంచినావుసుమీ” యని రామ కృష్ణుఁడు వివశుఁడై వచించెను. వివశత్వమునుండి తెప్పిఱిల్లి మఱల నాతఁడు “నరేంద్రా! చాలాకాలము నీకొఱకు వేచియుంటిని. ఇంత యాలస్య మేలచేసితివి ? తుచ్ఛప్రాపంచికవిషయలుబ్ధులతో మాటా డుటచే నాపెదవులు మండినవి. అయిన నింక నీతోఁ బ్రసంగించి యా యగ్నిని చల్లార్చెద”నని కరుణాపూరితుఁడై యాతఁడు వచించెను.

శ్రీరామకృష్ణునిపాదసన్నిధిని కొందఱు వృద్ధులు, యువకులు, బాలుర మొత్తమిరువదిమంది కలరు. వీరిలో నరేంద్రుఁ డిదివఱకే కొందఱ నెఱుఁగును. నరేంద్రుని కిదియొక నూతనప్రపంచముగాఁ గన్పట్టెను శ్రీరామకృష్ణుఁ డొకపిచ్చిమనుష్యుఁడనియు నాతనిశిష్యు లును పిచ్చివారలై మూర్ఖవిశ్వాసలోలురై యాతని సేవించుచుండిరని యు నిశ్చయించుకొనెను. అయినను శ్రీరామకృష్ణునిసాన్నిధ్యమున నాతఁడు పాడినపు డెద్దియో యొకవిశుద్ధజీవనతరంగ మాతనిహృద యమును వెఁ బ్రసరించెను. పాటపాడినంతనే శ్రీరామకృష్ణుఁడు బ్రహ్మా నందపరవశుఁడగుట, దేహస్మృతిని వీడుట, మఱల స్మృతిఁదెచ్చికొ నుట, ఆతని అనన్యసాధారణప్రేమపూరితవాక్యములందలి కల్మష రాహిత్యము శిష్యబృంద మాతని దేవునిఁగా నర్చించువిధానము నివ న్నియు నాతని కర్థము కాలేదు.

ఈయంశమునే తలఁచి వివేకానందుఁడు శిష్యుల కిట్లు చెప్పెను. “ఆసమయమున రామకృష్ణుఁ డెంతపిచ్చివాఁడో కదా యనుకొంటిని. రామదా ! నన్ను పిచ్చివానియొద్దకా పంపినది ? ఆతఁడు భ్రాంతిమతి కాదనుట కొక్క హేతువు నా కగఁబడలేదు కాని నాహృదయ మాతనిచే నాకర్షింపఁబడెను. ఆతని పిచ్చితన మత్యచ్ఛమము ఆక

ర్షణశక్తియు నద్భుతము. ఆతని కారుణ్యము నద్భుతము. ఆతనియద్భుతజీవప్రవర్తన నన్ను మూకవానిఁగాఁ జేసివైచినది.”

శ్రీరామకృష్ణు నొద్ద సెలవుతీసుకొనుచు మఱలఁ దాను దర్శనము చేసెదనని చెప్పి వెడలి వేఱొకసారి నరేంద్రుఁడు తన బ్రాహ్మసమాజసభ్యులతో నరుదెంచెను. మఱల శ్రీరామకృష్ణుఁడు పాటబాడుమనెను. గానము విని శ్రీరామకృష్ణుఁ డానందపక్షముల మీఁద, నాత్మైకభావమున కెగిరిపోయి “చూడుఁడు. సరస్వతీజ్యోతి యాతని ముఖమునుండి యెట్లువిస్ఫురత్కాంతులతోఁ బ్రకాశించుచున్నదో” యని వచించెను. సభ్యులందఱు స్తబ్ధులై యూరకుండిరి. అంత శ్రీరామకృష్ణుఁడు, “నిద్రించుసమయమున కాంతిగోళము నెన్నఁడైనఁజూచి యుంటివా”యని ప్రశ్నించెను. నరేంద్రుఁడు జరిగినయుదంతమంతయుఁ జెప్పినవిని, శ్రీరామకృష్ణుఁడు “ఇది యథార్థము. ఈతఁడొక ధ్యానసిద్ధుఁడు. భగవద్ధ్యానమే యీతని నిద్ర” యని వచించెను.

తోడిమిత్రులందఱు, రామకృష్ణుని విచిత్రవాక్యములను విని హేళనజేయ నారంభించిరి. కాని నరేంద్రుఁడు తీవ్రసంకల్పుఁడై మహర్షి దేవేంద్రనాథుఁడు “నీనేత్రములు యోగినేత్రములనుట” జ్ఞప్తికిఁ దెచ్చికొని, “వీరిరువురు వచించిన మాటలు సత్యములా? లేక శ్రీరామకృష్ణుఁ డొకపిచ్చివాఁడు, మహర్షియొక యాత్మవంచితుఁడు నయియుందురా” యని తర్కించుకొనెను.

కాని శ్రీరామకృష్ణుఁడు నరేంద్రునవ్యాజానుకంపాంతరంగముతోఁజూచెను. కన్నతల్లియైననట్లాతనిఁ బ్రేమించియుండ లేదు. బ్రాహ్మసమాజమందలి మహాప్రవక్తలగు కేశవచంద్రసేనుఁడువంటి వారుకూడ నాతని శిష్యభావముతోఁ గొనియాడుట నరేంద్రుని కాశ్చర్యమును గొల్పెను.

శ్రీరామకృష్ణుఁడు 20-2-1834 వ సంవత్సరమున, నొకదరిద్ర బ్రాహ్మణవంశమున నొకపల్లెటూరిలో జనించెను. బాల్యమునుండి యాతఁ డద్భుతభాగవతదృష్టిం బ్రదర్శించెను. పదునొకండవవత్సరముననే లోకమంతయు భగవద్రూపమై యాతనికిఁ గన్పట్టెను. చిన్ననాఁటనొక నాటకప్రదర్శనమును జూచి ఋషీశ్వరుల, సన్యాసుల పాత్రల నాతఁడు గ్రామస్థులకు వినిపించి వారల నానందపరవశులఁ జేయువాఁడు. పదునెన్మిదవ వత్సరమున దక్షిణేశ్వరములోని కాళికాలయార్చకుఁడుగా నియమితుఁడై అర్చనాదికమును మఱచి, కాళికాధ్యానము బ్రతుఁడై యుండువాఁడు. రాణిరాస్మణి యల్లుఁడగు మధురబాబు, వాని ధ్యానముమెచ్చి ఒక ప్రత్యేకమందిర మాతనిధ్యాననిమిత్త మేర్పాటు చేసెను. తల్లి తనకుఁ గన్పట్ట లేదని యాతఁడధికవిచారముచే కృశించి నేలఁ బడి బాలునివలె నేడ్చి పొరలినదినముసము లనేకములు గలవు. దేవాలయములోని గంటమ్రోత యాతని హృదయమునకు లోకమును స్వర్గతుల్యముగా మార్చును. సేవకునిగాఁ, బ్రేమపాత్రునిఁగా, భక్తునిగాఁ, బుత్రునిఁగా, నాతఁడు కాళీదేవిని ప్రార్థించెను.

శ్రీరామకృష్ణుని మానసికశక్తు లత్యద్భుతములు. స్పర్శమాత్రముచే, నవలోకనమాత్రముచేఁ దనహృదయస్థంబులగు విషయముల నాతఁడితరులకుఁ దెలియఁజేయును. అన్యమానసమెట్టిదో, వస్తువులఁ జూచునట్లాతఁడు చూడఁగలఁడు. వివేకానందుని శిష్యులు, సహాధ్యాయులునైనవారిని, రామకృష్ణుఁడు తన మనోదృష్టిచేఁ బరీక్షించియే యంగీకరించెను. భగవద్విషయమగు నొక్క పాటగాని, మాటగాని, యాతనికి బ్రహ్మానంద మొడఁగూర్చును.

ఆతని భాగవతదృష్టిచూండి మరల్ప బంధువు లాతనికి వివాహముచేయఁగోరిరి. కన్యానిశ్చయమే కాని, స్త్రీపురుష సంపర్కమేమియు లేకపోయినను, వరునిప్రాపంచికదృష్టికిష్టమార్గము వివాహ

మని కొందఱు నమ్ముదురు. యుక్తవయస్సువచ్చిన వెనుక రామకృష్ణుని భార్య శారదాదేవి, తనభర్త పిచ్చివాఁడయ్యెనని విని, తనబంధువర్గము వెంటనిడుకొని, దక్షిణేశ్వరమున కరిగెను. ఆమెను చూచినంతనే రామకృష్ణుఁడు, "తల్లీ !" యని పిలచెను. ఆమె యథార్థమును గ్రహించి, యాతనిశిష్యకోటిలోఁ జేరి సేవచేయుట కియ్యకొనెను.

తరువాత శ్రీరామకృష్ణుఁ డామెను కాళికామాతృభావముచేఁ బుష్పములచేఁ బూజించువాఁడు. భర్తృహృదయముఁగాంచి, సర్వసంసారపరిత్యాగబుద్ధిం జేసి, భగవదర్పణబుద్ధితో భర్తృసేవైకపరతంత్రయై, జీవితము వ్యయింప నిశ్చయించికొనిన యామహాదేవిపాతివ్రత్య మెట్టిదో యెవరు నిర్ణయింపసమర్థులు ? హిందూయథార్థవివాహోద్దేశ మదియేకదా ! భూషణములకుఁ గాదు. ఆస్తికై కాదు. భోగమునకుఁ గాదు సేవచేయించుకొనుటకుగాదు.

శ్రీరామకృష్ణుఁడు వచించినట్లు, నరేంద్రుఁ డాతని సమీపించునప్పటికే, తాత్రివికసంపుల్లాంభోజమై యుండెను. శ్రీరామకృష్ణజ్ఞానమకరందయోగసువాసన లాకసులమందు ప్రవేశించెను. కాని మొట్టమొదట గృహోపరిభాగమున నిల్వఁబడి, కన్నీరు కాల్వలుగట్ట, "తల్లీ ! నాకు శిష్యు లెవర"ని రామకృష్ణుఁడు విలపించుచుండువాఁడు. నరేంద్రుఁడు ప్రధానశిష్యుఁడైనపుడు, శ్రీరామకృష్ణునిహృదయ మెంతయుప్పొంగెనో వర్ణింప నెవరిశక్యము ?

నరేంద్రుఁడుమాత్రి మప్పుడప్పుడు సందేహచకితుఁడగుచు నొకొక్కతఱి, "ఇదంతయు నసహ్యాము. ఈముదుసలి, తనకాళి యబద్ధమని పల్కు దినము వచ్చితీరున"ని తలఁచుచుండెడివాఁడు. కాని నరేంద్రుని కాతని సముఖమును వీడుటకు శక్తిలేకపోయెను. మూఁడవసారి నరేంద్రుఁడు గురుసన్నిధికేగినపుడు, పాటపూర్తియయిన వెనుక

నమందావేశపరవశుఁడై, శ్రీరామకృష్ణుఁడు నరేంద్రుని దూరముగాఁ గొనిపోయి యేకాంతముగా నిట్లు చెప్పెను. "చూడుము! నీయందు శివుఁడున్నాఁడు, నాయందుశక్తి యున్నది ఈరెండు నొకటే" అది విని, నరేంద్రుఁడు చిఱునవ్వునవ్వి, "ఇదంతయు హేతురహిత మౌర్ఖ్యమ"ని తలంచెను.

తరువాత వా రిరువురుకలసి రామకృష్ణునిమందిరములోని కేగిరి. శిష్యులు భగవద్గానము సల్పిరి. సాయంసమయమయ్యెను. పరిపూర్ణప్రశాంతి యావరించెను. రామకృష్ణుఁ డాసనమువీడి, నరేంద్రునొద్దకు వడివడి చని, తన దక్షిణహస్తము నాతని గుండెమీఁదఁ బెట్టెను.

ఇఁక నరేంద్రుఁ డేమయ్యెను? మందిరము, ప్రాంగణములు, ఆలయము, దక్షిణేశ్వరవనము, శిష్యులసమూహములు, గురువిగ్రహము నాతని కదృశ్యములయ్యెను. శరీరస్మృతి నరేంద్రునికిఁ బూర్తిగా దగ్ధమైపోయినది. అట్టి ఘోరభయంకరస్థితిలో నరేంద్రుఁడు, 'ఏమిజరుగుచున్నది. నన్ను నీవేమిచేయుచుంటివి. నాకింటఁ దల్లిదండ్రులు గలర'ని గద్గదకంఠముతోఁ బల్కెను. ఈమాటపలికి, నరేంద్రుఁడు మూర్ఛితుఁడై, మఱల కొంతసేపటికి లేచి, గాఢసుషుప్త్యవస్థనుండి మేల్కొన్నవానివలె కన్నులు తెఱచి, తన్నుఁదానే నూతనపురుషుగా భావించెను. మరణించి నూతనజన్మమెత్తిన ట్లాతనికిఁ దోఁచెను. అట్టి మూర్ఛావస్థలో నేమిజరిగెనో నరేంద్రునకు నెన్నఁడు తెలియలేదు. తరువాత కొన్నినాళ్ళకు రామకృష్ణుఁడు తనశక్తి అఖండజీవశక్తియనియు, దాను పిచ్చివాఁడు కాడనియు, నరేంద్రునకుఁ దెల్పు నిమిత్తమే యట్లు జేసియుండెనని తెలియవచ్చెను. ఆనాఁడు మొదలు నరేంద్రునిహృదయములోని సంశయములు నాశమై, ప్రాపంచికదృష్టి భగ్నమై, తార్కికసీమ తగులబడి, యథార్థదృశ్యమాతని యెట్టయె

దుటఁ గన్పట్టె, నిశ్చల నిర్వికల్పసమాధిరుచిని చూపెను. ఆనాఁడు మొదలిడి, నరేంద్రునిహృదయము శ్రీరామకృష్ణుని వశమైపోయెను. శ్రీరామకృష్ణుఁడు కరస్పర్శమాత్రముచే నెట్లు మోక్షపదవి చూపెనో, యాతఁ డెట్టి భగవదంశాసంభూతుఁడో తెలియనగును

దక్షిణేశ్వరసమీపమున, గంగాతీరమున, భగవన్నామస్మరణమునకుఁ దాళము వేయు నడుగులిడుచు, సకలేంద్రియముల నాత్మావలోకనమందు నియమించి, నడచుచున్న శ్రీరామకృష్ణునిమూర్తి యత్యంతము దర్శనీయంబై వెల్గొందుచుండెను.

పంచవటివృక్షసమీపమునఁ, బూర్ణచంద్రచంద్రికలలో నిరువదేండ్ల బాలుఁ డాత్మనిక్షేపముచే నశాంతిప్రబలి, యథార్థజ్ఞానార్జనప్రయత్నములో సంశయావృతాంతరంగుండగుచు, శ్రీరామకృష్ణవాక్యవిమర్శనానందములో, "ఈతఁ డెవరు? ఎట్టివాఁడై యుండు" నను ప్రశ్నావిముఖమున ముడులువెట్టఁ, దిరుగాడుచుండెను. శ్రీరామకృష్ణుఁ డవతారపురుషుఁడని కొందఱు, బ్రహ్మర్షియని కొందఱు, బ్రహ్మానందైకరసాస్వాదియని కేశవచంద్రసేనుఁడు వివిధరీతుల వర్ణించియుంట నాబాలుఁడు గ్రహించెను. "ఎంతపిచ్చివాఁడైనను నన్ను గతస్మృతునిగాఁ జేయగల్గిన యీతనిశక్తి యెట్టి"దని యాతఁడు తర్కింపనారంభించెను.

ఒకనిముసములో శ్రీరామకృష్ణనరేంద్రు లిరువురు కలసి, కాళికాలయముఁ జొచ్చిరి. శ్రీరామకృష్ణముఖోద్భూతభగవద్భక్తిగాననాదములు బయల్వెడలి, ఆలయమును చైతన్యప్రకాశవిస్ఫురితంబొనర్చెను. భజనానంతరము, పంచవటివృక్షచ్ఛాయాప్రస్థితాసనమును జేరి నరేంద్రుఁడు రామకృష్ణునిఁ గూర్చి యిట్లుగా ధ్యానింపనారంభించెను. "అనేక వత్సరవిష్ణ్వారాధనానంతరము వరప్రసాదియై జన్మించుటచే నాతనికి గదాధరుఁడని పేరిడిరి. సన్యాసాశ్రమస్వీకార

సమయమునఁ దోటపూరిగురూత్తముఁ డాతనికి రామకృష్ణనామ మొసఁగెను. కొలఁదిగాఁ జదువుట, వ్రాయుటకన్న నాతని కెక్కు-డెద్దియుఁ దెలియదు. అయినను, చిన్ననాటనే ఆధ్యాత్మికదృష్టి యాతనికి జన్మహక్కు-గాఁ బరిణమించెను. దినదినము బాలురఁబిలచి, రామభజన మెట్లుచేయువాఁడో కదా! ఆతనియసమానభక్తి పారవశ్యమును నిరీక్షించి, గ్రామస్థులు బాష్పనయనులై, యాతనిఁజూచుట కెట్లేగుచుండువారో కదా! ఘోరదరిద్రదేవతాపీడితుఁ డయ్యు, నాతఁ డెట్లతిథిసత్కారము తాను తినుటమాని చేయుచుండెడివాడో కదా!" శ్రీరామకృష్ణుఁ డంత నాలయమునుండి బయలుదేరి, పంచవటివృక్షముక్రిఁది నరేంద్రునిఁగాంచి, పొందినయానందమునకు హద్దు లెవ రేర్పరుపఁ గలరు?

అంత నరేంద్రుఁడు మఱల నిట్లు ధ్యానించెను; "శ్రీరామకృష్ణుని తండ్రి చనిపోయెను. పుత్రులు కలకత్తా చేరిరి. కాళికాలయనిర్మాణము పూర్తియయినది. రామకృష్ణునగ్రసోదరుఁ డర్చకుఁడుగా నియమింపఁబడెను. తరువాత రామకృష్ణుఁడే యర్చకుఁడయ్యెను. ఆతని యౌవనజీవితము పూర్ణముగా మారినది. బాలుఁడు భక్తుఁడై, భక్తుఁ డుగ్రసాధకుఁడై, సాధకుఁడు సన్న్యాసియై, యథార్థనిర్ణయైకబద్ధకంకణుఁడై, లోకైకప్రవక్తయై, బ్రహ్మైక్యమందినాఁడా ? ఆతనిభక్తి యెంతయద్భుతము, మాతృనామస్మరణమాత్రమున దేహాభిమానము నమసి, తన్మయత్వస్థితిం గాంచు మహాభాగ్యవంతుఁ డాతఁడు, పిచ్చివాడని బంధువులు, పెండ్లిచేసియుండిరే! ఆతనికి వివాహమాడినమాట జ్ఞప్తియందు లేదే! యోగకన్యకనే పరిణయమాడినాఁడా! ఆతఁడుచేసిన యొకసాధన సల్పుటకితరులకు వేయిజన్మములు చాలవే! ఆతఁడు గుడిలో నుండఁ గలఁడా ? గంగాతీరమున నొక చిన్నకుటీరము నిర్మించుకొనెనా? ఆకుటీరములో నాతఁడు

తపించెను. జపించెను. మాతృదర్శనము కాలేదని విలపించెను భగవ ద్దర్శనము కాలేదని కృశించుచుండ, హృదయ్ అన్నము నోట బల వంతముగాఁ జొప్పించుచుండెనా! అట్టిసమయమున నాతనిమానస మున నెట్టి యోగాగ్ని ప్రజ్వరిల్లినది! ఆతని నేత్రగోళము లెల్లు మి ర్మిట్లుగొల్పు కాంతితో వెల్గొందెను. ఆత్మాగ్నిజ్వాలచే నాతనిశరీర ము క్షీణించి, యెట్టితీవ్రజ్వరములకుఁ దావైనది." యని తలఁచు చుండఁ, దుచ్ఛశరీరాటంకము చేఁగల్గిన దుఃఖతరంగములఁ దలంచుటచే నరేంద్రుని కాయము వణక నారంభించెను.

మఱల నరేంద్రుఁడు గురుధ్యాన మారంభించెను; "ఇట్టిసం దిగ్ధావస్థలో బ్రాహ్మణినామక బ్రాహ్మణసన్యాసిని, యాతనికడ కరు దెంచినదా! ఆమె సర్వసంగపరిత్యాగ మొనర్చిన పార్వతీవిగ్రహము వలె నుండెనా! శ్రీరామకృష్ణుని చరణసేవ నిశ్చయించుకొనెనా! భగవద్భక్తిపారవశ్యముచే శ్రీరామకృష్ణుఁడు పిచ్చిపట్టినట్లుండుటామె గ్రహించెను. ఆతఁడు శరీరమును గాపాడమఱచెను. ఆత్మధ్యానము గాంచఁగల్గుచో శరీరమేమైన నేమనియా? కాళీదర్శనాభావముచే విలపించుచున్న యాతని నాబ్రాహ్మణి యోదార్చెను. పూర్వము, రాధ, చైతన్యులు, మాత్రమే యట్టి భగవద్వియోగభారముచే ననంతముగా విలపించిరని యామె చెప్పినది. తనజీవితగమ్యస్థానాశ యము నాతనికి బోధించి బ్రాహ్మణి వెడలిపోయినదా! ఇట్టిస్థితిలో నున్న నరేంద్రునివిగ్రహము చూచి, శ్రీరామకృష్ణుఁడు చిత్రప్రతిమ వలె నిలఁబడెను. నరేంద్రునిఁగదల్ప యత్నింప లేదు.

మఱియు నరేంద్రుఁడిట్లు ధ్యానింప నారంభించెను; "బ్రాహ్మణి వెడలిన వెనుక, తోటపూరిగురూత్తముఁ డరుదెంచెను. తోటపూరి దిగంబరసన్యాసి, ప్రపంచము కల్లయని తలఁచి యాతఁడు యాత్ర చేయుచుండెను వర్షాతపంబు లాతనికి సమానములు, పచ్చికబయళ్లా

తని పరుపులు, భోజనము యథాప్రాప్తి, "వంగదేశమున కరుగుము. అచ్చట నీవొకపురుషునికి మోక్షవిద్య నొసంగఁగలవ"ను నొకవాణి విని, యాతఁడు శ్రీరామకృష్ణునికడ కరుదెంచెను. మూఁడుదినముల కన్న నెచటనుండని యాతఁడు దక్షిణేశ్వరమునఁ గొన్నిమాసములున్నాఁడు. అద్వైతానుభవజ్ఞానముండుట కాతనికి నలుబది వత్సరములు పట్టెను ఆయద్వైతము నాతఁడు రామకృష్ణునికి బోధించెను. శ్రీరామకృష్ణుఁడద్దానిని మూఁడుదినములలోనే గ్రహించెను. రామకృష్ణు నద్భుతతాత్త్వికదృష్టికి తోటపూరి విస్మితుఁడై, యాతనినిర్వికల్ప సమాధ్యవస్థ నిశ్చలమగునదో కాదోయని అనేకసారులు కొట్టెను. శ్రీరామకృష్ణుఁడు చలించలేదు.

శ్రీరామకృష్ణుఁడు దివ్యాద్వైతతత్త్వము ననుభవించి, తానే తోటపూరికి గురువై, కాళికార్చనావిధానము నాతఁడు సమగ్రముగా బోధించెను. రామకృష్ణుఁడొకసిద్ధపురుషుఁడని గ్రహించి, తనబోధన లాతని కనవసరములని వెడలిపోయెను. శ్రీరామకృష్ణపారిజాతము సర్వకళాశోభాయమానమై వికసించెను. ఇఁక నామకరందము నానుశక్తిగల మధుపంబు లాతనిఁ జేరనారంభించెను; హిందూమహామ్మదీయతాత్త్వికచక్రవర్తు లరుదెంచి, యాతనిప్రభావముఁజూచి ముగ్ధులై వెడలిరి. గౌరీపండితుఁడు, పద్మలోచనుఁడు, వైష్ణవచరణుఁడు, శశధరతర్కచూడామణి, కేశవచంద్రసేనుఁడు, ప్రతాపచంద్రమజుందారుఁడు, విజయకృష్ణగోస్వామి, స్వామిదయానందసరస్వతి, నాగమహాశయుఁడు, మున్నగు నఖండయశోధురీణు లరుదెంచిరి. హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, కవీశ్వరులు, మహాపవిత్రులు, తత్త్వవేత్తలు, ఆచార్యులు, ప్రజానాయకులు, ధనికులు, నిర్ధనులు, స్త్రీలు, బాలురు, శ్రీరామకృష్ణ సందర్శనార్థ

మై, శ్రీరామకృష్ణ హృదయవికసితకుసుమసుగంధములచే నాకృష్టులై, వచ్చి, యాతనిబోధనామృతమును చవిచూచి, ధన్యులై వెడలిరి.

తుట్టతుదకు నరేంద్రుఁడును వచ్చెను. ఆనరేంద్రసమాగమనమాత్రమే లోకము నుద్ధరించెను ఎన్ని వేలజను లెంతెంతటివారురాలేదు? నరేంద్రుఁడే లోకోద్ధరణహేతుభూతుఁడు కానేల? శ్రీకృష్ణుఁడు వచించియుండలేదా?

శ్లో॥ మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతిసిద్ధయే,
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః॥

అస్ఖలితబ్రహ్మచర్యవ్రతదీక్ష సముగ్రముగాఁ గైకొని, యింద్రియమదంబు నదమదంబుచేసి, వాంఛానలము నార్పివైచి, జీవితాశయములకుఁ జిచ్చుపెట్టి, సర్వసంగపరిత్యాగముచే నిశ్చలుఁడై, కష్టపరంపరలఁ బ్రార్థించి నెత్తినిడుకొని, విశుద్ధతైకైశ్వర్యసర్వస్వుఁడై మోక్షపదైకగమ్యస్థానుఁడై, జీవయాత్రసల్పిననరేంద్రునకుఁ గాకున్న, యితరుల కట్టిభాగ్య మెన్నిజన్మములకైనఁ బట్టునే? నరేంద్రుఁ డావిధముగా, శ్రీరామకృష్ణజీవితచరిత్రాదికచింతానిమగ్నుఁడై, యెట్టకేలకు నేత్రములు తెఱచి, బ్రహ్మానందరస ముప్పొంగుచున్న వదనముతో నుండ, శ్రీరామకృష్ణుఁ డెట్టయెదుటనిల్చి "నరేన్ రమ్మ"ని పిలచి, వెంటనిడికొని బిల్వవృక్షమును సమీపించి, యిరువురు నచలధ్యానయోగములో స్థిరులై యుండిపోయిరి.

---

## పందొమ్మిదవ అధ్యాయము.

## శ్రీరామకృష్ణునిఁ గూర్చి యన్యాభిప్రాయములు.

ప్రాచీనహిందూసాంప్రదాయముల కతివిరుద్ధముగు బ్రాహ్మసమాజములోనుత్కృష్టత వహించిన నాయకోత్తములు, శ్రీరామ

కృష్ణుని నిష్కల్మష చిత్తముతోఁ గీర్తించుటమాత్ర శ్రీరామకృష్ణుఁ డెట్టి విశాలహృదయుఁడో చెప్పనవసరము లేదు. శ్రీరామకృష్ణు నవితరాత్మ్యత్మపరిభావ మెట్టివారలను వినమితశిరస్కులం జేసెను. బ్రాహ్మసమాజోద్ధారకులలోఁ గేశవచంద్రసేనుని విడిచినచోఁ బ్రతాపచంద్రమజూందారును మించినవ్యక్తి మఱియొకఁడు లేడు 1899 సంవత్సరమున అక్టోబరుమాసపు టాస్తికపత్రికలో నాతఁడు శ్రీరామకృష్ణునిఁగూర్చి యిట్లు ప్రసంగించి యున్నాఁడు.

"ఎప్పు డెచటనున్న నఖండజ్ఞాన తేజఃపుంజములఁ బ్రసరింపఁ జేయు నామహాత్ముని దివ్యవిగ్రహము నాకు నిత్యము గాన్పించుచునే యున్నది. ఆమహాత్ముని దర్శనమాత్రభాగ్యముచేఁ గల్గు ననిర్వాచ్యానందమునిఁ దిమోహము నాకింకను తగ్గలేదు. మాకిరువురకు గలవ్యత్యాస మేమి? నవనాగరికతచేత, నాత్మప్రౌఢిమచేత, సంశయాస్తికతచేత, విజాతీయాశయాశ్రితబుద్ధిచేతఁ బాశ్చాత్యతుల్యుఁడను నేను ; విద్యాభ్యసనములేక, నాగరికతాస్పర్శలేక, సాధారణవిగ్రహారాధకుఁడై, దారిద్ర్యక్లేశ్వరుఁడైన హిందూభక్తుఁడాతఁడు. డిశాలీ, ఫాసెట్టి, స్టాన్లీ మాక్సు ముల్లర్ మున్నగు పాశ్చాత్యకుశాగ్రబుద్ధుల యాశయములలో నిమగ్నుఁడనై, క్రైస్తవబోధనల నతిగౌరవించుచు క్రీస్తుమతవ్యాపకులకు నెచ్చెలినై, తీవ్రతమబ్రాహ్మసమాజ సభ్యుఁడ నగునేను, గంటలకొలఁది కాలము శ్రీరామకృష్ణుని వాక్యములచే మోహితుఁడనై పడియుండుటెందులకు? నేనేకాను. వందలకొలఁది నాబోంట్లీరీతినే మోహితులైరి. వేలకొలఁది శ్రీరామకృష్ణుని పాద సన్నిధిని సేవించిరి. లక్షలకొలఁది యాతని దర్శనలాభమునకై వేచి యుందురు. తుచ్ఛశేముషీగర్వోన్మత్తచిత్తులు కొందఱాతని నిందింపవచ్చును. పాక్షికబుద్ధి ప్రేరితులగు కొందఱు క్రీస్తుమతసందేశకు లాతని దూషింపవచ్చును. వారియభిప్రాయము నామూలాగ్ర

ముగ విమర్శించియే, శ్రీరామకృష్ణునిఁ గూర్చి యిట్లువచింప సాహసించెదను.

"ఈమహాత్మునికి ముప్పదేండ్లువయస్సు. బ్రాహ్మణుఁడు. దృఢకాయుఁడే. కాని, యోగసాధనలచే నాతనిశరీరసౌష్ఠవము వీఁగిపోయినది. ఐన నాతని మృదుల బాలహృదయము, నాతని నిస్తులనిరాడంబరత్వము, నాతని యనిర్వాచ్యరూపమాధురి, యాతనిముఖమున బ్రహ్మానంద చిద్విలాసరసముల చిందించుచుండును. సాధారణముగ హిందూసన్యాసులకుండు జాతిమతభేదములు, శాస్త్రోక్తనిత్యవిధులు, రహస్యజ్ఞానవైఖరి, పవిత్రైకాన్మత్య దురభిమానము నివెవ్వియు నాతనికి లేవు. వస్త్రాహారము లాతని కపరిధానములు. నేను గురువును బోధకుఁడ ననుభావమాతని కావంతయు లేదు. కాని ప్రాపంచికవిషయలోలురను, నింద్రియబద్ధులను, నాతఁడొకించుక దూషించును. ఆతని మతమేమి? ప్రాచీనహిందూమతమే కాని, విచిత్రముగానుండును. ఆతఁడొకే దేవత నారాధించువాఁడు కాఁడు. శైవుఁడుగాఁడు, శాక్తేయుఁడు కాఁడు, వైష్ణవుఁడుగాఁడు, వేదాంతియుఁగాఁడు, ఆతఁడు సకలమతదేవతార్చకుఁడు. శివభక్తుఁడాత డే, శ్రీరామభక్తుఁడాతడే, కృష్ణభక్తుఁడాతఁడే, అద్వైతియు నాతఁడే, అన్నిమతములలో నిజ్ఞాన, భక్తి ప్రార్థనావిధానముల నాతఁడారాధించును. విగ్రహారాధకుఁడైన, నద్వితీయపరబ్రహ్మవాదియు నాతఁడే. ఆతని విగ్రహారాధనము, సామాన్యులకువలె హారతులతోడను, నైవేద్యములతోడను, పుష్ప గంధాక్షతాదికములతోడను, పూర్తికాదు. నిర్వికల్పసమాధియే యాతని మతము. ఆత్మావలోకనమే అర్చన. ఈభావములతో నాతనిహృదయము పరిభ్రమించుచుండును. ఆతఁడు మాటాడఁ గోలఁడి, ఆత్మజ్ఞానాగ్నిఁ డింకిన స్త్రీ[illegible] [illegible] ఉడచుఁడను. ఆతనికి శ్రమయుండదు. [illegible] నాతనిముఖము, కాంతివంతమగను.

ప్రతి హిందూదేవతయు నాతని యుద్దేశములో నొకశక్తిస్వరూపము, సమస్తదేవత లాయనంతశక్తి నిర్ణయైకసాధనములు.

"ఆతని శివార్చనచూడుడు, యోగధ్యాననిమగ్నావతార స్వరూపమే శివుడు. సమస్తప్రాపంచిక భోగవిసర్జనముచే నిశ్చలధ్యాన సమాధ్యర్పితహృదయుడై, హిమాలయమువలె కంపములేక నుండు మౌనిరాజస్వరూపుడే శివుడు. ప్రాపంచిక సుఖదుఃఖములే సర్ప రూపమున నాతనిశరీరమును చుట్టుకొనియు నాతని నేమియుఁ జేయఁ జాలవు. ఆతఁడు మృత్యుంజయుఁడు, నిర్భయుఁడు, సమస్తలోకభార ము లాతనివి. లోకుల కమృతత్వప్రాప్తినొసంగ నాతఁడు హాలాహ లము ద్రింగెను. భస్మము, చర్మము లాతని యాభరణసర్వస్వములు. ఈవిధమగు శివస్వరూపమును ధ్యానించి, శరీరస్మృతిమఱచి, చాల కాలమాతఁడుండఁగలఁడు.

"శ్రీకృష్ణుఁడు ప్రేమావతారుఁడని రామకృష్ణుఁడు పూజిం చును. సామాన్యముగాఁబ్రజలు చిత్రించు కృష్ణునిముఖముచూడుఁడు. అది స్త్రీముఖమా ? పురుషముఖమా ? స్త్రీపురుష వ్యత్యాసమేమైన నందుగలదా ? బాలుని హృదయనైర్మల్యము, బాలికాహృదయ మాధుర్యమాతని ముఖమున లేదా? శుద్ధప్రేమచే నాతఁడు స్త్రీపురు షహృదయముల భక్తిమార్గమునకుఁ ద్రిప్పెను. నిర్మలమగు భగవత్ప్రే మ సర్వసంబంధియై, వెలయఁగలదని నిరూపించుటకే శ్రీకృష్ణుఁ డవత రించెను. బిడ్డయై, అఖిలదంపతుల వాత్సల్యపాత్రుఁడై, యందఱ సౌభ్రాతృత్వమంది, అనిర్వాచ్యానంద ప్రదాతయై, సమస్తస్త్రీబృం దముల నాత్మైక్య సూత్రబద్ధులఁజేసి, భారతవర్షమున శ్రీకృష్ణుఁడు ప్రేమతత్త్వమును స్థాపించియున్నాఁడు. శ్రీకృష్ణుని ప్రేమతత్త్వమీనాఁ టికి జనుల కగ్రాహ్యమే, యనిరామకృష్ణుఁడు వచించును. అట్టి కృష్ణుని ప్రేమతత్త్వము ననుభవపూర్వకముగాఁ దెలిసికొను నిమిత్తము

K. C. S. Reddy



రామకృష్ణుఁ డెన్నిమారులు గోపపురుషవనితా వేషముల ధరించి, యాపరమేశ్వరుని మిత్రునిగను భార్యగను ప్రేమించి యుండ లేదు? అట్టి పరమేశ్వరార్పితబుద్ధితో భక్తిపరవశుఁడై కన్నీరు కాల్వలు కట్టుచుండ, శరీరము మఱచి, చిద్విలాసముద్రితవదనముతో నేలఁబడి రామకృష్ణుఁ డేడ్చినదినములు స్మరింప నాకు ధైర్యము లేదు. అట్టి బాహ్యజ్ఞానశూన్యదృష్టిలో నంతరవలోకనముచే నెట్టి యానంద మాతఁ డనుభవించెనో యెవరు చెప్పఁగలరు? భగవద్భక్తిపారవశ్యమున నొడలు మరచి, క్రీడించు నాతనిహృదయాంతరసౌఖ్యము నెవఁడు గాంచి చూడఁగలఁడు. ఎట్టి బ్రహ్మానందము నాతనికి లేనిచో నేల యాతఁ డట్టిసమయమున, బాష్పధారలు వఱదలై పార, నెట్టి ఱాతి గుండియలనైనఁ గరగించి, భక్తిని పురికొల్పఁగల కీర్తనలు, వాక్యములు, ప్రార్థనములు, బయల్పఱచును?"

"రామకృష్ణుఁడు కాళీదేవిని తల్లియని పిలచును. సంపూర్ణ భగవచ్ఛక్తి స్త్రీరూపధారణమే కాళియని యాతనితలంపు. తల్లి నారాధించు మాతృభావప్రేమకన్న సౌలభ్యమగు ప్రేమమార్గము వేఱొకటి లేదు. శ్రీ మహాశక్తిస్వరూపిణి యగుటచే నామె పుత్రి వాత్సల్యమునకుఁదప్ప మఱెద్దానికి లొంగునది కాదు. కాంతయే భగవద్జ్ఞానదృష్టినిభగ్నమును చేసిలోకమునుఱ్ఱూఁతలూగించుచున్నది. కాంతయొక్క మహాశక్తి మహర్షులను చలబుద్ధులం జేసినది. రామకృష్ణునికి భార్యగలదు. కాని వారిరువురకు సాంగత్యము లేదు. మాతృస్థానేతరమగు స్త్రీరూప మాతనిదృష్టి కగోచరము. పరిపూర్ణ కామదహనమే యాతని యాశయము. అట్టి కామధ్వంసనాభ్యాసములో నాతఁడు గంగాతీరమునఁబడి గుండెలు బ్రద్దలగున ట్లేడ్చుట, ప్రార్థించుట చూచి, జనులు గుంపులుగావచ్చి యాతని నుపహసింపఁ జేయువారు. తుదకు కాళీకరుణాకటాక్షముచేతనే యాతఁడు, కాంతా

కాంక్షను కాల్చివైచి, ప్రతికాంతను మాతృభావముతోఁ జూడఁ గల్గెను. ఇది పాశ్చాత్యజాతికి విరుద్ధము. ఈయభిప్రాయమే హిందూ జాతీయ జీవనాధారము. సత్యముచే స్త్రీ నారాధించుశక్తి హిందువు నకే కలదు. "నాతండ్రి రామభక్తుఁడు. నేనును రామభక్తుఁడనే." యని రామకృష్ణుఁడు వచించెను. రాముని రామకృష్ణుఁ డొకసేవక భావమున భావించును. నాయకునికి సేవసేయునవకాశము లభించు టే యాతనికి వలయు మహాలాభము. మరణయాతనలు, ప్రతిఫలా పేక్ష, విషయవాంఛ, వీనిని విసర్జించి, సేవకాగ్రేసరుఁడై, దైవశక్తి ప్రేరితుఁడై జీవితము నర్పించిన హనుమంతునిహృదయమే రామ కృష్ణుని హృదయము.

"కామకాంచనజయమే రామకృష్ణుఁడు వాంఛించినది. కామ మును జయించిన వెనుక, కాంచనజయమున కాతఁడు గడంగెను. ధన ముచూచిన నాతనిహృదయము క్షోభించును, వణకిపోవును. ఒకనాఁ డొకచేతితో మట్టిముద్దను, రెండవచేతితోఁ గనకమును, తీసికొని రెంటివైపు ననేకసారులుచూచి, మట్టి కనకమనియు, గనకమే మట్టి యనియు వచించి, రెంటిలోఁగల భేదదృష్టి నాశనముచేసి గంగలోఁ బారవైచెను. ఈవిధముగాఁ గాంచనాభిలాష నాతఁడు జయించెను.

"హిందూమతముతో నాతఁ డూరకొనలేదు. సర్వశక్తిస్వరూ పుఁడైనఁ "అల్లా" దేవుని ధ్యానించుట కాతఁడు ముసల్మానురూప మును ధరించి, వారి యాహారవిధాన మవలంబించి, ఖురాను శ్లోక ములపఠించుచుండువాఁడు భగవత్తత్త్వస్వరూపుఁడగు జీసస్‌మూర్తి కాతఁడు వినమితశిరస్కుఁడై ప్రణమిల్లును. ఈయభిప్రాయములు రామకృష్ణుని విశాలహృదయమును దెల్పుచున్నవి. ఇవన్నియు రామ కృష్ణుని ప్రత్యేకసందేశములు. ప్రత్యభిప్రాయము నాతఁ డనుభవ పూర్వకముగాఁ దెలిసికొన నెన్నియో సాధనలఁ జేసెను. ఆతఁడొక్క

## మొదటిభాగము.

వాక్య మెన్నఁడు వ్రాసియెఱుఁగఁడు. తర్కించి యెఱుఁగఁడు. బోధించియెఱుఁగఁడు. కాని హృదయమున స్రవించుచున్న భావతరంగముల నాతఁడు వెలిగ్రక్క యత్నించువాఁడు. అక్షరజ్ఞానశూన్యుఁడైనను, కఠినపురాణవాక్యముల నాతఁడు విమర్శించి, విపులార్థ నిర్వచన మాతఁడు చేయువాఁడు ఆతనినోట వెడలువాక్యములు లిఖింపఁబడినచో నొక జ్ఞానరత్నఖనియగును. ఆతనిమాట లాంగ్లములో వ్రాయుట దుస్తరము.

"హిందూమతమహోన్నతాదర్శములు మూర్తీభవించినరూపే రామకృష్ణుఁడు. శరీరము నాతఁడు పూర్తిగా నిగ్రహించెను. ఆతని శరీరమున జ్ఞానాగ్ని నిత్యము సహస్రసూర్యకాంతితో వెల్గొందుచుండును. భగవంతుఁడు తప్ప వేఱువృత్తి యాతనికి లేదు. చుట్టము, చెలికాఁడు, ఉద్యోగము, ఊహ, అన్నియు నాతనికి భగవంతుఁడే. ఆతని యనింద్యవిశుద్ధత, ఆతని యనిర్వాచ్యనిగూఢతాత్త్వికానందము, ఆతని విద్యావిహీననిస్తులజ్ఞానము, ఆతని యవ్యాజానుకంపాంతరంగము, ఆతని ప్రతిఫలశూన్యాఖండభగవద్భక్తిపారవశ్యము, ఇవన్నియు నాతని జీవకళలు. ఆతఁడింకను నట్టి కళాప్రపూర్ణతం గాంచి యానందించుటకు భగవంతుఁడు, దీర్ఘాయుర్దాయము నొసంగుఁగాత. మన బ్రాహ్మసమాజోద్దేశములు భేదించుఁగాక. కాని, యాతఁ డనుగ్రహించినన్నాళ్ళు నాతనికి చరణసేవ చేయు భాగ్యమునకై, మన మెదురుచూచి తీరవలయును. శ్రీరామకృష్ణుని కాళికార్చనావిధానమే కేశవచంద్రసేనుని హృదయమును, బ్రాహ్మసమాజమునకు వైశాల్యమును కల్పించుభావములతో నింపెను. భగవంతుని 'దల్లి' యని పిలచుభావము కేశవచంద్రసేనునికి రామకృష్ణుఁడే దానముచేసెను."

## ఇరువదియవ యధ్యాయము.

### భువనేశ్వరీపుత్త్రుఁడు: గురుశిష్యులు.

శ్రీరామకృష్ణసందర్శనమాది, సన్న్యాసాశ్రమస్వీకారమువరకుఁ గల యైదువత్సరములు, నరేంద్రుని జీవితము దుర్భరకష్టపరంపరలకుఁ బాల్పడినది. అఖండైశ్వర్యములతోఁ దులఁదూగిన యాతని కుటుంబము విశ్వనాథుని మరణముతో దారిద్ర్యపిశాచమునకెఱయైపోయెను. మొట్టమొదట నరేంద్రుఁడు శ్రీరామకృష్ణుని దర్శించినప్పటికి విశ్వనాథదత్తుఁడు సజీవుఁడైయుండెను. కాని యాతఁడు లక్ష్యము చేయలేదు. నరేంద్రుఁడు రామకృష్ణునికిఁ బూర్తిగా నధీనుఁడును గాలేదు. నరేంద్రుడు నిక్కముగా సర్వసంగపరిత్యాగమొనర్చునని యెఱిఁగియుండినచో; సమస్తోపాయములచేఁ దుదకు దౌర్జన్యముచేనయిన, విశ్వనాథుఁ డాతనిఁ బ్రాపంచికదృష్టికి లాగియేయుండును ఏలన విశ్వనాథుఁడు ముందు ప్రపంచపురుషుఁడు. మతమాతనికి రెండవవిషయము [illegible]కుమారుఁ డుత్కృష్టన్యాయవాది కావలయునని, విశ్వనాథు నుద్దేశ్యము. కాని న్యాయశాస్త్రపరీక్ష యైనను పూర్తి గాకమున్నే విశ్వనాథదత్తుఁడు పరలోకప్రాప్తినందినాఁడు. ఇంతకుఁబూర్వము తనకుమారునికి వివాహముచేయ నాతఁడనేకపర్యాయములు ప్రయత్నించెను. దైవవశమునఁ బ్రతియత్నము నిష్ఫలమయ్యెను. తన మరణదినముననే యొకసంబంధము నిశ్చయించెను. కాని, మరణముతో నదియుఁ జెడెను.

నరేంద్రుఁడు వివాహమాడుట శ్రీరామకృష్ణుని కెంతమాత్రము నిష్టములేదు. శ్రీరామకృష్ణుఁడు తన సంకల్పపర్వతము నా ప్రయత్నమున కడ్డుపెట్టి నిలచెను. ఎట్టకేలకు వివాహప్రయత్నము పునరవకాశము లేకుండ, భగ్నమైనదని విన్నపుడు, నరేంద్రుఁ

ఏకవ్యక్తి ప్రేమకు పాత్రుఁడై సంసారమును నడపుటకుఁగాక, విశ్వమానవబృందమునకు మోక్షమునొసఁగుటకునై జనించెనని, రామకృష్ణుఁడు తెలిసి సంతసించెను. ఎప్పుడు వివాహము తలపెట్టినను, నరేంద్రుఁడు తీవ్రవిముఖతను ప్రదర్శించుచునే యుండెను. జనకమరణానంతర మాతఁడు స్వయంప్రజ్ఞాధురీణుఁడై, వివాహాశయములనే త్రెంపివైచెను.

తండ్రిమరణముతో నరేంద్రుఁడు కుటుంబయజమానియయ్యెను. సకలకుటుంబభార మాతనిమీఁదఁ బడెను. ఇట్టిసమయమున సన్న్యాసాశ్రమాభిలాష హృదయమునకుఁ దట్టినచో, నాతఁడు నిస్సహాయమై, పరితపించుకుటుంబము నెట్లు విడతునాయని భీతిల్లుచుండును. ఒకప్రక్క గృహాభియోగము, మఱొకప్రక్క దారిద్ర్యము, వేఱొకప్రక్క న్యాయశాస్త్రాభ్యసనము, మఱియు నింకొకప్రక్క సన్న్యాసాభిలాష, యిట్టిస్థితిలో నిరువదేండ్లబాలుఁ డెట్లు పరితపించియుండునో తెలియకపోదు. ఇరువదినాల్గుగంటలలో నొకనిముసమైన నాతనికి శాంతినొసఁగుక్షణము లేదు. నిరంతరము పెనవేయుచున్న పరిస్థితుల నుండి బయల్పడు మార్గాన్వేషణముతోడనే యాతఁడు ప్రొద్దుపుచ్చ వలసివచ్చెను. పట్టెడన్నము లభించక యాతఁడనేకసారులుపవసించెను.

ఎట్లైన నరేంద్రుఁడు గ్రంథపఠనములో మగ్నుఁడయ్యెను. తాత్త్వికగ్రంథములే ముఖ్యముగా నాతని నాకర్షించినవి. అప్పుడే యాతఁడు బ్రాహ్మసమాజసంబంధమును వదలుకొనెను. ఆతనివైఖరి చూచి భువనేశ్వరీమాత, తనపుత్రుఁడు తన్నువిడిచి సన్న్యసించునేమోయని భీతిచెందియు, నామెయం దాతనికిఁ గల నిరుపమానమాతృభక్తి, యట్లు విడువనీదనియు నమ్మి యూరకుండెడిది. వివాహమాడుమని పెక్కుమారు లామె యాతనిని నిర్బంధించెను. కాని యా

విషయములో నాతఁడు బదులు చెప్పుట మానుకొనెను. కాని యాతఁ డట్టి విషమపరిస్థితులలోనైనను హృదయమును తేలికపఱచుకొని, బాలునివలెనే ప్రవర్తించెను.

ఏమిజరిగినను సరే. శుద్ధబ్రహ్మచర్యవ్రతదీక్షయే నరేంద్రుని ముంగిట ప్రత్యక్షమగుచుండెను. విశుద్ధజీవనమునకై, యాతఁడు మాలిన్యమెదుర్కొనఁ బ్రాణములనైన నర్పింపఁ గంకణము కట్టుకొనెను. తండ్రి చనిపోయిన వెనుకనైన నాతఁడు వివాహము చేసుకొనుచో నతని కుటుంబము లాతని నల్లునిఁగాఁ బడయ యత్నించినవి. బంధువులాతని నందులకంగీకరింపుమని బాధించిరి. అట్టిసమయమున నాతఁడు, "ఏమి? నన్ను బంధించి సంసారకూపమునఁ బడద్రొబ్బ యత్నించుచుంటిరా? నేను పెండ్లిచేసికొనినచో నాజీవిత మంతటితోసరి?" యని వచించెను.

ఈవిధముగా మూఁడువత్సరములు గడచినవి. తానిఁక కుటుంబమును వీడినను, నయ్యది దారిద్ర్యబాధకు లోనుగాదని నిశ్చయించుకొని, క్రమముగా నరేంద్రుఁడు దక్షిణేశ్వరముననే యెక్కుడుకాలము వెచ్చించుచుండువాఁడు. దినములు, మాసములు, దక్షిణేశ్వరములోను, కాశీపురమందును గడచిపోవుచుండెను. కాని, యాతఁడు తన కుటుంబమును పూర్తిగా మఱువలేదు. అప్పుడప్పుడింటికేగి, యోగక్షేమము లరసి, తల్లి నోదార్చి వచ్చుచుండెడివాఁడు! తాను బుద్ధునివలె భిక్షాటనమునకై సన్యాసియై తిరుగుచుండినను, తనసోదరీమణు లిర్వురును చనిపోయిరని విని విలపించెను. కుటుంబవైకల్యములు, దారిద్ర్యబాధలు నివియే నరేంద్రునిదేశాభిమానమునకు, సంఘాభిమానమునకు హేతువులు. తినఁ దిండిలేక, కట్ట గుడ్డలేక, నిల్వ నీడలేక, మలమల మాడిపోవుచున్న కోట్లకొలఁది తన భారతసోదరులస్థితిని దలఁచినపు డాతనిగుండెలు విచ్ఛిన్నమై, తుత్తునియలై పోవుచుండెడివి.

నరేంద్రుఁడు తన తల్లిమాట తలంపునకువచ్చుచో నప్రయత్నముగా, నఖండభక్తిపురస్సరముగా, నామెకు సాష్టాంగప్రణామ మొనర్చును. పుత్రునిఁ జూచి భువనేశ్వరియు, మిక్కిలి గర్వము చెందుచుండును. వివేకానందుని మహాసమాధ్యనంతరము, నీదేశమునకు వచ్చిన యాతని పాశ్చాత్యశిష్యురాలికనితో 'నాపుత్రుఁ డిరువదినాల్గవవత్సరముననే సన్యాసియయ్యె'నని ధీరప్రౌఢిమతో నామెపల్కెను. కాని నరేంద్రుఁ డిరువదినాల్గవవత్సరమున కాదు సన్యాసియైనది. రామకృష్ణుఁడు వచించినట్లాతఁ డాజన్మబ్రహ్మజ్ఞాని, బ్రహ్మచారి. భువనేశ్వరి కాసంగతి తెలియకఁబోదు.

కాని తల్లులు తల్లులేకదా! తన యింటిలో సౌందర్యవతియగు మనుమరాలు, కుశాగ్రబుద్ధియగు మనుమఁడు, నరేంద్రుని కుదయించి, నట్టింటతిరిగి, యామెకు మితానందసంధాయకులై యుండిన నెంతబాగుండునో కదా యని భువనేశ్వరి తలపకపోలేదు. తరువాతనైనను తనపుత్రులిరువురకుఁ బెండ్లిచేయ నెంచెను. వారును బ్రహ్మచర్యవ్రతమునే స్వీకరించిరి. వారిలో భూపేంద్రనాథదత్తుఁ డనునాతఁడు సత్యాగ్రహోద్యమములోఁ బనిచేసి, ప్రభుత్వముచే నిర్బంధితుఁడై భారతస్వాతంత్ర్యాలయమగు చెఱసాల నలంకరించెనని తెలియవచ్చుచున్నది. తాను కనుసారకన్నముగ్గురుపుత్రులు, యిర్వురుపుత్రికలు, వంశోద్ధరణసాధకులు కాకపోయిరి. కాని యాలోటంతయు నరేంద్రుఁడు కలపుదీరునట్లుగా, వివేకానందుఁడై తీర్చెను. కోట్లకొలఁది యాధ్యాత్మిక పుత్రపౌత్రసంతతి నాతఁడు చేకూర్చి, తన వంశమునకేగాక, జగత్కుటుంబమునకు మోక్షపారంపర్యమును కల్గించెను.

ఆత్మల బంధించు పాశములు బలవత్తరములైనవి. శ్రీరామకృష్ణనరేంద్రులకుఁగల సంబంధ మనిర్వాచ్యము. వారి యథార్థసంబంధ

మేనాటికిఁ జెప్పనలవికాదు. ఆసంబంధ మత్యంతగంభీరము. అనంత ప్రేమపూరితములు, ననూనగూఢభావయుక్తములు, ననూనభక్తి మయంబులు, నఖండగౌరవోపేతములు నయి, భావిసంతతికిఁ గూర్పఁ బడిన వివేకానందునివాక్యము లేకొలఁదియో యాసంబంధముయొక్క రుచినైనఁ జూపఁగలవు అట్టి పవిత్రప్రేమబంధ మాయిరువుర నట్లు మేళవించియుండుటచేతనే, శ్రీరామకృష్ణ వివేకానందుల శిష్యకోటి, యిరువురలో నొకనామమును తలపెట్టినప్పటికి రెండవనామము నప్ర యత్నముగాఁ దలఁచి రామకృష్ణ వివేకానం దైక్యరూపముననే దర్శించును.

నరేంద్రుని ప్రథమముఖావలోకనముతోడనే, శ్రీరామకృష్ణుని హృదంతరమం దొక నిర్హేతుకప్రేమాంకుర ముదయించినది. అయ్యా దాధ్యాత్మిక ప్రేమాంకురమగుటచే నవినాశము ఘోరసంశయాకులచిత్తుఁడై నరేంద్రుఁడు శ్రీరామకృష్ణుని దర్శించి, "మహాశయా! దేవునిఁ జూచితివా!" యని యడిగినప్పుడే శ్రీరామకృష్ణుడు నరేంద్రునుత్కృష్టావలోకనములోనికి దింపెను. వారి ప్రేమపాశ మీవిధముగా తీవ్రతరమై, నరేంద్రునికి భగవద్దర్శనసాధనజ్ఞానజ్యోతిర్నిరీక్షణముగా సమాప్తిమయినది. వీరిరువురసమ్మేళనమే లోకమునకొక నూతనశకమును ప్రారంభముచేసెను. హిందూమతపునరుద్ధారణతోఁ గూడిన, నూతన ధర్మసందేశము, కోట్లకొలఁది మానవమానసముల నిద్రవఱికే, మోహోర్ధ్వములఁ జేసివైచెను.

కాని శ్రీరామకృష్ణుని హృదయగాంభీర్యము నర్థముచేసికొనుట నరేంద్రునకుఁ గఠినాతికఠినమైపోయెను. నిర్దాక్షిణ్యముగా, నరేంద్రుఁడు పెక్కుసారులు పరీక్షాపరంపరలు గురిపించెను. రామకృష్ణుఁ డొకమందబుద్ధియని యాతఁడు తలంచెను. మూఢభక్తియుక్తుఁడే కాని, విశాలభావపూరితుఁడు కాఁడని, నరేంద్రుఁడు భ్రమప

డెను. నరేంద్రు నెట్లైన శ్రీరామకృష్ణపాదసాన్నిధ్యమునకు బంధించి విడువని హేతువు, శ్రీరామకృష్ణు నమితానుకంపాంతరంగమే. నరేంద్రుఁ డెందుచేతనైనఁ గొన్నిదినములవఱకు రాకున్నచో, రామకృష్ణుఁడు కాళీప్రత్యక్షభావసమయమున నెట్లు తల్లడిల్లెనో, యట్లే తల్లడిల్లువాఁడు. నరేంద్రుని రాకలేమి చూచి యాతఁడు కాళీమాతను సమీపించి నరేంద్రుని రప్పింపుమని వేడికొనిన సమయము లనేకములు గలవు. కాళీమాత, రామకృష్ణునికోర్కె తీర్చెనో యన్నట్లా సమయముననే నరేంద్రుఁ డరుదెంచువాఁడు. శ్రీరామకృష్ణునన్యశిష్యవర్గ మది చూచి, యబ్బురపడుచుండువారు. కొందఱు శ్రీరామకృష్ణుఁడు పక్షపాతబుద్ధియనికూడ తలంపక పోలేదు. ఆదినములలో రామకృష్ణుని కొక్కటే గలకోరిక. నరేంద్రుఁడు తనయొద్దికి రావలయును. అదియే యాతని జపము, ధ్యానము, ప్రార్థనయును. నరేంద్రున కట్టి శ్రీరామకృష్ణుని ప్రతాప మర్థము కాలేదు. కొన్ని వేళల రామకృష్ణుఁడు మూఢభక్తుఁడేయని రోసినను, నరేంద్రుఁడు శ్రీరామకృష్ణునికోర్కె దీర్ప నాతురతఁ జూపువాఁడు.

నరేంద్రుని గురువాక్యబద్ధుని చేసిన హేతు వింకొకటి కలదు. చాలదినముల వెనుక నరేంద్రుఁ డొకనాఁడు రామకృష్ణునికడ కరుదెంచెను. యథోచితగౌరవసంభాషణలు జరిగిన వెనుక, శ్రీరామకృష్ణుఁడు తానెట్లు నరేంద్రుని కొఱకు విలపించెనో తెలిపెను. అంత నరేంద్రుఁ డుద్రిక్తుఁడై, "ప్రతినిమేషము నన్నేలనీవు తలఁచెదవు. అట్లు తలచుచో నిఁక నేనే నీవగుదువు: పూర్వము, జడభరతుఁడు తన లేడిపిల్ల నుగూర్చి నిరంతరము తలఁచి, ధ్యానాదికము మఱచి, మఱుజన్మమున లేడియై పుట్టినట్లే, నీయవస్థయు నగు"నని హేళన చేసెను. శ్రీరామకృష్ణుఁడు మాటాడలేదు. అవ్యాజానుకంపాతరంగితుఁడై, రామకృష్ణుఁడు శాంతిరసైకాస్వాదియై యూరకుండెను. నరేంద్రుఁ డామాట గురుధిక్కారభావముతో ననియుండునా?

గంటలుగడచెను. సూర్యుఁడపరాబ్ధిఁగ్రుంకెను. కాళికాలయములో గంటలు మ్రోగెను. ప్రార్థనగీతానినాదములు బయల్వెడలి, భక్తుల నాకర్షించుచుండెను. రామకృష్ణుఁడాలయప్రవేశమొనర్చి, హారతి యిచ్చి, నిశ్చలసమాధిలో నిల్వఁబడెను. ప్రార్థనాసమయమధిగమించి, శిష్యబృందము వెనుకకుఁ దిరిగెను. మఱల స్మృతి దెచ్చికొని, రామకృష్ణుఁడు కాళీనామస్మరణతో బయటికరుదెంచి తనగదిచేరి నరేంద్రునిఁ జూచెను. వెంటనే కూర్చుండెను. శిష్యులందఱాతనిఁ బరివేష్టించిరి. అంత "నరేంద్రా"యని పిలఁచి రామకృష్ణుఁ డిట్లనెను; "నరేంద్రా! కాళీమాత నాకంతయుఁ దెలిపినది. నీవు చిన్నబాలుఁడవనియు, నీవు చెప్పుమాటలు పరిపక్వజ్ఞానయుక్తములు కావనియు, నామెచెప్పి నీలో నేనంతరాత్ముఁడగు నారాయణునిఁ జూచుటచే నిన్నంత ప్రేమించుచుంటినని వచించె" నని పల్కెను. అందుచే నీమాటలు తృణతుల్యములు సుమీ! నీయందు నారాయణునిఁజూడని క్షణమున, నీకు నాకును సంబంధము లేదని గంభీరముగా వచించి, మఱల సమాధిమగ్నుఁడయ్యెను. సమస్య ఛిన్నమైనది. నరేంద్రునంతఁగా ప్రేమించుకారణ మందఱకు వ్యక్తమైనది. నరేంద్రునిచేతులు ముకుళితములై, అప్రయత్నముగ శ్రీరామకృష్ణచరణములమీఁద వ్రాలెను. ఆతనిహృదయము శ్రీరామకృష్ణవాక్యములచే మోహితమయ్యెను. తనయందపరిమితానురాగము చూపుటకుఁ గలకారణము, తనయందుగల నారాయణాంశమేయని నరేంద్రుఁడు బాగుగా గ్రహించి, తాను చేసిన ప్రతిఘటనలకు లజ్జావనతవదనుఁడయ్యెను. శ్రీరామకృష్ణ నరేంద్ర సంబంధహేతువు పూర్తిగాఁ బ్రదర్శితమయ్యెను. శ్రీరామకృష్ణుఁడితరశిష్యులలో నారాయణాంశను చూడకపోలేదుగాని, నరేంద్రులోఁ బరిపూర్ణముగాఁ జూచెను.

నరేంద్రుని తా నమితముగాఁ బ్రేమించుటకుఁ గలహేతువుల వివరించుచు రామకృష్ణుఁడు శిష్యులతో నిట్లు చెప్పెను; "ఈబాలు రందఱు నారాయణస్వరూపులని నే నెఱుఁగుదును. నేను నరేంద్రుని మొదట చూచినపు డాతఁడు దేహస్మృతివిహీనుఁడై కన్పట్టెను. ఆతనిహృదయమును నాచేతితోఁ దాఁకినదాది యాతఁడు తనజన్మమునే మఱచెను. అందుచే నాతఁడు కన్పట్టనిచో నేను విలపింతును."

ఈవిధముగా శ్రీరామకృష్ణుఁడు నరేంద్రునిఁ గూర్చి, విస్పష్టముగనే పల్కుచుండెడివాఁడు. ఒకానొకసమయమున శిష్యులందఱు గూర్చుండి యుండ, నాతఁడిట్లు వచించెను; "ఒకకారణముచేఁ గేశవచంద్రసేనుఁడు గొప్పవాఁడైనచో నట్టికారణములు నరేంద్రునందు పందొమ్మిది కలవు. కేశవచంద్రసేనునిహృదయములో జ్ఞానము ప్రదీపమై వెల్గుచుండును. నరేంద్రుని హృదయములో నయ్యది, ప్రచండచండకరబింబసదృశమై వెల్గుచున్నది." కేశవచంద్రసేనుని రామకృష్ణుఁడు ప్రేమించెను కేశవచంద్రసేనుఁడు నరేంద్రునివంటి శిష్యుఁడు కాకున్నను, రామకృష్ణుని శిష్యుఁడే. రామకృష్ణవాక్యామృతమే కేశవచంద్రసేనుని బోధనలలోఁ బ్రసరించినది.

నరేంద్రునందలి యఖండప్రేమచే నాతఁడు చేయువలయు గురుశుశ్రూష నరేంద్రుఁడు స్వయముగాఁ జేయ రామకృష్ణుఁ డంగీకరించలేదు. సాక్షాన్నారాయణ రూపుఁడగు నరేంద్రుఁడు; తనకు సేవచేయుట, రామకృష్ణుఁ డధర్మముగాఁ దలఁచెను. నరేంద్రుఁడు సేవచేసెదనని పట్టుపట్టిన, "నీమార్గము వేఱ"ని చెప్పి, రామకృష్ణుఁ డంగీకరించుట మానును.

నరేంద్రునిఁ జూచుటతోడనే, నిశ్చలసమాధిలో నిలచి పోవువేళ లనేకములు శ్రీరామకృష్ణునికిఁ గలవు. తుట్టతుద కొక

సారి, నరేంద్రుఁడు తాను కోరినట్లు రాకపోవుటచే విలపించి, నరేంద్రునికడకే పయనమై, దక్షిణేశ్వరముకడ కంతలో నరుదెంచు చున్న నరేంద్రునిఁ గాంచి, యాతనిముఖము నవలోకించి, "నారాయణా! నాకొఱకై నీవు శరీరమునుధరించితివి. నీవు పుట్టుటకుముందు కాళీమాతతో, "తల్లీ! కామకాంచనవిసర్జనముచే విశుద్ధతనంది, పునీతుఁడైన యొకఁడు నాకు మిత్రుఁడుగా లేనిచో నేనెట్లు జీవించగలన"ని మొఱవెట్టికొంటిని. నిన్నటిరాత్రి నీవువచ్చి, నన్ను లేపి, "వచ్చితిని తండ్రీ" యని నిలచినావుసుమీ'' యని రామకృష్ణుఁడు వచించెను ఈవిధముగా నరేంద్రరామకృష్ణబాంధవ్యము దురూహ్యమయినది. పార్థపార్థసారథిసంబంధమే, నరనారాయణసంబంధమే, యిచటఁ బ్రత్యక్షమగుటలేదా? లేకున్నచో భార్యాభర్తలకుఁ గాని, మాతాశిశువులకుఁ గాని, సోదరులకుఁ గాని, మఱెవ్వరికిఁ గాని, యిట్టిప్రేమపాశము వెలసియుంట వింటిమే ?

---

## ఇరువదియొకటవ అధ్యాయము.

### సన్న్యాసాశ్రమ ప్రేరణవిధానము; దక్షిణేశ్వరానంద దినములు.

ప్రాపంచికవిషయపాశములు, బలవత్తరములైనవి. మాయాతీతపదంబున కరుగుమార్గము, నిశితాయుధాగ్రధారమీఁదఁ గాలిడి నడచుటవంటిది. కామక్రోధలోభమోహమదమాత్సర్యము లగ్నిజ్వాలలై, లోకమును దహించి, బంధించి, అంధకారప్రాప్తినొసఁగి, దుఃఖసాగరమునఁ ద్రోయుచున్నవి. అట్టి యాశాంధకారావృతదుర్గమారణ్యమధ్యంబునుండి, మార్గము నఱికికొని, ముందుకుఁ బోవుట కెట్టి తాలిగుండె వలయునో కదా! నిశితజ్ఞాన కుఠారహస్తుఁడై రామ

కృష్ణుఁడు విషయాటవిని ఖడించెను అట్టి అభయహస్తమునే నరేంద్రుని కాతఁడొసఁగి యున్నాడు.

మతముయొక్క పరమావధి భగవద్దర్శనమే. ఇంద్రియబంధములఁ దెంపివైచి, పరమాత్మదర్శనైకలాలసత్వముంబూఁ గఠినాతికఠినయాతనలఁ బొందుటొక్కటే దానికి మార్గము. అంతకన్న నుత్కృష్టమగు మార్గమొండు లేదు మానససహజ చాపల్యము, ఫాందరిహీమమై, దృష్టికి గుప్తీకృతనమును తెచ్చిపెట్టుచున్నది ఇంద్రియ సౌఖ్యగాఢవాంఛ, అశాశ్వతవస్తువులమీఁదికే మానసమును దిగలాగుచున్నది. ఐనను యథార్థప్రతిబింబావిస్పష్టకాంతి రేఖలైన నపుడపుడు హృదయమును తాఁకక మానవు. అట్టిసమయమున మానవుఁడు తత్త్వమును గూర్చి చింతింప నారంభించును.

సన్న్యాసమును సేకరించి, వరుసగా పదిరెండువత్సరములు, శ్రీరామకృష్ణుఁడు తపోయోగ సాధనలఁ జేసెను. చలించు మానసమును కుదుటపఱిచి, కాముములను కాల్చివైచి, భీతిని భూతిచేసి, పవిత్రతను పరిణయమాడి, యాతఁడు నిత్యానందమూర్తియై విలసిల్లెను.

యథార్థ దృశ్యమును మఱుగుపఱచు నాకూర్ర యవనిక లెవ్వి? సహజస్వాతంత్ర్యయుక్తములగు నాత్మల బంధించు నాపాశము లెవ్వి? కామకాంచనములు, లేక కామినీకాంచనము లని శ్రీరామకృష్ణుఁడు వచించి యున్నాఁడు. మహర్షులట్లే వచించిరి. వివేకానందుఁడట్లే వచించెను. కామినీకాంచనవాంఛాదహనమే ఆత్మసాక్షాత్కారమని మహాపురుషులందఱు నూదిపోసినదే.

నరేంద్రుని హృదయధైర్యస్థైర్యములు, తెలియవలయుచో, శ్రీరామకృష్ణుని హృదయము తెలియవలయును. భగవద్జ్ఞానానందరసముచేతనే లోకములన్నిటిని పవిత్రీకృతముచేసి, భగవంతుని

కన్న కామ్యమెద్దియు లేదని యాతఁడు నిరూపించెను. కామినీవాంఛ జయించునిమిత్త మాతఁడు, కామినీరూపము దాల్చి, కొన్నినాళ్లు స్త్రీ పురుష భేదము మరచి, తిరుగాడెను. స్త్రీ ప్రపంచమంతయుఁ గాళీస్వరూపముగా నాతనికిఁ గన్పట్టెను. ఇంద్రియము లెల్లు మోసగించగలవో యాతఁడు గ్రహించి, నిరతాదర్శదర్శనాభిముఖుఁడై, నిశ్చలనిశ్చయబుద్ధితో, బ్రహ్మచర్యమును నిలుపవలెనని రామకృష్ణుఁడు నరేంద్రునకు బోధించెను. ఇంద్రియబంధమూలోన్మూలనమువలనఁ గాని విశుద్ధతం బడయుమార్గము రామకృష్ణునకుఁ గన్పట్టలేదు.

కాంచనజయము కూడ రామకృష్ణుఁ డత్యద్భుతముగాఁ జేసెను. ఒకచేత బంగారము, వేఱొకచేత మంటిముద్దను పట్టుకొని, బంగారము వస్తువులఁ గొనఁగలదుగాని, దేవుని చూపలేనప్పు డేమి లాభమని తలఁచి, రెంటిని మేళవించి గంగలోఁ బారవైచెను. మంటియొక్క మఱొకరూపమే కనకము. విలువనిచ్చుచో నయ్యది నిత్యపదార్థములఁ దేగల్గునే కాని, యాత్మప్రశాంతి నొసఁగజాలదు. కాన కనకము ధూళితుల్యమే యని తెలిసి, రామకృష్ణుఁడు కాంచనజయమును బడసెను. ఈ రెండువిషయములందును రామకృష్ణుని త్యాగ మచింత్యము. అధికాదాయముతోఁ గూడిన దక్షిణేశ్వరాలయాధిపత్యమును గ్రహింపుమని, రామకృష్ణుఁడు కోరఁబడినపుడు, నితరులధికధనము నొసఁగవచ్చినపుడు నాతఁడు, "ఈధనమును నేనేమిచేయను? ధనము నాకెందులకు? కాళీమాతా! నాకొఱకెందులకిట్టివారల నంపెద"వని ప్రార్థించును.

శ్రీరామకృష్ణునకుఁ గొంతెము జబ్బుచేసినది. బాలశిష్యులు, గృహస్థ శిష్యులాతనికి సేవచేయుచుండిరి. గృహస్థులలో నొకఁడు రామకృష్ణునిఁ దనయింటికిఁ దోడ్కొనిపోయి, శిష్యులతోఁ బోష

ణార్థమై, కొంతధనము వెచ్చించెను. కొన్నినాళ్ళవెనుక, నధికధనవ్యయమైనదని యాతఁడు కనుగొనెను. రామకృష్ణుఁడదివిని, "నరేంద్రా! నన్నువెంటనే యిచటనుండి తొలఁగించుము. ఇదిమనకు తావుగాదు. గృహము లేనిచో నొకచెట్టునీడయే శ్రేష్ఠమ"ని చెప్పి, వెంటనే శిష్యసమేతుఁడై వెడలిపోయెను. ప్రపంచమంతయు హేమమయమైనను రామకృష్ణునిహృదయము చలింపఁజాలదు. ధనరాశులాతనికి ధూళికన్న నెక్కుడుగావు. కామినీకాంచనములమీఁద నాతనికీఁధముగా తీవ్రతమమగు నేహ్యబుద్ధిగలదు.

శ్రీరామకృష్ణునిశిష్యులలోనాతనికన్నను వృద్ధులు, గృహస్థులు గలరు. వారిలోఁగొందఱాతనిని, నిర్దాక్షిణ్యముగాఁ బరీక్షించిరి. ఒకనాఁడొకశిష్యుఁడు రామకృష్ణు నొకగృహములోనికిఁ దీసికొని పోయి, యాతనిం బరీక్షింప, భోగవనితల నంపెను. శ్రీరామకృష్ణుని మేడనెక్కించి వారు వెనుకకరిగిరి. అంత నాతఁడు గదిలో వారవనితలయెదుట నిల్వవలసివచ్చెను. కాంతలాతని ననేకవిధముల నాకర్షించి, సంగమేచ్ఛజూపిరి. పరిస్థితిఁజూచి రామకృష్ణుఁడు వెంటనే, "తల్లీ! తల్లీ! నన్నిచ్చటికిఁ గొనివచ్చితివి," అని బాలునివలె రోదనముచేయ నారంభించెను. ఆతనిశరీరము చేతనారహితమైపోయెను. ఆతనిహృదయము నిశ్చలసమాధిమగ్నమయ్యెను. వారకాంతలది చూచి, విస్మయమందిరి. రామకృష్ణునిహృదయమందలి విశుద్ధజీవతరంగములు తటాలున బయల్పడి, కల్మషముతోఁ గూడిన యాస్థలమును కడిగివైచెను. అంత నాకాంతలు, రామకృష్ణునిపాదముల మీఁదఁబడి జోహారులొనర్చి, నిల్చి, తమ్ము తీసికొనివచ్చినశిష్యునిఁజూచి, "ఈసన్యాసివరునొద్దకా మమ్ము పిల్చితివి. ఈతఁడు శుకదేవుఁడు. భగవత్తుల్యుడు మమ్ము తల్లియని పిలఁచినాఁడ"ని చెప్పి వెడలిపోవుచుండఁగా రామకృష్ణుఁడు స్మృతితెచ్చుకొని, కాంతలదీవించి వెడలిపోయెను.

అట్టి తీవ్రతమవిశుద్ధతాగ్నిజ్వాలయొక్క వేడిమిలో నరేంద్రుఁడు, మోక్షమార్గదర్శనలాభమునకై, అత్యాశ్చర్యభరితుఁడై కూర్చుండి యుండెను. ఎట్టిరాక్షసాధముఁడైన నట్టి తావునకేఁగఁ గల్గుచో నాతఁడు భగవత్తుల్యుఁడయి లోకమును మఱువఁడే !

నరేంద్రుఁడట్టి యగ్నిపరీక్షలో నుత్తీర్ణుఁడయ్యెను. ధనికులగు నాతనిమిత్రులు కొందఱాతని షికారుకు రమ్మనగా నాతఁడందుల కంగీకరించెను. ఒకగుఱ్ఱపుబండిలో వారు కూర్చుండిరి. వెంటనే బండి యొకసందులో నొకయింటిముందర నాపఁబడెను. అచట మోసగాండ్రు పెక్కురుగలరు. వారేకమై, కొంతసేపుపాడి నరేంద్రుని పాడించిరి. నరేంద్రుఁడలసెను. అంత నరేంద్రు నొకగదిలోఁబరుండి, విశ్రాంతిగొనవచ్చునని వారు చెప్పిరి. అంత నాతఁడొక గదిలోఁ బరుండి యుండఁగా, నొకభోగకాంత వచ్చి, యెదుటనిలఁబడెను. ఆమె తన జీవితదుఃఖవిషయములఁ గూర్చి ముచ్చటించి, తరువాత తన సహజతుచ్ఛకాంక్షం దెల్పెను. నరేంద్రునిదృష్టి వెంటనే శ్రీరామకృష్ణునిమీఁది కరిగినది. భగవంతుఁ డాతనిహృదయమునుండి మేల్కాంచెను వెంటనే యాతఁడు తీవ్రముఖుఁడై లేచి, వెడలిపో నుంకించి. "తల్లీ! నేను పోవలయును, నన్ను క్షమింపుము. నిన్ను దేవుఁడు రక్షించుగాక. నీది నీచమగు బ్రతుకని తెలిసినచో నీవు పరిశుద్ధురాలవగు దినము వచ్చితీరు"నని చెప్పి యదృశ్యుఁడయ్యెను. నరేంద్రునిమిత్రులతో నాకాంత, "ఆహా ! నన్నెంతయాటనాడించితిరి. సాధుపుంగవునొద్దకా నన్నంపినది ?" యని విరసోక్తిగఁబల్కి వెడలిపోయెను. ఈసమయమున కొందఱు నరేంద్రుఁడు దుస్సహవాసముచే కామినీలోలుఁడు గావచ్చునని రామకృష్ణునితోఁ జెప్పిరి. కాని రామకృష్ణుఁడది నమ్మక, అట్టివిషయమేమియు నవసరములేదు

దుర్మార్గుల దుష్టవృత్తు లాతనినంటఁజాలవు. కాళీమాతయే యాతని రక్షించున''ని వచించెను.

శ్రీరామకృష్ణదివ్యపాదారవిందబద్ధుఁడగుటచేతనే నరేంద్రుఁడట్టి యచంచలహృదయమునుగల్గి, ఎట్టిమోహములచే బంధింపఁబడక, నిర్లిప్తుఁడై, నిర్మముఁడై, నిర్మలినుఁడై, నిల్వఁగల్గెను. ఆధ్యాత్మికవిశుద్ధత, ఆతనిహృదయములో సహజముగా నుద్భవించెను. శ్రీరామకృష్ణబోధనామృతముతో నావిశుద్ధత, తాఁకరాని అగ్నిజ్వాలయై, మాలిన్యరాశుల నెచటఁగాంచిన దహించి, బూడిదచేసెను. విశుద్ధతకై (purity) ప్రాణములు పోయినను, మృత్యువునోరు తెఱచి మ్రింగ వచ్చినను, ప్రపంచమొక్కటై మీఁదఁబడినను, నరేంద్రుఁడచంచలుఁడై నిల్వ నిశ్చయించుకొనెను. అట్టి విశుద్ధతాగ్నిజ్వాలావృతహృదయము లేకదా లోకము నుద్ధరించి, ధర్మస్థాపన మొనర్చి యీశ్వర సంకల్పముల నెఱవేర్చి శాశ్వతాఖండయశోధురీణులై చెల్వారుట?

భారతాంబరో! నీవిమలగర్భంబున జన్మించుభాగ్య మబ్బుట కెన్నివేలజన్మంబులు పుణ్యంబుసల్పితిమోకదా! నీ దివ్యామృత స్తనదుగ్ధము లానుటచే, మాయనేక పూర్వజన్మకృత పాపరాశులు దగ్ధమైపోయినవి. అచ్ఛాధ్యాత్మికజీవన పవిత్రతరంగడోలికలలో నీవు మమ్మూఁచి లాలించుబిడ్డలమగుట మేమెంతయు ధన్యులము. తల్లీ! జన్మబంధవినిర్ముక్తమగు ననామయపదంబునకుఁ బోఁజోకొట్టు నీజోలపాటల నినాదమాధురిచే మాశ్రోత్రకవాటములు పునీతములైనవి. మాతా! తుచ్ఛపాశ్చాత్యవిద్యావిధాన మౌర్ఖ్యసంజాత గర్వోన్మత్తచిత్తులమయి నీయెడ కృతఘ్నులమై, జీవచ్ఛవంబులమైపోయిన మమ్ము చైతన్యయుక్తులంజేయ నొక్కరామకృష్ణుని మఱలఁ బ్రసాదింపవే తల్లీ! అఖండాద్వైతజ్ఞానామృతమయపూర్తి వివేకానందు నెక్కడ దాఁచి

తివి జననీ ? దంభప్రకృతిశాస్త్రనీచనాస్తికమతమారుతములదాడి నుండి, మమ్ము రక్షింపరావే కారుణ్యస్వరూపిణీ !

తల్లీ! గురుశిష్యవిద్యావిధాన మెన్నడరుదెంచునో కదా! తుచ్ఛ బాహ్యానుసరణలాలసత్వముచే, స్తన్యము లెండిపోయి, డబ్బాలతోఁ దడుప నోరెండి మాడిపోవు శిశువర్గంబురీతి, విజాతీయ నాస్తికవిద్యాభ్యసనము మాగొంతుకలో 'గురగుర'నుపుట్టించి, సద్యోమరణ మొదగూర్ప భయపెట్టుచున్నది. తల్లీ! పాశ్చాత్యనాగరికతాధారైక స్థాపితవిశ్వవిద్యాలయము లెన్న డంటుకొనిపోవునో కదా !

సత్యాన్వేషకులారా ! రామకృష్ణనరేంద్రుల గురుశిష్యబోధనావిధాన మెట్లున్నదో గాంచి, ప్రస్తుతస్థితిం దలంచి, కన్నీరు కార్చుఁడు! శిష్యకోటిలో నరేంద్రుఁడొక్కఁడే రామకృష్ణునిమహిమ పూర్తిగాఁ దెలిసికొనఁ గల్గినవాఁడు. నరేంద్రుఁ డొక్కఁడుమాత్రమే రామకృష్ణుని వాక్యములను తూఁచి, తర్కించి, సంశయింప సాహసించెను. అవసరమగుచో నెదుర్కొన భీష్మించినవ్యక్తి భీష్ముఁబోలు నరేంద్రుఁడొక్కఁడే. ఆలయోపాంతసోపానములమీఁద నిలఁబడి, "తల్లీ! నాయధార్థమును ఖండింపశక్తిగల నొక్కని నాకుఁ బ్రసాదింపవా ?" యనిప్రార్థించిన రామకృష్ణునిమొఱ లాలించి, కాళికామాత నరేంద్రునంపియున్నది. శిష్యులందఱు రామకృష్ణు నత్యాదరముతో, సంశయరహితభక్తిమై, సేవించిరి. నరేంద్రుఁ డొక్కఁడుమాత్రమే సంశయములఁ దీర్చుకొనుబుద్ధితో గురువృత్తినఁ బ్రతిఘటించి నిల్చెను. నరేంద్రునివాక్యములు సశితర్కసింహగర్జానినాదములని శిష్యులందఱు చెప్పుదురు. ఏవిషయము చర్చకువచ్చినను, ప్రాచ్యపాశ్చాత్యగ్రంథముల ననంతముగా నుదాహరించి, ప్రతివాదులను, తనతార్కికబా

ణము చేఁ దూల్లుపడఁజేయుచుండ, రామకృష్ణుఁడదిచూచి, యాతని గంభీరజ్ఞానవైశాల్యమున కచ్చెరువంది, దీవించుచుండును నరేంద్రు నిది మూర్ఖవాదమా? కేవలసత్యైక నిర్ణయమునకై, నిర్మలోత్కారచే బయల్వెడలినభావసాగరమే నరేంద్రునిబుద్ధి. నరేంద్రునందు "శివశక్తి" కలదని రామకృష్ణుఁడే వచించియుండలేదా? పంచవటివృక్షముక్రిందఁ గూర్చుండి, శిష్యసమేతుఁడై ధ్యానముద్రలోనుండగా, నరేంద్రుఁడ టువచ్చుచుండెను. వెంటనే శ్రీరామకృష్ణుఁ డిట్లనెను; "చూడుఁడు నరేంద్రుఁ డిటువచ్చుచున్నాఁడు. ఆతనిదృష్టి యెంతలోతుగనున్నదో పారవిహీనసాగరమువలె, దివ్యజ్యోతి యాతనినుండి వెలివడుటలేదా? మాయాస్వరూపురాలగు తల్లియైన నాతనికిఁ బదియడుగులకన్న సమీపమున కేగఁజాలదు." అంతమఱల, "తల్లీ! కొంచెము నీమాయను నరేంద్రుమీఁదఁ గప్పుము. లేకున్నచో నాతఁడు భవదైకనిశ్చలధ్యానతత్పరుఁడై, లోకము నుద్ధరించుయత్నమును మఱచిపోవు"నని రామకృష్ణుఁడు వేడికొనెను. రామకృష్ణుని వాక్యము లెంత సత్యోపేతములో నరేంద్రుని భావిజీవిత మత్యద్భుతముగాఁ బ్రకటింపఁగలదు.

మఱొకసారి నరేంద్రునిఁగూర్చి వచించుచు, "సమస్తమాలిన్యముల మాడ్చి మసిఁజేయు జాజ్వల్యమానవిశుద్ధతాగ్నిమూర్తి నరేంద్రుఁడు. ఆతఁడు పంది మాంసమునుకూడ భుజింపవలసివచ్చిన నాతనివిశుద్ధత చెడనేర"దని రామకృష్ణుఁడు వచించెను.

రామకృష్ణునిమాటలనుల్లంఘనీయములుగదా! పాశ్చాత్యాన్నవిక్రయశాలలలో నరేంద్రుఁడు భుజించి, తనధర్మసందేశము నొసంగుచుండినప్పుడు హిందూసంఘదోషముల బయల్పఱచుటే వృత్తిగాఁగల కొందఱు కృత్రిమక్రైస్తవసందేశకులు, మూర్ఖప్రచారములు చేయ మొదలిడిరి. అప్పుడు రామకృష్ణుని శిష్యులిట్లు గురువాక్యముల స్మరిం

చుకొని "లోకముద్ధరించు నాధ్యాత్మికధర్మసందేశమునే జీవితపరమావధిగా నిడుకొని సర్వసంగపరిత్యాగ మొనర్చిన నామహాయతిపతంసుఁ డొక్క హిందూసంఘాచారమును, విధిలేక త్రోసిపుచ్చిననేమి మునిఁగిపోవును? పరిపూర్ణవిశుద్ధతాలోప మాతని కెట్లు వాటిల్లఁగలదు? సన్యాసికి నియమము లేల"యని తలఁచి తృప్తివహించిరి.

దక్షిణేశ్వరస్వామీశ్వరునకుఁ గొందఱాస్తికులు గౌరవసూచకముగాఁ గొన్ని ఫలము లర్పించినప్పుడు రామకృష్ణుఁడు వానిని దీసికొనుముందు దాతయొక్క దానాభిప్రాయము విశుద్ధ మగునా యని తర్కించి మఱియుఁ దీసికొనును. కాని నరేంద్రున కట్టిది లేదు. అతఁడు వెంటనే తీసికొని భుజించును. శ్రీరామకృష్ణుఁడు నరేంద్రునకు ప్రత్యేకపుహక్కు నొసంగియుంచెను. అగ్నిజ్వాలలో మలినములు పడి, అగ్ని నార్పఁగలవే? దగ్ధమయి తీరును.

సాయంసమయప్రార్థనలు విరమింపఁబడినవెనుక కొందఱు శిష్యు లింటికిఁబోవుదురు. కాని కొందఱు గురుమందిరముననే నిద్రించుచుందురు. రాత్రి శ్రీరామకృష్ణునకు నిద్దుర లేదు. కాళీప్రసన్నదివ్యవదనముతోఁ బ్రత్యక్ష సమాధి నిమగ్నుఁడై యాతఁడు బ్రహ్మానందరసమును గ్రోలుచుండును. అర్ధరాత్రమున నాతఁడు భగవన్నామస్మరణచేయుచుండును. మఱికొంతసేపూరకుండి వేణునాదసన్నిభమృదులకంఠముతో "బాలులారా! లెండు! మేల్కొనుఁడు. ప్రార్థనాసమయమయిన"దని చెప్పి యాతఁడు గానము ప్రారంభించును. వెంటనే శిష్యులందఱు లేచి ప్రార్థన సల్ప నారంభించి ముకుళితనేత్రులై ధ్యానయోగమున కాసీను లగుదురు. సత్యముచే శ్రీరామకృష్ణునితో నుండుటే ప్రార్థన, జపము, ధ్యానము. ఆతని పరిచయమే మహాజ్ఞానయోగము. ఆతని సాన్నిధ్యమున భగవదితరవిషయముల కెట్టితావు లేదు. సూర్యకాంతిలోఁ జీఁకటి నిల్వనట్లే అతని యద్భుతభక్తి పారవశ్యము

ముందట శిష్యులకు వేఱొకగొప్ప తలంపునకే రాదు. ఆత్మప్రభావ మచ్చట సంపూర్ణపూర్ణిమాచంద్రచంద్రికాధావళ్యముతో వెల్గొందుచుండును.

నరేంద్రుని కాస్థితి మంతయు వాత్సల్యపూరిత హృదయుఁడగు తండ్రిపజ్జ క్రీడించు బాలుని స్వేచ్ఛావిహారమువలె నుండెను. ఆతని హృదయావేశములు నాశయములు, సంశయములు విప్పి చెప్పికొని నిర్మలానందముచుఁ బొందు సమాధానము నొసంగు తావుగా నాస్థలము నరేంద్రునకుఁ గన్పట్టెను. నీ దివ్యతర విస్ఫురత్ జ్ఞానప్రదీపములతో దక్షిణేశ్వరవనము, భూగోళము సూర్యచంద్రకాంతులతో వెలిగినట్లు కాంతిమయమైపోయెను. ఒకొక్కతఱి నరేంద్రుని ప్రతివాక్యములకుఁ దా నానందపూరితహృదయుఁడై "నేను చెప్పితిని కదా" యని దీని నంగీకరింపకుము. నీతార్కికదృష్టిచేఁ బరిశీలించికొనుము. అంగీకారా నంగీకారములతో దేవుఁడు కనఁబడఁడు. అనుభవపూర్వకముగాఁ దెలిసికొను"మని రామకృష్ణుఁడు నరేంద్రునకు బోధించును. ఈవిధముగా మింటప్రచండచండకరుండు వెలిగినట్లు రామకృష్ణుఁడును, వివిధ నక్షత్రరాశివలె శిష్యగణమును, సూర్యునకు ప్రతిసూర్యునివలె నరేంద్రుఁడును లోకమునకు జ్ఞానప్రకాశమును నిత్యదానము చేయుచుండిరి.

---

## ఇరువది రెండవ అధ్యాయము.

### శ్రీరామకృష్ణబోధనాపద్ధతి : అద్వైతబోధనము.

సామాన్యముగా నాధ్యాత్మిక తత్త్వము లోకుల కరుచిహేతువైనది. విశేషమీ యాంత్రయుగమందు, నీవిచిత్ర హేత్వంధీభూతయుగమందు, నీభోగలాలసత్వపరాయణవేళ, మానవదృష్టి బాహ్యవస్తుసం

తతిని వీడి, నివృత్తి మార్గమును పట్టఁజాలకున్నది. మఱియుఁ గేవల స్వమత, స్వసంఘ, స్వదేశ, స్వజాతీయాది పాక్షికాశయ ప్రేరితులగు మానవులు పరమాత్మ సంబంధియగు మతమును ద్వేషసంఘట్టనచక్రముల నడుమఁ ద్రోసి నలిపివైచుచున్నారు. అందుచే నొకరిమత మొకరికి సరిపడదు. కాని పరమేశ్వర సాక్షాత్కారముగల మహానుభావు లప్పుడప్పు డుదయించి, యథార్థజ్ఞానబోధ చేసి వివిధమత సామరస్యము కల్పించి, మూర్ఖప్రపంచము తనివిచెందు కుయుక్తుల ఖండించి, సత్య మార్గమునకు లోకమును ద్రిప్పి వెడలుచుండుట లేకపోలేదు. శ్రీరామకృష్ణుఁ డట్టి భగవత్పూరుషుఁడు. యథార్థమతాభినివేశము పుట్టించు శక్తి యాతని కమితముగాఁగలదు.

ప్రభాతవాతపోతములు మందగతి వీచుచుండెను. తమ దుర దృష్ట స్థావరస్థితిని భరింపలేకనో, నవీన భానూదయానందముచేతనో, వృక్షాగ్రములు మంచుబిందువులచే, విచార బాష్పములనో, యానంద బాష్పములనో కార్చుచున్నవి. వృక్షబాంధవ బాష్పబిందు దర్శనముచేఁ బక్షిగణము లారావముల బయల్పరుపఁ జలించి ప్రశాంతదేవత వెనుకంజవేయ నారంభించినది. "భగవంతుఁడు సరూపియా? రూపరహితుఁడా? అవతారములు సత్యములా? కల్పితములా?" యని రామకృష్ణశిష్యబృందము మధ్య తీవ్రతర్కవాదములు చెలరేగినవి. రామకృష్ణుఁ డప్పుడే జ్ఞానసమాధినుండి మేల్కాంచి, ఆశిష్యవాదము లవిుంచి గంభీరముగా వినఁబడు నరేంద్రునికంఠనాదము నాకర్ణించెను. ఆతని ముఖము చిన్మయానందముద్రితమై శాంతికాంతిమయంబై యుండెను. శిష్యకోటిని సమీపించి యాతఁడు, గాత్రము నెత్తి యిట్లు పాడఁదొడఁగెను.

"గీ. పరమపూరుషుఁ జూడఁగాఁ బరుగులిడుచు
నంధకారములందేల యడలెదీవు?

వేదశాస్త్రాదివాదముల్ వెఱ్ఱిభ్రమలు !
ప్రేమమయమూర్తి యతఁడు పో ! వినుముమనస !"

ఇదియే రామకృష్ణుని ప్రార్థనాపూర్వకముగా బోధించుమార్గము. ఆవాక్యామృతరసమును గ్రోలి, స్మృతితప్పి, శిష్యులు నోళ్లు కట్టువడి యూరకుండిరి. శ్రీరామకృష్ణునిముంగిట నోరువిప్పి, భగవద్విషయనుమాటాడుటకు వారికిసాహసముచాలదు. రామకృష్ణుఁడుతర్కించుట, వాదించుట, బోధించుట యిదియేమియు నెఱుఁగఁడు. "సత్యమును హృదయమున శాంతభావముతోఁ జూచుఁడు. అప్పుడే భగవత్కాంతి ప్రసరించున''ని యాతఁడు వచించును.

కామినీకాంచనజయమే, భగవద్భావముతో హృదయమును నింపుట ఆతనిబోధన. భగవంతునిఁగూర్చివాదములాడుటమౌర్ఖ్యము. "శాస్త్రములు నిశ్చయములా ! వేదములు యథార్థములా ? భగవంతుఁడననేమి ?'' యని మఱొకసారి శిష్యులు వాగ్వాదములో దిగిరి. శ్రీరామకృష్ణుఁడు తనప్రేమపాత్రులగు శిష్యు లట్టి భగవద్విషయమునఁ జర్చించుటగాంచి, సంతసించి, చిఱునగవుతో నూరకుండి, గంగానదీతీరమున కరిగి నిలచుండెను. శిష్యులందఱాతనివెనుకనే నిలచిరి. అచ్చటఁ గొన్నికుక్కలొకయెముకకొఱకు కొట్లాడుచున్నవి కాని మఱొకశ్వానము, నీటియొడ్డుననున్న మాంసపుముక్కను పట్టుకొని, మాటాడక భక్షింపనారంభించెను. రామకృష్ణుఁడుశిష్యులవైపుచూచి, శ్వానమువంక తనవ్రేలుచూపి, పక్కుననవ్వెను. ఇదియే యాతని బోధన. మఱెద్దియు మాటాడలేదు. శిష్యులు లజ్జావనతముఖులై, తమ వాదములు, శ్వానగర్జనములవంటివేయని తెలిసి, మౌనము దాల్చిరి.

శిష్యులెప్పుడెప్పుడు తర్కవితర్కములలో దిగినను, రామకృష్ణుఁడు వారల మందలింపఁడు. చర్చ, సత్యకాంక్షాపూరితమైనచో జ్ఞానము లభింపకమానదు. ఎవరిహృదయమును వారు వెలిఁగ్రక్కు

కొను స్వాతంత్ర్యమిచ్చుటే యాతని మనోభీష్టము. ఐన,నరేంద్రుఁడు శిష్యులలో మకుటమై, శ్రీరామకృష్ణునాశయమును చే వెలిఁబుచ్చుచుండుటవలని, రామకృష్ణుఁడు నిశ్చలసమాధిలోఁ బడుచుండువాఁడు. కాని కొన్ని వేళల నరేంద్రుఁడు తోడిశిష్యుల నణఁచినవి, వారల యాశయముల భంగపఱచి, అగ్రిత్వము వహింప, నితరులు దీనులై నిల్వఁబడునవస్థఁజూచి, రామకృష్ణుఁడడ్డువచ్చి, నరేంద్రునెదుర్కొని, శిష్యుల కానందమొడఁగూర్చును. ఒకసమయములో, నరేంద్రుఁడు "గ్రుడ్డినమ్మకమును"గూర్చి చర్చ ప్రారంభించెను. అంతరామకృష్ణుఁడు "నరేంద్రా! గ్రుడ్డినమ్మకమన నేమి? నమ్మకమనునదే గ్రుడ్డిది. నమ్మకమునకు కన్నుగలదా? నమ్మకమనిగాని, జ్ఞానమనికాని చెప్పుము గ్రుడ్డినమ్మక మను టర్థరహిత"మని వచించెను.

అనఁగా సమస్తతత్త్వశాస్త్రములు, సమస్తవాగ్విజృంభణములు, గ్రుడ్డినమ్మకముమీఁదనే నిల్చియున్నవి. నరేంద్రుని గ్రుడ్డినమ్మకమునుగూర్చిన యుపన్యాసముగూడ గ్రుడ్డినమ్మకమేయని రామకృష్ణునభిప్రాయము. ఈవిధముగా సమస్త విద్యాపారంగతుఁడగు వివేకానందుఁడు, నిరక్షరకుక్షియగు శ్రీరామకృష్ణునెదుట పాలుత్రాగుబాలుఁడైపోవలసివచ్చెను. తమజీవితములో మఱెన్నఁడు గ్రుడ్డినమ్మకమను మాటను, వివేకానందుఁ డుపయోగించలేదు.

"మానవుని పని భగవంతుం దెలియుటే. భగవంతునిఁగూర్చి తలఁచుట మంచిదే. కాని,భగవంతునిజూచుటయే ఉత్తమము. అప్పుడే ప్రపంచము నరికట్టగలశక్తి యావిర్భవించు"నని రామకృష్ణుఁడు బోధించెను. ఆతఁడు "నీవేమిచూచితివి? నీవేమికన్గొంటి"వని యే ప్రశ్నించును. ఒకసారి నరేంద్రుని ప్రతివాది నెత్తిమీఁద శ్రీరామకృష్ణుఁడు తనకాలిడును. దానితో నరేంద్రుఁడా శిష్యునెదుట నిల్వఁజాలక, తన బుద్ధినైశిత్యమెడల నోడిపోవును. అట్టి గురూత్తముని సాన్నిధ్యమున

జీవించుటచేతనే నరేంద్రుఁడు తనధర్మసందేశము నాత్మానుభవైక సందేశముగా మార్చి, సత్యదర్శనమే మతమని బోధింపఁగల్గెను.

శ్రీరామకృష్ణునిబోధనావిశేషమంతయు నాతని పవిత్రప్రవర్తనములో నిమిడియున్నది. సర్వసాభ్రాతృత్వము నాతఁడు బోధించుచో నాతఁడట్లుజీవించి చూపినాఁడు. ఒకసమయమున సాధనచేయుచున్నతఱి సమాధిమగ్నుఁడై, శరీరము మఱచి నిప్పులమీఁదబడిపోయెను. శ్రీరామకృష్ణుఁడన్నను, నాలయమును నిర్మించిన రాణిరాస్మణి, మధురబాబులన్నను, సహనము లేని యొక మూర్ఖుఁడది చూచి కసితీర్చికొన, వెంటనేవచ్చి, తన పాదములతో రక్షించు నెపమున, శ్రీరామకృష్ణుని నిప్పులనుండి తన్నెను. ఆతన్నులకు శ్రీరామకృష్ణుఁడు స్మృతితెచ్చుకొని జరిగినసంగతిగ్రహించి, చిఱునగవు నవ్వి యూరకుండెను. రాణీరాస్మణిగాని, మధురబాబుకాని, యీసంగతి విన్నచో నాతన్నినమూర్ఖు నుఱితీసియుందురు. రాణిరాస్మణి మధురబాబుల మరణానంతరమునఁగాని, యీసంగతి రామకృష్ణుఁడు శిష్యులతోనైనఁ జెప్పియుండలేదు. ఈచర్య యెట్టిదూషణాతీత హృదయమును వెలిబుచ్చుచున్నదో! శ్రీరామకృష్ణుఁడు బ్రాహ్మణుఁడు. జాతిభేదములకు విరుద్ధముగా నాతఁడెన్నఁడుబోధింపలేదు. కాని అధఃపతితులైన అంత్యజులమీఁద నాతఁడత్యధికప్రేమచూపెను. చండాలుఁడైనఁ జేయనిపనుల నేహ్యముగాఁ జూడక మనఃపూర్వకముగా నాతఁడు చేసియుండెను. జాత్యౌన్నత్యము, కులనైచ్యము, వీనిని మఱచుటకై, శ్రీరామకృష్ణుఁడు పాకీదొడ్లను, తనశిరోజములనే చీపురుగానొనర్చి తుడిచియుండెను. అహంకారము నణఁగఁద్రొక్కు నుద్దేశముతో నాతఁడుచేసిన అవాచ్యకార్యములు వేలుగలవు. సర్వప్రపంచమును బ్రహ్మరూపముగాఁజూచినయాతనికి జాతిభేదమెచట? భగవన్మయంబగు సృష్టిలో, జాతిభేదముల కెట్లు తావుండఁగలదు.

ఆతనిబోధన మీాక్రిందిమాటలలో నిమిడియున్నది.

"భగవంతుని నీయిచ్చవచ్చినట్లు ప్రార్థింపుము. చీమచిటుకన్న నాతఁడెఱుఁగఁగలఁడు. కామినీకాంచనజయ మొకటే భగవంతునిఁ జూపఁగలదు. యథార్థసత్యాన్వేషణదృష్టి ముఖ్యతమము. అదిలేనిదే జ్ఞానము లభింపదు. భగవంతునిఁజూడవలయుననెడి దృష్టితో దేహాభిమానము నశించిపోవలెను." ఈసంగతికై యాతఁ డొక కథ చెప్పెను. ఒకగురు వొకశిష్యుని నీటిలోముంచి, గట్టిగ నొక్కిపట్టుకొని, ఊపిరియాడక మరణము కల్గుననుసూచన తెలియుసమయమునఁ బైకిఁదీసి, "మరణభీతిచే నీ వెట్లుకొట్టుకొని గింజులాడితివో, అట్లు భగవంతుం జూడ కొట్టుకొని గింజులాడు తీవ్రసంకటమునకు బాల్పడినప్పుడు నీకు భగవంతుఁడు కన్పట్టు"నని యాగురూత్తముని వాక్యములు రామకృష్ణుఁడు వచించును.

"భగవంతుఁడు రూపసహితుఁడా? రూపరహితుఁడా?" యను ప్రశ్నకు "భగవంతుఁడు రూపరహితుఁడు రూపసహితుఁడు కూడ" నని వచించును. "సర్వస్వరూపి యాతఁడే! రూపరహితుఁ డాతఁడే! దేవతలాతఁడే! ఆనందదాయి యాతఁడే! క్షేత్రమాతఁడే! క్షేత్రజ్ఞుఁడాతఁడే! అనుభవసహితావలోకనమే మతము"నని యాతఁ డుద్ఘోషించును.

భగవంతునిఁ బ్రత్యక్షముగాఁ జూచిన ఆమహానుభావుఁడు, భగవద్దర్శనము లేని జన్మమొందఁదలఁకని పరితపించు నానిర్మలహృదయుఁడు గురుశిష్యులైనచో నిఁక వలయున దేమున్నది? ఎట్టి యార్పరాని యాధ్యాత్మికాగ్నిజ్వాల లాసమ్మేళనఫలముగా బయల్వెడలి, లోకమాలిన్యముల మంటఁగలిపి, బ్రహ్మానందజ్ఞానామృతతరంగములఁ బ్రసరింపఁజేయునో యెవరు చెప్పఁదురు?

శ్రీరామకృష్ణుని బోధనామృతరసము లెన్నియో మార్గములలో ని య నంతముగాఁ బ్రవహించినను, శిష్యకోటి యెల్ల తనివిఁ జెందినను, నరేంద్రహృదయకాసారము నిండారదాయెను. ఆకాసార మెంతలోతు, ఎంత వెడల్పు గలదో కదా? నరేంద్రుఁ డేమి చేయుచున్నను, తుదకు నిద్రించుచున్నను, శ్రీరామకృష్ణుని దివ్యవిగ్రహము, దివ్యయానందవిలాసకాంతులు చిలుకుచు నాతని యెల్లయెదుట కన్పట్టి, తన్నుఁ దెలిసికొమ్మని పురికొల్పుచునే యుండును. గాఢసమాధిమగ్నుఁడై, తాను సముఖమునఁ గనుగొన్న సత్యాంశములనైన నరేంద్రుఁడు విని, విమర్శించి, సంశయించనిదే జీర్ణించుకొనఁడు. సంశయవిచ్ఛేదము కానిచో నాతఁ డేమి జరిగినను సరే ప్రతిఘటించి తీరును. ఎట్టిశుద్ధసత్త్వైకదర్శనవినిర్మలాభిలాష యాతనిపట్టి పీడించినదో కదా!

ఆద్యంతరహిత హిందూతాత్త్వికావలోకనసారము సర్వాకారపరిపూర్ణమై, యవతరించిన మూర్తియే శ్రీరామకృష్ణుఁడు నరేంద్రుఁడట్టిమూర్తి నర్థము చేసికొనుట కెన్నియాతనల ననుభవించెనో చెప్పనలవికాదు. సహజముగా నరేంద్రునిది హిందూమానసమే యైనను, పాశ్చాత్యవిద్యాశ్రయములతోడను, బ్రాహ్మసమాజపాశ్చాత్యతత్త్వతాత్త్వికాభిప్రాయములచేతను, నాతనిహృదయము హిందూమతాశయముల కెదురై పరిణమించెను. అట్లుగా నేర్పడిన నరేంద్రుని మానసము, మొట్టమొదట శ్రీరామకృష్ణుని పిచ్చివానిఁగను, హిందూమతాచారాదర్శములు పురాణకల్పితములుగను, జాతిమత సాంఘిక భేదములు దూరదృష్టి రహితములుగను గాంచెను. అట్టి మానసమే శ్రీరామకృష్ణసాన్నిధ్యమున కేగినపుడు, ప్రతిఘటించి నిల్చుట సహజమే కాని శ్రీరామకృష్ణు నపారపవిత్రతానుభవశక్తియెదుట నరేంద్రుని కుతర్కములు, కుసంశయములు, నంధకారము వగిది పటాపంచలై పోయెను.

హిందూమతసారమును గ్రహించుమార్గసూచకయంత్రము నరేంద్రున కేబ్రాహ్మసమాజమందును కన్పట్టలేదు. ఆయంత్రమును రామకృష్ణుఁడే నరేంద్రున కొసంగెను. కేవలస్పర్శమాత్రముచే, ననంతజ్ఞానజ్యోతి చూపఁగల్గి పిచ్చివాఁడుగాఁ దోఁచిన రామకృష్ణుని పిచ్చితనము, నరేంద్రుని నిశితమానసమున కతీతమైపోయెను. తాత్త్వికోచ్ఛ్వాసనిశ్వాసములు బలవత్తరములుగానున్నను, పరిపూర్ణాధ్యాత్మికరక్తనాళములు లేకఁ గన్పట్టుచున్న బ్రాహ్మసమాజమును, బ్రాహ్మసమాజనాయకాగ్రేసరుఁడైన కేశవచంద్రసేనుఁడునయితము, రామకృష్ణునే యర్చించుటయుఁగాంచి, రామకృష్ణసందర్శనముచే, నరేంద్రుఁడు తనయాత్మగురులాభమునకై సంతసింపక పోలేదు.

శ్రీరామకృష్ణబోధితుఁడై నరేంద్రుఁడు కాళీమాతయందు భక్తిపరిపూర్ణమనస్కుఁడై, సమాపభగవదారాధన పెంపొందింపఁజేసికొని క్రమముగా విగ్రహారాధనార్థమును గ్రహించి హిందూమతదత్తుఁడై పునర్మానవపవిత్రాశయనిర్మితి చేసికొనెను.

శ్రీరామకృష్ణుఁడు తన ప్రత్యక్షానుభవజ్ఞానతరంగములచే, నరేంద్రుని సంశయాత్మకమగుమానసమునుతడిపి, యానందరసముచే నింపివైచెను. అట్లుచేసియే శ్రీకృష్ణుఁ డర్జునునిచే రణరంగమునఁ గావ్యక్తించెను. రామకృష్ణుఁడు నరేంద్రునిచే లోకమునకు సమస్తాశయములచే భేదించిన పాశ్చాత్యజాతికి నివృత్తిమార్గమును బోధింపజేసెను కొలదిభేదములున్న నుండుఁగాక. రామకృష్ణుఁడు శ్రీకృష్ణతుల్యుఁడుగాకున్నచో శ్రీకృష్ణప్రతిబింబమే, నరేంద్రుఁ డర్జునతుల్యుఁడుగాకున్నచో నర్జున ప్రతిబింబమే.

శ్లో॥ జ్యాయసీ చేత్కర్మణస్తే మతాబుద్ధిర్జనార్దన ।
తత్కింకర్మణి ఘోరేమాం నియోజయసి కేశవ ?

శ్లో॥ వ్యామిశ్రేణైవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే
తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోహమాప్నుయామ్॥

అని యర్జునుఁడు ప్రశ్నించి సంశయము దీర్చికొనినచో, "కాళీ! కాళీ! జయమహాకాళీ! మాతా కాళీ!" యని హృదయమెగిరి గంతులువైవ గళరవము నెత్తి కీర్తించిన "కాళి యేమి? కాళి యెవరు? ఏమి మార్ఖ్య"మని దుర్భరసంశయాకులచిత్తుఁడై నరేంద్రుఁడు శ్రీరామకృష్ణు నెదుట నిల్వఁబడెను. శ్రీకృష్ణుఁ డర్జునుని నమ్మింపఁబూని, తనవిశ్వప్రదర్శన మొనరించినచో రామకృష్ణుఁడు స్పర్శమాత్రముచే నాధ్యాత్మికవిద్యుచ్ఛక్తితరంగముల నరేంద్రునిహృదయములోఁ జొరఁజేసి, కాళీరూపమందు నమ్మకముఁ బుట్టించి సంశయముతీర్చెను.

ఐన, నరేంద్రుఁడింకను పరిపూర్ణుఁడు కాలేదు. అర్జునున కాత్మబంధుమిత్రవధ, వేధింప, తండ్రిమరణముచే దారిద్ర్యపీడితమగుచున్న కుటుంబపోషణ మెట్లుజరుగునా? యని నరేంద్రుఁ డల్లాడెను. నరేంద్రునికి వాదోపవాదములచేఁ దలకెక్కివచ్చి బాధింప, విసిఁగి, యింటికి వెడలిపోయెను. రామకృష్ణుని కింకఁదోఁచునెట్లు? వెంటనే రామకృష్ణుఁడును, కలకత్తాకుఁ బయనించి, యొకశిష్యుని నరేంద్రునకై పంపెను. నరేంద్రుఁడు వచ్చెను. ఆతని శిరోభారముగాంచి, రామకృష్ణుఁడు తనహస్తము నాతనితలమీఁద నుంచెను. వెంటనే నరేంద్రుని భారమంతయు మాయమయ్యెను. గృహబాధలచేఁ గుములుచున్న తల్లి నెట్లోదార్చుట? కుటుంబయజమానియగు విశ్వనాథదత్తుఁడు మరణించెను దారిద్ర్యము హెచ్చెను. చేతికందిన జ్యేష్ఠపుత్రుఁడు దక్షిణేశ్వరము నాశ్రయించెను. ఇఁక దిక్కెవ్వరు? ఎట్టివిషమపరిస్థితియో చూడుఁడు. నరేంద్రునిగుండె జంకుట సహజమా? కాని భగవత్తుల్యు ననుగ్రహమున్నచో నేకొఱంతదీరదు? అట్టి ఆత్మానునయము చేకొని, నరేంద్రుఁడు మరల దక్షిణేశ్వరముఁ జేరుకొనెను.

శ్రీరామకృష్ణుఁ డాతనిదుఃఖపరికంపితాస్యమును చూచి, పరిస్థితి గ్రహించి తల్లిని ప్రార్థించుమని పంపెను. నరేంద్రుఁడట్లు చేసి వచ్చినంతనే, "నరేంద్రా! తల్లి నేమని ప్రార్థించితివి"? అని రామకృష్ణుఁడు ప్రశ్నింప, "భక్తిజ్ఞానవైరాగ్యము లిమ్మంటి"ననెను. మరల ప్రార్థింపుమని గురువంపెను. మరల నట్లు చేసి, యేమికోరితివన, మొదటిరీతినే నరేంద్రుఁడు బదులుచెప్పెను. మూడవసారి మరల నరేంద్రుని ప్రార్థింపుమని రామకృష్ణుఁ డంపెను. నరేంద్రునిహృదయమున గృహపరిస్థితి బాగుచేయుమనెడి కోర్కెయున్నను మరల నాతఁడు మొదటిరీతినే ప్రార్థించెను. కాని యీ సారి నరేంద్రునిముఖము మారి దివ్యజ్ఞానకాంతిపుంజముల నీనుచుండెను. నిక్కముగాఁ గాళీదాస్యము చేసి యాతఁ డరుదెంచెను. అప్పుడు రామకృష్ణుఁ డితరశిష్యులతో నరేంద్రునికుటుంబమున కిఁక, కాళీదేవతయే గృహాధిదేవతయై, దారిద్ర్యమును పారదోలునని వచించెను. అతఁడు వచించినరీతినే, యాదినమారంభమై, నరేంద్రుని కుటుంబమునకు లోపము రాకుండ నడచెను.

బ్రాహ్మసమాజములో నరేంద్రుఁ డేకేశ్వరప్రార్థనము, ప్రత్యేకవ్యక్తిత్వము నేర్చికొనెను. అద్వైతము రామకృష్ణుఁడు ధ్వనించినంతనే, నరేంద్రుఁడు తటాలున మారిపోయెను. "శివోహమ్" అని రామకృష్ణుఁడు వచించినంతనే, నరేంద్రుఁడు విని, "అది వట్టిమూర్ఖప్రలాప"మని వచించెను. శ్రీరామకృష్ణుఁ డద్వైతతత్త్వముబోధించు మార్గ మత్యద్భుతము. సర్వసృష్టిహేతుభూతముగా నాతఁడు మారిపోయెను. అట్లు మారిపోయి, నిర్వికల్పసమాధిమగ్నుఁడై నిల్చి, శరీరము కాలినను, లోకము దహింపఁబడినను, వత్సరములకొలఁది యాతఁడట్లుండి చలింపనే లేదు. అట్టి యద్భుతనిర్వికల్పసమాధ్యవస్థలో నిలఁబడి, పరమాత్మైక్యభావముతో నరేంద్రాత్మాంతరంగమును, తన

పరమాత్మ తాదాత్మ్యములోఁ గలిపివైచికొనియే, నరేంద్రుని కద్వైతబోధ చేసియుండెను. ఇదియే నరేంద్రునకు విశ్వరూపప్రదర్శనము. అట్టిస్థితిలోనుండి "అహంబ్రహ్మాస్మి! అహంబ్రహ్మాస్మి!" యని ఉచ్ఛ్వాస నిశ్వాసముల పైకిడి నరేంద్రు నాకర్షించెను. దానితో నరేంద్రుఁడు పూర్తిగా మారిపోయి, హిందూమతకన్యాపరిణయ మాడెను. అట్టికన్యతో నంతర్వర్తియై, క్రీడించియే నరేంద్రుఁడు ప్రపంచమున కాధ్యాత్మికశిష్యకోటి స్థాపితసుతాదికపుత్రసంతతి నొడగూర్చి తన యనంతకోటిజన్మఋణవిముక్తిం గాంచెను.

అట్టిసమయమున, నరేంద్రు నద్వైతగ్రంథములు చదువుమని రామకృష్ణుఁ డుపదేశించెను. కాని నరేంద్రుఁడు దాని కియ్యకొనలేదు ఏలన, సర్వాద్వైతసారమూర్తి యెదుటనుండ వేఱు చదువు లేల? కాని రామకృష్ణుఁడు, "నాకొఱకు చదువుము. నాకు వినఁ గుతూహల మగుచున్న"దనెను. అందుల కంగీకరించి, నరేంద్రుఁడు, యోగవాశిష్ఠము, అధ్యాత్మరామాయణము, నుపనిషత్తులున్నగునవి రామకృష్ణుని కట్టెదుట చదువనారంభించెను. నరేంద్రుఁడు చదువుటలో విశేషముగలదు. అతఁడు చదువు నద్వైతసారము గ్రంథములనుండి త్రావుచున్నట్లగపడెను. అట్టివేళల శ్రీరామకృష్ణుఁడు శరీరములో నిలువ లేకపోయెను. నిర్వికల్పసమాధియే యాతని మందిరము. ఆమందిరము ప్రవేశించి రామకృష్ణుఁ డిట్లు వర్ణించును, "సర్వము పరబ్రహ్మమయము. తెలియునది తెలియనిది, సర్వలోకములు సర్వప్రపంచములు, జీవములు, వేదములు, వేదేతరములు పరబ్రహ్మరూపములే ఆద్యంతరహితము, ఆద్యంతసహితము నగు నవన్నియు నాపరబ్రహ్మమే. సత్యమే పరబ్రహ్మము. పరబ్రహ్మేతరమయినది లేదు. ఇట్లు తలఁచువాఁడే పరబ్రహ్మము" ఇట్టిబోధన శ్రీరామకృష్ణుని నోటవిని, నరేంద్రుఁ డద్వైతకేసరియై, నాస్తిక జనారణ్యము

లో నతితీవ్రముగా విజృంభించి, దంభప్రకృతిశాస్త్రకుతర్క-వృక్ష శాఖల నమలివైచి, "శివోహ" మ్మను సింహగర్జనముచే, లోకమును మోహింపఁజేయు టొకయబ్బురమా?

---

## ఇరువదిమూఁడవ అధ్యాయము.

### నరేంద్రుని శిష్యత్వము—మానసపరివర్తనము.

శ్రీరామకృష్ణా! శిష్యునికొఱకై వెదకులాడి, ప్రతిఘటించిన ను ప్రేమించి, కడుపార కన్నబిడ్డకన్న వేయిమడుఁగు లాదరించి, భగవద్దర్శనము చేయించినఁదాఁక నీకుఁ దోఁచినదికాదే! ఆహా! నీ బోఁటి గురుకటాక్షముఁ గాంచుజన్మ మెప్పుడు లభించునోకదా! ధన వాంఛాలుబ్ధులగు గురునామక్రూరభుజంగరూపులను చూచి విసిగి వేసారితిమి తండ్రీ!

నరేంద్రుఁడు తా నొక నిజమగుహిందువు ననిపించుకొనుటకై నేర్చినవిద్య నొసఁగిన ఋణదాత రామకృష్ణుఁడే. అట్టిదాన మొసఁగుటలో ననంతశాంతి వివేకములు రామకృష్ణుఁడు చూపవలసివచ్చెను. శ్రీరామకృష్ణుఁడు బోధించినది తాను భగవంతునిఁ బ్రత్యక్షముగాఁ జూచినజ్ఞానవాక్యములచేతనే. అట్టి ప్రత్యక్షమైనభవపరిపూర్ణుఁడగు నరేంద్రుఁడు రామకృష్ణునిబోధన గ్రహించుటలోఁ గష్టములకు, సంశయములకుఁ బాల్పడుటయేకాక, కొన్నివేళల మూర్ఖప్రతిఘటనము కూడఁ జేసియుండెను. అట్టిచో రామకృష్ణుఁ డవ్యాజానుకంపాతరంగితాంతరంగుఁడు కానిచో నేమి జరిగియుండునో యోచింపఁదగును. కాని రామకృష్ణుఁడు జ్ఞానమునకు శంకరాచార్యుఁడు, కారుణ్యమునకు శ్రీచైతన్యమూర్తి. శంకరాచార్యుని ధీశక్తి, చైతన్యుని మృదులహృదయము నేకమై, రామకృష్ణునిఁగా మారినవి. బోధించునపుడు తాను శంకరుఁడై, ప్రతిఘటింపఁబడినపుడు చైతన్యుఁడై, రామకృష్ణుఁడు

నిల్వఁగల్గెను. పరిపూర్ణాధ్యాత్మికేతరజ్ఞానమూర్తియై అభినవభారతభాగ్యరత్నమై, యొసఁగిన నరేంద్రుఁడు, ప్రాచీనభారతజీవసూత్రావతారమై, భగవత్సాక్షాత్కారభాగ్యుఁడై యొప్పిన రామకృష్ణునెదుట నిలఁబడెను. విశేషము నరేంద్రుఁడు పండితుఁడు. వ్యావహారికజ్ఞాని. లోకము నెఱింగినవాఁడు. రామకృష్ణుఁడు నిరక్షరాస్యుఁడు, లోకజ్ఞానహీనుఁడు, వ్యావహారికజ్ఞానాంధుఁడు. కలభేదమేమన, రామకృష్ణుఁడెయ్యది తెలిసిన నిఁకఁ దెలియునవసరము లేదో, అట్టి భగవద్జ్ఞానమునెఱింగినవాఁడు. ఎయ్యది తెలియకున్న, నన్ని తెలిసినను వ్యర్థమో, అది తెలియనివాఁడు నరేంద్రుఁడు. తెలిసికొనునభిలాషమాత్రమపరిమితము. వీరిర్వురసమావేశము పూర్వ, తాప న్యాయమయ్యెను. అదియే అద్భుతము.

నరేంద్రుఁడు పారమార్థికచర్చలో లౌకికవాదముచే నెగ్గఁజూచినపుడెంతయు నోర్పువహించి, "నరేంద్రా! యథార్థము నన్నివైపులనుండియుఁ జూడుము. నాజీవితమంతయు నిట్టియత్నములందే గడచి గట్టెక్కినది. ఇది మఱువకుము. భక్తిమయజ్ఞానమే జ్ఞాన" మని రామకృష్ణుఁడు హెచ్చరించుచుండును. ఇట్టితరుణమందుఁగూడ నరేంద్రుఁడు భీష్మించుచో, రామకృష్ణుఁడు మానవత్వములోఁబడి, సహనము చూపఁజాలకుగ్రుఁడై "వెడలుము! ఇఁకపై నిచటకు రాకు" మని నరేంద్రుని వెడలఁగొట్టును. నరేంద్రుఁడు నిశ్శబ్దముగా బయటికిఁబోయి, యొకింతలోఁ బశ్చాత్తాపతప్తుఁడై, తానుతొందరపడినట్లు గ్రహించి, హృదయము మెత్తపడ, వెంటనే వెనుకకరిగి, రామకృష్ణునెదుటఁ జేతులు జోడించి, నిల్వఁబడును. రామకృష్ణుఁడును, నరేంద్రుని సుశీలముఁగాంచి, యాతఁడు తన్ను దూషించుటకొఱకు గాక, నిజసంశయవిచ్ఛేదనార్థమై యట్లు ప్రతిఘటించెనని తెలిసికొని మఱల ప్రేమపూర్వకముగాఁ గౌఁగిలించుకొనును. ఇట్లుగా రెండు

మూఁడుసారులుమాత్రమే జరిగెను. అనఁగా రామకృష్ణుఁడు తన జీవితములో మానవచపలత్వమునకు రెండుమూఁడుసారులే లోన య్యెను.

శ్రీరామకృష్ణుఁడు రాధాకృష్ణులఁ గూర్చి బోధించుచు, రాధ చూపినప్రేమ, దైవసందర్శనలాలసత్వముచే జనించిన శుద్ధప్రేమ యనియు, భగవద్దర్శనవియోగజన్యమగుప్రేమయే యట్టితీవ్రతం జెందుననియు, వచించును. రాధయొక్క పురాణప్రోక్తబాహ్యప్రవర్తనాదికము కేవలవాంఛాన్వితమని నరేంద్రుఁడు కొట్టివేయును. అప్పుడు నరేంద్రునిఁ జేయి పట్టుకొని, "పరమేశ్వరస్వరూపుఁడగు శ్రీకృష్ణపరమాత్మయందలి రాధయొక్క యింద్రియాతీతపవిత్రప్రేమపూరితహృదయమును నీవు విడువఁగలవా?" యని రామకృష్ణుఁడు ప్రశ్నించును.. ప్రేమయే ముఖ్యము. ప్రేమప్రదర్శనమార్గ మప్రధానమని నరేంద్రు నొప్పించును. తుట్టతుదకు యథార్థతత్త్వమును నరేంద్రుఁడు గ్రహించి, రామకృష్ణు నుత్కృష్టజ్ఞానమున కచ్చెరు వందును.

"నరేంద్రా! నీకు శక్తియున్నచో వర్తకులు రూప్యముల మోగించి,.నాణెము చేసినట్లు నన్ను పరీక్షించుము. అట్లుపరీక్షించకుండ నన్నంగీకరించుమార్గము నీకు సరిపడ"దని రామకృష్ణుఁడు వచించును. ఈమాట జ్ఞప్తియందుంచుకొని ఒకనాఁడు నరేంద్రుఁడొక విచిత్రము చేసెను. రామకృష్ణుఁడు శిష్యసమేతుఁడై కలకత్తాకు వెడలెను. నరేంద్రుఁడువచ్చి, రామకృష్ణుని గదిలోఁ జేరి, యొక వెండినాణెమును, రామకృష్ణుఁడుపరుండుపఱుపుక్రింద పెట్టెను. కలకత్తానుండితిరిగివచ్చి, రామకృష్ణుఁడలసి, పఱుపుపైఁ గూర్చుండెను. వెంటనే యాతనిశరీరము గగుర్పొడిచెను. మంటలెత్తెను. వణకిపోయెను. కారణ మెవ్వరికిఁ దెలియదు. వెంటనే శిష్యుఁడొకఁడు, పఱు

పుత్తడి, పురుగే దేమున్నదే మోయని, చూచి, పాన్పు దులుపఁగా, నా ణెండినాణెము క్రిందఁబడెను. “ఇది యిచ్చటి కెట్లువచ్చిన”దని రామకృష్ణుఁడు ప్రశ్నించుచుండఁగా, నరేంద్రుఁడు నవ్వుచు మెల్లఁగా బయటికిఁ జనెను. నరేంద్రునిముఖలక్షణము గాంచి, సంగతి గ్రహించి రామకృష్ణుఁ డాశ్చర్యభరితుఁడై, నరేంద్రు నమితముగాఁ బ్రేమింప నారంభించెను. కాంచనజయంబునకై చేయు సాధనసముదాయమున, రామకృష్ణుఁడు తనకర్మేంద్రియములను నివృత్తిమార్గమున కత్యద్భుతముగాఁ ద్రిప్పి, శుద్ధవైరాగ్యపూతము లొనర్చియుంటచే, నాయింద్రియము లప్రయత్నముగా, తీవ్రతమాభ్యాసముచేఁ గాంచనాదిలోహపు టునికి గ్రహించి, వణఁకుస్థితిలోఁ బడిపోయినవి. ఎట్టి యద్భుతజితేంద్రియత్వమో కదా !

రామకృష్ణునిశరీరము నిరంతరసాధనపరిశ్రమముచేఁ గుమ్మరిచేతిలోనిమంటిముద్దవలె వంగి సాగిపోయెను. “యీస్థితి సామాన్యమానవస్థితి. నాహృదయము నిరంతరసమాధిమగ్నమై యుండును నేను యీస్థితికి వచ్చుటకై, నాయింద్రియములను మేల్కొల్పి, గట్టిప్రయత్నమును చేయవలయు”నని రామకృష్ణుఁడు వచించును.

శివాభిషేకముచేయుటకై, భక్తిప్రపూర్ణుఁడై రామకృష్ణుఁడంజలితో నీరుపట్టి తెచ్చుచుఁ దన్మయుఁడై, దారిలోఁ బడవిచ్చును. పుష్పములు విష్ణునిఁబూజింపఁగోయుచు, వివశుఁడై ఆకులను కోయ నారంభించును. నైవేద్యము చేయునపుడు, కాళీలగ్నమానసుఁడై, స్మృతిదప్పి నక్లైరములను ఫలపుష్పములతో, హారతిదీపముతో నెత్తినిడుకొని, శిరోజము లంటుకొన్నను తెలియక నిల్వఁబడును. ప్రార్థనయనుసరికే యాతఁడు సర్వము మఱచును. మహమ్మదీయుఁడు, వైష్ణవుఁడు, శైవుఁడు, శాక్తేయుఁడు, క్రైస్తవుఁడు, బౌద్ధుఁడునై, రామకృష్ణుఁడు మఱుసటిక్షణములో నద్వైతియై నిలఁచిపోవును.

ఇట్లు ప్రతిక్షణము, భగవదర్పితసర్వప్రాణుఁడై, యాతఁడు విహరించును నరేంద్రుఁడు నట్టిగాఢభక్తిచేఁ దన్మయత్వము నందుయత్నము చేయు గురుశుశ్రూష చేయుచుండెను. మఱుక్షణ మేమిజరుగునో రామకృష్ణున కవసరము లేదు. జరుగుచున్ననిముసమున, భగవద్ధ్యానముతో జీవితమును గడపవలెను. ఇట్లున్నస్థితిలో నాతనికి, మత్తుగల్గించుటకై, ఒకఁ డాతనికి మూఁడునల్లమందుమాత్రలిచ్చి మూఁడుదివసములు సేవింపుమనెను. రామకృష్ణుఁ డవి తనకొంగున మూటకట్టుకొనెను ఆక్షణము మొదలాతఁడాలయమునకుఁ బోవుదారి మఱచి, డొంకలకష్టపడెను. ఆతనిజ్ఞాన మడుగంటెను. తరువాత నాతఁడు స్మృతిదెచ్చికొని, "ఓహో! నాకొంగున నల్లమందుమాత్రలున్నవా?" యనితలఁచి మూటవిప్పి, వాని నవ్వలవిసరినంతనే, యాతనికి మార్గము విదితమయ్యెను.

ఒకసారి, శిష్యులందఱు భగవచ్చరణాద్యవయవరూపులనియు నందు నరేంద్రుఁ డుత్తమాంగమనియు వర్ణించి, సప్తఋషులలోనొకఁడై నరేంద్రుఁ డుదయించెనని చెప్పెను.

బ్రాహ్మసమాజసభ్యులు కొందఱు, నరేంద్రుఁడు యోగపరిశ్రమలచేఁ గృశించి క్రుంగిపోవునని భయపెట్టిరి. నరేంద్రుఁ డది నమ్మెను. అంత రామకృష్ణుఁడు, "భగవంతుండెలియు యోగవిద్య క్షీణింపఁజేయుచు. అనంతానందసాగరము జూపును. అట్టియోగానందసాగరవారిని రుచిచూచుటే అమర్త్యత్వ"మని బోధించెను.

ఎచ్చటనున్నను శిష్యులందఱకు రామకృష్ణునివిగ్రహము ప్రత్యక్షమే! ఒకశిష్యుఁడు తాను దక్షిణదేశమున నున్నపుడు తన్ను రామకృష్ణుఁడు ముట్టుకొన్నట్లు కన్పట్టెనని వచించి, అది నిజమా? యని నరేంద్రుని ప్రశ్నింప, "నా కట్లనేకసహస్రపర్యాయములు గన్పట్టె" నని యాతఁడు బదులుచెప్పెను.

స్వగృహపరిస్థితుల నెట్లైన సవరించి, పరిపూర్ణసంగత్యాగ మొనర్చెదనని నరేంద్రుఁడు యత్నించి, యాకులమానసుఁడయ్యెను. అదిగ్రహించి, "నరేంద్రా! మఱునటిక్షణమునుగూర్చి తలఁచుచో నీ వెన్నఁడు సర్వసంగపరిత్యాగివి కాఁజాల"వని రామకృష్ణుఁడు బదులు చెప్పెను. అంతనరేంద్రుఁడు, తాను పంచవటిబిల్వవృక్షములక్రింది యాసనములమీఁద ధ్యానమారంభించెదనని చెప్పఁగా, నాతఁడు సంతసించి, "నరేంద్రా! నీవు కళాశాలకుఁబోవా?" యని ప్రశ్నించెను. అందుల కుద్రిక్తుఁడై, "నేను కళాశాలలోఁ జదివినదంతయు మఱచి పోవుట కెద్దియైన మందు నొసంగినచో నే నెంతయుఁ దృప్తిచెందెద" నని నరేంద్రుఁడు వచించెను.

నరేంద్రుఁడు క్రమముగా భావసమాధిలో నుండఁ గోరెను. అనేకసాధనల్బందునిమిత్తముచేసి, యొకనాఁడు గురువుతో, "తండ్రీ! నే నెన్నియో సాధనలఁ జేసితిని. ఇంద్రియముల జయించితిని. కాని నాకు నూతనమెద్దియుఁ గన్పట్టుట లేదు. అనుభవించిన జ్ఞానమంతయు నాకు నూతనముగనే కన్పట్టుచున్న"దని సంశయముతోఁ బల్కెను. అంత రామకృష్ణుఁడు, "వత్సా! నీకు భయములేదు. గుంటలో దిగినచో మత్తగజేంద్ర మందలినీటిని చెల్లాచెదరు చేయును. కాని అదియే గంగాస్రోతస్సులోఁబడిన నలజడియే యుండదు. అట్లే నీహృదయము గంగాస్రోతస్సువంటిది. భగవత్ జ్ఞానగజేంద్రము నీ హృదయమునఁ బ్రవేశించి నిన్ను చలింపఁజేయఁజాలకున్నది. ఇతరశిష్యులలోఁబడి, చలనము, నూతనవికాసము గల్గి, అలజడికి హేతువైన"దని రామకృష్ణుఁడు వచించును.

ఒకసారి, నిర్మలాద్వైతతత్త్వములోఁబడి, నరేంద్రుఁ డిట్లుపన్యసించెను. "ప్రపంచనిర్మాణమంతయుఁ బైశాచికహేత్వాధారము. నేనైన నింతకన్న మంచిలోకమును సృజింపఁగలను. అయినను, మనకు

భగవంతునం దనంతభక్తిప్రేమలుంచి, సర్వము భగవన్మయమనియు, నేనే సర్వము చేయుచుంటిననియు, నానాజననమరణాదికముల ఫల హేతువును నేనే యనియు, నమ్మి, సర్వమును భగవదర్పితబుద్ధితోఁ జేసినచో బాధములు నశించును"

నరేంద్రు నెవ్వరైన దూషించుచుండ విన్నచో శ్రీరామకృష్ణుఁడు సహింపఁడు. వెంటనే, "నరేంద్రుని దూషించుట శివనింద యని తెలియు"మని గర్జించును.

ఈవిధముగా రామకృష్ణుఁడు నరేంద్రునకు, భగవద్జ్ఞానబోధ చేసి, క్రమముగాఁ గాళీయర్చననుండి, "తత్త్వమసి" జ్ఞానములోనికి దింపి, "శివోహమ్" మంత్రముపదేశించి, వేదాంతమృగరాజముగా మార్చివైచెను. రామకృష్ణునినోట మాటవెడలినదే తడవుగా, విమర్శించి నరేంద్రుఁడు భక్తిపురస్సరముగా గ్రహించి, రామకృష్ణతుల్య జీవనమునకై పరితపించుచు, నద్వైతతత్త్వసిద్ధికై దినదినప్రవర్ధితజ్ఞానాధికుఁడై, పెంపొందుచుండెను.

నరేంద్రుని శిష్యత్వము బహుచిత్రమైనది. తీవ్రనాస్తికవాదిగా నాతఁడు రామకృష్ణుని దర్శించెను. ఆతీవ్రత నాతఁడు కొంతకాలము నిల్పి, రామకృష్ణుఁ డేమిచెప్పినను, పరిపూర్ణాస్తికాశయపూరితమగుటయే కాక, బాహ్యవిగ్రహారాధనరూపమయియుండుటచే, వెంటనే ప్రతిఘటించెడి యవసర మాతనికి తప్పినది కాదు. కాని ప్రతిఘటించిన ప్రతిపర్యాయము రామకృష్ణుఁడు తన యాధ్యాత్మికవికాసముచే నాతని హృదయము నావరించిన వాదాభిలాషను, నాస్తికతను, క్రమముగా మార్చుచువచ్చెను. నరేంద్రుని హేతుభూతశేముషీ ప్రభావమును, క్రమముగా నణఁగఁద్రొబ్బి, సహజజ్ఞానధురీణమగు హృదయమునకుఁగల గ్రంథుల నొకటివెనుక నొకటి, రామకృష్ణుఁడు

విడఁగొట్టనారంభించెను. ఆయాపరిణామాంతరువు ఎట్లుగడచినవో వెనుకనే చెప్పఁబడియుండెను. ఆతనిహృదయము ఎట్లు వికసించి పరిపూర్ణతనందెనో ముందు తెలియును.

నరేంద్రుని హృదయపరివర్తనమును బాగుగాఁ దెలిసికొనుటకు నరేంద్రునితో రామకృష్ణునెదుట కూర్చుండు నెడఁ గొంత సాధ్యమగును. భగవద్దర్శనము చేసినగురుశిష్యుల మనోభావములు తెలియుటెంతకష్టమోకదా !

ఇదివఱకున్న ప్రతిఘటనభావము లన్నియు నరేంద్రునియందు లీనమైపోయి, బహిఃప్రకటనమును మానుకొన్నవి. నరేంద్రునిహృదయము లేచి, శ్రీరామకృష్ణహృదయముతో నైక్యీభవింపనారంభించినదో, శ్రీరామకృష్ణునివచనములే చెప్పును శ్రీరామకృష్ణుఁ డొకసారి, భగవంతునిఁగూర్చి మాటాడుచుండఁగాఁ దదేకదృష్టితో నరేంద్రుఁడు వినుచుండియు విననివానివలెఁ గూర్చుండెను. "నరేంద్రా ! నేఁ జెప్పువాక్యములు విను"మని శ్రీరామకృష్ణుఁడాదరముతోఁ బల్కెను. "నీమాటలు వినుటకు నేనిచటకు రాలే"దని నరేంద్రుఁడు బదులుచెప్ప, "మఱెందులకువచ్చితి" వని రామకృష్ణుఁడు మఱల ప్రశ్నించెను. ఈప్రశ్నకు నరేంద్రునిహృదయము ప్రేమపక్షములకట్టుకొని, తీవ్ర్వనఁ బైకెగసి "నీచే నే నాకర్షింపఁబడితిని. అందుచే నిన్ను నేఁ ప్రేమించితిని. నిన్నుఁ జూచుటకే నేను వచ్చితి"నని సమాధానమిడెను. వెంటనే బ్రహ్మానందభరితుఁడై, రామకృష్ణుఁడు లేచి నరేంద్రునిఁ గౌఁగిలించికొనెను. తదాలింగనముతోడనే గురుశిష్యభేదభావమంతరించినది. దేహస్మృతినెఱుంగనియాత్మ ప్రేమలత లొండొరుల నప్రయత్నముగా నల్లుకొనినవి. శ్రీరామకృష్ణుఁడు శ్రీమన్నారాయణావతారమని నరేంద్రుఁడు నమ్మెను. శ్రీరామకృష్ణుఁడు యథార్థగ్రంథము. అగ్రంథపత్రములలో భగవంతుఁడు చిత్రింపఁబడి

యున్నాఁడని నరేంద్రుఁడు తలఁచెను. ఆతరువాత తోడిశిష్యులతో ముచ్చటించుచు, నరేంద్రుఁడు, "శ్రీరామకృష్ణుఁడొక ప్రేమావతారమూర్తి" యని వచించెను. శ్రీరామకృష్ణుని బుద్ధినైశిత్య మెట్టిదో పిచ్చినమ్మకమునుగూర్చి యుపన్యసించుటయుఁ బిచ్చినమ్మకమే యని యాతఁడు చెప్పినపుడే నరేంద్రునకుఁ దెలిసెను. నరేంద్రుఁడేమిమాట్లాడినను, శ్రీరామకృష్ణుఁడు "నీవుచూచితివా" యనియే ప్రశ్నించును. చూచుటయే, సత్యప్రత్యక్షదర్శనమే శ్రీరామకృష్ణుని బోధన, నరేంద్రుడు తెలిసికొన్నది.

ఒకనాఁడు సంకీర్తనముచేయువిధానము రామకృష్ణుఁడు శిష్యులకు బోధించుచుండెను. అందఱు గదిలోఁ గూరుచుండిరి. నరేంద్రుఁడు మృదంగమును వాయించి, అలసి వసారాలోనికిఁ జనెను. రామకృష్ణుఁడు సమాధినుండి లేచి, నరేంద్రుఁడు లేడని చెప్ప విని, "ఏమియుఁ గొఱఁత లేదు. ఆత్మాగ్ని నాతఁడు ముట్టించి వెడలినాఁడు. ఇఁక నాతఁ డెచ్చటనున్ననేమి ?" యని వచించి, తనధైర్యమును ప్రేమ లొంగఁదీయ వడివడి వసారాలోని కరిగి, "నరేంద్రా! నీ వేమి యిచట పల్కుచుంటి"వని యడుగ, "మానవసామాన్యుల కర్థముకాని మహావేదాంతతత్త్వమునుగూర్చి మాటాడుచుంటి"నని నరేంద్రుఁడు బదులిడెను. ఆమాట విని రామకృష్ణుఁడు నవ్వి, "నీయిచ్చవచ్చినరీతిని మాటాడుము. కాని ప్రేమమయమగు భక్తియు, విశుద్ధతర్కయుక్తమగు జ్ఞానము రెండు నొకటియనిమాత్ర మెఱుంగుము. కాని రెంటిలో భక్తిమార్గమే సుకరము. ఇది తెలియు"మని వచించెను. ఈబోధనామృతమును నరేంద్రుఁడు ద్రావి, మత్తిలి, గురువునను సరించుసూచనను ప్రార్థనతోఁ గలిపి, "అవును ! తత్త్వవేత్తవలె వాగ్విజృంభణము చేయు టనవసరము. తల్లీ ! నీయవ్యాజప్రేమచే నన్ను ప్రేమోన్మాదునిఁ జేయవా" యని వచించి "నేను హామిల్టను

చదువుచుంటిని. పాండిత్యసహితమగు నజ్ఞానమే సకలతత్త్వశాస్త్రముల కంతము, మతమున కాదియని యున్న"దని నరేంద్రుఁడొక శిష్యునితోఁ బల్కెను.

నరేంద్రుని హృదయములోఁ దార్కికాంకురము లున్మూలితములై ప్రేమాంకురములు మొలకలెత్తెను. నరేంద్రుని నఖండధిషణాప్రదీపము కాంతిరహితమై యారిపోయినది. తార్కికనాదఘోష యణఁగిపోయినది! బుద్ధి, మానసాదీంద్రియములు, నిర్మలప్రేమమయ భక్తికిరణప్రసరణసాధనములుగా మారినవి. భగవద్దర్శనైకలాలసత్వ మాతని కధికమై పోయినది. శ్రీరామకృష్ణమకరంద భాండమునాతఁడు త్రావుటకై నిశ్చయించుకొని, ఆప్రయత్నము నాతఁడు వీడుచో లోకము తనమూలమున మోసపోవునని తలంచెను. ఆరామకృష్ణజ్ఞానామృతభాండమునకు, బయటికిఁ బ్రవహించుగోట్టమాగా నరేంద్రుఁడు మారనారంభించెను.

---

## ఇరువదినాలుగవ అధ్యాయము.

నరేంద్రుని మూర్తిమత్త్వము: ఆతఁడు రామకృష్ణుచే నెట్లుగాఁజూడఁబడెను?

ఇంతవఱకు మనము నరేంద్రుని హృదయపరిణామక్రమంబును తెలిసికొంటిమి. ఆతనిమూర్తి యెట్లుండెనో తెలిసికొను టవసరము కాకపోదు.

సాధారణముగా మహాపురుషులబుద్ధి, మానసము, ఇంద్రియములు, శరీరావయవములు, నాత్మతేజఃప్రకాశమున కనుకూలములుగా నే యుండును. ఆత్మజ్యోతి యఖండముగా వెల్గవలయునా నరేంద్రుని శరీరము పరిపూర్ణాంగసౌందర్యరాశియై యేలయుండదు?

ఇప్పుడు నరేంద్రుఁ డనాఘ్రాతపుష్పమురీతిని యౌవనసంపత్పరిపూర్ణుఁడై, యెక్కుడుపొడుగు, నెక్కుడుపొట్టియుఁగాక, సమానౌన్నత్యముచే నలరారుచుండెను. ఆతనివిశాలవక్షస్థలము రేఖలు దీర్చినట్లున్న యాతనిపరివ్యాప్తభ్రూమధ్యభాగము, నాతనిధవళాంబుజపత్రనేత్రములు, నెంతయు గంభీరముగ నున్నవి. సౌందర్యమంతయు నాతని యాకర్ణాంతచక్షుర్యుగమ్మునసే యిమిడియున్నది. అవి యోగినేత్రములు ఆతనిదృష్టి యోగిదృష్టి. ఆదృష్టియే చూపఱ నాకర్షించినది.

ఆతఁడు పల్కునపుడు ప్రపంచమున నాతఁడు తప్ప వేఱొద్దియుఁ గన్పట్టదు. ఆతనిమాటలు మోహనబాణములవలె, నెట్టిహృదయమునైన నరికట్టఁగలవు. ఆతనిశరీరము కొంచెము స్థూలమై దైర్ఘ్యమునకు సరిపోయి, లావణ్యమును పెంపుచేసెను. సర్వావయవములలో నొకవిధమగు దివ్యశక్తి నిరంతరము, కెరలి ప్రకేళ్ళురుకుచున్నట్లుండును.

కాని యాతనిముఖమే యెన్నటికి మఱువరానిది. మానసాంతర్గతములైన వివిధవిచిత్రభేదాభిప్రాయము లాముఖపటమున, విస్పష్టముగాఁ జిత్రింపఁబడును. మల్లికాముకుళధావళ్యము నధఃకరించు నాతనిరదపంక్తి, హృదయపారిశుద్ధ్యమును, నిశ్చితనిగూఢదృష్టిని వెలిఁగ్రక్కుచుండును. కాని యాతఁ డాధ్యాత్మికావలోకనములో నున్నపు డాతనిముఖము భీతిప్రదమైయుండును. మిత్రబృందములో నున్నపు డాతనివదనమున బాల్యోత్సాహకళ, నిరాడంబరత్వము వ్యాపించి, యద్భుతరసము నొలికించుచుండును. ఆతనిముఖస్థితి కొన్నివేళలఁ బరిపూర్ణసంగరహితత్వమును వెలిబుచ్చి, మిత్రబృందమును దూరమునకు వెడలనడచును. ఆతనికార్యక్రమమున కడ్డుకల్గించు మూర్ఖలోకమును గూర్చి తలఁచనపు డాతని నాశనాశమలనుండి, మ

హాదావేశపూరితతీక్ష్ణనిశ్వాసములు లోకమును కంపింపఁజేయునట్లు బయల్పడును. పరమేశ్వరైకార్పితఫలబుద్ధితో నాతఁడు గీతములు మృదుకంఠమునెత్తి, మనోహరముగా నాలపించునపు డాతనియాస్యము భక్తిప్రపూరితమై పూర్ణచంద్రమండలమును కళంకిత మొనర్చును. ఈవిధముగా నరేంద్రుని మూర్తిమత్త్వము నిర్మింపఁబడి సర్వజన మనోరంజకముగా, నయ్యైవేళల భక్తిజ్ఞాన వైరాగ్యహాస్యరసములఁ బ్రదర్శించుచు నెంతయు దర్శనీయంబయి యుండును

తన పవిత్రతరధీమహిమ హృదయాంతర్గర్భితప్రేమజ్యోతిచే నలంకరింపఁబడినదాది, నరేంద్రుఁడు తానొకమహాకార్యము చేయ వలసియుండెనని నిశ్చయించుకొనెను. పరిపూర్ణాత్మనిశ్వాస మాతనిలో మూర్తీభవించినది. భగవత్తుల్యమూర్తి యగు శ్రీరామకృష్ణుని హృన్నివసితజ్ఞానామృతమును లోకమునఁ జవి చూపు నమ్మహాభార మాతనిమీఁదనే పడుచున్నదని యాతఁ డప్పుడే గ్రహించి, అట్టి యదృష్టము తనకే యబ్బెనని, తనలోఁదాను మెచ్చుకొనుచుండును. శ్రీరామకృష్ణదివ్యఫలరసము, నరేంద్రశుకరాజముఖమ్మున నప్పుడే, నరేంద్రుని కళాశాలావిద్యార్థిబృందములోఁ జొరనారంభించినది. ఆతనితో మాటాడువారు, నాతనితో గలసికొనువారు, చూచువారు, వినువారు, నాతనిఁగూర్చి ప్రసంగించువారు నఖండాధ్యాత్మికావేశపూరితులై, పరమార్థైకదృష్టిలాభమునకై, జీవితముల వెచ్చింపవలయునని యుద్రిక్తులగుచుండువారు

తన యాత్మనిశ్వాసమును గూర్చియుఁ దన భావిమహాదశను గూర్చియుఁ దనమిత్రమండలితో నాతఁ డిట్లు ప్రసంగించును "మీరు పెక్కుచదువు నెడ న్యాయవాదులు, వైద్యశేఖరులు, న్యాయాధిపతులు కానగుదు. ఆగుఁడు. నామార్గమును మీరు చూచెదరు కాక." నరేంద్రుఁడు శ్రీరామకృష్ణదర్శనలాభహీనుఁడై, వివేకా

నాయకుఁడు కాకున్నను, తానుకోరినట్లు కేశవచంద్రసేనునివంటి మహా నాయకుఁడైన నయి యనేకసహస్రముల నాకర్షించి యుండెడు వాఁడు. కాని కేశవచంద్రునిమించి, లోకము నరికట్టు సనాతనధర్మ సందేశకుఁడై, సర్వసంగపరిత్యాగచక్రవర్తియై నూతనభారతభాగ్య నిర్మాణాధారుఁడై, నరేంద్రుఁడు వెలుఁగవలసి యుండెను. బ్రాహ్మసమాజములో నాతనికెందరో మిత్రులుకలరు. కేశవచంద్రసేనుని, నవబృందావననాటకమున నాతఁడు యోగిపాత్రను ధరించినపుడు, శ్రీరామకృష్ణుఁడునయిత నచటికరుదెంచి, చూచి నరేంద్రునితో, "నరేంద్రా! ఆనుష్ఠులతోడనే నాయొద్దకొకమారువచ్చి పో"మ్మని ప్రేమాంతరంగుఁడై పల్కెను.

నరేంద్రుని జగద్విఖ్యాత వివేకానందునిఁ జేయఁగల్గిన వాతని బాధించినదారిద్ర్యము, శ్రీరామకృష్ణదర్శనమును. దారిద్ర్యమును నిమసనాఁగలి యాతని సామాన్యహృదయభూమిని దున్ని, నిర్మలినము చేసి, నిర్నిధనప్రేమబీజములనాటి, వెడలిపోయినది. ఆబీజాంకురములను శ్రీరామకృష్ణ పరమహంస తనయఖండ జ్ఞానామృతరసముచేఁ దడిపి, పెంచి, లోకమోహనాధ్యాత్మికఫలసంతతి కాలవాలము చేసి, చెల్వొందెను. శ్రీరామకృష్ణనరేంద్రులకుఁ గలతారతమ్యములఁ గూర్చి నరేంద్రుఁడే యిట్లు చెప్పియుండెను. "జ్ఞానులు చూచుట కసహ్యముగానుందురు. భక్తు లవశ్యదర్శనీయులు. రామకృష్ణుఁడు బాహ్యమునకు భక్తాగ్రేసరుఁడు. అంతర్యమున జ్ఞానమూర్తి. నా హృదయ మనంతభక్తిమయము. కానినా బాహ్యదృష్టి జ్ఞానరూపము."

మహాపురుషులు మాతృగర్భమునుండి వెల్వడినదాది, వారు చేయునగు కార్య మెట్టిదో, దానినే దృష్టినిడుకొని, వారికి లోకమంతయు నడ్డై నిలచినను, ప్రాణాంతమైనను, మఱెట్టి యెట్టిఘోరవిపత్తులు వ్యాప్తముగ మీఁదఁబడినను, ఉరికంబము నెక్కవలసివచ్చినను,

మింటికెగయు నగ్నిజ్వాలామయమగు గుండమున నెఱుకవలసివచ్చినను చలింపక, ధర్మమార్గమునవనే, సత్యపరణినే, మృగేంద్రగాంభీర్యముతోఁ గార్యరంగమునఁ గాల్వెట్టి, ముందునకేపోయి, తమజీవిత గమ్యస్థానమును చేరువరకును విశ్రాంతిఁగొనరు ఆహా! వారిదేకదా! ధన్యతమజీవితము వారిచరితమేకదా దివ్యామృతము !

శ్రీరామకృష్ణుఁడు త్రికాలసంవేది. పూర్వము మహర్షిపుంగవులకుఁగల దివ్యదృష్టి యాతనికమితముఁగాఁగలదు. దక్షిణేశ్వరవనమునఁ దాను నిశ్చలసమాధిగతుండుఁగా నరేంద్రజననపూర్వ మొక కాంతిగోళము, వారణాశీపురోపరిభాగమున, వియత్తలమునుండి బయలుదేరి, గంగానదీప్రవాహమునూనుగా కాళీఘట్టనగరమును జేరియదృశ్యమయ్యెను. అది చూచి రామకృష్ణుఁడు, "నామిత్రుఁ డిపు డుదయించినాఁ"డని తలఁచెను. మఱొకప్పుడు నిశ్చలసమాధిమగ్నుఁడై, యుండి, శ్రీరామకృష్ణుఁడు, తననిగ్రహము దివ్యజ్యోతిర్మయబాలాకృతివహించి, దేవతలు, సిద్ధులు, మహర్షులు, భక్తాగ్రేసరులు, నివసించు నాకాశపథంబున కెగసి, కడకొక అఖండసచ్చిదానంద దివ్యతేజోగోళముతోఁ బ్రవేశించి, కొంతసేపుండులాడి, కాళీకారుణ్యవశమున, నాత్మైక్యము చెందక, వెనుకకు మఱలి, సప్తర్షిమండలమునుజూచి, యందొక్కనిఁగని, తనయఖండశక్తిచే నాతనిసమాధినుండి మేల్కొల్పినిల్చెను. ఆమహర్షి, యర్ధనేత్రములు విప్పి మఱుచటిక్షణముననే మఱల సమాధిలో నిమిడిపోయెను. కాని శ్రీరామకృష్ణబాలజ్యోతిర్విగ్రహ మూరుకొనక మఱల మహర్షిని మేల్కొల్ప, నాతఁడు కన్నులు మఱలఁదెఱచి, యొకజ్యోతినుండి యొకకిరణమును బయటికంపెను. అంత రామకృష్ణుఁడిట్లనుకొనియెను. "ఈమానవలోకమున్న హాత్ముని దివ్యజ్యోతిని భరింపఁగల్గు సమయము రాలేదు. ఈకిరణమే, లోకమును మోహాపఁజేయు నద్భుత కార్యములు చేయఁగలదు."

వేఱొకప్పుడు, గాఢసమాధిలోఁ దానొకమహర్షివర్యుం గాంచి విస్మితుఁడై, "నరేంద్రా! నరేంద్రా!" యని కేకవేయఁగా నాఋషి కండ్లు తెఱచెను. దానినిఁ జూచి, కాయస్థవంశసాగరచంద్రబింబమై, కలకత్తాలో జనించిన నరేంద్రబాలుఁ డాతఁడే యని నిర్ణయించుకొనెను.

ఆయావిషయములఁ జూచి, నరేంద్రుఁడు సప్తర్షిగణములో నొకఁడనియు, లోకకళ్యాణమునిమిత్తము భూలోకమున నవతరించు ననియు, నాతఁడే నరేంద్రుఁడనియు, దూరదృష్టిం దెలిసికొనియే యుండెను. ఆదృష్టిననుసరించియే, ప్రథమమున, నరేంద్రుఁ డాతనిదర్శనమునకై వచ్చినపుడు, "నరేంద్రా! వచ్చితివా! నీకొఱకే నే నెదురు చూచుచుంటిని. ఇన్నినాళ్లేల యాలసించితివి. ఇఁక నాజన్మోద్దేశము సఫలమైన"దని యాతని విడివఱ కౌఁగియున్నట్లే రామకృష్ణుఁడు పలికియుండెను.

నరేంద్రుఁడు రామకృష్ణునిశిష్యాగ్రగణ్యుఁడైనపుడు, "నరేంద్రునాదర్శము రూపరహిత పరబ్రహ్మము. ఆతఁ డాత్మజ్ఞానిబృందములో వీరాగ్రేసరుఁడు. ఎంతమందిభక్తులు నాకడకువచ్చిరి. నరేంద్రునితుల్యుఁ డింకొకఁడు లేఁడు. శిష్యులలో నొకఁడు దశపత్రపద్మము, వేఱొకఁడు శతపత్రపద్మము, నైనచో నరేంద్రుఁడు సహస్రపత్రపద్మము. శిష్యులందఱు సాధారణపానపాత్రములగుచో నరేంద్రుఁ డనంతసాగర స్వరూపుఁడు. నరేంద్రుఁ డెద్దానిమీఁద నాధారపడువాఁడు కాఁడు ఆతఁడు నిరంతరస్వచ్ఛందమూర్తి. ఆతఁడు సభావేదికపైనుండి, యుపన్యసించుచో నొకయాధ్యాత్మిక విద్యుత్తరంగము నాహృదయము నుయ్యాఁలలూఁగించు''నని యాతఁడు వచించెను.

వేఱొకసారి శిష్యకోటితో ముచ్చటించుచు "ఈబాలుని మీరందరు చూచితిరికదా! అతనిముఖమున నిష్కాపట్యము, నిరా

డంబరత్వము, నెట్లువెల్లుచున్నవో! అతఁడు నిత్యసిద్ధులలోనొకఁడు. అజన్మబ్రహ్మజ్ఞాని నరేంద్రుని మించినవారెవరు? అతఁడు వేదములోఁజెప్పఁబడిన హోమపక్షివంటివాఁడు. ఆహోమపక్షి, యెట్లాకసమున విహరించుచు గ్రుడ్లువెట్ట, నాగ్రుడ్లు సగముదూరము భూమిపై పుపడి, యయన్మధ్యముననే, ఆత్మకతనవేగజాతోష్ణముచే, భిన్నములయి, పక్షిశాబకములయి, మఱలఁ బైకెగిరిపోవునో, అట్లే నరేంద్రుఁడు నిశ్చలసమాధి ముద్రావస్థనుండి, బ్రహ్మలోకమునుండి, లోకకళ్యాణహేతువుచే భూలోకమున నుద్భవించియు, పంచభూతవిషయవాంఛ లాతని నంటకమునుపే, బ్రహ్మజ్ఞానానందనిలయమునకు తిప్పున నెగిరిపోనుంకించుచున్నాఁ"డని రామకృష్ణుఁడు వచించెను.

మఱియు నింకొకసారి, యితరమహానాయకులతో నరేంద్రుం బోల్చుచు, "కేశవచంద్రసేనుఁడు, విజయగోస్వామి వీరిలో జ్ఞానము ప్రదీపమై వెల్గుచున్నది. కాని నరేంద్రునిహృదయములో జ్ఞానము సూర్యబింబాకృతిని ప్రజ్వరిల్లుచున్న"దని యాతఁడు వక్కాణించియున్నాఁడు.

నరేంద్రుఁడు దారిద్ర్యపిశాచమున కెరయై, కష్టపరంపరలకాహుతియై, విలపించుచున్నతఱి, రామకృష్ణుఁ డొకశిష్యునాతనికి సహాయమొనర్పుమని కోరెను. అది నరేంద్రుఁడు విని, "అయ్యా! నాసంగతి నాతని కేలచెప్పినా"రని తీవ్రముగాఁ బల్కఁ, "ఓనరేంద్రా! సర్వము నీకు నేనే చేయఁగలనని యెఱుంగవా? నీకొఱకు నేను బిచ్చమైన నెత్తెద"నని ప్రేమామృతము చిందునట్లు రామకృష్ణుండు బదులుచెప్పెను.

అనసుయముననే, రామకృష్ణుఁడు నరేంద్రునికుటుంబమును దారిద్ర్యమునుండి కాపాడుమని ప్రార్థించియున్నాఁడు. కాళీదేవిప్రత్యక్షమై "నరేంద్రున కేమియు భయము లేదు. నరేంద్రునికుటుంబమున

కట్టిలోపము కలుగ"దని వచించెను. నరేంద్రు నెంత ప్రేమించినను, నాతఁ డెప్పుడైన నొకనిముసమైన కలుషహృదయుఁడైనచో రామకృష్ణుఁడు కనిపెట్టును. కని యాతఁడేదే నిచ్చినచో ముట్టఁడు. ఏమిమహా దీక్ష యోగదా! కలుషమునంట నాతఁ డెట్లు పరితపించెనో!

---

## ఇదుమైదవ అధ్యాయము.

### శ్రీరామకృష్ణు నౌన్నత్యము: గమ్యస్థానోన్ముఖత.

ప్రస్తుతప్రపంచమున నొక్కటే వనముగలదు. అదియే ఆత్మప్రకాశభాసురంబగు దక్షిణేశ్వరము. అచ్చటజరుగు ప్రతిచర్యయు నాత్మప్రభావవికసనహేతువే. అచ్చట వినఁబడు ప్రతిధ్వనియు నింద్రియచోరుల వీపులంబడు చఱపులనినాదమే. అచ్చట కన్పట్టు ప్రతివిగ్రహము, శ్రీమన్నారాయణావతారస్వరూపమే ఒక్కమహాపురుషు ననంతజ్ఞానవాగ్ఝరు లచట నూటలూరి, మోహబద్ధమైన లోకమును చైతన్యయుక్తముఁ జేయుచుండును. ఆతఁడే శ్రీరామకృష్ణుఁడు. అట్టి వనములో నిరంతరము జీవింపఁగల్గుభాగ్య మబ్బ జన్మ మెవరు కోరకుండ నుండఁగలరు?

శ్రీరామకృష్ణుని శిష్యులందఱు పుణ్యమూర్తులే. కాని, పాపాంధుల నాతఁ డెక్కుడు పూజించును. ధైర్యము, సాహసము, బలము, నివియే వానికి వలయునవి. పాపభూయిష్ఠములైననుసరే! ఏలన పాపబుద్ధులబలం బెన్నటికైన సన్మార్గమునకుఁ ద్రిప్పఁగలననెడు ధైర్య మాతనికిఁ గలదు. కలుషాంధుఁ డాతనిదృష్టిలో, సత్యముచే, స్వాభావికముగా సంయమీశ్వరుఁడే! పాపమనున దున్నదని యాతఁ డంగీకరింపఁడు. కాంతితమంబు లెట్లేకకాలంబున నుండఁ గలవు? నిరంతరాత్మప్రకాశభాసురమే లోకము. ఇఁక నంధకారమునకుఁ దావెయ్యది? యని యాతఁడు ప్రశ్నించును.

సోదరీమణులుగూడ ననేకులు రామకృష్ణపదారవిందములఁ బూజించుచుండువారు. అందొక్క కాంత రంభాసదృశసౌందర్యవతి. ఆమెనుగూర్చిన వివరము లెవ్వియుఁ దెలియవు. ఆమె దక్షిణేశ్వరమున కరుదెంచి, రామకృష్ణుని సేవించెను. రామకృష్ణుని కామెయందు భగవదంశ ప్రత్యక్షముగాఁ గన్పట్టెను. ఒకసమయమున నాతఁ డామెను చేతితోఁ దాఁకెను. ఆమె వెంటనే నిశ్చలసమాధినిమగ్నయై, తెలివివచ్చిన వెనుక గురుచరణములమీఁదఁబడి, కాళీనామస్మరణ మొనర్చెను.

గోపాలమాతయను నొక నారీరత్నము గంగాతీరమున నొక పర్ణకుటీరములో నివసించుచుండెను. ఆమె గోపాలబాలునిఁ బుత్ర భావముతోఁ బ్రేమించుచు సన్యాసినియయ్యెను దక్షిణేశ్వరములో నున్న రామకృష్ణు నామెచూచి, బాలునిఁగాఁ గాంచి, "గోపాలా! గోపాలా!" యని కేకలిడెను. ఆమె నాతఁడు, "తల్లీ! మాతా!" యని పిలచెను.

మహమ్మదీయసన్యాసశ్రేష్ఠులు కొందఱు, నానక్ గురు శిష్యులు కొందఱు, క్రైస్తవమతాచార్యులు కొందఱు, రామభక్తులు కొందఱు, శ్రీరామకృష్ణుని దర్శించి, వారివారి యిష్టదైవతముల నాతనియందుఁ గాంచి, శిష్యులై యాతని సేవించిరి. రామకృష్ణదర్శనమాత్రముచే వార లఖండతత్త్వజ్ఞానప్రాప్తి గాంచిరి.

హిందూనాటక రంగ నిర్మాతయు, షేక్స్పియ్యరు తుల్యుఁడు నని ప్రఖ్యాతివహించిన గిరీశబా బచటికివచ్చి, శ్రీరామకృష్ణుని దర్శించెను. గిరీశబాబు లోక మెల్లఁద్రిప్పిన సట్లనుభవించిన మహాభోగి. కాళీదేవ్యాలయములో శ్రీరామకృష్ణుని మాతృప్రార్థనాసంబంధాత్యంతపరిచితప్రేమపూర్వకకంఠనాదముచు విని, యబ్బురమంది, "ఈతఁ డొక చోరనాయకుఁడైనఁ గావలయు, లేక నొక

మహార్షియయిన నగు"నని వచించెను. ఒకతూరి గిరీశబాబు శ్రీరామకృష్ణునొద్ద కరుదెంచి, "అయ్యా! నాపాపవిముక్తికై నే నేమి చేయవలయునో తెల్పుఁడు. నే నొక పాపంచికపురుషుఁడననియు, కలుషాంధుఁడననియు మీ రెఱుంగుదురుకదా!" యని ప్రశ్నింప, "నానామమును దినమునకు మూఁడుమారులు తలఁచిన ముక్తుఁడవగుదు"వని రామకృష్ణుఁడు బదులుచెప్పెను. అంత గిరీశబాబు "అయ్యా! నాపరిస్థితులలో మిమ్ము మూఁడుసారులు తలఁచుకొనుశక్తి నాకు లే"దనెను. మఱల గురువర్యుఁడు, "రెండుమారులు తలఁపఁగలవా?" యని ప్రశ్నించెను. అదియు సాధ్యముకాదని గిరీశబాబు వచించెను. "పోనీ దినమున కొకసారియైన నన్ను జపింపు"మని రామకృష్ణుఁడు వచింప దానికిని గిరీశబా బంగీకరించలేదు. "అట్లైనచో మదర్పితబుద్ధివై చరింపుము. నీమోక్షము నాహస్తములం దున్న"దని రామకృష్ణుఁడు వచించెను. శ్రీరామకృష్ణుని నిష్కల్మషబోధనమున కచ్చెరువంది, యింటికి వెడలి, దినమున కొకసారియైనఁ దలంపఁజాలనని చెప్పిన గిరీశబాబు, ప్రాణాంతమువరకు శ్రీరామకృష్ణనామపారాయణమును నిరంతరముఁజేసి, తన్నామస్మరణముతోడనే ప్రాణములు విడిచెను. అంత్యదినములలో నాతఁడు మహాయోగివలె వర్తించెను. శ్రీరామకృష్ణుడు మంచిచెడుగులను పుణ్యపాపములతో బంధించఁడు. బలము దుర్బలత్వముకింద భాగించును. అఖండబలోపేతుఁడే భగవద్దర్శనమే నాటికైనఁ జేయఁగలఁడు. బలహీనుని కీలోకమునఁ దావు లేదని యాతఁడు వక్కాణించును.

ఈవిధముగా, శ్రీరామకృష్ణునొద్ద కనేకవైద్యశేఖరులు, పండితులు, కవీశ్వరులు, మహాప్రవక్తలు, భక్తులు, స్త్రీలు,పురుషులు, బాలురు, నన్నిమతంబులవారు వచ్చి, వినమితశిరస్కులై, యమితభక్తితో భజించుటయు, పాపులు, పుణ్యులు, కలుషమతులు, నిర్మల

K. C. S. R



చిత్తులు ననుభేదము లేకుండ, ననంత కారుణ్యామృతధార నందఱిమీఁద సమానముగ నాతఁడు చిలికించుటయుఁ జూచి, నరేంద్రుఁడత్యంతాశ్చర్యభరితుఁడై, తానట్టిమహాగురువరేణ్యున కగ్రశిష్యుఁడై జన్మించు భాగ్యమబ్బినందుల కమితానందమంది, యాంతర్యమున నెంతయో గర్వించుచుండును. ఎట్టిమహాపురుషు లచటికరుదెంచినను సరే రామకృష్ణుని పరిపూర్ణప్రేమపాత్రత నరేంద్రునికిఁగాక మఱెవ్వరికి లేదు. ఇదియే నరేంద్రుని కానందహేతువు. కాని నరేంద్రుఁడెట్టివాఁడు ? "నాగురువు లేనిదే నేనెవఁడను ? నామరహితుఁడనే!" యని యాతఁడత్యంతవినయభూషణుఁడై వచించును.

ధనాధిక్యముచే నిక్కినీగుచు, మేము భగవద్భక్తుల మనుకొను వారలను శ్రీరామకృష్ణుఁడు గౌరవించఁడు. అట్టివారల నాతఁడు, "దాష్ట్యకీమిమయనవృద్ధమృణ్మయరూపులు మీ''రనివచించును. ఒక ప్రజానాయకుఁడు రామకృష్ణునికడ కరుదెంచి, యాతనితత్త్వమును గూర్చి హేళనఁజేయు, "నిన్నుప్రజలు పూజింతురుగాక ! నాకు నీ గొప్పతనమెద్దియుఁ గన్పట్టదు. అల్పమానసముతోఁగూడిన అంత్యజాతిజనుఁడే నీకన్నమే"లని తీవ్రముగాఁ బల్కెను. అట్లన్నను, రామకృష్ణుఁడన్నమాటలు వారిహృదయములలోనున్న నిజపరిస్థితుల ప్రతిబింబములగుట వా రాగ్రహింపక, తమ కాలుష్యము నడఁప రామకృష్ణునే ప్రార్థింతురు. భగవత్పుత్రులకు ధనముతోఁడను, పేరుప్రతిష్ఠలతోఁడ, నాగ్రహములతోఁడను పనియేమి? ఇవన్నియు వారలకుఁ దృణసమానములు. నిష్కల్మషమానసమే వారికి వలయునది. కేవల పాండితీమహిమయు నవసరము లేదు. గ్రంథము లంధతను బోఁగొట్టఁ జాలవు. అట్టిచో నెట్టిపాండితశ్రేష్ఠులు రామకృష్ణుని సేవింపక తప్పినది కాదు.

ఇట్టినిరాడంబరత్వము, వాంఛాఖండనము, ఇట్టి ధనికనిరాసము, పాండిత్యప్రకర్షాసహనము, నిట్టి యశోలాలసత్వనిరాకరణము, నిర్భయవాక్సంపత్తి, యిట్టి ఆత్మగౌరవోత్కర్షకామలినజీవితవిధానము, నరేంద్రుని హృదయమున శాశ్వతముద్రలై నరేంద్రునిమూర్తిమత్త్వమునకు స్వయంప్రకాశ స్వయంవ్యక్తిత్వము లొసంగెను.

శ్రీరామకృష్ణుఁడు దూషణభూషణ తిరస్కారాతీతుఁడు. అతఁడొకసారి నరేంద్రునితో నిట్లు వచించెను "బాలుఁడా! వినుము! భగవద్భక్తులఁగూర్చి ప్రాపంచికబుద్ధులనేకులు కుభాషలాడుదురు. కాని యప్పుడు మనమేమిచేయవలయును? వెనుకాడి పర్వెత్తి మొఱుగుచున్న కుక్కలనుజూచి, సరకుచేయక రాజమార్గమున నడచు మత్తగజేంద్రంబుచాడ్పున సంచరింపవలయును. అగజేంద్ర మా కుక్కలయఱపులను చెవినిపెట్టక, తనమార్గమున నయ్యది పోవును. నరేంద్రా! ప్రజలు నిన్ను దూషించునపుడేమి తలఁచెదవు?" వెంటనే "మొఱగుచున్నకుక్కలగుంపుగా వారిని తలఁచెద" నని నరేంద్రుడు బదులుచెప్ప "కాదు! కాదు! నీవంతవఱకుఁ బోవనవసరము లేదు. వారిని లెక్కచేయకుము కాని ప్రతిమానవుని నారాయణస్వరూపముగాఁదలఁపుము. పరమేశ్వరుఁ డందఱిలో నివసించి, యనేకరీతుల వర్తించుచుండును. ఒకడు మహర్షినారాయణుఁడగుచో నింకొకఁడు కూర్రనారాయణుఁడు కావచ్చు"నని రామకృష్ణుడు మందలించెను.

ఈమాటలు హృదయమునఁ బాతుకొనియుండుటచేతనే నరేంద్రుఁడు స్వామివివేకానందుఁడై, ధనమదాంధీభూతులగు క్రైస్తవులాతని దూషించినపుడు శాంతిభావము వహించి, వారిని దీవించెను వారలలో మాత్రము భగవంతుఁడు మూర్ఖనారాయణుఁడై యుండలేదా ?

ఒకసారు నరేంద్రుఁడు వివిధమతములఁ గూర్చి, విమర్శించుచు భూతపిశాచార్చకులంగూర్చి దూషింపనారంభించెను. అది రామకృష్ణుఁడువిని, "బాలుఁడా! ప్రతిగృహమునకు నొకదొడ్డిగుమ్మము కూడఁగలదు. ఆగుమ్మమునుండి లోని కేలప్రవేశింపరాదు. నీవు చెప్పినట్లు సింహద్వారమునుండి లోనికరుగుటయే శ్రేష్ఠమని నేను నంగీకరింతునుసుమీ"యని ప్రీతితోఁబల్క నరేంద్రుఁడెంతయు నట్టి ప్రేమపూరితవాక్యములచే బద్ధుఁడగును.

శ్రీరామకృష్ణుఁడాత్మస్థాపితాదర్శములఁ గూడ సంశయించును. "తల్లీ? ఇది నిజమగుచో నాపురుషుఁడిటకు వచ్చుఁగాక" యని కాళీమాతను ప్రార్థింప యథార్థముగా నాపురుషుఁడప్పుడే ప్రత్యక్షమయ్యెను. వేఱొకసారి, "ఈసత్యము సిక్కమగుచో నీతాయి,కప్పవలె నెగురునట్లు చేయుము, తల్లీ" యని యాతఁడు వేడ, సత్యద్భుతముగా నాతాయి కప్పవలె గంతులిడెను.

ఇట్టి ప్రత్యక్షస్వీయానుభవముల శ్రీరామకృష్ణుఁడు నడించుట నరేంద్రుఁడాయనుభవముల నప్రతిహతముగా గ్రహించి, గురుతుల్యజ్ఞానమూర్తి కాఁగోరి; వివేకానందుఁడై, తానెట్లు సఫలుఁడయ్యెనో చూపియున్నాఁడు.

శ్రీరామకృష్ణునికడ నరేంద్రుని శిష్యత్వ మేనాఁడు ప్రారంభమయినదో సరిగా నిర్ణయింప వీలులేదు. తనహృదయమునిూఁదఁ జేయిపెట్టి, రామకృష్ణుఁడు నరేంద్రుని గతస్మృతునిఁగాఁజేసినదాది నరేంద్రుఁడు శిష్యత్వమంగీకరించెను గాని, పరిపూర్ణముగా నాతని సంశయము తీరువఱకు నిశ్చయమగు శిష్యబుద్ధి నరేంద్రునకుఁ గల్గలేదు. ఆసంశయవిచ్ఛేదమైనను కొలఁదిమాసములలోనే జరిగిపోయెను. కాఁబట్టి నరేంద్రుఁ డాదినుండి శిష్యుఁడనుటలో ననుచితము లేదు.

ఇప్పటికి నరేంద్రుని శిష్యత్వ మారంభమై, యించుమించుగా నాల్గువత్సరము లయినది. మొదటివత్సరములో నాతఁ డరుదుగా గురుదర్శనము చేసెను. రెండవయేట నాతఁ డధికముగా గురుసన్నిధినే కాలముగడపెను. మూఁడవయేట శిష్యుఁడు గురుసేవైకలగ్నమానసుఁ డయ్యెను. నాల్గవయేట నరేంద్రుఁడు గురునివిడిచినదినములు చాల తక్కువ. ఐదారువత్సరములలో నరేంద్రుఁడు గురుతుల్యుఁడయ్యెను. ఆఆవసంవత్సరాంతమందు, "నీవు భగవంతునిఁ జూచితివా?" యని మొదట నరేంద్రుఁడు ప్రశ్నించినపుడు రామకృష్ణుఁ డిట్టిసమాధాన మొసఁగెనో, శిష్యకోటి తన్ను బ్రశ్నించినపు డాతఁడును, "నేను భగవంతునిఁ జూచినాను, చూపఁగల"నని చెప్పఁగల్గు నాధ్యాత్మిక మృగరాజముగా మారెను. శ్రీరామకృష్ణుఁడు పండ్రెండువత్సరములు వెచ్చించి, ఆత్మక్షేత్రమున నింద్రియముల నెరవేసి, పరబ్రహ్మాంకురముల మొలిపించి, వృద్ధిచేసి, సాధనాంబువులచేఁ బోషించి, కాపించిన భగవత్ఫలం బనుభవింప నరేంద్రుఁడు వారసుఁడై జన్మించెను. వారసత్వమును దానొక్కఁడే యనుభవింపలేదు. లోకమంతకు విరివిగాఁ బంచిపెట్టెను. జ్ఞానరత్నఖనిని దోఁచుకొనిపోవు కామినీకాంచనచోరవరులమూఁక నప్రతిహతముగా జయించి ఆధ్యాత్మికసామ్రాజ్యమును స్థాపించి,ఆసామ్రాజ్యమును వ్యాప్తిచేయుటకై, రామకృష్ణుఁడు నరేంద్రునకుఁ బట్టముగట్టెను. శ్రీరామకృష్ణుఁ డాత్మానందసాగరమున మున్గి, వివిధజ్ఞానమణినిచయంబును బయటఁబెట్ట, నామణిగణంబుల నాధ్యాత్మికభిక్షుకసంతతికి నరేంద్రుఁ డమితముగా దానమొనర్చి కృతార్థుఁ డయ్యెను. శ్రీరామకృష్ణుఁడు సత్యజ్యోతి. ఆజ్యోతిచే నరేంద్రుఁడు సమస్తాత్మదీపముల నారిపోకుండ వెల్గించెను.

శ్రీరామకృష్ణునాత్మనత్వాంశములు నరేంద్రునిహృదయముమీఁద వరుసఁగా నైదేండ్లు ముద్రితములై, భ్రమరకీటన్యాయ

ముఁగా, నరేంద్రుని శ్రీరామకృష్ణునిఁగా మార్చినవి. సకలహిందూతత్త్వసారసంగ్రహస్వరూపుగా శ్రీరామకృష్ణుని నరేంద్రుఁ డతిస్పష్టదృష్టితోఁ జూచి తనిసిచెందెను. తాను జూచిన దృశ్యమునే పాశ్చాత్యఖండములలోఁ బ్రదర్శించి, "అత్యుత్కృష్టమగు యథార్థమత్యంతసూక్ష్మరూప"మని నిరూపించెను. ఎన్ని వేలమంది పాపాంధులను, శ్రీరామకృష్ణుఁడు మునిసత్తములఁ జేసివైచుట తనకట్టెదుట నరేంద్రుఁడు చూడలేదు.

శ్రీరామకృష్ణుని భాగవతదృష్టి యెంత సూక్ష్మాతిసూక్ష్మమైనదో కదా! సర్వప్రపంచము భగవంతునిశరీరమనియు, నందలి తరుపుష్పఫలాదు లిదివఱకే పరమేశ్వరున కర్పితములైనవనియుఁ, దలఁచి, యాతఁడు, "పుష్పములఁ గోసి, విగ్రహముల కర్పించుటెంత వెఱ్ఱి" యని భావించును. కొన్ని వేళల నాతఁడు పచ్చికమీఁద నడువఁ జాలఁడు. ఆతృణములు భగవత్కళలని యాతనితలంపు. ఒకఁడొకని తన్నినచో నాతనిఁ గొట్టినట్లు భావించును. పేదలను చూచి, తనకుక్షి కాలుచున్నట్లు తలఁచి, మథురబాబును జూచి, "వారిని బోషించినచో నా కాకలి మాను"నని వచించును. ఇంక నున్నతభావసమాధిలో నున్నపు డాతఁడు, భూమిమీఁదఁ బడినప్రతియడుగు తనగుండెమీఁద వేయఁబడినట్లూహించును. ఏలనఁ దానే సర్వభూతస్వరూపమని భావించును.

శ్రీరామకృష్ణుఁడు నిరంతరాత్మారాముఁడు. తా నెప్పుడుతలఁచిన నేస్థితిలోనైన నుండఁగలఁడు. ఈరామకృష్ణుని దివ్యానుభవములన్నియు నరేంద్రుఁడు గాంచెను. అట్లు గాంచుటలోఁ దన సవితర్కబుద్ధిని విసర్జించెను. వానిని జీర్ణించుకొనుటకు హృదయకవాటములను తెఱచి విడిచెను. రామకృష్ణుఁడు ధనకోశమును కాపాడు రాజసైనికునివలె, నరేంద్రునిఁ గాపాడెను. భగవంతునిఁగూర్చి వినుట, తెలిసికొనుట, ధ్యానించుట, తర్కించుట, యీయంతరువులన్నియు నరేం

ద్రునికిఁ గడచిపోయెను. శ్రీరామకృష్ణుఁడు భగవంతునిఁజూడఁగల దృష్టిని, యితరు లొకపున్నము నెట్లీయఁగలరో, అట్లు ప్రసాదించఁ గలఁడు. అట్టిప్రత్యక్షదృష్టిని ప్రసాదింపుమని, నరేంద్రుఁడు గురుని ప్రార్థించెను. అట్టిదృష్టిని నరేంద్రునికిఁ గొలఁదికొలఁదిగా లభించుచుం డెను. తనశక్తినిఁ బరీక్షింప నొకనాఁడాతఁ డొకశిష్యునిఁ దలమీఁదఁ జేయిపెట్టెను. ఆశిష్యుఁడే యభేదానందస్వామియై యిట్లు వర్ణించెను. "నరేంద్రుఁడు నన్ను తాకినపు డొక యాధ్యాత్మికవిద్యుచ్ఛక్తితరంగ గము నాశరీరమును జొచ్చినట్లయ్యెను వెంటనే గతస్మృతినై నేనసం తధ్యాననిష్ఠలోఁబడి, యిదివఱకు భక్తుఁడనైనను, నాఁడు మొదలు మహాద్వైతతత్త్వమూర్తి నయితిని.''

నరేంద్రునిశిష్యత్వము నాల్గువత్సరములు గడచినపుడు, రామ కృష్ణునికంఠములో వ్రణము బయలుదేరి, కలకత్తాకుఁ జేరువనున్న కాసిపురమునకు బస మార్చఁబడెను. ఆవ్రణబాధను జూచి, యొక శిష్యుఁడు "గురువరా! నీవు మహాయోగివికదా! నీశక్తిచే దాని నేల తొలగించుకొన"వని ప్రశ్నించెను "బాలుఁడా! నామానసమును కాళీమాత కర్పించితిని. మఱల నీయెముకలప్రోవగు తుచ్ఛశరీరము లోనికి నాహృదయమును దిగలాగఁజాల"నని రామకృష్ణుఁడు వచిం చెను.

నరేంద్రుఁ డిఁక రామకృష్ణున కవసానదినములు వచ్చుచున్న వని గ్రహించి, తనకు నిర్వికల్పసమాధివర మొసంగుమని గురువును ప్రార్థించెను. గురువును, తత్సమయ మాసన్నమగుచున్నదని గ్రహించి యూరకుండెను.

---

## ఇరువదిఆఱవ అధ్యాయము.

నరేంద్రుని జ్ఞానసంగ్రహణవైఖరి : శిష్యబృందములోని నరేంద్రుఁడు.

"పరమాత్మ యొక నామముచే బంధింపఁబడవలయునా? రూపభగవదారాధన రూపరహితపరమాత్మాభిప్రాయమును బాధించునా? రూపసహితుఁడు రూపరహితుఁడు ననుమాట లంతరహితములు. భగవంతుం జూడవలెననెడి మానవునిగాఢతమవాంఛ, నాయాసరూపారూపభావము లరికట్టఁజాలవు. మాత, పరబ్రహ్మము నీరెండు నాసత్యనామములే. సత్యమును రూపముగాఁ జూచిన నేమి? రూపరహితముగా నెఱిఁగిన నేమి? రూపారూపాతీతముగా గ్రహించిననేమి?" ఇదియే రామకృష్ణునిబోధన. ఇదియే వివేకానందుని బోధనమును. మానవులు నామములచే సంఘీభూతులగుదురు. అభిప్రాయములు మనస్సును కలవరపఱచును. ఏదియెట్లైనను మానవునియొక్క అతీంద్రియవాంఛ యొక్కటే. వాంఛితమునొక్కటే. బంధితుఁడగు మానవుఁడు, సర్వబంధరహితమూర్తియగు భగవంతుఁడగుటయే!

ఈవిధమగు బోధనామృతమును గ్రోలుచు నరేంద్రుఁడు దక్షిణేశ్వరవనమందును, కాశీపురవనమందును, శ్రీరామకృష్ణపదారవిందైకలగ్నమానసుఁడై కూర్చుండెను. ఆతఁడు శ్రీరామకృష్ణుని బోధనల నిట్లు గ్రహించెను. "అన్నిమతములు భగవంతునిఁ జేర్చుమార్గములే. భగవంతునిఁ జేరవలెననెడివాంఛయందన్నియునొక్కకోరికనే కోరుచు నొక్కరీతినే పరితపించుచున్నవి. గర్హింపఁదగిన దెద్దియు లేదు."

కాని నరేంద్రుని నెట్టయెదుట తన్నత్యంతము నాకర్షించి పురికొల్పిన దేమతముఁగాదు, జ్ఞానమునుగాదు, విద్యగాదు, వాక్సిద్ధియునుగాదు. సాక్షాత్పరమేశ్వరమూర్తియగు శ్రీరామకృష్ణుని దివ్య

విగ్రహమే. పరద్వైగ్రహార్పిత సర్వజీవనుఁడై, నరేంద్రుఁడచంచలుఁడై, కూరుచుండెను ఏయేమతము లేయేసంఘము లెట్టి యెట్టి దివ్యాదర్శములు చూపినను మానవత్వ పరిపూర్ణుఁడై, భగవద్జ్ఞానపాటద్దివ్యమూర్తియై, ప్రదర్శితమయిన శ్రీరామకృష్ణుఁడే యాతని కన్ని యాదర్శములు, మతములు, సత్యాంశములు. వేయేల్వియు నరేంద్రునికి, శ్రీరామకృష్ణునిలో బయల్పడిన విస్పష్టతను ప్రదర్శింపజాలక పోయినవి.

శ్రీరామకృష్ణునిలో సమాధి, భగవంతుఁడు, భగవంతునిఁ దెలియు నిరంతరయాతన, నందుమూలమునఁ గాంచనగు, నిర్మలాత్మ ప్రశాంతి యివియే నరేంద్రునకుఁ గన్పట్టినవి. బ్రాహ్మసమాజములో నున్నప్పుడు తాను దలపోసినఅవ్యక్తాధ్యాత్మిక చింతనాపరత్వ మాతని విడిచి వెడలిపోయినది. మతమన, నుపాసన, బుద్ధిసాధన, తత్త్వవిచారణ, యివెన్వియుఁగావనియు, నపరిపూర్ణుఁడగు మానవుఁడు పరిపూర్ణత్వమునందుటే, అనఁగాఁ, బరిపూర్ణమూర్తియగు పరమాత్మస్వరూపము తానేయని యెఱుంగుశక్తి వార్జించుటేయని నరేంద్రుఁడు తెలిసికొనెను.

మతమన నశాశ్వతవస్తువాంఛామోహాఖండనము చేసి స్వయంవ్యక్తిత్వస్వయంప్రకాశములచే వెల్గొందుటయేయనియు, భోజన నిద్రా స్త్రీపురుష భేద, మరణభయాదిరజ్జుపరికల్పిత జాలగ్రంథులను మట్టుమూలముగా ఛేదించి, విజయలక్ష్మిం జేకొనుటయేయనియు నట్టిరణరంగమున నింద్రియవైరివీరుల నుఱుమాడిన విజయమూర్తులే, ప్రపంచమాదినుండి బయటికిందోసిన భగవద్భక్తాగ్రేసరబృందమూపమనియు, నరేంద్రుఁడు నిర్భయముగా, నిస్సంశయముగాఁ, దెలిసికొని, శ్రీరామకృష్ణుఁడట్టిభగవత్తుల్యమూర్తులలో నొకఁడని గ్రహించి, అట్టిసంగతిఁ దానెఱుం[illegible]లాభమునకై మాన

సాంతరమున నంతయు సంతసించును. నరేంద్రుఁడు శ్రీరామకృష్ణ సజీవభగవద్విగ్రహమునుండి, 'మానవుఁడా! నిన్ను నీ వెఱుఁగ'ను వాక్యముల చదివి జపించుచుండెను. వేఱుసిద్ధాంతములు, వేఱుమతభేదములు, వేఱుసత్యము లాతనికి నర్థముకాలేదు. యథార్థపదార్థతీవ్రతమదర్శనోత్సాహమును, తత్సాధనావశరమగు నాత్మపరాయణత్వసమున్నానమే మతమని నరేంద్రుఁడు గ్రహించెను.

పరబ్రహ్మమునకు నాతని యైక్యముఁగోరు జీవనిష్కల్మష వాంఛకుఁగల యవినాశబంధమును నరేంద్రుఁడు గాంచెను. నిశ్చయముగ భగవంతునిఁ జూడవలెనని యొకే కోరికలో మానవుఁడు తన్మయుఁడై పోయినచో భగవంతుఁడు ప్రత్యక్షము నగుతీరును.

బంధము వేనిమూలమునఁ గల్గుచున్నది? మానవాదీంద్రియములవలననే! మోక్షమో? మానవాదీంద్రియములవలననే. ఎట్లు? ప్రాపంచకవిషయములమీఁదఁ బర్వెత్తు నింద్రియములను వెనుకకులాగి, మలినముకడిగి, భగవంతునిమీఁదికిఁ ద్రిప్పినక్షణముననే మోక్షము ప్రాప్తించును.

శ్రీరామకృష్ణుఁడొక యవతారమూర్తియా? కాఁడా? యను సామాన్యమానవుల భ్రాంతిలో నరేంద్రుఁడు పడలేదు. శ్రీరామకృష్ణుఁ డెవరైనను సరే. శ్రీరామకృష్ణునిధ్యానము, ధ్యానముద్రలో 'తల్లీ! తల్లీ!' యని కన్నులువఱదలు కార్చుట, ఆతనిభోజనవిధానము, నిద్ర, ప్రతినిమేషప్రవర్తనము, నివన్నియుఁ బరంజ్యోతిం జేరబరుగిడు కార్యములుగా నాతనికిఁ గన్పట్టెను. శుష్కసిద్ధాంతములాతని కసహ్యమయ్యెను. మానవవార్త నాపరంజ్యోతికడకుఁ గొంపోఁగల దివ్యవార్తావహుని విగ్రహమును, శ్రీరామకృష్ణునందాతఁడు దర్శించెను. అట్లుదర్శించి, మానవుఁడు స్వకీయాకుంఠితప్రయత్నముచే సకలబంధములఁ ద్రెంపివైచి, భగవద్దర్శనము చేయుఁగల మహా

శక్తియని నరేంద్రుఁడు కన్గొనెను. మానవశక్తి కట్టిప్రయత్నమెంత సాధ్యమో అంతప్రయత్నము శ్రీరామకృష్ణునం దాతఁడుగాంచి, తాను నట్లుచేయనేర్చుకొని, ఆధ్యాత్మికసందేశమును లోకమునకొసంగఁగల స్వల్పఫలమునే పొందఁగల్గెను. కాని నరేంద్రుఁ డొక్కటిమాత్రము పొందఁగల్గెను. శ్రీరామకృష్ణు నవితర్క్యాత్మదివ్యజ్ఞానమాధురిమలో శ్రీచైతన్యు ననంతభూతప్రేమ, శ్రీమచ్ఛంకరాచార్యునఖండధిషణాప్రస్ఫురత్ జ్ఞానకాంతి, బుద్ధభగవాను నప్రతిమాన విశుద్ధజీవనప్రవృత్తి, వీనియొక్కరుచిని నరేంద్రుఁడు గాంచఁగల్గెను.

శ్రీరామకృష్ణు నవతారపూరుషునిఁగా నర్థము చేసికొనుటలో సామాన్యమానవకోటియొక్క మౌర్ఖ్యమునుండి బయల్పడ నరేంద్రుఁడు యత్నించెను. సర్వస్వరూపుఁడగు భగవంతుఁ డొక్క యల్పమానవునం దెట్లుండఁగలఁడని, సామాన్యుల భ్రమ? కాని, ఆద్యంతరహితమూర్తి యగునాపరమాత్మ, యేయాకృతిలోనిల్చిన, వానికంతము బాధ మున్నగునవెట్లు సంభవింపఁగలవు? ఇదియే నరేంద్రుని భావము గాదు. ఆతఁ డింక నున్నతపదంబునకుఁబోయి, సమస్తప్రాణులలోను భగవంతుఁడుండి, పరిపూర్ణాత్మశక్తిప్రకటనావకాశములకై వేచియుండెనని గ్రహించి, యాసందేశమునే యాతఁడు ఖండాంతరముల కేగినపుడు; "ప్రత్యాత్మ సహజముగా భగవద్గర్భితము. ఆ యంతర్భూతుఁడగు భగవంతు నాంతర్యమున నాత్మ తెలిసికొనుటయే పరమావధి"యని గంభీరభాషణములతో వక్కాణించి యున్నాఁడు.

శ్రీరామకృష్ణునికి శిష్యులనేకమందికలరు కాని, యాతని నిశ్చయప్రేమపాత్రతం గన్నవారలు కొలఁదిమందిమాత్రమే గలరు. అట్టివారలలో నారాయణాంశ యితరులలోఁ గన్న నెక్కుడు స్పష్టముగా నాతనికిఁ గన్పట్టెను అందుచే నాతఁడు వారిని ప్రత్యేకానురాగముతో

గౌరవించి, ఉత్కృష్ట యథార్థవిషయముల సాధనవిధానముల వారికిఁ దెల్పెను.

శిష్యబృందము రెండువిధములుగా భాగింపఁబడెను. గృహస్థ శిష్యబృందము. బ్రహ్మచారిబృందము. బ్రహ్మచారులు పదునేన్మండు గురు కలరు. ఈబ్రహ్మచారియువకబృందమే, వివేకానంద స్థాపితమైన రామకృష్ణమతసంస్థకుఁ బునాదియై, శ్రీరామకృష్ణునిసందేశమును లోకమంతటఁ జాటుటకై, సర్వసంగపరిత్యాగ మొనర్చినది. ఐనను గృహస్థశిష్యకోటియు నద్భుతముగు సహాయమును చేయకున్నచో యువకుల యత్నములు విఫలములయ్యెడివే! వీరందఱియందు నరేంద్రుఁడు సోదరప్రేమపూరితుఁడై చరించెను. శ్రీరామకృష్ణనిర్యాణానంతరము, వీరందఱు నరేంద్రునే యాంతఁగాఁగొని వర్తించిరి.

గృహస్థశిష్యకోటిలో నరేంద్రునిచుట్టమైన రామచంద్రదత్తుఁడు మహాభక్తుఁడు. ఆతఁడు జీవితాంతమున సన్న్యాసాశ్రమము స్వీకరించి, మఱియు గార్హస్థ్యధర్మములను యథోచితముగ నెఱవేర్చెను. రామకృష్ణు ననంతరమునఁ గలకత్తాసమీపమున నీతఁడు యోగ ధ్యానమును నొక యాశ్రమమును నిర్మించెను.

బారానగరమందుఁగల రామకృష్ణమఠమును పోషించి,నిల్పినమహానుభావుఁడు సురేంద్రనాథమిత్రుఁడు నాగమహాశయుఁడు, బలరామబోసు మహాభక్తులు. తత్త్వవేత్తలు. శ్రీరామకృష్ణుఁడు "నరేంద్రుఁ డొరనుండి తీసినకత్తి"యని చెప్పినపుడు విని, నరేంద్రుని పాదములకు సాష్టాంగము సల్పినవాఁడే నాగమహాశయుఁడు. నరేంద్రుఁడు శివావతారుఁడని నాగమహాశయు నుద్దేశము. నాగమహాశయుఁ డఖండాద్వైతవేదాంతి సర్వములో నాతఁడు భగవంతునిఁ జూచిన దివ్యపూరుషుఁడు. ఒకనాఁ డొక సర్పమువచ్చి శిష్యులభయకంపితులఁజేయ, "రమ్మా! తల్లీ! రమ్మా! నీరంధ్రమున కరుగు" మని

నాగమహాశయుఁడు భక్తిపూర్వకముగా వచింప, సర్పము వెంటనే వెడలిపోయెను. నాగమహాశయునిఁగూర్చి యనేకములగు నద్భుత గాథలుగలవు. మహాత్ములలో నాతఁడొకఁడనుటకు సందియము లేదు.

బలరామబాబు భక్తకుటుంబములోనివాఁడు. జమీందారుఁడు. తన ధనమంతయు శ్రీరామకృష్ణార్పణముచేసి, తనగృహముననే శిష్యులనందఱను పోషించినాఁడు.

గిరీశచంద్రఘోషునిఁ గూర్చి యిదివఱకే చెప్పఁబడెను. రాణి రాస్మణి యల్లుఁడగు మధురబాబు రామకృష్ణు నఖండముగాఁ బ్రేమించెను.

సురేశబాబు, బలరామబాబు, కాళీపదఘోషు వీరి మువ్వరను, రామకృష్ణుఁడు శివునియొక్క దాసులని పిలచెడువాఁడు. వీరు మొదట పాపప్రవర్తకులు. గాని వారిని రామకృష్ణుఁడు మహాత్ములంజేసెను.

మహేంద్రనాథగుప్తుఁడు వీరందఱికన్న నుత్కృష్టుఁడు. శ్రీరామకృష్ణజీవితచరిత్రము నాంగ్లవంగభాషలలో వ్రాసి, శాశ్వతకీర్తి నార్జించెను. గ్రంథకర్త దానను నహంభావమును సహింపఁజాలక యమ్ సర్వేశ్వరుని పుత్రుఁడు, శిష్యుఁడు నని చెప్పికొన్న మహాపురుషుఁ డాతఁడు. మాష్టరు విద్యాశాల స్థాపించి విద్యాసేవ చేసిన మహాపురుషు డాతఁడు. ఇంకను శిష్యులనేకులుగలరు. మనోమోహన్ కేదార్, మణి, కిశోరి, దేవేంద్ర, అక్షయ, నవగోపాల్, అతుల, నవచైతన్య, మహేంద్రముఖర్జి, ప్రియముఖర్జి, హరిన్ ముస్తఫి, ఇపిన్, నిత్యగోపాలగోస్వామి, అధర్, వైకుంఠసన్యాల్, ఉపేంద్ర, హరమోహన్, మున్నగువారందఱు, నున్నతవిద్యాపారంగతులు, ప్రజారంజకులు. వీరందఱును రామకృష్ణుఁ డమితముగాఁ బ్రేమించివాఁడు.

రామకృష్ణుని శిష్యుఁడగు రక్కల్ అనువాతఁడు, రామకృష్ణ మఠసంస్థకు ప్రప్రథముఁడై పేరుగాంచిన బ్రహ్మానందస్వామియయ్యె ను బాబూరామ్‌స్వామి ప్రేమానందుఁడు; యోగి, స్వామి యోగానందుఁడు, నిత్యనిరంజనుఁడు, నిత్యనిరంజనానందుఁడు, (ఈతఁడమెరికాలో బోధించెను. రామకృష్ణసంస్థకు కార్యదర్శి) హనుమాన్ మహావీరుఁడని రామకృష్ణునిచేఁ బేరుగాంచిన, సోషి, చెన్నపట్టణము లో రామకృష్ణమఠమును స్థాపించిన రామకృష్ణానందుఁడు; హరియను నతఁ డమెరికాకేగి బోధించిన స్వామితురీయానందుఁడు; వృద్ధగోపాల దా, స్వామి అద్వైతానందుఁడు; కాళియనునతఁ డమెరికాకేగి, రామకృష్ణమఠమును స్థాపించి, అఖండసేవచేసిన స్వామి అభేదానందుఁడు; తారకుఁడు కాశీలో రామకృష్ణమఠమును స్థాపించి, దాని కధ్యక్షుఁడైన శివానందుఁడు; గంగాధరుఁడు మూర్షిదాబాదు జిల్లాలో ననాథశరణాలయము, వృత్తివిద్యాశాల స్థాపించి పేరుగాంచిన స్వామి అఖండానందుఁడు; శారదుఁడు, అమెరికాలో బోధించి ప్రథమహిందూదేవాలయమును నిర్మించిన ధీశాలి, శారదానందుఁడు; లాటూయనునతఁడు స్వామియద్భుతానందుఁడు; తులసీయను నతఁడు బెంగుళూరులో రామకృష్ణమఠాధ్యక్షుఁడైన, నిర్మలానందస్వామి; సుబోధనుఁడను బోధానందస్వామి; యిట్లందఱు స్వాములై, వివిధ దేశములలో వివిధమతసంస్థలస్థాపించి, ఆత్మార్పణముల గావించిన ధీరులు. వీరందఱును శ్రీరామకృష్ణుని పరిపూర్ణప్రేమపాత్రులు శ్రీరామకృష్ణుఁడు శ్రీమన్నారాయణావతారుఁడని నమ్మి, యాతఁడు కోరినమానవసేవయందే తమమోక్షమును గాంచిరి.

కాని, నరేంద్రునికంటెను ప్రేమపాత్రతగన్న శిష్యత్వము నార్జించిన నింకొక వ్యక్తిగలదు. ఆమెయే రామకృష్ణుని కన్యాభార్య యగు శ్రీశారదాదేవి. కళికామాత లోకమున కెట్లో; శ్రీరామ

కృష్ణమఠసంస్థ కామె యట్లుగా మాతృదేవి యయినది. ఆమె శ్రీరామకృష్ణునకుఁ దాను భార్యనన్నమాట మఱచినది. శ్రీరామకృష్ణుఁడు గురుదేవుఁడని యామె నమ్మెను. చర్మదేహమును ధరించిన కాళికాదేవియే శారదాదేవియని రామకృష్ణుఁడు భావించి యట్లుగా నడచెను. పరస్పర మెన్నడు విస్మరించి యెఱుఁగరు ఆమె పాతివ్రత్య ప్రభావమును వర్ణించుటకు మానవులకు శక్తిచాలదు. ఆమె శ్రీరామకృష్ణుని గురువర్యునిఁగాను, శిష్యులను పుత్రసంతతిగాను, చూచి చేసినసేవ తలంచిన యానాటి సీతామహాదేవి, చంద్రమతీదేవి, సావిత్రిమాత జ్ఞప్తికి రాకమానరు.

శిష్యకోటిలో నొకఁడు శారదా రామకృష్ణుల సంబంధమును గూర్చి సంశయించి, యొకనాఁడు పరీక్షింప, నర్ధరాత్రి వారిచర్యలను రహస్యముగాఁ బరికించెను. ఆసమయమున శ్రీరామకృష్ణుఁడు మహాభావసమాధిమగ్నుఁడై 'తల్లీ! తల్లీ!' యనిపిలచి శారదాదేవిపాదములకడఁబడి, సాష్టాంగ మొనర్చి, నేత్రము లశ్రుపూరితములు కాఁ బలవించుచుండుటఁ గాంచి, సంశయ నిచ్ఛేదనమై, వారి నెక్కుడుగౌరవముతోఁ జూడసాగెను. ఆసంగతిఁగని, శ్రీరామకృష్ణుఁ డాతనితో, "నన్ను నీవు పరీక్షించుటలోఁ దప్పులేదు. అట్లు చేయకున్నచో నీకు నాయందు నమ్మక మెట్లుండగల"దని మందస్మితవదనుఁడై పల్కెను.

శారదాంబ యేకారణముచేతనైన నొకించుక యసంతృప్తురాలైనచో, రామకృష్ణుడు తనలోని స్త్రీభావము వక్రతగాంచినదని పలవించి, నిర్వికల్పసమాధిలోఁబడి, కాళీప్రసన్నతఁ గాంచువఱకు తృప్తినొందువాఁడు కాఁడు.

నరేంద్రుఁడు శారదాదేవిని, కన్నతల్లికన్న నెక్కుడు గౌరవప్రేమలతోఁ జూచి, యామెనుండి విశేషజ్ఞానము నార్జించెను. నరేంద్రుఁడు కన్నతల్లిని సోదరులను విడచి, సర్వసంగపరిత్యాగము చేసిన

వెనుక, నాతని కాధ్యాత్మికజీవనములో మఱల నిర్మలముగా గార్హస్థ్య ధర్మములబోధించి జననీజనక వాత్సల్యము వర్ణనాతీతప్రేమతోఁ జూపి, యాదరించినవారు శారదారామకృష్ణులు. శారదాదేవియు నరేంద్రునిఁ బుత్రరత్నముగాఁజూచి యాతని కనేకవిధముల బోధించి, పెంచి పెద్దవానినిఁ జేసినది.

---

## ఇరువదియేడవ అధ్యాయము.

### కాశీపురవనము- బుద్ధగయ- ఘాజిపురము

మహాపురుషుల జీవితము లత్యద్భుతములు. భగవంతుఁడు, వానినిఁ జేరుమార్గమును బోధించు మానవసేవ, తత్సాధనముల కడ్డు వచ్చు శరీరమానసాదుల నరికట్టుట, ఇవియే వారిజీవితములందుఁ దేజోవంతములై మిరుమిట్లు గొల్పుచుండును. లోకము, మోహము, నింద్రియవిషయములు, యాతన, దుఃఖము వారి నెదుర్కొని ఆత్మవినాశమునే పొందుచుండును. దాంపత్యము, ధనము, స్త్రీపురుషభేదము, వాదము, యశోవాంఛ, దూషణభూషణతిరస్కారములు, ఆగ్రహము మున్నగునవి వారి ప్రపంచములో నామరణశిక్షకుఁ బాత్రములు. వారిసామ్రాజ్య మాత్మసామ్రాజ్యము. ఆసామ్రాజ్యమును స్థిరముగాఁ గాపాడుసైనికులు, ఆనాత్మపరాయణత్వము సర్వసంగపరిత్యాగము, పరిపూర్ణవిశుద్ధత, పాతివ్రత్యము, అస్ఖలిత బ్రహ్మచర్య వ్రతదీక్ష, నిరుపమాన భగవత్ప్రేమ యివియే. ఆసామ్రాజ్యముల కధపతియెవఁడు? నైర్మల్యము, సుఖదుఃఖసమత్వము, నిష్కల్మష ధ్యానముద్ర, అనంతప్రేమ, సమస్తప్రాణికోటి వాత్సల్యత, అకుంఠితవైరాగ్యము, నివన్నియుఁ బరుగిడి, యొకనియందు మూర్తీభవించి, యాతనినే సామ్రాజ్యసింహాసనము నధిష్ఠింపఁజేయును. శ్రీరామకృష్ణుఁ డట్టి యాత్మసామ్రాజ్యచక్రవర్తిత్వ

పదవిఁగాంచి, నరేంద్రునికి యౌవరాజ్యపట్టాభిషేక మొనర్చి, శిష్య బృందమును సైన్యకోటిగా నేలుచుండెను.

నరేంద్రుఁ డేతద్రాజ్యభారవహనార్హతను వహించు శుక్లపక్ష శుపాకరునివలె, జ్ఞానకళాభివృద్ధిం గాంచుచుండ, శ్రీరామకృష్ణుని శరీరము, శిథిలత నొందఁజొచ్చెను. కలకత్తాలోనున్న వైద్యుల సాహాయ్యము సులభసాధ్యమగుటకై దక్షిణేశ్వరమునుండి బస కాసిపురవనమునకుఁ మార్చఁబడెను. శిష్యకోటి నిద్రాహారముల వీడి, విశ్రాంతి మఱచి, కంఠములోని వ్రణముచే బాధపడుచున్న గురునకు సేవ చేయుచుండిరి. వైద్యశేఖరులువచ్చి, మాటాడినచో ప్రాణభయము రాఁగలదని రామకృష్ణుని నియమించి వెడలిరి. కాని సూర్యకిరణ విస్తృతి నెవఁ డాపఁగలఁడు? శ్రీరామకృష్ణునిహృదయకాసార మనంతజ్ఞానామృతపూరితమై, పైకుబుకుచున్నది. ఒకరక్తమాంసకల్పితశరీరములోని యొకవ్రణబాధయా తత్ప్రసరణమున కడ్డువచ్చునది? ఆజ్ఞానామృతరసపూరితసరంబున కరుదెంచిన, అజ్ఞానపిపాసాపీడితులయి, యల్లలనాడుచున్న మానవసహస్రంబులకు, నాయమృతమును చిల్కి, యెండిపోవుచున్న కుత్తుకలందడిపి, శాంతిఁజేకూర్చవలదా? బుద్ధభగవానుఁడు, తన నిర్వాణప్రవేశసమయమున నెట్టిబాధనందుచున్న బోధించుట మానెనా? క్రీస్తుదేవుని, మేకులుకొట్టి కొఱతవేయుచున్నను, పరమాత్మబోధ చేయుచు మరణించలేదా? ఒక్కమాటాడినను సద్యోమృత్యుభీతి గలదని వైద్యులు చెప్పినను, తాను నిక్కముగా నెంత యాతనపడుచున్నను, రామకృష్ణుఁడు బోధించుట మానలేదన్నచో నం దాశ్చర్యమేమి?

తరువాత రామకృష్ణానందుఁడైన సోషిబాలుఁడు, గురుప్రక్కనే కూరుచుండి, గురుఁ డనుభవించుచున్న బాధలఁగాంచి, విచారపూరితుఁడయ్యు, గురుసేవచేయఁగల్గుభాగ్య మబ్బినందులకు

నానందముతో శుశ్రూష చేయుచుండెను. ఇతరు లందఱుఁగూడ నా సేవలోఁ బాల్గొనిరి. ప్రఖ్యాతిగాంచిన వైద్యశేఖరులువచ్చి శ్రీరామ కృష్ణుఁడిఁక జీవించు టబద్ధమని పల్కిరి. ఆతని యపారకృపాప్రపూర్ణ వాక్యముల వని, వైద్యులును మోహితులై చాలకాల మచ్చటనే నిలిచిపోయిరి.

ఈసమయమున గృహస్థశిష్యులు ప్రతిదినము తప్పకవచ్చి, గురుసేవ చేయుచుండువారు. శ్రీరామకృష్ణుఁడును యువకశిష్యబృంద మునకు సన్యాసాశ్రమ మొసంగి, గృహస్థులకు జ్ఞానబోధ చేయుచుండు వాఁడు. సన్యాసాశ్రమమును స్వీకరించిన యువకుల కొక్కొక్క కాషా యవస్త్రమును, కమండలువు, భిక్షాపాత్రయు నిచ్చి, బిచ్చమెత్తి తన కన్నము తెండనపంపెను. వారును వెంటనే వెడలి, సంశయింపక, యింటింటికి నరిగి, బియ్యముదెచ్చివండి, రామకృష్ణునకుఁ బెట్టి, శేష మును తామును దినుచుండువారు. ఆబాలు రందఱు నున్నతకుటుంబ సభ్యులు, ధనాధికులునయ్యు నట్లు భిక్షుకవృత్తి నవలంబించి తన్ను ప్రేమించుటఁ జూచి, శ్రీరామకృష్ణుఁ డంతరంగమున సంతసించెను రాజ్యాధిపతియగు బుద్ధుఁడు భిక్షాటనవృత్తిని వరించలేదా ? అదియే కదా ! సత్యమగు సర్వసంగపరిత్యాగసరణి ! ఆత్మ ధనకులాధిక్యతా, అహంభావము పోనడంచి, నిస్సంగత్వదృష్టితో నివృత్తిమార్గగాము లగువారలేకదా యతివతంసులు. నిక్కముచే శ్రీరామకృష్ణుఁడు త్యాగాగ్ని ! శిష్యు లందఱు త్యాగాగ్నిజ్వాలలు !

శ్రీరామకృష్ణు నంత్యదినములలో శిష్యులందరు, నాతని దుర్భరావస్థం జూచి, ఖిన్నులై, దుఃఖసాగర నిమగ్నులైరి. మతిస్థైర్యము పోయి, పిచ్చివారివలె వారు విలపింప నారంభించిరి. నరేంద్రు డొక్క

పరితాపముండెనో యెవరు చెప్పఁగలరు? గురుబాధ తొలఁగింపఁ దా నేమియుఁ జేయలేకపోతినిగదా యని ధృతిచెడి, నరేంద్రుఁడొక రాత్రి, వసతిగృహముచుట్టు నేష్పుచు, "రామా! రామా!" యని యఱచుచుఁ దిరుగుచుండెను. ఆయార్తనాదము విని, రామకృష్ణుఁడు దగ్గరనున్న యొకశిష్యునితో, "నరేంద్రు నిచటకుఁ గొనిరమ్మ"ని వచించెను. నరేంద్రుఁడు గురుసముఖమునకు వచ్చి నిల్వలేకపోయెను. కాని రాకఁ దప్పినది కాదు. వచ్చి నిల్చిన నరేంద్రునిఁ జూచి, "నరేన్! నీ కెందుల కీతవిచార"మని రామకృష్ణుఁడు మందలించెను. మఱియు రామకృష్ణుఁడు, "ఈ రాత్రి నీవు గడపినట్లు నేను పండ్రెండేండ్లు గడపితిని. ఆదినములు సుడిగుండములవలె వెడలిపవి. బాలుడా! ఒక్క రాత్రిలో నీ వేమి చేయఁగలవు?" అని పల్కెను.

కాశిపురవనపురములోనిగృహము భగవద్విశ్వవిద్యాలయముగా మారిపోయినది. పండితోత్తములందఱచట కరుదెంచిరి. తత్త్వశాస్త్ర మచ్చట తుత్తునియలు చేయఁబడెను. భగవద్ధ్యానగానవినోదములతో కాలము నడువసాగినది. గురుచరణముల కడకరిగి, "అయ్యా! నా హృదయశోకమును, మానసశాంతిని బోగొట్టుమం దేదైన నొసంగు"మని నరేంద్రుఁడు ప్రార్థించును. ఆయనను కాళీదేవినే యడుగుమని గురువు సమాధాన మొసంగును. ఒకసారి నరేంద్రుని బిలఁచి, రామకృష్ణుఁడు, "కొందఱు నన్ను దేవుఁడందురే" యనుచుండఁగా, "కొన్ని లక్షలమంది నిన్ను దేవుఁడని పిలువనిమ్ము! నిన్ను దేవునిగా నేనెఱుఁగునందాఁక నట్లంగీకరింపఁజాల"నని నరేంద్రుఁడు తీవ్రముగాఁ బల్కెను. శ్రీరామకృష్ణుఁ డట్టియుత్తరముఁ గోరియే కదా ప్రశ్నయిడినది? మఱియు నరేంద్రుఁ డిట్లనును; "నాకు దేవుఁడైన నవసరము లేదు. నాకు శాంతికావలెను. సత్యము, జ్ఞానము, అనంతము, నివియే నావాంఛితములు."

స్వామిబ్రహ్మానందుఁ డయిన రక్ఖాల్ అనునతఁడు గురువు పడుచున్న బాధ చూచి, "అయ్యా! భగవంతునితో మాటాడి యింకను గొన్నినాళ్లు మీశరీరము నిచట నిలుపుకొనరాదా?" యని ప్రశ్నించెను. "భవగవంతు నిచ్ఛయే నాయిచ్ఛ! ఆసర్వేశ్వరేచ్ఛయే జరుగుఁగాక!" యని చెప్పి రామకృష్ణుఁ డూరకుండి, మఱికొంతసేపటికి "ఇప్పుడు నేనును నాతల్లియు నేకమైతిమి. నాలోఁ దల్లి, శిష్యుఁడు నిర్వురు గలరు. అందు శిష్యుఁడే, అనఁగా శిష్యభాగమే బాధనందుచున్న" దని వచించెను.

నరేంద్రుఁడు నిర్వికల్పసమాధిని బొందుసమయ మేతెంచినది. ఆతనికోర్కెలన్నియు నందే లగ్నమైనవి. ఒకనాఁడురాత్రి నరేంద్రుఁ డిట్లుకలగనెను. "రమ్ము! నీకు గోపకాంతయగు రాధనుచూపెద"నని రామకృష్ణుఁడు పిలువఁగా నరేంద్రుఁడు గురువును వెంటాడఁ గొంత దూర మరిగి, ఇంక నెచటికరిగెదవనిపల్కి తానే రాధారూపమును ధరించి, రామకృష్ణుఁడు కన్పట్టెను. ఆనాఁడు మొదలు నరేంద్రుఁడు బ్రాహ్మసమాజములోని యేకేశ్వరోపాసనాగీతముల విడిచి రాధాగీతములు పాడ నారంభించెను.

నరేంద్రుఁ డత్యున్నతసాధనానిమగ్నుఁడై తన కన్నెదుట తన వలె నున్న వేఱొకపురుషుఁడు తా నేమిచేసిన నదియే చేయుచున్నట్లు గాంచి గురువుతో నీసంగతిఁ దెల్ప "ఉత్కృష్టధ్యానముద్రలోఁ గన్పట్టు చిత్రములలో నిదియొకటి" యని ప్రత్యుత్తర మొసంగెను.
రేంద్రుఁ డీవిధముగా గురుసేవచేయుచు నిర్వికల్పసమాధికై వాం
రాదు. శ్రీరామకృష్ణుని సాన్నిధ్యము సర్వహిందూతత్త్వసా
శ్రీరామకృష్ణుఁడు హిందూధర్మచంద్రబింబము
ను రాజన్యశ్రేష్ఠులనుగూర్చి యద్భుత
రామునౌదార్యము, శ్రీకృష్ణుని

లీలావిహారము, శ్రీశంకరాచార్యుని శేముషీప్రభావము, శ్రీచైతన్యు నవ్యయభక్తిభావము, కబీరు రామప్రసాదుల నిష్కల్మషహృదయము, నానక్ గురువర్యుని దివ్యశక్తి, వీనినిగూర్చి రామకృష్ణుఁడు ప్రసంగించునపుడు వారందఱు నాయాయుగములలో జీవించుచున్నట్లు తలంతురు. వేఱొకసారి గీతానందములోఁబడి యానందరసముట్టిపడఁ బాడుచుందురు దక్షిణేశ్వరములో నిట్లే జరిగెను కాశీపురములో నిట్లే జరిగెను. కాని శ్రీరామకృష్ణునంత్యదినములు సమీపించుచున్నవి. అతని జీవితగ్రంథములోనిపుటలు పరిసమాప్తిచెందుదినము లరుదెంచినవి. శిష్యు లత్యుత్కంఠతో నాతని నర్థముచేసికొనుటలో నేమఱక యుండిరి.

కాశీపురవనములో నుండఁగా నొకతఱి బుద్ధదేవునిఁ గూర్చి చర్చప్రారంభ మయినది. ప్రధానోపన్యాసకుఁడు నరేంద్రుఁడే! అతఁడు తాను చదివిన బౌద్ధమతగ్రంథములలోని విషయములనత్యుత్సాహముతో వెలిఁగ్రక్క నారంభించెను. బుద్ధభగవానునిసవితర్కధిషణాశక్తి, అతని కవితాప్రిశయసంపత్తి, అతని యత్యద్భుతభూతదయ అతని యప్రతిహతభగవద్దర్శనైకదీక్ష యాతని జాజ్వల్యమానసర్వసంగపరిత్యాగము నాతని యనంతప్రేమపూరితహృదయము, నాతని నిగూఢమధురవిలసన్మూర్తిమత్త్వము, వీనినిఁగూర్చి నరేంద్రుఁడు తన్మయుఁడై, గంభీరవాక్కులతో వచింప, శ్రోతలహృదయములకు, నరేంద్రుఁడు బుద్ధుఁడయియుండునా? యనుసంశయము తట్టెను.

బుద్ధనిత్యాగమే కొనియాడఁదగినదని యాతఁడువచించుచు అధికధనరాసులు, రాజ్యాఖండవైభవము, సర్వశాసనాధి... నతులితజనకవాత్సల్యము, జగన్మోహనయ... యొక్క నిరంతర దాంపత్యసుఖము, శ... మందిరము,నమూల్యవస్త్రాభరణాది...

యము, నత్యంతధవళదంతి దంతపరికల్పితసుఖాసనములు, వివిధరత్నమణిగణ రచితద్వారంబులు, వీనిమధ్య స్వర్గతుల్యజీవనము నిరాఘాటముగా సల్పి, ఆనందతరంగడోలికలలో నూగులాడుచుఁ గాలము గేరీతి గడపుచున్న యాదివ్యపూరుషుఁడు, చేతనొక కమండలువు పట్టి, భిక్షాపాత్రము ధరించి, సర్వప్రపంచమే గృహముగా, యథార్థపిపాసాపీడ్యమానులకు విశ్వసోదరబృందమే కారుణ్యమయసామ్రాజ్యసభ్యులుగా, దుఃఖ మరణ భయాభిప్రాయంబులే శాశ్వతముగా బాధింపఁబడిన యరివర్గముగా, దేశాటనము చేయుచున్న బుద్ధభగవానునిఁగా మారిన యాపరమేశ్వరసన్నిభమూర్తిని నరేంద్రుఁడు తన మధురతరవాక్యములచేఁ బ్రదర్శించి, బుద్ధభగవానునిత్యాగమునకుఁ దుల్యమగు త్యాగము లోకమున మృగ్యంబని వక్కాణించెను.

అంత నరేంద్రునివాస్య ముత్కృష్టత్యాగాగ్నిజ్వాలలచేఁ గాంతిమయంబు కాఁ (శ్రీ)బుద్ధభగవానుని "నాశరీర మిచ్చటనే యెండిపోవుఁగాక, నాశరీరములోని యెముకలు, మాంసము, తుత్తునియలై, శిథిలతఁ గాంచుఁగాక, ఏయనంతజ్యోతిదర్శనలాభ మెంతకష్టలభ్యమో యాజ్యోతి లభించునందాఁక, యుగసహస్రంబులు పట్టినను, నీశరీర మీయాసనమునుండి చలించరా"దని ధైర్యము మూర్తీభవించినట్లు పల్కిన నిశ్చయము నాతఁడు శిష్యులందఱచేఁ బారాయణ చేయించును. ఆసమయమున బుద్ధగయలో బోధివృక్షముక్రిందనే వారందఱు గూర్చుండినట్లు తలంచిరి. సంశయమేఘసంఘాతములు, యథార్థజ్యోతినష్టకౌన విడిచిపుచ్చిన రాజ్యవైభవసౌఖ్యస్మృతి, తలపునకువచ్చి హృదయమును వెనుకకులాగ, నఖండధైర్యమూర్తియై, కదలకనిల్చి, యెట్టకేలకు, నాకరంజ్యోతిదర్శనముచేసి, లోకాధారజ్ఞానకాంతిబింబమై, బుద్ధభగవానుఁడు నిజాసనమును వీడి, బయటికి వచ్చిన యాసంగతి విస్పష్టముగా వర్ణించి, నరేంద్రుఁడు శిష్యులతోఁ

గలసి, "ఓం నమో భగవతే బుద్ధాయ"యని సాష్టాంగములు సల్పెను. శ్రీరామకృష్ణుఁడు నరేంద్రుని హృద్యైద్య వాక్యమాధురి నాని, సమాధి మగ్నుఁడై, బుద్ధునివలె నిల్చియున్న శిష్యవిగ్రహముం గాంచి, యందఱితో నైక్యము చెందువాఁడు.

ఇంతమాత్రముచే నరేంద్రునికిఁ దృప్తిలేదు. ఆతఁడు బుద్ధగయకేగవలెను. బోధివృక్షముక్రిందఁ గూర్చుండి ధ్యానింపవలెను. అదియే యాతనినిశ్చయము. శిష్యబృందమునకు నాయకుఁడై, గురుసేవచేయుచున్న యాతఁడు వారినివిడిచి యెట్లేగుట? చెప్పక విడలిన చో వా రేమనుకొందురు? రామకృష్ణుఁ డేమితలఁచును? ఏమిజరిగిన నాతఁడు విడలి తీరవలయును. "శ్రీరామకృష్ణుఁ డవతారపురుషుఁడు. తలచునెడ నాఁబోటివారల నేయిమంది నాతఁడు సృజింపఁగలఁడు. నాసహాయమాతని కెంత?" యని నరేంద్రుఁడు తలఁచి, తారకుని, కాళిని, తీసికొని, యితరులకుఁ దెలియకుండ బుద్ధగయకు బయలుదేరెను. శిష్యులలోఁ గలకలము బయలుదేరెను. "నరేంద్రుఁ డేఁడీ? కాళీతారకు లేమైరి? నరేంద్రుఁ డింటికి వెడలెనా? కాళికాలయమున కరిగెనా? లేక లోకాటవమునకై మనల విసర్జించి వెడలిపోయెనా?" యని శిష్యులు తర్కించుకొని గురునిఁ జేరిలో సంగతినాదిరి గురువు వారివలెఁ గలఁత నందలేదు. నరేంద్రునిసంగతి యాతనికిఁ దెలియును. "నరేంద్రుఁడు శీఘ్రమే తిరిగివచ్చును. ఒకనెమలి, నల్లమందున కలవాటుపడి, దినదినము వేళకెట్లాక మానవ్రనితోట కరుదెంచుచుండెడిదో, యట్లే నరేంద్రుని కిచ్చట నేతావ్రన లభింపనిరుచి తగిలినది ఆతఁ డెచటికేగినను మఱలితీరు"నని రామకృష్ణుఁడు చెప్పెను.

1886వ సంవత్సరము ఏప్రిల్ మాసములో నరేంద్రుఁడు, బయలుదేరి బుద్ధగయ చేరుకొనెను. ప్రయాణకాలమంతయు బుద్ధభగవానుని మహదాశయకథనముతోడనే వారికిఁ గాలక్షేపమయ్యెను. బోధి.

సత్యాలయమును సమీపించి, యఖండవినయముతో లోనికరిగి, యాతని శిలావిగ్రహము నెదుట, నానందబాష్పాభిషేకముతో సాష్టాంగనమస్కార మొనర్చి, పద్మాసనస్థులై, కొంతసేపు మహాత్ముని త్యాగదీక్షనుగూర్చి యోగముద్రితులై, తీవ్రజపముసల్పి, వారు ముఖ్యపూరు మఠమునొద్దకరిగి, మహాంతును దర్శించిరి. ఆమహాంతు వారి నెంతయు గౌరవించి, యుచితసత్కారములతోఁ బూజించెను. సాయంసమయమయ్యెను. సకలప్రాణికోటియొక్క తాపత్రయనాదములన్నియు నణఁగిపోయినవి. అజ్ఞానమువలెఁ దమఃపటలము లోకము నావరించెను. అంత నరేంద్రుఁడు మిత్రుల నిర్వుర వెంటఁ బెట్టుకొని, బోధివృక్షమును జేరి, యాబుద్ధునాసనమును జూచి, యాశ్చర్యభరితుఁడయ్యెను నరేంద్రుఁడు లేచి, బుద్ధాసనముమీఁద ముకుళితనేత్రుఁడై కూరుచుండి, సమాధిమగ్నమానసుఁడై, బాహ్యప్రపంచమును మఱచిపోయెను. అట్లు కొంతసేపుండి, దగ్గరనున్న గురుభాయీలను కౌగిలించుకొని, నేత్రములు తెఱచి, నిరుఁడచుచు పిలపింప నారంభించెను శిష్యులు భయవిస్మయకంపితులై, యట్లాతఁడు పిలపించుటకుఁ గారణమునుగఁబోఁగా మఱల నాతఁడు ధ్యానమగ్నుఁడయ్యెను. బుద్ధభగవానుని నిరుపమానకారుణ్యవారాశిలోఁబడి, తన్మయుఁడై, పరమాత్మను కౌగిలించుకొను నుద్దేశముతో నరేంద్రుఁడు గురుభాయీలను కౌగిలించుకొనెనా? ఆతనిహృదయములో నప్పు డేమితోచెనో యెవరి కెరుక? కాని, యెద్దియో, పరిపూర్ణానందతరంగ మొక్కటి యాతనిహృదయమునఁ బ్రవేశించినదనుటకు సందియము లేదు. మఱి మూఁడుదినములు నిరంతరధ్యానముతోడను, బుద్ధుఁడు విహారించిన యితరస్థలదర్శనములతోడను, బుద్ధగయలో నుండి, రామకృష్ణుఁ డేమయ్యెనో యని తలంచి, కాశీపురమునకు నరేంద్రుఁడు శిష్యులతోఁ దిరిగి

వచ్చెను. నరేంద్రుని రాకకు రామకృష్ణుఁ డెంతయు సంతసించి, బుద్ధగయలోని విశేషములు చెప్ప నియమించెను.

నరేంద్రుఁ డిట్లు గుర్వాజ్ఞకాని, శిష్యుల మెఱుక కాని, లేకుండ యాత్రార్థమై వెడలిపోయిన సమయ మింకొకటి కలదు. అప్పుడు గురుశిష్యసంబంధ మింకను దృఢముగా నల్లుకొన లేదు. శ్రీరామకృష్ణు నవతారపురుషునిఁగా జూచుదృష్టి నరేంద్రుని కప్పుడు లభింపలేదు. రామకృష్ణునికంటె యతీశ్వరుల నెవ్వరినైన దర్శింప నుద్యుక్తుఁడై, నరేంద్రుఁడు ఘాజిపురము జేరెను. అచట పవనహారిబాబా యను మహానివర్యుఁ డుండెను. వాయుభక్షకుఁడై యుంట నాతని కా నామము వచ్చినది. నరేంద్రుఁడు రామకృష్ణుని శిష్యుఁడని విని, పవనహారిబాబా, యాతని నెంతయు గౌరవించెను. శ్రీరామకృష్ణునిఁ గూర్చి, పవనహారిబాబా మాటాడునపు డాతని కంఠనాదము, భక్తిపారవశ్యమున వణఁక నారంభించెను. శ్రీరామకృష్ణుని ఛాయాపటమును జూపి, "దీనినే నేనర్చించుచుంటి"నని యాతఁడు పల్కెను. నరేంద్రుఁ డెక్కడకేగిన శ్రీరామకృష్ణుని నామ మెదురౌటఁ జూచి, తనగురువుకన్న శ్రేష్ఠుఁ డింకొకఁడు లేడని యాతఁడు తలఁచెను.

---

## ఇరువదియెనిమిదవ అధ్యాయము.

### నరేంద్రుఁడు: నిర్వికల్పసమాధి.

మహాశనిపాత నిర్ఘోషముచే నితరశబ్దము లన్నియు నణఁగిపోయి, హృదయమును భేదించి, కూర్చు నొకవిధమగు భయంకరశాంతివలె, జాజ్వల్యమానాగ్నిగోళమువంటి మహోత్తుంగా వేశపూరితాభిప్రాయ మొకటి, మానసమునఁ బ్రవేశించి యితరాభిప్రాయముల నన్నిటిని దిగఁ ద్రొక్కి సమకూర్చు తీవ్ర నైశ్చల్యముపోలె, నిరంతర

మేఘసంఘాతసంఘట్టనోజ్జాత స్తనితానంతరము శరత్కాలప్రాప్తిచేఁ గల్గు, నిర్మలనీలనిశ్శబ్దవియత్తలప్రశాంతివోలె, దుర్గమారణ్యమధ్య గుహాంతరాళనివసితాచంచలమారుతాకంపితస్థితివోలె, నుత్తుంగభంగ ఘూర్ణితమై శాంతించిన సాగరవారిప్రసన్నతంబోలె, చలనరహిత నక్షత్రమహాశాంతివోలె, శరీరమానసాదీంద్రియములు, చేతనారహి తములై, యనంతజన్మార్జిత కర్మఫలముద్రాముద్రితమగు మేధస్సు ధూళిమై, ప్రత్యేకాత్మ, అఖండసచ్చిదానందజ్యోతిర్మయుండై, యొప్పు పరమాత్మలో నైక్యమై యుండఁగల నిర్వికల్పసమాధ్యవస్థ యొసంగు ప్రశాంతి వర్ణనాతీతము. అట్టిస్థితిలోఁ బరబ్రహ్మమే యున్నది. మఱెద్దియును లేదు. ఒకపఱి యట్టి నిర్వికల్ప సమాధి ప్రాప్తించిన మానవుఁడు మఱి తిరిగి, యీదేహమును ధరింపఁడు. కాని, ప్రపంచకల్యాణహేతుభూతులై జనించిన యామహాత్ము లట్టిస్థితి ననుభవించియు, మఱల శరీరములోని కరుదెంచి, కర్మోన్ముక్తులగుదురు. అట్టి నిర్వికల్పసమాధినుండి తిరిగి మానవప్రకృతికివచ్చిన యమ్మహానుభావులు, విద్యుద్దీపకాంతితో లోకమును జ్ఞానోత్తేజిత మొనర్తురు. అట్టివారినోట వెడలుమాట లమృతబిందువులు. ఆమాటలు లోకమును మోహింపఁజేసి, తమయిచ్ఛవచ్చినరీతిని ప్రజల నడపు శక్తిని కల్గియుండును. అజ్ఞానసాగరములో దిక్కులేక పడిపోయి మున్గుచున్న మానవనౌకా సముదయము నొడ్డుచేర్పఁగల మహాకారుణ్యరసపూరితములా వాక్యములే.

నిర్వికల్పసమాధి శ్రీరామకృష్ణునకుఁ గరతలామలకము. అట్టి స్థితిలో నాతఁడు నిత్యముఁ జెలగాటములాడును. ఆతనిసమాధి యనేకవిధములు. ఒకసారి సవితర్కసమాధిలోను, మఱొకసారి సవితర్కావితర్క మధ్యస్థితిలోను, వేఱొక్కసారి, నిశ్చలసమాధిలోను, నాతఁడుండఁగలఁడు. తలఁచినంతమాత్రముచే నెట్టిసమాధియైన. నాతనికిఁ

ప్రత్యక్షము. ఒకనిమునసులో 'నేను భావమును' మఱచి, బాహ్యబంధములను త్రెంచి, నిశ్చలధ్యానమగ్నుఁడై, భగవంతుం జూడఁగల శక్తి యాతనికిఁ గలదు.

నరేంద్రుని కొక్కటే కోరిక మిగిలియున్నది తాను శ్రీరామకృష్ణునివలె, నిర్వికల్పసమాధిలో మగ్నుఁడై, భగవంతుని జూడవలెనని యాతఁడు కోరెను అట్టి వరప్రసాదమునకై, శ్రీరామకృష్ణుఁడేమి త్యాగము చేయుమనిన నట్లుచేయుటకు నరేంద్రుఁడు సిద్ధుఁడై యున్నాఁడు. నరేంద్రుని కాస్థితిలో నన్నియును రుచించుట లేదు. జీవాఖండపిపాసావిచ్ఛేదకమగు లోకైక జీవమహానందసాగరములో నన్యసత్వాంశము లన్నియు నరేంద్రునకు నీటిబిందువులుగాఁ గన్పట్టెను. సర్వోపనిషత్సారరూపమగు, 'అహంబ్రహ్మాస్మి' 'శివోహమ్' వాక్యముల నాచరణపూర్వకముగా ప్రదర్శించు శక్తికొఱకే యాతఁడు పరితపించును. శ్రీరామకృష్ణు నాతఁడు నిక్కముగా సేవించిన దినములకే! ఇట్టి కోరికగోరు మానవు లెందఱుందురో కదా!

నరేంద్రుని ప్రార్థనగాంచి, శిష్యులు భయకంపితులైరి. ఆసమయమున నరేంద్రునిముఖము, సర్వసంగపరిత్యాగాగ్నిచే దేదీప్యమానమయ్యెను ఆతనిప్రవర్తన భగవత్ప్రార్థనలో నిమిడిపోయెను. ఆతనివాంఛ నిశ్చలసమాధిలో మగ్నమయ్యెను. దివారాత్రము లేకరీతిగా నాతఁడు సత్యాపిధారావ్రతము పూని, నిద్దుర లేక, ఆహారము విడిచి, పిచ్చివానివలె నుండెను. కాశీపురవనసౌధాంతరమున నున్న శ్రీరామకృష్ణుని కడకరిగి, "గురూత్తమా ! నాకు నిర్వికల్పసమాధి యెప్పుడు పొసఁగెద"రని వినయముతో నాతఁడు ప్రశ్నించెను. బ్రహ్మానందపరిస్ఫురన్ముఖాంబుజ ముల్లనవిప్పి, "నాకు నెమ్మదిగా నున్న వెనుక నీకోర్కె తప్పక తీర్చెద"నని రామకృష్ణుఁడు బదులు చెప్పెను. "కాని మీరు చనిపోయినచో నె"ట్లని నరేంద్రుం డాగలేక నడుగ,

"నీ వేమి మాటాడుచుంటి"వని నీరసముప్పొంగఁ బల్కఁ "శరీరము లేనిచో మఱెట్టియు సాధ్యము కాదా? బాలుఁడా! నీకేమి కావలయు" నని మఱల రామకృష్ణుఁ డోర్పుతోఁ బల్కెను. "శ్రీశుకదేవుని వలె, సమాధిలో నొకేపట్టున నైదారుదినములుండి, శరీరమునురక్షింప నవసరమగుచో స్మృతికివచ్చి, మఱల సమాధిలోనుండు నవస్థయే కావలయు'' నని నరేంద్రుఁ డనెను. శ్రీరామకృష్ణుఁ డాగ్రహము నటించి, "ఛీ! సిగ్గు! సిగ్గు! నీమూర్తి లోకమోక్షప్రదానసమర్థము. నీ విట్లు మాట్లాడుట తగదు. భూరివటవృక్షమువలె, నీవు నీఱెక్కలక్రింద మానవకోటికి విశ్రాంతి నొసంగఁ గలవాఁడవని నేఁ దలఁచితిని దానికి బదులు నీయాత్మమోక్షమునకే నీవ్రాగులాడెదవా? బాలుడా! అట్టి యల్పవిషయములఁ గోరకుము. భగవంతు నద్వైతదృష్టింజూచి యూరకుండుట పక్షపాతము. సర్వమానవసంబంధ సౌఖ్యములలోఁ గూడఁ జూడవలెను. భక్తిజ్ఞానముల మేళవించు"మని పల్కెను.

అది వినినంతనే నరేంద్రుని నేత్రములనుండి యశ్రుధార మున్నీరై ప్రవహించెను. గురునభిప్రాయ మాతఁడు గ్రహించెను. తనకు నిర్వికల్పసమాధ్యవస్థ నొసంగుట గురున కిష్టము లేకపోలేదనియు, నజ్ఞానాగ్నిచే దహించి యల్లాడుచున్న మానవసహస్రంబుల రక్షించుటకే తన్నట్లు బోధించెననియు, నరేంద్రుఁడు గ్రహించి రామకృష్ణునిచేఁ బ్రదర్శితమయిన జ్ఞానజ్యోతిని లోకమున వెలుంగఁ జేయుభారము తనమీఁదనే గలదని యాతఁ డూహించి యూరకుండెను.

శ్రీరామకృష్ణు నుద్దేశములో మహాపురుషులు రెండుతెఱగు లుందురు. నిర్వికల్పసమాధిలోనుండి బ్రహ్మైక్యభావములో నానందవార్ధిలో నీదులాడుటయే ముఖ్యముగా నెంచువారు మొదటితరగతి

వారు. బ్రహ్మైక్యజ్ఞానమందియు నట్టిజ్ఞానము లేక నల్లాడు ప్రాణికోటిని తరింపఁజేయు నఖండకరుణాంతరంగముతో శరీరయాత్ర చేయుచు పరార్పితజీవనసర్వస్వులై వర్తించువారు రెండవతరగతివారు. ఈతరగతి లోనివారే జగద్గురువులు. నరేంద్రునిహృదయము సమాధిలగ్నమైనను నాతడప్రతిమానకారుణ్యపయోధియనియు, నఖండత్యాగసాగరమూర్తి యనియు, రామకృష్ణుఁ డెఱింగియే లోకసంగ్రహార్థము జీవింపు మని యాతఁడు మందలించియుండెను. నిత్యసిద్ధుఁ డగు నరేంద్రుఁ డాత్మ మోక్షసిద్ధికోరుట సార్వభౌముఁడు బిచ్చమెత్తుటవంటిది కాదా !

కాని నరేంద్రునివాంఛ రుచిమైనఁ జూడనిదే యడఁగునట్లు కన్పట్టలేదు. ఆతనిమానసము నిర్వికల్పసమాధిలోఁ బడి సచ్చిదానందరసము నొకపఱిఁ గ్రోలి బయటికి రావలెను.

ఒకనాటిసాయంసమయమున నరేంద్రుఁడు పద్మాసనస్థుఁడై ధ్యానముద్రలోఁ బడియుండెను. తటాలున నాతనిశిరస్సునకు వెనుక భాగమున నొకదివ్యతేజస్సు వెల్గిన ట్లాతఁడు గాంచెను. ఆతేజస్సు విస్తృతి చె దనారంభించెను. ఆతనిమానసముం దైక్యమయ్యెను. ఆతరువాత నేమిజరిగినదో తెలియుటకు భాషాకాంత నోచుకొన లేదు. నక్షత్రమండలమెగిరి పోయినది. లోక మదృశ్యమయ్యెను. సర్వవస్తుసంతతియు మారిపోయి యాసచ్చిదానందపరంజ్యోతియొక్కటే ప్రత్యక్షమయ్యెను. ఆతని కెన్నఁడు కాంతిగోళము కన్పట్టిన నాతఁడు లెక్కచేయలేదు. కాని యీసారి కన్పట్టిన దివ్యజ్యోతి యట్టిది కాదు. ఈజ్యోతి యనంత విశ్వవ్యాప్తి వహించినది. ఆతని యహంభావ మం దిమిడిపోయినది. దేశకాలము లందు దగ్ధములైనవి. సర్వస్వరూపము లందు లీనమైనవి. బ్రహ్మానందమయ దివ్యజ్యోతియొక్కటే

నిలచియున్నది. పరమాత్మనిశ్చలరూపుతో నిలఁచియున్నాఁడు. అట్టి స్థితి యవాఙ్మానసగోచరమగుచో వర్ణించుటెట్లు?

ఈవిధముగా నరేంద్రుఁడు నిర్వికల్పసమాధిలో నిమగ్నుఁడైనపుడాతఁ డద్భుతభయభ్రాంతులకు లోనయ్యెను. విస్మయము విఱిగి మీఁదఁబడిన ట్లాతఁడు వడఁకిపోయెను. చలనరహితమగు నానందోద్రేకమునుండి యాతఁడు పరమాత్మదర్శనము చేయుటలో భయచకితుఁడయ్యెను. ముఱల నందుండి తుద కాతఁడు శాశ్వతప్రశాంతినిలయమైన యనంతసచ్చిదానందజ్యోతిలో నిలచిపోయెను.

ఆరాత్రి యందఱును శాంతముగా నూరకుండిరి. శిష్యులు కొందఱు గురుసేవ చేయుచుండిరి. కొంద ఱేకమూల ధ్యానించుచుండిరి. గోపాలదా మాత్రము నరేంద్రునిప్రక్కనే యుండెను. నరేంద్రుని నిరుపమానగంభీరకంఠధ్వని యాతఁడు విని తత్క్షణమే యాతని కడకుఁ బర్వెత్తి "ఓగోపాలదా! ఓగోపాలదా! నాశరీర మేది?" యనుమాటలు విని "నరేన్! ఏమది? ఇది నీశరీరముకాదా?" యని పల్కెను. నరేంద్రుఁడు నేలమీఁద సాష్టాంగముగాఁ బడియెను. శరీరము బిగువుపాఱి గట్టి పడెను. అందు జీవమున్నట్లు తోఁచలేదు. గోపాలదా యేమిచేయును? నరేంద్రుఁడు మరణించెనా? 'రండు రం' డని శిష్యులను గోపాలదా కేక లిడెను.

ఆకేకకు పదిమందిశిష్యులు బదులు పల్కి, పర్వెత్తివచ్చి, యేమిజరిగినదని గుండెలుకొట్టుకొనుచు నడిగిరి. వారికి నరేంద్రుని దేహముచూపి, గోపాలదా 'చూడుఁ'డని పల్కెను. వారి కేమియుఁ దోఁచలేదు. అఖండానందప్రశాంతి నరేంద్రునిముఖమున విశదమయ్యెను. నరేంద్రుని నేత్రములు లోపలిదృష్టితో ముకుళితములయ్యెను. శిష్యులు కడుభీతిలి నరేంద్రునిఁ గేకలిడిరి. శరీరమును విదళించిరి. శ్వాస కట్టుపడియుండుటచూచి కంగారుపడిరి. శరీ-

పిసిగి యూపిరి తేఁ బ్రియత్నించిరి. కాని యూపిరి రాలేదు. "నరేం ద్రుఁ డేమయ్యెను? చనిపోయెనా?" యని వారు ప్రశ్నించుకొ నిరి. ఎవరికిని నోరాడలేదు. కొంతసే పాగిరి. నిముసములు గడచెను. గంటలు గడచెను. నరేంద్రుఁడు కదలలేదు. శిష్యులికనోర్వఁజాలక, రామకృష్ణునికడకుఁ బర్వెత్తి, విషయము నివేదించిరి. శిష్యులు రామ కృష్ణుని జేరునప్పటికి రామకృష్ణునిముఖ మనంతశాంతిభాయిష్ఠమై, మహోత్కృష్టావేశరచితమై యుండెను రామకృష్ణుఁడు వారివిఁజూచి విమయ మెఱిఁగినవానివలె నవ్వెను. అట్లు చిఱునవ్వునవ్వి, "గోపాల దా! భయములేదు. వాని నట్లుండనిండు. ఆస్థితినొసంగుమని యాతఁ డు నన్ను బాధించినాఁ"డని వచించెను. రామకృష్ణునినేత్రములప్పు డద్వైతజ్ఞానకాంతిగోళములై వెలుంగుచుండెను. గురువాక్యములచే శాంతిఁ గాంచి, శిష్యులు ధైర్యమూని, నరేంద్రుఁ డున్నతావునకు మఱలిరి.

రాత్రి తొమ్మిది గంటలగువఱకు నరేంద్రుఁడు నిర్వికల్పసమా ధిలో నుండెను. భగవంతుని జూడవలెనని యెన్నివేలజన్మములనుండి త్యాగానలము రగుల్కొల్పి విషయవాంఛాటవి నంటించి ధనమందిర పుత్రపౌత్రిసంబ ధముఁ గాలఁ దన్నివైచి, యెడతెగని తపంబొనరిం చెనో, ఆతపఃఫలమును నరేంద్రుఁడు నిర్వికల్పసమాధిలోనుండి, చిన్మయానందముద్రితుఁడై అనుభవించెను.

ఇఁక వానికి వలయునదెద్దియును లేదు. ఏదికోరినచో నిఁకకోర నవసరము లేదో యా కామితము నాతఁడు రుచిచూచిన వెనుక నాతనికివల యునదెద్ది? పరమేశ్వరసాక్షాత్కారభాగ్యముకన్న నిఁక భాగ్యమేము న్నది! గణనాతీతయోనికూటములోఁ బడి, దుర్భరగర్భానేక సహ స్రంబులలోఁ గుమిలి పాపపంకిలమున మ్రగ్గి దుఃఖాస్త్రంబుచే వడి, తాపత్రియాగ్ని కాహుతియై, పశుపక్షి, వృక్ష

లఁతాది, యనంతనీచజన్మములెత్తి, యొడలుగానక చేసినకర్మరాశియంతయు దగ్ధమై, పరమాత్మానందపాథోధిలో నిర్మగ్నుఁడై, నిర్వ్యాపారుఁడై, నిర్బంధనుఁడై, సురనదీతరంగములమీఁద నామొలనూఁగు రాయంచవలె, విహరించుస్థితి నరేంద్రునకుఁ బ్రాప్తమైనది. ఆతఁడెట్టి పుణ్యాత్ముఁడోకదా! ఎట్టిపుణ్యమూర్తియుఁ గాకున్నచో, లోకము నాతఁడు తనమోహనవాగ్బాణబద్ధముచేసి, తన యమృతజ్ఞానరసమును, ప్రజల కుత్తుకలలోఁ జొన్పి ప్రశాంతి చేకూర్చఁగల్గెను? ముప్పదివత్సరములప్రాయముననే మున్నీరుదాటి, మూఢప్రకృతి శాస్త్రముచే ముచ్చిలి మూకవలె, లోకప్రాణికోటిని మూర్ఛిలఁజేయుచున్న మూషకదంతతుల్య తుచ్ఛాతితుచ్ఛశాసనవిధానములచే శాంతిభంగ మొనర్చుచున్న పాశ్చాత్యఖండముల నెల్ల మూతులఁబిగించి, తన సత్యధర్మసందేశ జాలగ్రంథములలోఁ బడవైచి, మోక్షసాధనోన్ముఖులఁజేసి, చిరతమకీర్తిం బ్రాపించెను ?

అట్లు రాత్రి తొమ్మిదిగంటలు దాటినవెనుక నరేంద్రుని శ్వాసనాళమునుండి యూపిరి మెల్లమెల్లఁగా రా నారంభించెను. శిష్యబృందమమితానందములో నోలలాడెను. శ్రీరామకృష్ణుని కప్పుడే వార్త వెడలెను. నరేంద్రునికిఁ బాదము లొత్తుచుఁ గొందఱు సేవించుచుండిరి. "నరేంద్రా!" యని కొందఱు పిలువనారంభించిరి. వారివాక్యములు నరేంద్రునకు సముద్రగర్భమునందలి, యస్పష్టనాదములవలె వినఁబడుచుండెను. క్రమముగా నానినాదములు, నరేంద్రునకుఁ దెలివినొసంగుచుండెను. తన ప్రశాంతి చెడిపోవుచున్నట్లాతఁడు గ్రహించెను. శిష్యులు బలవంతముచే లేపకున్నచో నరేంద్రుఁడు నిర్వికల్పసమాధిలో నింకను గొంతకాలముండువాఁడే! అదియుఁగాక నెద్దియో యొక యమోఘశక్తి యాతని నాస్థితినుండి లాగుచున్నట్లు గనబడెను! ఇఁక బయటికిరాక తప్పినదికాదు. ఇం

కొంకనిముసములో నాతఁడు నేత్రములు తెఱచి, "ఏమిజరిగిన"దని మెల్లఁగాబల్కెను. ఆధ్వని శ్రోత్రములఁబడుట తడవుగా శిష్యు లాతఁడు మఱల నిర్వికల్పసమాధిలోఁబడునేమో యని భీతిలి, పెద్దధ్వని చేసి, యాతని మేల్కొల్పిరి. మానవస్మృతి యాతని బయటికిలాగినను, నాపూర్వ మనుభవించిన విశేష నిర్మలానందముద్ర లాతని హృదయమును విడువక, ముఖమున కనంతదివ్యకళాప్రపూర్ణతనొసంగి, లోకరంజకదృష్టి నర్పించెను. ఆతనియా పప్పుడే, తీక్ష్ణముగా నగ్నిఁగాల్చి బయటికిఁదీసిన కాంచనశలాకవలె, వర్ణాధిమధ్య చంచలచ్చంచలాకృతిని వహించి, యాతనిమూర్తి కనంతమనోజ్ఞతను గూర్చెను.

అట్టి దేదీప్యమానాకృతితో నరేంద్రుఁడు, స్మృతిదెచ్చుకొనెను. ఆతనిశరీరము తేలికపడినట్లు కన్పట్టెను. ఒక యద్భుతశక్తి యాతనిలోఁ దిరుగాడుచున్న ట్లగపడెను. అంత నాతఁడు లేచి, రామకృష్ణుఁ డున్న మేడమెట్లెక్కెను. అట్లెక్కుటనాతఁడు సరిగా నెఱుఁగఁడు. మఱొకనిముసములో నాతఁడు, గురునెదుట నిల్వఁబడెను. నరేంద్రునిముఖముఁ దీక్ష్ణముగాఁ దిలకించి, "ఇప్పుడు మాత నీకు సర్వముఁ జూపినదికదా! ధనము పెట్టెలోఁబెట్టి తాళము వేసినట్లు నీనిర్వికల్పసమాధిదృష్టితాళము వేయఁబడును. ఆతాళముచెవి నాచేతిలోనుండును. నీవు చేయవలయుపని చాలగలదు. నీపని పూర్తియయిన వెనుక, నీతాళము మఱలఁదెరువఁబడును. అప్పుడు మఱల నీనిశ్చలసమాధిజ్ఞానము రాఁగలదు. కాని నీ విప్పుడు నీశరీరమును జాగరూకతతోఁ గాపాడుము. పవిత్రసాత్త్వికాహారము నే భుజించు"మని రామకృష్ణుఁ డాదరముతోఁ బల్కెను. మఱియు నితరశిష్యులతో, నరేంద్రుఁడు నిర్వికల్పసమాధినుండి రాఁగల్గుట లోకులయదృష్టమనియు, నట్టియఖండజ్యోతిని వహించు శరీరమునకు సామర్థ్యము చాలక నశించుననియు, రామకృష్ణుఁడు వచించెను.

రాత్రియంతయు భగవత్సంకీర్తనముతోఁ గడచెను. ఆసంకీర్తనముమధ్య రామకృష్ణుఁ డొకసారి, "నరేంద్రుఁడు స్వేచ్ఛామరణము నొందఁగలఁడు. ఏక్షణమున నరేంద్రుఁడు తన యథార్థరూపమును దెలిసికొనునో, యాక్షణముదాటి నరేంద్రుఁ డొక నిముస మీదేహముతో నుండఁడు! సమస్తఖండములఁ దనయఖండబోధనలచేఁ దలక్రిందు చేసిన వెనుక నట్టిసమయము మేతెంచు"నని వక్కాణించెను. మఱల నాతఁడు కాళీదేవినిఁ దలంచి, "తల్లీ! నరేంద్రునిలో నీయద్వైతజ్ఞానమును కప్పియుంచుము ఆతనిచే నేను చేయించఁగలపని విశేషమున్న"దని ప్రార్థించెను. నిజముచే శ్రీరామకృష్ణుఁడు తనయితర శిష్యబృందమునకు మోక్ష మొసంగుమని తల్లిని ప్రార్థించియుండెను కాని నరేంద్రునివిషయములో నాతనిప్రార్థనము ఛేదించుటకుఁ గారణ మాత శిత్స్వల్పముగుమాయచేనైనఁ గప్పఁబడనిచోఁ గర్మాచరణకుఁ గడంగడనియే యట్లుచేసెను. అనఁగా నరేంద్రు డఖండసచ్చిదానందసాగరములో మున్గి తనహృదయభాండము నాయమృతముతో నింపి, బయటికివచ్చి, పూర్వము జగన్మోహనాకారముచే నమృతభాండమును రక్కసులను మోసగించి దేవతలకుఁ బరమేశ్వరుఁడు పంచి యిచ్చినరీతిని, లోకమందలి ముముక్షుకోటికి ముక్తినొసంగెను. "సివితరుల సందఱ భగవత్సాన్నిధ్యమునకుఁ దోడ్కొనిపో నేలయాతురపడెద"వని శిష్యుఁడొకఁడడుగ, "ఒకప్రాణికి సహాయము చేయఁగల్గు నవకాశము లభించునెడ నే ననేక సహస్రపర్యాయములు, శునకజన్మమునైన నెత్తుట కించుకంతయు సంశయింప"నని రామకృష్ణుఁడు కరుణా

...చెను.

---

# ఇరువదితొమ్మిదవ అధ్యాయము.

## శ్రీరామకృష్ణ నిర్యాణము.

శ్రీరామకృష్ణుని యిహలోకవాసరము లన్నియు శిష్యులకు ధ్యానముద్రలతోడను, ప్రార్థనలతోడను, సేవతోడను, నిర్మలానందముతోడను, నరేంద్రు నగ్రశిష్యత్వముతోడను గడచిపోయెను. ఇంకఁ గొన్ని దినములు మాత్రమే మిగిలియున్నవి. జగత్కల్యాణహేతుభూతుండగు నమ్మహాత్ముని భౌతికశరీరము, పరిపూర్ణ శిథిలతఁగాంచుటకు దినములు లెక్కకు మిగిలినవి. ఆతనియాధ్యాత్మికపుత్రబృందమనఁదగు శిష్యబృందము, నిరంతరసేవానిమగ్నమైయుండెను. లోకమునుతరింపఁ జేయ నవతరించిన యామూర్తి లోకమునుండి నిర్గమించుచుండ దివారాత్రము లేకరీతిని, నిద్రాహారములుమాని, శిష్యులు గురుశుశ్రూష చేయుటొక చిత్రమా ?

అది 1886 వ వత్సరములో నాగష్టుమాసము. జగద్గురు దర్శనముచే పావనతఁజెంద జనులు గుంపులుగుంపులుగా వచ్చిపోవుచుండిరి. గురువ కంత్యదినములు వచ్చుచున్నవని, నరేంద్రుఁడు కాంచకపోలేదు. క్రీస్తుదేవుఁడు తనపుణ్యరాశియంతయు నాతని నర్చింపవచ్చిన యొకశిష్యునిలోఁ జేర్చి, యాశిష్యుని పాపభారమంతయుఁ దాను వహించితినని చెప్పినవాక్యము లాతనికి జ్ఞప్తికివచ్చెను. తనశిష్యుల యొక్క పాపపటలమంతయు రామకృష్ణునిలోఁ జేరి, యాతని మరణహేతువయ్యెనని నరేంద్రుఁడు నమ్మెను. ఆనమ్మకముచే నాతనికి సంతోషము, విచారము నొక్కమాటె కల్గెను. గురువియోగమ
సహింపఁజాలఁడు. గురు నాధ్యాత్మిక సామ్రాజ్యా
భిషేకము చేసినాఁ డనెడి యనంతానంద
పోలేదు. మూఁడుమాసముల వెనుక, రామకృ

కర్పించుట, గురునానక్ మహాశయునివలెఁ, దన్నెఱుంగు శిష్యోత్తము కొఱకు వేచియుండుట, నరేంద్రున కనుభవమగు నావేశమును కల్గించెను; ఆతనిస్థితినిగూర్చియే నరేంద్రు డిట్లు తలచెను. "రామకృష్ణుఁడు నన్ను మాత కర్పించినవెనుక నాతనిశరీరసౌష్ఠవ మాఱుమాసములే నిల్చి, తరువాత క్రమక్రమముగా క్షీణింపనారంభించెను. అప్పుడే యాతఁడు మరణబాధకు లోనయ్యెను."

నిజముచే శ్రీరామకృష్ణునిమూర్తి క్రమశిథిలతచే, నరేంద్రుని ప్రవర్ధమానజ్ఞానకళాభివృద్ధియాలమున నరేంద్రుఁడు నూతనజన్మ మందనారంభించెను అట్టినూతనజన్మమందుటకు, నరేంద్రునిహృదయము నాల్గువత్సరములు, నిరంతరము, నియమాదికముచే శుద్ధి యొనర్పఁబడెను. రామకృష్ణుఁడు తనభగవత్కళను, కాళీమాతలోఁ జేర్చవలెను. ఇదియే యీశ్వరోద్దేశమయి యున్నది.

జూలై మూఁడంతనాఁడి రామకృష్ణునికి మాటాడలేని స్థితివచ్చెను. అవయవసంజ్ఞలచేతనే యాతఁడు తనయభిప్రాయములు వెల్లడించుకొనుచుండెను. శిష్యబృందములో విచారసూచనలు ప్రారంభమయ్యెను. కన్నతండ్రివలెఁగనినవాడి ప్రేమపూరితహృదయముతోఁ బెంచిన జననివలె, అంతర్యదాస్య మొసర్చిన మిత్రునివలెఁ, దనకై జీవితమునైన నర్పింప సంసిద్ధుఁడైన త్యాగచక్రవర్తివలెఁ, బెంచిన యామహాత్ముఁడు, సందిగ్ధమరణావస్థలోనుంటఁ జూచిన శిష్యు లమితదుఃఖ నిమగ్నులైరి. ఆదినమున కాదినము రామకృష్ణుని బాధ యెక్కుడగుచుండెను. కాని యాతని శరీరము చిన్మయకాంతిలో [illegible]ప్యమానముగా నుండెను. ఆతనిహృదయ మధిక నిశ్చలప్రదీ[illegible]కొంచుట ప్రదర్శితమయ్యెను. ఆస్థితినిగూర్చి వర్ణించుచు, [illegible]న్నెను; "సంస్కరణమునుగూర్చి యేల మాట్లా[illegible] [illegible]వుకన్న సంస్కార బరిపూర్ణుఁడైన వాని

నొక్కని నెందుఁజూచి యెఱుఁగను. ఆతనినడక, భాషించువిధము, విశ్రాంతి, కూర్చుండుట, చూచుట, వినుట, మందిరపరిశుద్ధి, ప్రతిని మేష కార్యాచరణవిధానము, నన్నియు నత్యధికసంస్కృతములై యొప్పినవి. గురుశిష్య సంబంధ మద్వితీయము. ఆతఁడు మఱికొంతకాలము జీవింపవలెనని వారు ప్రార్థించిరి. దాని కాతఁడు "సర్వేశ్వరసంకల్పమే యగునుగాక" యని బదులుచెప్పెను."

నరేంద్రుఁ డీసమయమున, నాధ్యాత్మికశక్తి మూర్తిభవించి నట్లుండెను. ఒకనాఁడు గిరీశబాబాతనిఁ దనతో ధ్యానింప నొకవృక్షముక్రిందకుఁ దీసికొనివెళ్లెను. అచట దోమలు నిలుచుండనీయుట లేదు. వారిద్దరు ధ్యానమగ్నులై యుండిరి. గిరీశబాబు దోమలబాధ సహింపఁజాలక, చకితుఁడై నరేంద్రునివైపు చూచెను. నరేంద్రునిశరీరము, నీలాంబరముచేఁ గప్పఁబడినట్లు, గణనాతీతమశకసంతతిచే నావృతమయియుండియు నరేంద్రుఁడు నిశ్చలధ్యానసమాధిముద్రలో నుండి చలింపకుండుటఁజూచి, గిరీశబాబు తనయల్పత్వమును దెలిసికొని, నరేంద్రు నద్భుతశక్తి కచ్చెరువందెను. ఇంకను నరేంద్రునిఁ బరీక్షింపఁ గేకలువెట్టెను. చేతితోఁ దట్టెను కొట్టెను. అట్లైన నరేంద్రుఁడు చలింపమి, చేయిపట్టుకొని బయటికి లాగెను. అప్పటికి నరేంద్రుఁడు స్మృతికివచ్చెను.

పెక్కుమారులు, శ్రీరామకృష్ణుఁడు శిష్యులను సాన్నిధ్యమునకుఁ బిలిచి, తననిర్హేతుకకారుణ్యమయదృష్టి వారిమీఁద నిగిడించి, తనయవయవములచే వారిని దుఃఖ లాలించును. "ఈ లోకమును వీడినచో నిఁక తన బాలశిష్యసంతతికి ది... యాతఁడు తలఁచి, నరేంద్రు డుండెనుకదా ... ము తెచ్చికొనును.

తనపరలోకగమనమునకు రెండుదినములు ముందు, శ్రీరామకృష్ణుఁడు నరేంద్రుని తన ప్రక్కకుఁబిలఁచి, కఠినప్రయత్నముచేఁ గంఠముదెచ్చికొని, యిట్లు పల్కెను; "చూడుము నరేంద్రా! మదీయ పుత్రతుల్యులగు నీబాలురందఱను, నీచేతిలో విడచుచున్నాను. వారందఱిలో నీవే కుశాగ్రబుద్ధివి, ప్రవీణుఁడవు. వారిని సోదరప్రేమతోఁ బెంచి, నా కార్యమును పూర్తిచేయుము "

ఈమాటలు విన్నవారికి వేఱొక భగవత్పుత్రుఁడు జ్ఞప్తికి రాకమానఁడు. ఆతఁడే క్రీస్తుదేవుఁడు. తనయగ్రశిష్యుఁడైన 'పీటరును, పిలచి, తన యవసానదశయందు, తన యాధ్యాత్మికసంతతి నాతనివశముచేసి యుండెను. పీటరుమీఁదనే తన సామ్రాజ్యభారమును పడవైచి, యామహాశయుఁడు దేహమును వీడెను. నరేంద్రునకు పీటరుస్థితియే సంభవించినది. ఆతనిమూలముననే, ఆదిమధ్యాంతరహితహిందూతాత్త్వికాభినవధర్మసందేశము, శ్రీరామకృష్ణుఁడనుభవపూర్వకముగాఁ బ్రదర్శించినరీతిని ఖండఖండముల వ్యాప్తిజరుగ వలసియుండుటచే నాతనియధీనములో శిష్యబృందమునే కాక, జీవిత సర్వఫల మనఁదగు నిఖిలజ్ఞానమునకుఁ గల తాళముచెవిని యిచ్చివేసి, శ్రీరామకృష్ణుఁడును వెడలిపోయెను.

గురువాక్యము లందలి యానతి విని నరేంద్రుఁడు, దుర్భరావేశసంజాతనిశ్వాసమును నిగిడ్చి, యఖండవినయముతో హృదయము ముకుళింపఁ, గంటఁ గన్నీరుజలజలరాల,నోటమాట వెడలక, బయటికివెడలి, దుఃఖసాగరమగ్నుఁడై, తన యావేశాగ్నినిఁ జల్లార్చెను. శిష్యకోటియు వివర్ణవదనములతోఁ గూరుచుండిరి. వారిని నరేంద్రుఁడుచూచి, వారిభావిస్థితిని దలఁచి, తనమీఁదఁబడిన భారముచేతను విచారముచేతను కృంగిపోయినట్లు నిలచెను. శ్రీరామకృష్ణుఁడు

వచించిన తన యంత్యసందేశములోని మాటలను మఱిమఱి తలంచి, కాసిపురవనగృహచ్ఛాయను గూరుచుండి, తన హృదయము విద్యుచ్ఛక్తితరంగములవలె వణఁకిపోవుచుండ నొక పుణ్యనిమేషమున, నరేంద్రుఁడు, తన గుర్వాజ్ఞను శిరసావహించి, పరిపూర్ణముగా నాచరింపవలెనని దృఢప్రతిజ్ఞ చేసెను; "శిష్యులకొఱకే నేను జీవించెదను. వారికొఱకై నేను బిచ్చమైన నెత్తెదను. అవసరమగుచో నేను వారికై ప్రాణములనైన నర్పించెదను." ఇవియే వానినోట వెడలిన వాక్యములు. ఆప్రతిజ్ఞాపరిపాలనముందే నరేంద్రుఁడు తన జీవితమును లగ్నము చేసి, ఆమరణాంతము, శిష్యులను వర్ణనాతీతప్రేమతోఁ బెంచి, భగవత్తుల్యులఁ జేసెను. శిష్యులును నరేంద్రు నత్యధికప్రేమతోఁ బూజించియుండిరి.

ఇంతకుముందు నరేంద్రుఁడు శ్రీరామకృష్ణుని సమీపమునకుఁ బిలువఁబడెను. శ్రీరామకృష్ణుఁ డప్పుడు మాటాడలేనిస్థితియం దుండెను. అంత్యదినములు సమీపించుచున్నవని యెఱిఁగి, శ్రీరామకృష్ణుఁడు శిష్యుల కచంచలాధ్యాత్మికబోధ చేయుచుండెను. కాని నరేంద్రుఁడు ప్రధానశిష్యుఁడు, కావున నాతనికి, విశేషసాధనల నేర్పుచుండెను. ప్రతిసాయంత్రము నరేంద్రుని దగ్గరకుఁ జేర్చి, ముందు తాను శిష్యుల నెట్లు సన్యాసాశ్రమస్వీకృతికిఁ బ్రోత్సహింపవలెనో, ప్రేమించి యాదరించవలెనో మున్నగువిషయముల నేకాంతముగా దినమునకు రెండుమూఁడు గంటలసేపు బోధించుచుండెను. కాని యానాఁడు నరేంద్రుఁడు గదిలోఁ బ్రవేశించినపుడుమాత్ర మొకకాగితము మీఁద, "అన్యులకు నరేంద్రుఁడు బోధించు"నని వ్రాసి రామకృష్ణుఁ డందించెను. నరేంద్రుఁ డది చూచి, సంశయించి "నే నట్లు చేయ" ననెను. అంత శ్రీరామకృష్ణుఁడు, తన బలమును కేంద్రీకరించి, గంభీరముగా, "నీవు చేసితీరుదువు. నీయస్థిపంచయమే నీచేత నట్లు చేయిం

చితీరు" నని వచించెను. మఱొకమారు, "నాయోగశక్తు లన్నియుఁ గొలఁది కాలములో నీలోఁ బ్రదర్శింపఁబడు"నని పల్కెను.

శ్రీరామకృష్ణుని మహాసమాధి కిఁక నాల్గుదినము లేమిగిలినవి. కాశీపురవనమంతయు జన్మాంతరార్థపరికీర్ణ మయియుండెను. బాలు రందఱు జ్ఞానసాధనములో నిమిడియుండియు గురుసేవానిమగ్నులై యుండిరి. గురూత్తముని భయావస్థ నరేంద్రుని చలింపఁజేసెను. గురునియోగాభిప్రాయముచేఁ గల్గిన దుఃఖము నాతఁడు భగవత్సం కీర్తనముచే మ్రింగుచుండెను. శ్రీరామకృష్ణుని గదిలోని కరిగి యాతని రక్తశూన్యముఖమును దిలకించి, భీతిచెంది నిలచెను. ఒకనాఁడు శ్రీరామకృష్ణుఁడు నరేంద్రునిఁ బిలఁచి, శిష్యులను బ్రక్కకుఁ జేరి, ధ్యానింపుఁ డనెను. గదితలుపులు మూయఁబడెను. శిష్యులేమి జరుగునోయని భీతిల్లుచుండిరి.

నరేంద్రుఁడు గురుసాన్నిధ్యమున ధ్యానముద్రితుఁడై గడపిన, అట్టి నిమేష మింకొకటి కలదు. బేలూరుమఠమునందు, తలుపులన్నియు మూసి, వివేకానందస్వామి గురువిగ్రహసమ్ముఖమున, నిశ్చల ధ్యానములో నాసీనుఁడై, నిర్వికల్పసమాధిని పొంది, మఱలి రాని పదవికిఁ బయనమయినదే యానిముసము.

అట్లానాఁడు రామకృష్ణబోధితుఁడై, గురుసాన్నిధ్యమున ధ్యానమగ్నుఁడై, నరేంద్రుఁడు నిశ్చలసమాధిలోఁబడియుండెను. శ్రీరామకృష్ణుఁడు తన గుండెమీఁద వెనుకచేయివెట్టి, ఆధ్యాత్మికశక్తిని ప్రసరింపఁజేసినప్పటి దివ్యప్రశాంతి, తన్మయత్వము నిప్పుడు నరేంద్రుని మఱల నావరించెను కాని యప్పుడు రామకృష్ణుఁడారోగ్యవంతుఁడై యుండెను. నరేంద్రుఁడు మఱల స్మృతితెచ్చికొని, శ్రీరామకృష్ణుని దుస్థితిగాంచి, విచారమునకు లోనయ్యెను. ఆసమయమున శ్రీరామకృష్ణుని నేత్రములనుండి కన్నీరు ధారలుకట్టి కారుచుం

డుట నరేంద్రుఁడుచూచి, కారణముఁ దెలియక తపించుచుండెను. అది చూచి రామకృష్ణుఁ డిట్లనెను. "నరేంద్రా! నాపుత్రుఁడా! ఇప్పుడు నాశక్తులన్నియు నీకర్పించి యుండుటచే నే నాధ్యాత్మికసంపద్విహీనుఁడనైన, యొకఫకీరునైతిని. నాచే నీకీయఁబడిన నీశక్తిచే, నీ వీలోకమున ఘనకార్యములు చేయఁగలవు. అనంతరము మఱల నీవు శాంతినందెద"వని వచించెను. నరేంద్రునిగుడ్లు నీరుచే నింపఁబడెను. చంటిపిల్లవానివలె నరేంద్రుఁ డేడువనారంభించెను. గురువు తన కేమి చేసెను? తన యఖండశక్తిని, తన యనేకజన్మార్జితానుభవజ్ఞానమును, తన యనంతాత్మప్రతిభను, తాను చెప్పినట్లు శ్రీరామకృష్ణుఁడు నరేంద్రునకుఁ బ్రసాదించియుండెననుటకు సందియము లేదు. లోకమును వైరాగ్యముచే మోహింపఁజేయుటకై తాను ధరించిన శరీరవసనమును, సడల్చివైచి, శ్రీరామకృష్ణుఁడు బ్రహ్మనిర్వాణమందైక్యమై తనస్థానమున లోకమునఁ బూరించుటకు నరేంద్రుని సిద్ధము చేసియుండెను.

జన్మానేకసహస్రములందు, ఆత్మ మధనముచే, విషయవాంఛాపిచ్ఛేదనముచే నార్జించిన అనంతభగవత్ జ్ఞానసంపత్సర్వస్వమును, కోరి విడిచిపెట్టి, శిష్యునికి దానముచేసి, తాను ఫకీరుగా మారిపోయి, లోకోద్ధరణముచేయ నుంకించిన, ఆ శ్రీరామకృష్ణుని, నరేంద్రునిమధ్య నాసమయమున, నేమిసంభవించెనో, తెలియ నెవ్వరికిఁ దరమగును? భౌతికశరీరవసన విసర్జనసమయమున, తన యాధ్యాత్మికాగ్నిజ్వాలను, నరేంద్రునిశరీరమునఁజొన్పి, తాను, బ్రహ్మైక్యము చెంది, తన శరీరమును మృత్యుహస్తగతమొనర్చి,లోకకల్యాణనిర్మాణమును సాధించిన, శ్రీరామకృష్ణు నాత్మవంటి యాత్మసాన్నిధ్యమును గాంచిన, యావివేకానందాది శిష్యగణ మెట్టిపుణ్యము లొనర్చెనో కదా! శ్రీరామకృష్ణుఁడు లోకమునకుఁ జేసిన మహోపకారములు

రెండు. తాను శరీరముఁదుధరించి, లోకమును పరమేశ్వర జ్ఞానాగ్నిచేఁ జైతన్యయుక్తమొనరించుటొకటి. తనయనంతరము, తానుముట్టించిన జ్వాలను వ్యాప్తిచేయునిమిత్తము, తానైన మృత్యుదేవతకుఁ దన శరీరమునందిచ్చి యాతనకు లోనైన నరేంద్రునకుఁ దన స్థానమొసంగుట రెండవది.

శ్రీరామకృష్ణు నవసానదినములు రెండును, శిష్యులవిచారము పెచ్చుపెరుగుటతోఁ గడచెను. ఇఁక శ్రీరామకృష్ణనిర్యాణముతోఁ దాము తండ్రిలేనిబిడ్డవలె, నంధకారములోఁబడి, దిక్కు లేని వారివలె విలపింపవలెననెడి విచారము శిష్యులకు దుర్భరమయ్యెను. విజ్ఞానప్రదీపము వారి హృదయాగారములలోఁ గాంతిని విరజిమ్మెనో, యాదీపము మిణుకుమిణుకుమనుచు నారిపోవుస్థితిలోనున్నపుడు వారిగుండెలు తటతట కొట్టుకొననారంభించెను. వారు శ్రీరామకృష్ణుఁ డింకను జీవించుటకొఱకై ప్రార్థించిరి. దుఃఖాశ్రుసిక్తనేత్రులై వారు తమ దైన్యమును వెలిబుచ్చుచుండిరి. ఇట్లుండగా నంత్యదినము కరుణారహితమై పర్వెత్తివచ్చినది. రాత్రివచ్చెను. శ్రీరామకృష్ణుని శరీరము, మరణయాతన ననుభవించుచుండెను. మృత్యుదేవత దయాశూన్యమై కోరలుసాఁచి వారికట్టెదుటఁ గన్పట్టెను. అంధకారము లోకము నావరించి వారికి భీతిగొల్పెను. జామురాత్రి గడచినది. రెండుజాములైనది. అనంతప్రశాంతి యాస్థలము నావరించినది. దుఃఖము, నంధకారము, మృత్యుముఖము నివియే శిష్యులకుఁ గన్పట్టెను. మహాఘోరతమమధ్యమునఁ జ్వలించు ప్రదీపములవలె, శిష్యులు రామకృష్ణుని చుట్టువారుకొనియుండిరి. తటాలున నరేంద్రునిహృదయములో నొకయభిప్రాయము తోఁచినది.

“ఈతఁడు తాను భగవదవతారమూర్తి యని చెప్పియున్నాఁడు. ఇప్పుడే, యీమరణయాతనలమధ్య, నీమనుష్యశరీరబాధయందు,

"నేను భగవదవతారమూర్తినే"యని చెప్పినచో, "నేను నమ్మెద"నని నరేంద్రుఁడు తలఁచెను. వెంటనే శ్రీరామకృష్ణుఁడు, మృత్యుపాశములచే లాగఁబడుచున్నను, శ్రమయనక, తన లోకరక్షణపరత్వముప్పొంగ, ధైర్యము వహించి, "నరేంద్రా! ఇంకను నీకు సంశయము తీరలేదా! వినుము. ఎవ్వఁడు రామావతారమో, యెవ్వఁడు కృష్ణావతారమో, అతఁడే యీరామకృష్ణావతారము. వేదాంతము ప్రకారము కాదు. నిశ్చయముగ నమ్ము"మని చెప్పెను. ఈవిధముగా లోకమున, ధర్మసంస్థాపనార్థము, వైరాగ్యధన ప్రదానార్థము, పరమేశ్వరుఁడవతరించి వివిధపరిస్థితులలో వివిధరీతులఁ గృతార్థతనంది, యిప్పుడు రామకృష్ణుఁడై యుండెనని, ఆమహాభయంకరనిమేషమున శిష్యబృందమును మోహమునుండి, బయటికి లాగి, శ్రీరామకృష్ణుఁడుద్ధరించి యున్నాఁడు. ఆసమయమున, విష్ణుచక్రమఖండదీప్తితో శ్రీరామకృష్ణుని గదిలోఁ బ్రవేశించినను, చెందనికలఁతలో శ్రీరామకృష్ణునివాక్యములువిని, నరేంద్రుఁడు జర్ఝరితుఁడై, తాను మూఢుఁడై, పరమేశ్వరావతారము నెదుటఁ గుత్కారములుచేసి యుండినందులకై లజ్జ వహించి, దుర్భరవిచారసాగరమునఁబడి, కన్నీరు మున్నీరై పార నేడువసాగెను.

ఆరాత్రియే అద్భుతమగు రాత్రి. నిరుపమానవిచారనిర్హేతుకానందబాష్పములతోఁ గొంతసేపు గడచినది. శ్రీరామకృష్ణుని నేత్రయుగ మగ్నిస్ఫులింగములరీతి నాత్మజ్యోతిని ప్రదర్శించుచున్నది. ఆజ్యోతికి భయమంది శిష్యులకు భయము కల్పించిన కారుచీఁకటి పటాపంచలైపోయినది. ప్రభాత మరుదెంచెను. 1886 వ సంవత్సరము, ఆగష్టు 16 వ తారీఖున, నుదయారంభమున, ప్రథమఘడియలో శ్రీరామకృష్ణుఁడు సమస్తవేదమూలంబగు నోంకారము నుచ్చరించుచు, నఖండసచ్చిదానందమయంబగు పరబ్రహ్మైక్యము చెందెను.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

శ్రీరామకృష్ణపరమహంస, అట్లు, భౌతికశరీరమును త్యజించి, బ్రహ్మైక్యము చెందిన యాక్షణమున, శిష్యుల హృదయములు, దుర్భరవిచారసాగరమునఁ మునిఁగినవి. దిక్కులేనివారివలె, వారు నోళ్ళు బ్రద్దలగునట్లు, రోదనము చేయ నారంభించిరి. వార్త వెంటనే నలుదెసలఁ బర్వెను. శిష్యకోటి పర్వెత్తి కాశీపురముఁ జేరినది. గురునియోగ మాస్థలమును శ్మశానవాటికఁగా నొనర్చెను. నరేంద్రుఁడు దుఃఖదందహ్యమానుఁడై, మొదలు నఱచి, మూర్ఛిలి పడిపోయెను. "గురువు మరణించెనా? ఎట్టి గాఢతమావ్యాజప్రేమతో నాతఁడు నన్ను పెంచినాఁడు? ఇఁక నెట్లని నరేంద్రుఁడు రోదనము చేసెను. ఆశ్రీరామకృష్ణుని ముఖముఁగాంచి నరేంద్రుఁడు బ్రేఁటు దిన్న పులివలె, నేలఁబడి దీర్ఘారావములు వెలిబుచ్చెను. ఆత్మజ్ఞానజ్యోతిచే నవ్యాజానుకంపాతరంగితములై, యఖండప్రేమామృతరసములనింపి చిల్కిన పల్కులు, మఱల వినఁబడవుకదా! పరమాత్మసందర్శనమునకై, యంతర్వర్తిమై, యాత్మమథనమొనర్చి, దివ్యజ్యోతిని బ్రదర్శించిన యానేత్రములు, మఱెన్నఁడు తెఱువవీలులేకుండ మూతవడిపోయినవి. భగవద్భక్తిమరందములు వెల్వడిన ద్వారమైన యాతని నోరు మఱల విప్పరానిదై నొక్కుకొనిపోయినది. ఇఁక దిక్కెవ్వరు? ఇఁక నరేంద్రునితో ముచ్చటగఁ బ్రేమించి, మాటాడి పెంచువారెవరు?

ఏతల్పముమీఁద రామకృష్ణుఁడు పండుకొనెనో, యామంచము బయటికిఁ దీసికొనివచ్చి, యాతనిశరీరమును, దివ్యాంబరములచేఁ గప్పి, శిష్యులు పుష్పములతో నలంకరించిరి. కొంతసే పావిగ్రహమును, వనమధ్యమునుండి వలగించి, యావెనుక బారానగరసమీపమునఁ నున్న శ్మశానమునకుఁ గొంపోరి. ఒకరివెనుక నొకరు శిష్యులు, శవమును తమభుజములమీఁదనే మోసికొనిపోయిరి. గురు

భక్తు లందఱువచ్చి, యామంచమును ముట్టుకొని, కండ్లకద్దుకొనిరి. హరినామస్మరణానినాదములు మిన్నుముట్టెను. శ్మశానమున శిష్యులు చితినేర్పఱచి, స్వహస్తములతో నాశవము నందిమిడ్చి, తరువాత నందఱుకలసియే యగ్నినిముట్టించిరి. ఆజ్యము, సుగంధద్రవ్యములు, గురూత్తమునిశవముమీఁదఁ జిలికించిరి. జ్వాలలు బయల్వెడలి, శ్రీరామకృష్ణు నంబరములను, నవయవములను, మఱొక్క నిముసములో, భౌతికదేహమును దహించెను. శ్రీరామకృష్ణు నాత్మ యఖండజ్యోతిర్మయబ్రహ్మజ్వాలలో మేళవించెను.

తమ్ము వీడ్కొని పరలోకమున కేగుచున్న శ్రీరామకృష్ణుని చితికి శిష్యులు, ప్రదక్షిణమొనర్చి, దుఃఖాశ్రులు రాల్చి, సాష్టాంగములొనర్చి నిల్చిరి. తుట్టతుదకు, లోకముద్ధరింప నవతరించిన శ్రీరామకృష్ణుల శరీరదహనసంస్కారము పూర్తియయ్యెను.

శిష్యకోటి హృదయములోనుండిన దుఃఖాగ్నియుఁ జిత్యగ్నివలె, మెల్లఁగాఁ జల్లారి, మానసాతీతానందాంకురములు పొడసూపెను. శ్రీరామకృష్ణుఁడు తన శిష్యబృందముయొక్క దుఃఖమునుజూచి సహింపఁజాలక, యొకగోచరముకాని యానందమారుతమును, వారలమీఁద వీఁచి విడలెనా? శ్రీరామకృష్ణుఁడు తన దృశ్యదేహమును విడిచినంతమాత్రమున, నాతని యనంతకారుణ్యమయమూర్తి యెట్లు దృశ్యముకాఁగలదు? పరమాత్మసాగరములో మునకలిడుచు, నఖండసచ్చిదానందప్రదీపమును చేరఁజనుచుండ, నాయాత్మసాగరము ఘూర్ణిల్లి, యుత్తుంగానంద తరంగముల బయల్పఱుప నయ్యవి రామకృష్ణుఁడు బయలుదేరిన మార్గమునుపట్టి శిష్యకోటినిఁ గలసికొనెనో యన, శిష్యులహృదయము లనిర్వాచ్యానందముచే వికసించెను.

నరేంద్రుఁ డఖండప్రశాంతిలోమునిఁగి, మాటలేక కొంతసేపూరకుండి, గురునామస్మరణాతిరేకముచే నొడలుమఱచి, పరవశుఁ

డై, నిలచియున్న శిష్యులఁజూచి, మహావేశపరతంత్రుఁడై, జయరామకృష్ణ! జయరామకృష్ణా! జయగురుదేవ!" యని యుచ్చైస్స్వనంబున శరీరముకంపింప, శ్రీరామకృష్ణునిమీఁది ప్రేమరస ముప్పొంగిపార జయజయధ్వానములు సల్పెను.

హరిః ఓంతత్సత్ !

---

## ముప్పదియవ అధ్యాయము.

### శ్రీరామకృష్ణమరణానంతరము : నిర్మాణప్రభాతము.

మహాపురుషుల జీవితాంశములు మానవకోటి కేనాఁటికి నర్థములు కావు. ఏలనన జ్ఞానాంధీభూతు లెట్లు దివ్యకాంతిం దిలకింపఁగల్గుదురు? మహాత్ములు లోకమున నవతరించి, యఖండజ్ఞానబీజములు నాటి వెడలుదురు. ఆబీజములు మొలకెత్తి, ఫలావస్థకు వచ్చుటకు కాలమవసరము. ఇంద్రియవిషయవాంఛామోహాబద్ధమగుటచే మానవమానసము నిగూఢతాత్త్వికనాదముల విన లేదు. మహాత్ములు వచించునట్టి వాక్యము లట్టివారికి మహాబధిరశంఖారావములు, మూకసద్గ్రంథాధ్యాపనములు నగును. మానసము కాలము పోనుపోను, పరిపూర్ణపరివర్తనముచేఁ బరిశుద్ధమైనపుడే, యాసత్యాంశములఁగాంచి, రుచిచూడఁగల్గు స్థితికి వచ్చును. అప్పు డట్టి మహాత్ముల సమకాలికులమై, జీవింప లేకపోతిమిగదా యని, మానవులు విలపింతురు.

కాని శ్రీరామకృష్ణుఁడు తనజీవితసత్యాంశములను, మూఢమానసములకుఁగూడ గ్రాహ్యములగునట్లు నాటి వెడలినాఁడు. శిష్యగణ మమ్మహాత్ముని జీవితోద్దేశమును పరిపూర్ణముగానే గ్రహింపఁగల్గెను. ఐనను, శ్రీరామకృష్ణనిర్యాణానంతరము వారెక్కుడు నేర్చుకొనసాగిరి. అనఁగా శ్రీరామకృష్ణుఁడు నాటినవిత్తనము లిప్పుడే

మొలకెత్త నారంభించినవి. శ్రీరామకృష్ణుఁడు మరణించినను, నాతని యనంతజ్ఞానబీజములు, సజీవములై, శిష్యులకు దినదినకళాభివృద్ధి నొసంగుచు, మరణరహితములై యున్నవి.

శ్రీరామకృష్ణుఁడు లోకమును వీడిన వెనుక, శిష్యుల కేమి చేయుటకును దోఁచలేదు. కాని వారు సంసారపరిత్యాగ మొనరింప నిశ్చయించుకొనియే యున్నారు. కాశీపురవనమునుండి బసమార్పు చేయుటను గూర్చి శిష్యులందఱు గుమిగూడిరి. చాలమంది రేయింబవళ్ళచటనే గడపుచుండిరి. తపోధ్యానసాధనములే వారిని గురువియోగదుఃఖాంబుధినుండి తెప్పలై తేల్చుచున్నవి. గురూత్తముని జ్ఞాపకచిహ్నముగా నుంచఁబడిన అస్థిసంచయమునకు వారు దినదినము మ్రొక్కుచుండిరి. గృహస్థశిష్యకోటి పెక్కుమారులు వచ్చి, భగవద్విషయములఁగూర్చి ముచ్చటించుకొనుచుండిరి. గురుమహాశయు నద్భుతశక్తిని గూర్చి విశేషముగాఁ దర్కించుకొనుచుండిరి.

రామకృష్ణుని మరణానంతర మొక వారమైనను గడువలేదు. ఒకనాఁడు నరేంద్రుఁ డొకశిష్యునితోఁ గలసి, ధ్యానలగ్నమానసుఁడై, వనమందు విహరించుచుండఁగా, నొక దివ్యవిగ్రహము వారికెదుటఁ గన్పట్టెను. ఆవిగ్రహ మఖండమరీచుల వెలిగ్రక్కుచుండెను. అది శ్రీరామకృష్ణవిగ్రహమే! శ్రీరామకృష్ణుని దేహము పోయినది. కాని, యాతఁడావనమందే నిలఁచియున్నాఁడు. నరేంద్రుఁడు మాటాడ సంశయించి నిలఁబడెను. రెండవశిష్యుఁ డాతురముతో, "చూడుము! చూడుము"ని నరేంద్రునిఁ బ్రోత్సహించెను. నరేంద్రుఁడు సంశయరహితుఁడై, యితరశిష్యులను గురుదర్శనార్థము కేకలిడి, వారు వచ్చునంతలోనే యాదృశ్యము మాయమయ్యెను.

శ్రీరామకృష్ణుఁడు లేమి, కాశీపురవనభవనమును బోషించుచున్న గృహస్థశిష్యకోటి ధనము నొసఁగ వెనుకాడుసూచన గన్పట్టెను.

"ఇఁక మిగిలిన యువకశిష్యులగతి యేమి? మఱల వారు సంసారమునకేగి, తమ యథోచితవృత్తులు స్వీకరించుటే యుత్తమ"మని గృహస్థులు పల్కిరి. ఆసమయమునఁ గొందఱు యువకశిష్యులు పట్టపరీక్షకుఁ జదువుచుండిరి. వారిగృహయజమానులు వారిని తిరిగివచ్చి విద్యాపరిపూర్తి చేయుమని బాధించిరి. మఱికొంద ఱిదివఱకే సన్న్యసించియుండిరి. వారిగతి యేమి? వీరే బలరామబాబు, సురేంద్రనాథమిత్ర, గిరీశచంద్రఘోషు, మహేంద్రనాథగుప్త, వీరు రామకృష్ణుని ప్రధానశిష్యులు. "సర్వసంగపరిత్యాగాదర్శము ప్రత్యక్షముగాఁ జూపిన గురూత్తము నెదుట జీవించిన మనము సంసారమునకు మఱలుటె"ట్లని వారు ప్రశ్నించిరి. ఒకరామకృష్ణసోదరసమితిని స్థాపించి, సన్న్యాసాశ్రమమే స్వీకరించి, ధ్యానముచే జీవింప వారు నిశ్చయించుకొనిరి. కాని ధన మెచ్చటనున్నదని గృహస్థులు తర్కింప, "మఱునాటి క్షణమునుగూర్చి తలఁచుట మౌర్ఖ్యమని రామకృష్ణుఁడు బోధించలేదా! భిక్షాటనముచే మనము జీవింపలేమా?" యని వారు బదులు చెప్పిరి. ఆమాటలు విని, హృదయము కరుణారసతరంగితము కాఁ, నేత్రముల నీరుబుకుచుండ, బాబు సురేంద్రనాథమిత్రుఁ డిట్లనెను; "సోదరులారా! మీ రేచటకుఁ బోయెదరు? ఒకగృహమును మన మద్దెకుఁ దీసికొందము. అందు మీరందఱును నివసించు నెడఁ బ్రాపంచికభారములతోఁ దూఁగలేనివేళల మాబోఁటిగృహస్థులము వచ్చి శాంతిం బొందుచుందుము. కాశీపురభవనమునకు నే నిచ్చిన ధనమును దీనికి నొసంగెదను." అని శిష్యులంద ఱమందానందము పొందిరి.

కలకత్తాకు, దక్షిణేశ్వరవనమునకు మధ్య గంగానదీతీరమును జేరి శ్రీరామకృష్ణుని శ్మశానమునకు సమీపముననున్న నొకగృహము నద్దెకు వారు తీసికొనిరి. ఆగృహము పాడుపడి, సర్పములకు,

వల్మీకములకు, దయ్యములకు నివాసమై, యన్నివైపులఁ గూలుటకు సిద్ధముగా వెలుపుగోలుపుచున్నను, ధనాభావముచేతను, గంగాసామీప్యముచేతను, దానినే గ్రహించి, రామకృష్ణసోదరసమితివారందు నివసించుచుండిరి. కొలఁదికాలములో నదియే బారానగరమఠమయినది. అట్లు నియమితమయినగృహములోఁ గొందఱు శిష్యులు నిరంతరము నివసించుచుండిరి. కొందఱు తాత్కాలికకార్యసమాప్తి చేసికొని వచ్చుటకై యిండ్లకేగిరి. కొందఱు తీర్థయాత్రచేయఁబోయిరి. స్వగృహమునకేగి, మాతృదేవత నూరడించి వచ్చుటకై నరేంద్రుఁడును వెడలెను.

శిష్యు లెవ్వరికి వారు చెల్లాచెదరై పోవుసమయమున, నొక గృహము, రామకృష్ణసోదరసమితి, యిని నిల్చుటకు నరేంద్రుఁడే హేతువు. తానును, విషమపరిస్థితుల కగ్గమైయున్నను, శిష్యులను మాత్రము గురువాక్యములచే నుద్రిక్తులంజేసి, పరిత్యాగమార్గమును బోధించుచుండెడివాఁడు. తుట్టతుదకు తనస్వగృహపరిస్థితులు చక్కఁబడి, తనకుస్వేచ్ఛనొసఁగినంతనే, గుర్వాజ్ఞాపరిపాలనమునకై యాతఁడు కృతనిశ్చయుఁడై, దినదినము స్వస్వగృహముల కరుదెంచిన శిష్యబృందములఁ గలసికొని, వారాతనిఁజూచి, తమపరీక్షలు చెడునని, మాటాడుటకవకాశమీయకున్నను, బలవంతముచే వారితో మాటాడి, “ఈబంధములఁ ద్రెంచివైచుఁడు. మీయజమానులేమి యన్నను సరే! శ్రీరామకృష్ణు నప్పుడే మఱచితిరా? మీరు చదువు బిరుదసంపాదనార్థ తుచ్ఛవిద్యయంతయు మౌర్ఖ్యబోధనముగాదా? భోగత్యాగము లోకేసరి వాంఛింపకుఁడు. రండు! మనము పోయి, భగవద్ధ్యానసాధనలచే జీవింత”మని బోధించును.

ఇట్లు రేయింబవళ్లు నరేంద్రునిచే బలపదోద్బోధితులై, తాము నిజముగా విశ్వవిద్యాలయ వ్యామోహబద్ధులై, జీవశక్తినంతను వ్య

యుపఱచుచుండిరనియు, జ్ఞానము వలయుచోఁ గళాశాలాకార్యక్రమ మనవసరమనియు, నిశ్చయించుకొని, యొకని వెనుకనొకఁడు గృహ బంధుమిత్రాదుల విసర్జించి, భావిభాగ్యాన్నత్యములఁ బాటింపక, కూలుచున్న యీపాడుగృహములోఁ గడుపునిండని తిండితోఁ, గేవల భగవద్ధ్యానమునకై, జీవితముల నర్పింప, నరేంద్రునిఁగూడి, రామకృష్ణసోదరసమితినిఁ గలిసికొనిరి. ఆసమయమున నరేంద్రుఁడు, మత్తమృగేంద్రమువలె, సన్యాసగర్జనలచే శిష్యులనందఱ వశపరచుకొనెను. శ్రీరామకృష్ణుఁడు నరేంద్రున కొసంగిన గౌరవముచేతను, నరేంద్రుని స్వకీయదివ్యమూర్తిమత్త్వాకర్షణచేతను, శిష్యులు వానిని దమ నాయకునిఁగా నంగీకరించి, యాతని యానకు బద్ధులగుచువచ్చిరి. ఎవఁడైననొకఁడు నరేంద్రునిఁ దిరస్కరించుచో వెంటనే నరేంద్రుఁడు, "మీజీవితముల నాయధీనమొనర్చి రామకృష్ణుఁ డేగలేదా? నేను మిమ్మొల్లవిడువఁగల"నని గర్జించుచు. నరేంద్రుఁడు వచించు ప్రతిధీరవాక్యము, చేయుప్రతిచర్య, యాతని మనోరంజకమూర్తి, యాతని నిర్నిధనాత్మవిశ్వాసప్రదర్శనము, నాతని సోదరవాత్సల్యము నివన్నియు శిష్యులందఱకు నాతని నాయకత్వ మనుల్లంఘనీయాంగీకారయోగ్యమొనర్చెను.

శ్రీరామకృష్ణుని దగ్ధశరీరశేషము నొకరాగిపాత్రనుంచుంచి, యాతఁడు పరుండుగదిలో శిష్యులతిజాగ్రతతో దాచియుంచి పూజించుచుండిరి కాని కొందఱు గృహస్థశిష్యులు సన్యాసశిష్యు లాగురు చిహ్నములను దాచుట తగదనియు, నొకతోటలో నవ్వానినుంచి, వానిమీఁద నాలయమొకటి నిర్మించవలెననియు వచించిరి. కాశీపురమున యువకశిష్యబృందమున్నంతవఱకు నెట్టివాదము దీనినిఁగూర్చి పొడమియుండలేదు. కాని బారానగరమునకు బసమార్చఁబడినంతనే గృహస్థశిష్యులు తీవ్రవాదములు సల్పనారంభించిరి. ఒకనాఁడు దార్జ

న్యము చేనయినను, నాచిహ్నపాత్రను లాగి కొనిపోవ గృహస్థులు బ యలుదేరిరి. యువకశిష్యబృందమును, సాక్షీనిరంజననాయకత్వమున వారికెదురొడ్డన సంసిద్ధమై నిలచెను. ఈవిషమస్థితి పరికించి, నరేంద్రుఁడు, "సోదరులారా! మనము మానవుల మనుమాట మఱువకుండు మానవత్వనిర్మాణసాధనమగు మనరామకృష్ణుని బోధనలను మఱవకుఁడు. గురుచిహ్నములను వారినే తీసికొననిండు. గుర్వాజ్ఞానుసారముగా, సన్న్యాసాశ్రమమును స్వీకరించి, యాతని పవిత్రాదర్శములనాచరించి లోకమునకు మనము మనగురుభక్తిని చాటలేకున్నచో నాతనిచిహ్నములను మనమెంత యర్చించిన నేమిలాభము? శ్రీరామకృష్ణునిశిష్యు లాతని చిహ్నములకై కొట్లాడి రనుదుర్యశంబున కర్హము కాకుఁడు. గురుప్రోక్తదివ్యవాక్యముల ననుసరించి, మనము మనజీవితముల నిర్మించుకొన్నచో లోకమంతయు మనపాదముల నర్చించితీరు"నని పల్కెను. నరేంద్రునిధీరగంభీరవాక్యములను విని శిష్యులు ఖిన్నులై, తమమార్గ్యమును విడిచిరి. ఒకనాఁడు సాక్షియే స్వయముగా గురుచిహ్నములను పట్టుకొనిపోయి గృహస్థశిష్యకోటి కిచ్చి వెడలివచ్చెను. ఆచిహ్నములు రామచంద్రదత్తుని వనమున స్థాపితములై, వానిమీఁద నాలయమొకటి నిర్మితమయ్యెను. అది యిప్పుడు యోగధ్యానమను నామముతో నొప్పుచుండెను. అచ్చట శ్రీరామకృష్ణుని వార్షికోత్సవము లఖండవైభవముగా జరుగుచుండును.

ఐనను మఱికొన్నిచిహ్నములను, సాక్షీ నిరంజనులు దాఁచి, నరేంద్రునకొసఁగించి, యవ్వానిసాక గదిలోనుంచి, దైనందినపూజాదికములు సల్పుచుండిరి. క్రమముగా గృహస్థులకు యువకబృందమునకుఁ గలవైరము నమసి, వారు పరస్పరప్రేమతో మెలఁగనారంభించిరి. ఖండాంతరఖ్యాతిఁ గాంచి వివేకానందుఁడు స్వదేశమునకు వచ్చిన

పుడాతఁడు, తనతోఁ దగవ్వలాడెనని యొకించుకయుఁ దలఁపక, రామచంద్రుఁడు సందిగ్ధమరణావస్థలో నుండెనని విని, వానిని, తన శిష్యసమేతముగా సేవించి, వానిపాదములనైన నెత్తుటకు సంశయించ లేదు.

నరేంద్రుఁడు గురుచిహ్నముల నిచ్చివేసెనని శిష్యు లాతని నేమియు నన లేదు. "ఏమున్నను, నేమి లేకున్నను, నరేంద్రుఁడున్నచోట నేనుందు"నని గురువయ్యెఁడాడిన మాటలుతలఁచి వారమితాదరములో నాయకునిఁ బూజింపసాగిరి.

1886 వ సంవత్సరము మొదలు 1892 వ వత్సరమువఱకు, మఠము బారానగరమందే యుండి, మఱల దక్షిణేశ్వరసమీపమున నున్న, "ఆలంబజారు"కు మార్చఁబడి, యచట 1897 వ సంవత్సరము వఱకు నుండెను. తరువాత నది గంగానదియొడ్డుననున్న నీలాంబర ముఖర్జీవనములోనికి మార్చఁబడి, యనంతరము, కొలదిదూరమున నున్న బేలూరునందు, వివేకానందునిచే నార్జింపఁబడిన స్థలమందే శాశ్వతముగా నిర్మింపఁబడెను.

ఈవిధముగా నరేంద్రుని నాయకత్వమున బారానగరమఠమునందు, శిష్యులందఱు, ఖడా తరములం దప్రతిహతముగా వ్యాప్తింపందవలయు ధర్మప్రచారమునకై, బీజములను పెంపుచేయు నిరంతరధ్యానముతో, తపోయోగములతోఁ గాలము గడపుచుండిరి. "నాకు నాతల్లి చూపినదేమనఁగా, నాభక్తశిష్యకోటిలోఁ గొందఱు పరదేశీయులు చేరుదురు. నే నెఱుఁగని భాషకుఁజెందినవా రనేకులుందురు" అని రామకృష్ణుడు వచించియుండ లేదు? మానవపంచవటియే దక్షిణేశ్వరవనము ఆవృక్షబీజములు, శ్రీమన్నారాయణావతారమూర్తియగు శ్రీరామకృష్ణునమృతవాక్యములు. ఆవృక్షమూలము నరేంద్రుఁడు. శిష్యబృందమనంతముగా వ్యాపించు నావృక్షశాఖలు. దాని

వేళ్ళనంతకాలగర్భమున నున్నవి. భగవద్భక్తిరస మావృక్షమును పెంచు నుదకము. ఆమహావృక్షచ్ఛాయను గణనాతీతమానవాత్మనిచయము చేరి సుఖించి, యాత్మానందము గాంచవలెను. ఆవృక్షాభివృద్ధికి నరేంద్రుఁడు, నితరశిష్యులు నందఱు నవసరమేయని ముందు తెలియును.

శిష్యబృంద మట్టిస్థితిలో నెట్టికఠినజీవనము గడపెనో, వినిన గుండె విచ్ఛిన్నమైపోవును. బిచ్చమైన నెత్తనిచ్ఛ వీడి, భగవత్కటాక్షముగా నేది లభించిన నద్దానితోడనే తృప్తివహించి, వారే స్వయముగా గృహదాస్యము ననఁగా నంట్లుతోముట, యలుకుట, నూడ్చుట, మున్నగు నీచకృత్యములనైనఁ జేయుచుఁ గాలముగడపిరి నరేంద్రుఁ డట్టివఱవుడు చేయుటలో ముందంజవైచును. ఒకపూట వండుకొనుటకుఁ బిడికెడు బియ్యమైన లేనిదినము లనేకములు గలవు. కాని యట్టిదినమున వారి కాహారము భగవత్సంకీర్తనమే. ఒక కౌపీనము, నొక కాషాయవస్త్రము, నొక చాప, యివియే శిష్యు నొక్కొక్కనికిఁ గలయాస్తి. జపమాలలు, తంబూరా, యివియే గృహోపకరణములు. గృహస్థు లొసంగిన కొన్నిసంస్కృతాంగ్లవంగగ్రంథములే వారి భాండాగారము. ఈవిధముగా సూక్ష్మాతిసూక్ష్మవస్తుసంతతితో శిష్యులు జీవించుటఁ జూచిన, ప్రాచీనభారత మాతృదృశ్యము ప్రత్యక్షము కాకమానదు.

దయాపయోధియగు సురేంద్రనాథ మిత్రుఁడే, శిష్యుల జీవనావసరములకుఁ దోడ్పడుచుండువాఁడు. తాను మొదటనొసంగిన స్వల్పధనము వారికి సరిపోవదని తలంచి, ప్రేమాతిశయము చేనాతఁడు, "శిష్యుల కెన్నఁడు లోటులేకుండ నేను చూడవలయును. నాయధిదైవతమగు శ్రీరామకృష్ణుని పుత్రులు గారా వీరు? వీరు నాసోదరు"లని యాతఁడు వక్కాణించుచును.

వెంటనే యాతఁడు గోపాలుఁడను నొకబాలునిఁ బిలఁచి మఠమునందు శిష్యకోటికివలయు సామగ్రినిచ్చు పనియందు నియమించి, యిట్లు చెప్పెను. "నీవు నాకుఁ జేయవలయు పని యిది. నాసోదరులెప్పుడు కొఱతచే బాధపడుచుందురో తెలిసి యప్పుడు వెంటనే నాకుఁ దెలియఁ జేయవలయును." గోపాలుఁడు శ్రీరామకృష్ణునెఱుంగును. నరేంద్రుని దేవునిగా గోపాలుఁడు నమ్మినాఁడు. తనకు సరియగు నుద్యోగము లభించినదని, యాతఁడు సంతసించి, శిష్యబృందమును కనిపెట్టుకొనియుండి, లేమి తటస్థించు సూచనగాంచినంతనే, పర్విడి, సురేంద్రబాబునుచేరి, "ఈనాఁడు శిష్యులకు భుక్తి లే"దని వచించును. "బజారునకు వెడలి, వలయునవి తెచ్చి, నాసోదరుల కొసఁగుము. నే నిచ్చితినని చెప్పకుము. నేను శ్రమపడుచున్నానని, వారు తలఁచి సంశయించి, తీసికొనుటకు వెనుకచూతు"రని సురేంద్రబాబు దయాపరిపూర్ణుఁడై వచించును. వెంటనే గోపాలుఁడు వలయు సరకులను దీసికొని, శిష్యులకర్పించి, "వీనిని నన్నొకరు మీకీయుమని నా"రని వచింప, శిష్యులమందానంద చేతస్కులై, దైవకటాక్షమున కచ్చెరు వందుచుందురు.

---

## ముప్పదియొకటవ అధ్యాయము.

### మఠనిర్మాణము: బారానగరదినములు: పరివ్రాజకదృష్టి.

మానవలోకమునఁ బలువురుగూడి యొకసంఘమై, యొక కార్యాచరణకుఁ గడంగుచుందురు. వ్యవసాయసంఘము, వర్తకసంఘము, విద్యాసంఘము, నాటకసంఘము, యంత్రకారకసంఘము, దోపిడిగాండ్రసంఘము, మున్నగు ననేకములు దినదినము బయలుదేరి, ప్రావృట్కాలపయోధరమధ్య సంచలచ్చంచలానిచయముఁబో

నాశి, నిమేషములలో నదృశ్యములగుచుందును. కాని యొక్క సంఘము స్థాపితమగుచో నయ్యది, గంభీరవారాశివలె, నాద్యంతరహితముగా జ్ఞానరత్నఖనుల నీనుచు లోకము నఖండతేజోమయము నొనర్చును. స్వార్థమును చంపి, ఐహికసుఖదుఃఖముల నవలఁద్రోసి, దేహాభిమానము తెగనడంచి, పరమేశ్వరార్పితబుద్ధితో లోకకల్యాణమును భగవద్ధర్మసమూలముననే నిర్మించి, ముముక్షుకోటికి మోక్షప్రదానము చేయనుంకించునట్టి మహోన్నతాదర్శముగల యీసంఘమే వలయునది ఆసంఘచరితమే చదువఁదగినది. చరిత్రయందునాఁడుమిడుట కదియే తగును ప్రస్తుతయుగమున హిందూస్థానమున, శ్రీరామకృష్ణ మతసంస్థ యేర్పడుట, మహోన్నతచరిత్రకమనుట కెంతమాత్రమును సందియము లేదు. హైందవసనాతనాధ్యాత్మికధర్మసందేశమును, జీవశాన్విత మొనర్చి, స్వదేశమునకే కాక, ఖండఖండములకు వ్యాప్తిచేయు మహోద్దేశముతోడనే యీసంస్థ యేర్పడి,తనధర్మము నఖండముగా నెరవేర్చిన దన్నచో వింతగాదు. ఏతత్సంస్థకు బీజప్రదాన మొనర్చిన యీవ్యక్తి శ్రీరామకృష్ణుఁడు. దానికిఁ జైతన్యమొసంగి, సర్వకళాభివృద్ధి చేకూర్చినవ్యక్తి స్వామి వివేకానందుఁడు.

శ్రీరామకృష్ణ ప్రోక్తాదర్శములం బ్రదర్శింపఁ బ్రాణములనైన నర్పింపఁగంకణము కట్టుకొని, యొకకడుపునఁ బుట్టినవారివలె, వాత్సల్యైకప్రేరితులై, భగవత్సాన్నిధ్యమే పరమావధిగా నిడికొని, బారానగరమున, నరేంద్రునినాయకత్వమున, శిష్యులు కాలము గడపుచుండిరి. స్వామిప్రేమానందుని తల్లి, తనగ్రామమునకు విచ్చేసి యాతిథ్యముగొన, శిష్యుల నాహ్వానించెను. గురూత్తముని భక్తురాలగు నామె కోర్కెఁదీర్ప, శిష్యులందఱు నంతపూరున కేగిరి. ఎచటనుండినను నరేంద్రునినోటినుండి వెడలువాక్యము లాధ్యాత్మికస్ఫులింగములే. "జయరామకృష్ణా! జీవితగమ్యస్థానము మానవత్వనిరూపణమే. ఇది

యేమార్గము. తక్కుంగల విద్యాభ్యాసము లేల? ప్రాణికివలయునది భగవద్దర్శనమే. వేఱుగాడవలు వ్యర్థము”లని నరేంద్రుని ఘోష. భగవత్సంకీర్తనము, ధ్యానము, త్యాగము, నివియే శిష్యుల కారాధ్యములై కన్పట్టెను.

అంతపుర మొక చిన్న గ్రామము. అచ్చట నవీననాగరికతాధారములగు కుతంత్రము, పరస్పరాసహనము, దేహాలంకార సంజాతమూర్ఖానందము మున్నగున వెవ్వియు లేక, నిర్దోషిత్వము, పరస్పరానుకూలత, అల్పజీవనవిధానము, నిష్కాపట్యము, నిర్మలప్రశాంతి యివన్నియుఁ ప్రాచీనఋషివాటికను శిష్యులచే స్మరింపఁజేసెను. బుద్ధదేవు ననంతవైరాగ్యమహామారుత మాశిష్యులమీఁదవీచెను. వారికట్టెదుట నొక్కటేమహాదర్శము గజ్జెలుకట్టుకొని మ్రోగుచుండెను. ధనలుబ్ధులకు నిధివలె, సర్వసంగపరిత్యాగము మూర్తీభవించి వారి నాకర్షించెను. శ్రీరామకృష్ణుఁడు వచించినటుల, శిష్యులందఱు భగవంతునాస్థానములో నున్నతోద్యోగులయి నిల్వవలెనని నరేంద్రుని నిశ్చయము. ఆయుద్యోగమునకుఁగల ప్రతిఫలము, పరిపూర్ణపరిశుద్ధి, యనంత దారిద్ర్యము, ఇవియే వారు లోకమునకుఁ బంచిపెట్టదలఁచినవి.

ఒకయాదిత్యవార మందఱును ధ్యానముద్రలోఁ గూర్చుండిరి. నరేంద్రుఁడు సంకీర్తనము చేయుచు, క్రీస్తుదేవునిమీఁదికి దృష్టినిల్పి, యాతని యఖండత్యాగవ్రతము, ననంతకరుణామయహృదయము, నాతని యనింద్య ధర్మసందేశము, నాతని యవక్రాధ్యాత్మిక జీవనవిధానము, నివన్నియు వారికట్టెదుటఁ జిత్రించి, “సోదరులారా! మీరందఱు క్రీస్తులు కాఁ బ్రయత్నింపుఁడు. అంతకన్న నున్నతాదర్శము లే”దని గర్జించెను.

బారానగరమున, శిష్యులజీవితమంతయు నిరంతరతపోయోగములతోఁ గడచెను. నరేంద్రుఁడు సమస్తప్రాచీనశాస్త్రములను తర్కిం

చి, గుణాగుణముల వారిమెుకుటఁ బ్రదర్శించును. ఒకతఱి, తెల్లవారు వేళ లేచి, "లెండు! బ్రహ్మానందమును గ్రోలుడు. వలయునదెద్దియు లే"దని పాడుచుండును. మఱొకసారి చరిత్రాంశములవిప్పి, అక్బరు చక్రవర్తి జాతీయసమత్వాదర్శముల నుద్బోధించి, స్వజాతిక్రమం బభివర్ణించును. హైందజీవకళ కాంతిఁ దఱుఁగకుండుటకు హేతువు, ప్రాచీనులగు మహర్షులు, నాశరహిత ధర్మసూత్రములను, మానవద్రై నందిన కర్మకాండలో నిమిడ్చియుండుటచేతనే యని వచించును. బ్రాహ్మణులు సందేశభారమును వహించి, లోకమునకుఁ బ్రదానమొన ర్చుటకే జన్మించిరనియు, నాకార్యమును జేయువారెవరైన బ్రాహ్మణశ్రేష్ఠులే యగుదురనియు, బ్రాహ్మణేతరులను, హైందవేతరులను, బ్రాహ్మణుల నొనర్చుటే "మనముఖ్యకర్తవ్య"మనియు నాతఁడుఘోషించును.

హిందూమతధర్మము లెట్టిపవిత్రతమాశయపూరితములైనను, విదేశజనసాంకర్యముచే నయ్యవి క్రమక్రమముగా, నాచరణ బాహ్యములై, హైందవజాతి వ్యావహారికములో నిర్జీవములై, నామమాత్రావశిష్టములైనవి. లోకము నద్భుతముగా మార్చివేయఁగల మహోన్నత ధర్మనిర్ణయములు, సూత్రములు, శాస్త్రములు, తత్త్వములు, యోగములు ననేకములుగలవు: కాని యొక్క ధర్మసూత్రము నకై, జీవితము నర్పించు నావ్యక్తియే మెచ్చుటను గన్పట్టకుండెను. ధర్మమం దనురాగ మందఱకును గలదు కాని యనుష్ఠానభాగ్యదశ యెన్నడురాలేదు. సత్యహరిశ్చంద్రునిఁ గీర్తించుట కందఱకు నోళ్ళున్న వి గాని, సత్యహరిశ్చంద్రులము మనము కావలయుననెడి తీవ్రసంకల్పమే లోపము. జాతీయజీవన మంతయు, సాత్త్వికరాజసభావముల దవ్వులవైచి, తామసాంధపరీవృతమై, జడత్వముదాల్చి, చేతనారహితమైయుండెను. భారతజ్ఞానాగ్ని నివురుగప్పి, జ్వాలోజ్జ్వలనమున కవ

కాశము లేక యుండెను. ఇదియే ధర్మగ్లాని. పరిచ్యుత ధర్మరక్షణము నిమిత్తమై, అతిమానుషవ్యక్తు లవతరమైరి. వెంటనే శ్రీరామకృష్ణుఁడు ప్రత్యక్షమై సర్వహిందూశాస్త్రీక ధర్మములు ననుభవించి, లోకమును బోధింప నుత్కృష్ట శిష్యసంఘమును ప్రదర్శించి, యవతారము చాలించెను. అఖండజ్ఞానప్రదీపక మనంతముగా వెలుగుటకు వలయు సామగ్రి రామకృష్ణుఁడు సిద్ధముచేయ, నాదివ్యజ్యోతిని లోకమున వెలిగించు భారమును, నరేంద్రునిపైఁ బడెను. నరేంద్రుఁడు తన భారము నెట్లు నిర్వహించెనో లోక మెఱుఁగును.

నరేంద్రుఁడు తనభావికార్యనిర్వహణమునకై, బారానగరమునఁజేసిన యేర్పాటీవిధముగానున్నది. జాతీయజీవనమునకుఁ గళాప్రతిష్ఠచేయు నాయాతత్త్వసూత్రముల నాచరణసాధ్యముగాఁ బ్రతి భారతవ్యక్తికిని బోధించుట; అవకాశములభించునెడ, ఖండాంతరములకైన నీసందేశముల నంపుట, యైయున్నవి, ప్రథమమునఁ బ్రతివ్యక్తియుఁ, దానెవరో, తనజన్మోద్దేశమేమో, తనగమ్యస్థానమగు సర్వేశ్వరునిఁ జేరుమార్గమెద్దియో, పరిపూర్ణముగా నెఱింగి, యనుభవజ్ఞానమునుపొందుటతోడనే ప్రథమరంగము పూర్తియగును కానిభగవదర్పితజీవనులమై యున్నచో లోకకళ్యాణ మెట్లు జరుగఁగలదు? నిరక్షరకుక్షులగు కోట్లాది మానవుల నుద్ధరించు టెట్లు? కార్యాచరణమునకుఁ గడఁగి తీరవలయును. అది మానవసేవారూపమును దాల్చవలయును. ఇచటనే నరేంద్రుని తీవ్రధిషణ, అనంతజ్ఞానము మేళవించినవి. కేవలసన్న్యాసముగాదు. కేవల కర్మయోగముఁగాదు. జ్ఞానకర్మయోగముల మేళవించి, శ్రీమచ్ఛంకరాచార్యబుద్ధభగవానుల శేముషీహృదయముల సారమును మిశ్రమమొనర్చి, నరేంద్రుఁడు లోకమునకుఁ బంచిపెట్టి, తనమాతృఋణమును, దేశఋణమును, లోకఋణమునుఁ గూడ నిర్విశేషముగఁ దీర్చికొని కృతార్థుఁడయ్యెను. ప్రతి

ఫలాపేక్షరహితకర్మాచరణమున కాతఁడు సేవాసంఘముల నిర్మించి, భగవదైకార్పితజీవనవృత్తికై మఠసహస్రంబుల నిర్మించి, యెట్లాతఁడు శ్రీకృష్ణభగవాను నుద్దేశమును పూర్ణముగా నావరించెనో ముందు తెలియఁగలరు. ఈవిధముగా దక్షిణేశ్వర కాసీపురవనములం దెల్లు శ్రీరామకృష్ణసముక్షమున శిష్యులు నిశ్చింతతో బ్రహ్మానందజ్ఞానముల ననుభవించిరో, యట్లే, బారానగరమందును, శ్రీరామకృష్ణస్థానమును నరేంద్రుఁ డలంకరింప వారందఱు ననంతజ్ఞాన సమార్జనముతోడను, కర్మాచరణమార్గాన్వేషణము తోడను, భక్తాగ్రేసరజీవితచరితామృతాస్వాదనముతోడను కాలమును గడపిరి.

ఎట్టి యఖండజ్ఞానము లభించినను, మఱెట్టి నిస్సంగత్వము ప్రాప్తించినను, భారతదేశమహర్షులకు సంచారనియమ మొక్కటి పూర్ణముగాఁ గలదు. సన్యాసియగు నాతఁ డొకేస్థలమందుమూఁడు దినములకన్న నెక్కుడుండరాదు. కారణము; స్థానమునందలి పరిచయముచే నందు మోహ మావిర్భవింపవచ్చును. కావున, సన్యాసి ముక్తసంగుఁడయ్యు, నాత్మదర్శనముకొఱకు నానాసీమసంచారము చేయుచు లోకసంగ్రహార్థముకై తత్తత్ప్రదేశములలోని జనులకు జ్ఞానబోధ చేయుచు, జీవనమును గడపుట హిందూమతవిధి. ఈనాఁటిసన్యాసు లేమి చేయుచుండిరో తలఁచినచోఁ బాపహేతువనుటలో సందియము లేదు.

బారానగరమున నరేంద్రుని శిష్యకోటి, భగవదైకార్పిత బుద్ధితోఁ గాలముగడపుచు, నొకప్రక్క సేవావిధానము నారయుచున్నను, వారును జన్మముచే హిందువులుగాన, పరివ్రాజకదృష్టికి లోనైరి. జ్ఞానకర్మయోగాభ్యాసము లెట్టి మహోత్కృష్టనియమము లైనను, మోహసంగములను విడిచి, ప్రకృతికాంత విస్పష్టవిహారము సల్పు పర్వతాభ్యంతరస్థగుహాంతరాళముల నిర్మలప్రశాంతి, దుర్గ

మారణ్యమధ్యమంబున నొంటరిగా సమస్తభారములు సర్వేశ్వరునిపై విడిచి, 'శివోహం' నాదోద్రేకముతోఁ దిరుగాడు నాస్వాతంత్ర్యమును, శిష్యులందఱు కోరుచుండిరి. అట్టికోరికచే నరేంద్రునికి విశ్రాంతి లేకుండెను. హిమాలయసౌందర్య మాత్మారామునిఁగూర్చియేమి పల్కునో యాతఁడు వినవలయును. నిరంతరము విశ్రాంతినిడి, వెనుకడుగు వేయక, సాగరసంగమమే పరమావధిగాఁ బర్వెత్తునదీఘుమైన మూహా మేమిసందేశమొసఁగునో, యాతఁడుగాంచితీరవలయును. తన జన్మభూమి యేమగాల నెట్లువిలపించుచున్నదో యాతఁడు వినితీరవలయును ఈసమయమున నరేంద్రునుఱ్ఱూతలూగించినకోర్కెయిదియే. ఈకోర్కెయే, ఆసేతుశీతనగదిగ్విజయయాత్రగాఁ బరిణమించెను. ఈయాత్రయందే, ప్రపంచరంగమధ్యంబున నిలఁబడి, తన మహాసందేశము నొసఁగు నవకాశము నరేంద్రున కొడఁగూర్చెను. ఈసంచారమే, నరేంద్రుని పాదారవిందముల నరేంద్రపుంగవు లర్చించునట్లు చేసినది.

యాత్రార్థము మొట్టమొదట దారితీసి నతఁడు, త్రిగుణాతీత స్వామియైన, శారద, గృహసంబంధపాశము లాతని లాగుచున్నవనియు, నట్టిపాశముల భేదించునుద్దేశమే తనయాత్రకుఁ గారణమనియు, నొక లేఖ వ్రాసి, నరేంద్రున కందునట్లు పెట్టి వెడలిపోయెను. నరేంద్రుఁడాతని తలంపునకు సంతసించెను. "ఇది నాకొక సంసారము, ఈసోదరులతోడి సంబంధమైనను నన్ను విలపింపఁజేయుచున్న"దని, నరేంద్రుఁడు వచించెను. "అవతారపురుషుల యెదుట మనము జ్ఞానము నార్జించినారము. భావిజీవితకార్యక్రమనిర్ణయ మైనది. సంసారముల విసర్జించితిమి. ఇఁక లోకానుభవమునకై, యీ నాసోదరదృష్టి చలించుచున్నచో నే నేల వారి నాపవలయును? సాధుజీవితమును గూడ ననుభవించి తీరవలయు"నని నరేంద్రుఁడు నిశ్చయించికొని, తాను

నట్లు చేయ నిరంతరముఁ గోరుచు, సమయమున కెదురుచూచు చుం డెను. కాని యెవరికివారు తోఁచినరీతిని సంబంధమువీడి వెడలిన చో నాశ్రమ మేమి కావలయును? శ్రీరామకృష్ణ మతసంస్థ దివంగత ము కావలసినదేనా? ఇట్టి సంశయములు నరేంద్రు నడ్డుకొనఁజాలక పోయెను.

కాని, శ్రీరామకృష్ణుఁ డేమయ్యెను. ఆశ్రమము శిథిలమగు చుండ, నాతఁడుచూచి యూరకుండఁ గలఁడా? పోషియనుతఁడెవ్వ రేమిచేసినను, తానుమాత్ర మాశ్రమనిర్వహణనిమిత్తము తన జీవిత మును వెచ్చింపవలయునని నిశ్చయించుకొని, మఱికొందఱఁ దనతో నాపి, శ్రీరామకృష్ణుఁడు ముట్టించి వెడలిన వైరాగ్యజ్యోతిని, నిష్క ళంకముగా, నిరపాయముగాఁ బ్రజ్వలింపఁజేయుచుండెను.

నరేంద్రుఁడు తనశిష్య సంబంధమును విసర్జించుయత్నములోఁ బెక్కుబాధలకు లోనయ్యెను. తన యధీనములో విడిచి శ్రీరామ కృష్ణుఁడు వెడలిన, నరేంద్రుఁడు వారిని విడిచిపోవుట ధర్మమా ? ధర్మముకొఱకై, తనమీఁద నిసరుచున్న లోకసంచారాభిలాషామూరు తము నెట్లాతఁ డెదుర్కొనవలయును? ఆతనిహృదయము, సకలధర్మా తీతస్థానముకేగి, పరివ్రాజకాగ్ని చేఁ బరితప్తమగుచుండ, నాతఁ డాశ్రమమును కాఁచికొని, యెట్లు సంకుచితుఁడు కాఁగలఁడు? ఏది యెట్లుజరిగినను, నరేంద్రుఁడు సర్వాశ్రమసంగముల నఱికికొని, వైరాగ్యప్రధానుఁడై, యాత్రలు చేయనారంభించి, సమీపస్థలముల కేగి, నిజాశ్రమప్రీతి వెనుకకులాగ మఱలివచ్చువాఁడు. మఱొకసారి దూరమునకేగియు, సోదరు నారోగ్యస్థితి వినియు, వేఱొకసారి యొకగృహస్థశిష్యుని మరణవార్తవినియు, వెనుక కాతఁడు తిరుగ వలసివచ్చెను.

కాని 1891 వ వత్సరము, జనవరిమాసములో, సర్వసంగ పరిత్యాగ మొనర్చి, నిర్లిప్తుఁడై, పరమాత్మయే తన్ననుగమింప, నరేంద్రుఁడు, దండకమండలుహస్తుఁడై, దేశయాత్రార్థము బయల్వెడలెను. నరేంద్రుఁ డాశ్రమమువిడచి విడలుచుండ శిష్యగణము వానిఁజూచి "ఇఁక నీమారు నరేంద్రుఁడు వెనుకకు రాఁడు. ఇదియే కడపటి దర్శనమేమో" యని నేత్రముల నీరుగ్రుక్కుచుఁ, జేయునది లేక విలపించిరి.

నరేంద్రుని మాతృదేశపర్యటనముకన్న నాతని జీవితమునం దత్యద్భుతమగు భాగము మఱొకటి లేదు. ధనమను మాటను తగులబెట్టి, యింటింటికిఁ దిరుగ భిక్షాపాత్రములోఁ బడినదే తినుచు, నే చెట్టుక్రిందనో, యేపుట్టమీఁదనో పండుకొనుచు, లోకమే హృదయముగ, లోకనాథుఁడే యాత్మబంధువుగ, కీర్తిగౌరవాతీతుఁడై, నరేంద్రుఁడు గడపిన యాపరివ్రాజకదినముల స్మరించుభాగ్య మబ్బుటచే మనమును నిక్కముగ ధన్యులమే. సనాతనభారతధర్మసార మాపరివ్రాజకయువకునిలో మూర్తీభవించుట ముందుచూడఁగలము.

అతఁ డెచటకేగిన నచట నాతని యపూర్వముఖవికాసము ననన్యసామాన్యయోగదృష్టి, యాతనియనిర్వాచ్యమూర్తిమత్త్వము నివన్నియుఁ జూచి, ప్రజలు గుంపులుగాఁగూడి, "ఒకగొప్ప సాధువచ్చినాఁడు నేఁ డీగ్రామము వచ్చునఁట. అతనిఁజూచి యాతఁడేమిచెప్పునో వినవలయు"నని కౌతుకప్రకటనఁ జేయుచుంటఁ జూచి, తన శాంతిభంగము కల్గునని గ్రహించి యాతఁడు, పేరు మార్చుకొనియు, తన భావికార్యక్రమము వచింపకయు, వచించినట్లు చేయకుండును. నీయెత్తులను నరేంద్రుఁ డెత్తి ప్రజాభినందన విముఖుఁడై నిర్మముఁడై నడచుకొనుచుండెను.

## ముప్పదిరెండవ అధ్యాయము.

నరేంద్రుఁడు-దేశసంచారియగు సంయమీంద్రుఁడు- ప్రథమశిష్యుఁడు.

నరేంద్రునిదేశయాత్రాచరిత్రము మనకతివిస్పష్టముగాఁ దెలియు భాగ్యము పట్టలేదు. ఏలన, నరేంద్రుఁడు తన కార్యక్రమమును గూర్చి యెన్నఁడు నెవరికిఁ దెలిపియుండలేదు. అప్పుడప్పు డవసరోచితముగఁ గొన్ని విషయములే యాతఁడు వక్కాణించియున్నాఁడు. కాని నరేంద్రునితో యాత్రసల్పిన శిష్యులుకొంద ఱాతనిచరితమును చాలభాగము వర్ణించియే యున్నారు. వారే బ్రహ్మానందతురీయానంద మున్నగువారలు. వీరందఱు నేదో యొకసమయమున నరేంద్రు ననుగమించియే యున్నారు. అఖండానందుఁడే, నరేంద్రునితో నొకవత్సరము యాత్రచేసి, జరిగినప్రతివిషయమును విపులముగా వ్రాసియుంచినాఁడు.

మొదట నరేంద్రునాకర్షించినపుణ్యక్షేత్రము వారణాశీపురము. సకలపుణ్యక్షేత్రరాజము, సకలమునీశ్వర నిలయము, వేదవేదాంగాదిసమస్తకళాస్థానము, పండితకవిబృందనివాసము, ననంతకోటిదేవాలయసీమ, గౌతమబుద్ధ శ్రీశంకరాచార్య ప్రబోధితము నగు నాకాశీపురము నతఁడు జేరి, యనల్పానందాంభోధిలో దేలి యాడెను. గంగాస్నానమొనర్చి, నరేంద్రుఁడు, విశ్వేశ్వరాదిదేవతాదర్శనసంజాతానందపులకితాంతరంగుఁడై, పరమేశ్వరభక్తులఁగూడి, "హర! మహాదేవ! శంకరా!" యని బాష్పధారాపూరితలోచనుఁడగుచుండెను. సనాతనధర్మదేహమునకు వారణాశి గుండెకాయవలె నాతనికిఁ గన్పట్టెను.

ఒకనాడాతఁడు కాశీపురమునకుఁ గొన్నిమైళ్ళదూరమునను న్న సర్నాథమునకు, బుద్ధదేవునిఁజూచుటకై కేడలెను. ఇచటనే బుద్ధుడు

ధర్మచక్రప్రవర్తనసూత్రమును మొదట బోధించెను బుద్ధదేవునిఁద లంచినంతమాత్రమున నరేంద్రుని హృదయము, సర్వసంగపరిత్యాగ యంత్రముమీఁద రూపాతీతస్థానమునకుఁ బర్విడఁజొచ్చెను. మధూకర భిక్షచే నాతఁడు జీవింపనారంభించెను.

ఒకనాఁడతఁడు దుర్గాలయమునకుఁబోవుచుండ, నొకమర్కట సమూహ మాతని వెంటాడెను. నరేంద్రుఁడొకించుక భీతిలి, పర్వెత్త నారంభించెను. మర్కటములు పర్వెత్తఁజొచ్చెను. నరేంద్రునకేమి యుఁదోఁచలేదు. వెంటనే, 'ఆగుము! మూర్ఖులనెల్లప్పుడు నెదుర్కొను మ'ను నాదమొక యోగీశ్వరునుండి వినఁబడెను. ఆమాటవిని నరేంద్రుఁడు ధైర్యముచిక్కఁబట్టి, నిల్వఁబడెను. ఆతని తిరుగుబాటుఁజూచి మర్కటసమూహము పాఱిపోయెను. అంత నరేంద్రుఁడొక పెద్ద నవ్వునవ్వి, మునీంద్రునిఁజేరి, "ఓంనమోనారాయణా!"యనిసాష్టాంగ మొనర్చెను. ఈవిషయమునుగూర్చియే, అమెరికాలో నుపన్యసించుచు, "ప్రకృతినెదుర్కొనుఁడు! అజ్ఞానమునెదుర్కొనుఁడు! మాయాభూతము నెదుర్కొనుఁడు! వెనుకంజవేయకుఁ"డని వివేకానందుఁడు గర్జించియుండెను.

కాశీపురమున నరేంద్రుఁ డనేకపండితుల దర్శించెను. పండిత భూదేవముఖోపాధ్యాయునితో నాతఁడు హిందూమతధర్మములఁ గూర్చి చర్చించుటలో, "ఆశ్చర్యము! ఇంతపిన్నవయసున నింతజ్ఞాని నెన్నడరసియుండలే"దని పండితుఁడు వచించెను. శివాలయమున వందలకొలఁది వత్సరములనుండి వాయుభక్షకుఁడై, జీవించుచున్న త్రైలింగస్వామి నాతఁడు దర్శించి, ప్రణామమొనర్చెను. భాస్కరానంద స్వామి, కాంచనజయముచేసినవారలు లేరని వాదింప, నరేంద్రుఁడా మాటసహింపక, శ్రీరామకృష్ణు నుదాహరింప, భాస్కరానందుఁడు

తెల్లవోయి, "ఈబాలునినోట సరస్వతి తాండవమాడుచున్నది. ఈత నిహృదయ మానందజ్యోతిర్మయ"మని పచించి యూరకుండెను. నరేంద్రుఁడు తనజ్ఞానమును సహస్రముఖముల వెల్లడించుచుండియు, నూతనాంశముల నేర్చికొనుటలో నాతఁడు విద్యార్థివలె వర్తించెను.

కాశీపురమునుండి నరేంద్రుఁడు దాశరథినిలయమగు నయోధ్యకరిగెను. అనంతకారుణ్యము, నప్రతిమానధర్మదీక్ష, అసమాన విశుద్ధజీవనవిధానము, నమలినపాతివ్రత్యము నివియే దివ్యాభరణములుగాఁగల యాసీతామహాదేవి, యాశ్రీరామచంద్రుఁడు, ఆహనుమాన్మహావీరుఁడు వీరినిఁ దలఁచి నరేంద్రుఁ డానందబాష్పనేత్రుఁడై, పులకితగాత్రుఁడై, శ్రీరామనామస్మరణముచేయ నారంభించెను.

తరువాత నరేంద్రుఁ డయోధ్యానగరమువీడి, టాజ్‌మహాల్ ధవళకాంతులచే నింద్రపురమును తులతూఁగుచున్న, ఆగ్రాపట్టణమును దర్శించి, మొగలాయిచక్రవర్తుల వైభవమును దలంచి, టాజ్‌మహాల్‌గట్టిన, హైందవనిస్తుల శిల్పకళానైపుణి కచ్చెరువంది, యటనుండి బృందావనమున కేగెను. బృందావనమున కేగుమార్గములో నొక యంత్యజుఁడు, పుగాకుగొట్టముచు పీల్చుచుండఁగా, నలసటచే నొకించుక విశ్రాంతిదీసికొనఁదలఁచి, నరేంద్రుఁ డాతనికడ కరిగి, గొట్టమునొకసారి యిమ్మనియడిగెను. ఆశ్చర్యచకితుఁడై, యాయంత్యజుఁడు, తానొక పాకీవానినని చెప్పి సంశయించుచుండిన నరేంద్రుఁ డొకయరమైలువెడలినంతలో, "సర్వాత్మైక్యభావమును నమ్ముచు, జాతివర్ణభేదాదులనవలఁద్రోసిననే నస్పృశ్యతాదోషమున కెరయైనేను "పాకీవాని"నని యాతఁడు చెప్పినంతనే, సాక్షాద్భగవత్స్వరూపుఁడగు నవ్వానిని విస్మరించుచుంటినా ? ఎంత మూర్ఖమో కదా!" యని తనలోఁ దాను తిట్టికొని, వెనుకకువచ్చి, యాతనినడిగి,

గొట్టముపుచ్చుకొని, పొగఁబీల్చి, తన మూఢజన్మసంస్కారమును తెగనఱికికొనఁగల్గినందులకు సంతసించి వెడలిపోయెను.

బృందావనమున, శ్రీకృష్ణుని లీలామానుషవిగ్రహచర్యలఁ బరికించి, యతిమానుషానందమంది, యటనుండి గోవర్ధనపర్వతమును సమీపించెను. నరేంద్రుఁడు దైవవశమున లభ్యమైనదే భుజించుచుం డెను. ఆకఁటిబాధతో నాతఁడు పయనించుచుండ, సమేఘవర్షము పడి యాతనికి హాయినిఁగూర్చెను.

కాని నరేంద్రునిది జాతిగుండె, కష్టపర్వతము లద్దానినిచలింపఁజాలవు. పరమేశ్వరాశ్రితజీవనుఁడగు నాతనికి విచారమేల? ఆతఁడీ యభిప్రాయముతో ముందుకు నడచుచుండెను. వెనుక నొక శబ్దము వినఁబడెను. ఆశబ్దము నరేంద్రునికి భోజనమునిచ్చు నర్థమును బ్రకటించెను. ఆధ్వని వినియు, నరేంద్రుఁడు, పరమేశ్వరకృపను బరీక్షింప నిశ్చయించికొని, ముందునకుఁ బరుగిడ నారంభించెను. ఆవెనుకటి మనుజుఁడును పరుగిడి, యొకమైలు దూరములో నాతనిఁ బట్టుకొని భోజనముచేయ బలవంతము సల్ప, నరేంద్రుఁడు భుజించి, "రాధాకృష్ణా!" యని స్మరించి వెడలిపోయెను. దిక్కులేని యామహారణ్యప్రదేశమునఁ దనభక్తుని యాఁకలి సేదదీర్చి, యాభోజనమిడిన యాపరమేశ్వరుఁడు నిముసములో నదృశ్యుఁడయ్యెను. భగవంతుఁడు భక్తజనాధీనుఁడు గాదె?

అటనుండి బయలుదేరి, నరేంద్రుఁడు వైష్ణవపుణ్యక్షేత్రమగు గోవర్ధనకుండమునకు వెడలుచుండెను. ఆతనియొద్ద నప్పుడొక కౌపినమే యుండెను. మార్గమధ్యమున నొకకాసారముం గాంచి, స్నానమాడఁ, గట్టుకొనుటకు వేఱువస్త్రము లేక, కౌపీనముచు తడిపి, గట్టు మీఁద నాఱవైచి,నీళ్ళలోనీఁది, స్నానముజేసి, లేచి, చూచుసరికిఁ గౌపీనము కన్పట్టలేదు. అంతనరేంద్రుఁడు పైకిఁజూచుసరికి, కౌపీన

ము నొకమర్కటము చేతఁబట్టుకొని యొకచెట్టుమీఁదఁ గూర్చుండి యుండెను. "సోదరా ! నాకౌపీనము నాకి"మ్మని నరేంద్రుఁడు ప్రార్థించి, ప్రార్థన వ్యర్థముకా, నత్యభిమానపూరితుఁడై, తానరణ్యమున వస్త్రాహారశూన్యుఁడై నిరశనవ్రతదీక్ష నవలంబించి, ముందుకుఁబోవుచుండెను. వెంటనే వెనుకనొక మానవశబ్దము వినఁబడి, మఱునటిక్షణములో నొకఁడొక వస్త్రమును, కొంతయాహారమును దీసికొనివచ్చి, భుజింపుమని నరేంద్రునిఁ బ్రార్థించెను. నరేంద్రునకుఁ గల్గిన యానందమున కంతములేదు. రాధాకృష్ణనామస్మరణైకవిలసితగాత్రుఁడై, యాతఁడు పరమేశ్వరుని, యనంతౌదార్యమునుకొనియాడుటకు శక్తిచాలమి, బాష్పపూరితలోచనుఁడై, ముందునకు సాగెను.

జీవితాశయములన్నిటిని మఱుఁగుపరచి, యగ్రస్థానమువహించునొక మహోద్దేశమొక గమ్యస్థానమును నిర్ణయించుకొని ప్రతిమానవమును యాత్రచేయించుచుండును. మానసము దృఢమైనదైనచో వెనుకదృష్టివీడి,గమ్యస్థానమువైపునకే, రయోద్రేకమున సాగుచుండును. కాని సర్వాశయముల సమగ్రముగా నఱికివైచి, గమ్యస్థానాధిగమనమే, జీవనసర్వస్వముగా నిడుకొనిన నాక్షణమే మహాపుణ్యకాలము. అదియే జీవమోక్షకాలము. అప్పుడే జ్ఞానోపదేష్ట యగు గురూత్తముఁ డప్రయత్నముగా లభించును, అనేకజన్మార్జితపాపకర్మరాశి యంతయు నప్పుడే దగ్ధమయి, నిర్విశేషముగా నంతరించును. ఆక్షణము ప్రాపించునందాఁక నెన్నికోట్ల గురువులెట్టిజ్ఞానమును నూరిపోసిన నయ్యది భస్మహవ్యమే. మానస మపవిత్రమై, యెన్నికోట్లయుగములు గడచిపోయిన, నీషణ్మాత్రజ్ఞానలాభమును గలుగనేరదు. వెఱ్ఱిమానవులారా ! గురువు గురువని యేలతడవులాడెదరు ? ఫల మూర్ఖజ్ఞానోపదేశమునకై ముడుపులుకట్టి, ముల్లోకములఁ దిరిగి,

ద్రిమ్మరులగుచుందురు ? మీమానసములఁ గడిగివైవుఁడు. విశుద్ధ జీవనకార్యక్రమమును నిర్ణయించుకొని, యపవిత్రత నరికట్టఁ బ్రాణములనైనపరిత్యజింప నుద్యుక్తులుకండు. జ్ఞానము, తత్త్వము వీని మాట భగవంతునకే వదలుఁడు. మానసము నిర్మలముకురమై నిలచినచో జ్ఞానజ్యోతియందేల ప్రతిఫలింపదో చూచెదముగాక !

నరేంద్రుఁడు కేదారభద్రికి వెళ్ళుచు హత్రాస్ స్టేషనులో నాగవలసివచ్చెను. ఆచోట నాతఁడధికాయాసవిదళితుఁడై, దహించుచున్న యాకఁటిబాధకు లోనై, శ్రమదీర్చుకొనన నొకమూలఁ బద్మాసనస్థుఁడై కూర్చుండియుండెను. ఆస్టేషను కధికారి వంగదేశీయుఁడగు శరచ్చంద్రగుప్తుఁడు. అతఁడు హిందూస్థానీ, ఉర్దుభాషలలో నగ్రగణ్యుఁడు. మనోజ్ఞత్వము, హృదయవిశుద్ధత, మగటిమి యివియే యాతని జన్మహక్కులు. అతఁడు తనకార్యములో నటునిటుఁ దిరుగుచుండఁగా నాతనిదృష్టి మూలఁగూర్చుండియుండిన యోగివిగ్రహము మీఁదఁబడెను. "ఇచటనొకసాధువు గలఁడు. ఆతనిముఖమెంత యద్భుతముగానున్నదో" యని తలఁచి, యచటనాఁగి, వానిపాదములకుఁ బ్రణమిల్లి, తనగదిలోనికి వచ్చి శ్రమదీర్చుకొమ్మని యాతనిఁ బ్రార్థించెను. మొదట శరచ్చంద్రుఁడు, "స్వామిజీ! నీవాఁకలిచే బాధపడుచుంటివిగదా!" యన "ఔ"నని స్వామి మెల్లఁగా బదులు చెప్పెను. "బాగున్నది. నీ కేమి తీసికొనెద" వని శరచ్చంద్రుఁడు మఱలనడుగ, "ఏదియైనను సరే తీసికొనిరమ్ము" అని స్వామి పలికెను. ఒకక్షణములో స్టేషనులో లభించుసరకుల నన్నిటినిఁ దెప్పించి, స్వామికొక దివ్యభోజనమును సమకూర్చెను. నరేంద్రుఁడు బుభుక్షానలతప్తుఁడై యుంటచేఁ దృప్తితీర భుజించెను

దినకృత్యములన్నియుఁ దీరినవెనుక, శరచ్చంద్రుడు రాత్రియంతయు సాధుపుంగవు నానందచంద్రికాకాంతిలోనే గడపెను. తనతోఁ

గొన్నినాళ్లుండుమని స్వామినిప్రార్థించి, "నాకుజ్ఞానబోధచేయు"మని మొదటవేడెను. దానికిఁ బ్రత్యుత్తరముగా నరేంద్రుఁడు భక్తిగీతము నొకటిపాడి యూరకుండెను. శరచ్చంద్రుఁడఁతట, "స్వామిజీ! నిన్ను సేవించుటకు, నీవెంటవచ్చుటకు నేను సర్వమును త్యజింప సంసిద్ధుఁడనై యున్నా"నని వచించెను. స్వామిహృదయ మాశ్చర్యనిమగ్నమయ్యెను. అట్టిధీరత్వ మాతఁడెచ్చటఁగని యుండలేదు.

ఒకనాఁడు సాధుపుంగవునిఁజూచి, "అయ్యా! మీావదనమసంతృప్తిని ప్రకటించుటకు హేతువెయ్యద"ని శరచ్చంద్రుడడుగ, "మత్ప్రియబాలకా! నాకొక ధర్మనిర్వహణభారము గలదు. నాయశక్తినిఁజూచి నేను భీతిలుచుంటిని. నాగురుమహారాజు నాకొకయాజ్ఞప్తియిచ్చియున్నారు. అందు భారతదేశపునరుద్ధరణ మిమిడియున్నది. దేశమున నాధ్యాత్మికజీవనవృత్తి యడుగంటినది. ఇప్పుడు మనము చేయవలయునదేమన భారతవర్ష తత్వసందేశముచే లోకమును జయించుటే" యని స్వామివచించుచుండ, నాతనినేత్రగోళము లగ్నిస్ఫులింగములవలె, నాతనివదన మరుణోదయసూర్యబింబమురీతిఁ బ్రజ్వరిల్లెను. శరచ్చంద్రుని హృదయము, చంద్రోదయముచే శరనిధివలె నుప్పొంగిపోయెను. వెంటనేయాతఁడు, "స్వామిజీ! ఇదిగో యీాశిష్యుని నీయిచ్ఛవచ్చినరీతి నాజ్ఞాపింపు"మని వచించెను. శిష్యునిహృదయమును పరీక్షింప, "దండకమండులువులు ధరించి, భిక్షాపాత్రగొని, యీామహాకార్యనిర్వహణమునకై ప్రాణములనర్పింపఁగలవా? యింటింటికిఁదిరిగి బిచ్చమెత్తఁగలవా? సర్వసంగముల విసర్జింపఁగలవా?" యని నరేంద్రుఁడు ప్రశ్నించెను. "నీయానమెట్టిదైన తత్క్షణమే శిరసావహించెద"నని ధైర్యము వాణియై శరచ్చంద్రునోటినుండి వెడలెను.

తరువాత నరేంద్రుఁడు కొన్నినాళ్లు వ్రజేంద్రబాబింటిలో నుండి యచటనున్న వంగదేశీయులతో స్నేహము నెలకొల్పి, వెడలె

దననఁగా శరచ్చంద్రుఁడువచ్చి, "స్వామిజీ ! నన్ను నీశిష్యునిఁగా నను గ్రహింపు"మని ప్రార్థింప, "నాశిష్యుఁడ వైనంతనే నీకుసర్వములభించునని తలంపకుము భగవంతుఁడందఱిలో సమానముగ నేయున్నాఁడు. నీకర్మయే నిన్ను నడపు"నని గంభీరముగా స్వామిబదులుచెప్పి, "నేన ప్పుడప్పుడు వచ్చిపోవుచుందును. ప్రస్తుతము నేను హిమాలయముజేర వలె"నని తననిశ్చయమును తెలిపెను. కాని, యంతమాత్రముచే శరచ్చంద్రుఁ డూరకొనలేదు "స్వామిజీ! నీవన్ని చెప్పినను సరే! నీవెచ్చటకేగిన నచ్చటికేతఁడు వచ్చితీరు"నని తననిశ్చయమును వెలిబుచ్చెను. శరచ్చంద్రునచంచలధైర్యముఁగాంచి, నరేంద్రుఁడు సంతసించి,"అయి నచో నీభిక్షాపాత్ర తీసికొని యీస్టేషనులోని కూలివాండ్రయింటి యొద్ద బిచ్చమెత్తి నాకన్నము తె"మ్మని స్వామియాజ్ఞాపించెను. శరచ్చంద్రుఁ డరనిముసములో నట్లచేసి స్వామికానందము గూర్చెను.

వెంటనే శరచ్చంద్రుఁడు తల్లిదండ్రులకడ సెలవుగైకొని, పదవికి రాజీనామా నొసంగి, గురువుతో హృషీకేశమునకు బయలుదేరెను. వారు దారిలోననేకకష్టములు పడవలసివచ్చెను. శరచ్చంద్రునకు సదానందనామ మొసఁగఁబడెను. ప్రయాణములో నాఁకలిచే, బడలికచే, జ్వరముచేఁ బీడితుఁడై, సందిగ్ధమరణావస్థ ప్రాపించినపుడు మృత్యుముఖమునుండి యాతనిని తనప్రేమామృతరసము లొల్కించి, ప్రాణములతోఁ దుల్యునిఁగాఁజూచి ప్రోచిన నరేంద్రుని హృదయమును, సదానందుఁ డద్భుతముగా వర్ణించియున్నాఁడు. శిష్యుని పాదరక్షలు, శరీరము నయితము, కొన్నివేళల, భుజములమీఁద మోసికొనిపోయిన యీ నరేంద్రుని సౌశీల్యము నెవఁడు వర్ణింపగలఁడు.

హృషీకేశమున సాధువృత్తిచేఁ గొన్నినాళ్లు వారుజీవనము గడపి, హాటూ్రిస్‌కు మఱలివచ్చిరి అచటి మిత్రులు వారి నతిగౌరవముతో నాహ్వానించిరి. కాని యాత్రాపరిశ్రమచే వారిరువురుఁ గూడ

నొకించుకయస్వస్థులైరి. ఈవార్త బారానగరశిష్యబృందమునకుఁ దెలిసి, వెంటనే నరేంద్రుని రమ్మని ప్రార్థించుచు వార్తనంపిరి. నరేంద్రుఁడావార్తనందుకొని, శిష్యసహితముగా బారానగరమును జేరికొనను. నరేంద్రురాకచే శిష్యులు బ్రహ్మానందునుండి, కూడవచ్చినసదానందునికి గురుపుత్రోఁబాటు సపర్యలొనర్చిరి.

క్రమముగానరేంద్రుని కారోగ్యము వర్ధిల్లఁజొచ్చెను. శ్రీరామకృష్ణ విగ్రహమును బూజించుటతోడను, యాత్రావిషయముల శిష్యులకుదోబ్ధించుటతోడను, నరేంద్రుఁడు కొన్నినాళ్లుగడపి, మఱల ప్రయాణసన్నాహ మొనర్చుచుండెను.

---

## ముప్పదిమూఁడవ అధ్యాయము.

### శ్రీరామకృష్ణుఁడా? పవనహారిబాబా?

### యాత్రాంతరువులు.

నరేంద్రుఁడు దక్షిణేశ్వరములో నున్నపుడొకసారి, ఘాజిపురమునకుఁబోయి, పవనహారిబాబానుదర్శించి యున్నాఁడు. మఱల నాతనికదే కోర్కె జనించినది.

పవనహారిబాబాయెవరు? వారణాశీసమీపంబున, నొక్కపల్లియలో బ్రాహ్మణవంశమున జన్మించి, బాల్యముననే ఘాజిపురమునకుఁబోయి, యామరణబ్రహ్మచారియగుపినతండ్రియొద్ద న్యాయవ్యాకరణశాస్త్రములను, రామానుజతత్త్వమును జదివి, పినతండ్రి మరణించినంతనే, పినతండ్రి మరణించుటచే నాతని స్థానమును తానే స్వీకరించి, కత్తియవార్ సమీపమునన్న గర్నార్ శిఖరము మీఁద బ్రహ్మోపదేశముబొంది, యటనుండి కాశీపురముఁజేరి, యొక యోగీశ్వరుంగాంచి అద్వైతవేదాంతతత్త్వమును దెలిసికొని, మఱలి

ఘాజీపురమునకుఁబోయి యొకగుహ నిర్మించికొని, యందు నిరంతర తపస్సాధనలతో జీవితమును గడిపినాడు. అతని కాహారము గుప్పెడు నింబపత్రములు. ఎప్పుడైన నన్నము వండుకొన్నచో నయ్యది దీనులకుఁ బంచిపెట్టును. ముఖ్యముగా నాతఁడు పవనభక్షణము తోడనే తృప్తిచెందుటచేఁ బవనహారిబాబా యను నామమొసఁగఁ బడెను. కొన్నిసమయములలో నాతఁడు సర్వము మఱచి, గుహలోనే ధ్యానమగ్నుఁడై చాలకాలముండును ఒకనాఁడాతఁడొకగుహలో నుండఁగా, నొక దొంగవచ్చి, యాతని యుపకరణములఁ బట్టుకొని పోవుచుండఁగా, దైవవశమున నాతఁడు బయటకు వచ్చుట తటస్థించెను. ఆతనిఁ జూచి, దొంగ యచట వస్తువులఁబడవైచి, పాఱిపోవు చుండగా పవనహారిబాబా వస్తువులను బట్టుకొని, దొంగవెనుక పర్వెడి వానినిఁబట్టుకొని, “సోదరా! నీకార్యవిఘ్నము చేసినందులకు నన్ను క్షమింపుము. నాయవసరమునకంటె నీయవసర మధికమైనది. ఇవి నీవే”యనిపల్కి, వస్తువులనొసఁగి, దొంగనుఁబంపివేసెను. వేరొకనాఁడు, తన్నొకత్రాఁచుపాము కఱువఁగా, బాధ తగ్గినవెనుక, “ప్రేమమయుఁడగు సర్వేశ్వరుని వార్తావహుఁడే యీసర్పరా”జని వచించెను. ఈవిధముగాఁ బవనహారిబాబా, భక్తులలో భక్తాగ్రేసరుఁడు, జ్ఞానులలో నగ్రగణ్యుఁడు. “కార్యముఫలావస్థకు వచ్చినప్పు డెట్టియుత్సాహముతో, నెట్టియోర్పుతోఁ బనిచేయుదుమో, యదే దీక్షతోఁ గర్మనారంభమునుండి చేయవలయు” నని వివేకానందుఁడు బోధించినవాక్యము లీపవనహారిబాబా బోధించినదే.

అట్టి పవనహారిబాబాను దర్శింప స్వామి ఘాజీపురమునకరిగి, మిత్రుఁడగు, గగనచంద్రరాయనియింట విడిదిచేసి, పవనహారిబాబాను దినదినము దర్శనముచేయుచుఁ, దన్ను దర్శింపవచ్చినవారికి జ్ఞానామృతధారలఁ జిల్కుచుఁ గాలముఁ గడపుచుండెను. ఒకనాఁడు

జనులు గుంపులుగూడి యుండ స్వామి యిట్లుపన్యసించెను; "దౌర్జన్యగర్భితరోషవాక్యములచే సంస్కరణము జరుగదు. అనంతశాంతి ప్రేమలమూలమున జనసామాన్యము కక్షరజ్ఞానము కల్గించి, హృత్పరివర్తనము గావించుచో నత్యద్భుతమగు సంస్కరణముల లభించును. హిందూమతాధారభూతమయిన, భాగవతదృష్టిమీఁదనే సమస్తవిద్యాభ్యాసము నాధారపడియుండవలెను. హిందూమతమును దూషింపకుఁడు. మతమును తీవ్రదృష్టితోఁ జదివి, జ్ఞాననేత్రముల విప్పి, పరికించినచో ననిర్వచనీయ సత్యప్రదీప్తియే మీకుఁగన్పట్టును. పాశ్చాత్యవిజ్ఞానాచారములు మిర్మిట్లుగొలుప మోహితులు కాకుఁడు. మాతృదేశము నర్థముచేసికొనుఁడు. దేశచరిత్రలో నిప్పటి మనదేశదౌర్భాగ్యస్థితి యెన్నఁడు తటస్థించియుండలేదు. వచ్చిన కష్టమంతయు మనయందలి శక్తిహీనతచేఁగాదు. మనకు శక్తిచాలదను దురభిప్రాయపిశాచమునకు లోనగుటచేతనే. సత్యముచే దేశమునకు దారిద్ర్యము లేదు. కాని, ఆత్మశక్తినెఱుంగకుండు నీమహాదారిద్ర్యమే మనల ప్రమింగుచున్నది. ఆత్మావలోకనముతోడనే మనక్లిష్టసమస్యలన్నియు విడిపోవును."

స్వామి యింకను చాలదినములుండునని ప్రజలు తలంచుచుండగా నొక్కనాఁడాతఁడాకస్మికముగా నదృశ్యుఁడయ్యెను. బారానగరశివ్యకోటి నరేంద్రు నత్యుత్సాహముతో గౌరవించెను. పవనహారిబాబానుగూర్చి సోదరశివ్యకోటి కుపన్యసించుచు, సమస్తజీవైక్యసూత్రమును, నంతరించు నవ శిమలు హిందూమతమున స్థిరప్రతిష్ఠితములై యున్నవని యనేకవిధముల బోధించెను.

కాని స్వామి, యెట్టియెట్టిమహోపన్యాసములొసఁగుచున్నను సెట్టిత్యాగాగ్ని రగుల్కొల్పి, యెందఱ నాకర్షించుచున్నను, నాతని హృదయము మాత్రము సంశయరహితము కాలేదు. ఒకవిధమగు

నశాంతి యాతని నావరించినది. ఆతనికిఁ బరిపూర్ణపరిశాంతిదాత, శ్రీరామకృష్ణుఁడొక్కఁడే యని యాతఁడెఱుంగును. కాని “పవనహారిబాబామాత్రము రామకృష్ణునికిఁ దీసిపోవునా? రామకృష్ణుని కంటె నెక్కుడుసాధనల నాతఁడొనర్చియుండలేదు. పవనహారిబాబాను నేనేల శిష్యత్వముచేసి, నాయశాంతినిఁ బోఁగొట్టుకొనరాదు. ఒక్క శ్రీరామకృష్ణుఁడే నాగురువైనచో నాకీ యశాంతిహేతువేయ్యది? రామకృష్ణుఁడు తెలుపఁగా మిగిలిన జ్ఞానము పవనహారిబాబానుండి తెలిసికొనెదను గాక” యని యనేకవిధముల, వివిధాభిప్రాయసంఘట్టనసంజాతసంశయాగ్నిజ్వాలచేఁ బరితప్తుఁడై, స్వామి యేమిచేయుటకుఁ దోఁచక, శాంతిమార్గముఁ గానలేక, దుర్భరవిషాదపరిస్థితి కగ్గమై యుండెను. “నీ కిప్పుడు నిర్వికల్పసమాధి ప్రాపించినది. సమస్తజ్ఞానము నీకుఁ గరతలామలకము. కాని నీవు లోకకల్యాణనిమిత్తకర్మాచరణమునకుఁ గడఁగవలసియున్నది. కాన నీసమాధియొక్క తాళముచెవి నాయొద్దనుంచును. ఒక్కించుకమాయ నీమూర్తి నలవరించియుంచుము”ని వచించిన రామకృష్ణవాక్యములాతఁడు మఱచిపోయెను. అట్లు మఱచి, పవనహారిబాబుకు శిష్యత్వముపహింపఁ గృతనిశ్చయుఁడై, బయల్వెడలెను. ఆతనికి ముందునకుఁ గాలుపడలేదు. ఆతనిశరీరము భారమెక్కెనై, యాతనిపాదములఁబూదవిలఁబడకుండెను హృదయము కంపించెను. తనకు రామకృష్ణునకుఁగల ప్రేమసంబంధము రూపరహితశక్తియై, యాతఁ డన్యునొద్దకుఁ బోకుండ నడ్డునిలచినది. తన స్థితియెట్టిదో, యాతనికిఁ దెలియలేదు. కాని వెనుకటిసందేహము విదళితమయ్యెను. తన్నాధ్యాత్మికజన్మమెత్తినదాది, తల్లి కన్నబిడ్డను పెంచినట్లు పెంచి, తన యనేకజన్మార్జిత పుణ్యరాశియంతయు నాతనికే ధారపోసి, యాతని పాపముల నాతఁడేధరించి. తానొకపక్షియై, యవతారము చాలించిన, శ్రీరా

మకృష్ణదివ్యవిగ్రహము, నూతనాకృతినివహించి నరేందునిని నందే హాదందహ్యామానమగు హృదయమున కెట్టయెదుటఁ గన్పట్టెను. నరేంద్రుని నేత్రములు, కృతజ్ఞతా బాష్పధారాప్లావితములైనవి. అతని గాత్రము వణఁకనారంభించెను. తానొక గురుద్రోహము చేసిన మార్గునివలె విలపించెను. అప్రియత్నముగా వానినోట, "ఓరామకృష్ణగురూత్తమా! నీవుకాక నాకు వేఱుగురువు లేఁడు. నాపాలింటి భగవంతుఁడవు నీవే. నీయాజ్ఞను నేను మఱువను. ఆమరణము నీ యాదేశమునకే బద్ధుఁడనైయుండెద"నని యెడు వాక్యములు బయల్వెడలెను

ఇఱువదియొక్కడినములు, నరేంద్రుఁడిట్లు రామకృష్ణవిగ్రహమును గాంచెను. ఇఱువదియొక్కడినములు, వాతఁడుజీవితములో నెన్నడనుభవించని యపారమానసికయాతన ననుభవించెను. వారిఱువురిమధ్య నాదినములలో నేమిజరిగినదో, యెట్టి యద్భుతవిషయములు సంఘటిల్లెనో, మానవలోకమునకుఁ దెలియుయోగము పట్టలేదు.

స్వామి అభేదానందునకు జబ్బుచేసినదని తెలిసి, మనస్వామి, కాశీచేరి, యచట సంస్కృతపాండితీ ధురంధరుఁడగు, ప్రమదదాసు మిత్రు నతిథిగానుండి, తనసోదరున కనేకవిధముల సేవయొనర్చెను. గృహస్థశిష్యుఁడగు బలరామబాబు పరలోకగతుఁడయ్యెనని తెలిసి, వెంటనే స్వామి కలకత్తాకు బయల్వెడలి, సురేశమిత్రుఁడును కొన్ని నాళ్ళకిిందటనే మరణించెనని తెలిసి కడుంగడు విచారించెను. బలరామబాబు మరణవార్తవిని ఖిన్నుఁడగుచున్న స్వామినిఁజూచి, ప్రమదదాసుమిత్రుఁడు, "నీవు సన్యాసివికనా ! యేల నీకీవిచార"మని యడుగ, "అయ్యా! మానవుండు సన్యాసియయినంతనే, హృదయమెక్కడికిఁబోవును? నిక్కమగు సన్యాసి యెక్కుడు పరితపింపవలెను.

అదియుఁగాక బలరామబాబుతోఁ గలసి నేను, మాగురుపాదముల
సేవించియుండలేదా? ఆాతిగుండె సన్యాసము నాకక్కఱలేద"నిస్వామి
బదులుచెప్పెను. ఈవిధముగాఁ గలకత్తానుండి మఱలి బారానగర
మును జేరుకొనెను. శ్రీరామకృష్ణుని మహాసమాధ్యనంతరము,
నాల్గున్నరవత్సరములు గడచెను.

1886 వత్సరము మొదలిడి, యొకటిన్నవత్సరములు, కలకత్తా
లో రామకృష్ణమతసంస్థను స్థాపించి, స్థిరప్రతిష్ఠితము చేయుటలోఁ
గడచెను మిగిలిన యారుమాసములు ఘాజిపురములోను, కాశీ
లోను, బారానగరమునను జరిగెను. ఈనాల్గయిదువత్సరములు నరేం
ద్రుఁడు వృథాకాలక్షేపము చేసెనా? మహాపురుషుల కొక్కక్షణ
మైనను పనిలేనికాలముండునా ? శ్రీరామకృష్ణమతసంస్థాననిర్మాణ
ము, మాతృదేశవివిధక్షేత్రజీవనమార్గజ్ఞానసంపల్లాభము, వివిధమహా
పురుషసందర్శనసంజాతనూతనాంశాసంగ్రహణలాభము, భావిభారత
సందేశాధారసామగ్రి నార్జించుట, వీనితో నరేంద్రుఁడు కాలముగడు
పుట ముఖ్యావశ్యకమైయున్నది.

జూలై 1890 వ వత్సరమున, మఱలి రాకుండు ప్రతిజ్ఞగై
కొని, అఖండానందుని వెంటనిడుకొని, నడచి, ఘుస్రీగ్రామమున కరిగి
యచటఁ గాళీదేవినిఁ బ్రార్థించి, హిమాలయమువైపునకు దారితీసెను.
అట్లు బయలుదేరి వారిరువురును, మొట్టమొదట భగల్పూరు జేరి,
యచట న్యాయవాదియగు మధురనాథసింహునింట నతిథులైరి.

స్వామి యాత్రాప్రారంభదినములలోనే, యాతని, యద్భుత
వైరాగ్యసూచకముఖప్రదర్శనము, నాతని యఖండసచ్చిదానందైక
లగ్నయోగదృష్టి, యాతని సహజమధురవాక్సంపత్తి, యెచట కేగిన
నచట ప్రజాసంఘముల నాకర్షించి, మోహింపఁజేసెను. బ్రాహ్మ
సమాజసభ్యుఁడైన మన్మథనాథబాబు, స్వామిబోధచే హిందూమత

ముగ్గు మఱల స్వీకరించెను. భగల్పూరునుండి స్వామి, వైద్యనాథము న కరిగెను. తానాంగ్లము నెఱుఁగుట తెలుపవలదని యఖండానందు నితోఁ జెప్పి, బ్రాహ్మసమాజనాయకుఁడైన, బాబురాజనారాయణ బోసుతో వంగభాషలోఁ బ్రసంగించి, తనయుపారవక్తృతాపాటవము చే నాతని మోహనివశుని జేసెను. తరువాతఁ దానుదర్శనము చేసిన యాస్వామియే, పాశ్చాత్యప్రపంచము నుఱ్ఱూఁతలూగించిన వివేకానందుఁడని తెలిసి యాతఁ డాంగ్లము నెఱింగియుండినసంగతి తనతోఁ బ్రసంగించినపుడు తెలియమికిఁ జింతించి, "ఈతఁడొక యద్భుత పురుషుఁ"డని వచించెను.

వైద్యనాథమునుండి వారిర్వురు మఱలఁ గాశీపురమును జేరిరి. ఇదియే స్వామికడపటి కాశీయాత్ర. ఆతఁడు తన వేదాంతసందేశమును, దిగ్దిగంతముల వ్యాప్తిచేసినందాఁక మఱల నాపట్టణమును జేరలేదు. కాశీనుండి వెడలునపుఁ డాతఁడు మిత్రుఁడగు ప్రమదదాస మిత్రునితో "నేనిపుడు కాశీని విడచి, సంఘముమీఁద నశనిపాతము వలె పైఁబడి, సంఘము పెంపుడుకుక్కవలె నన్ననుగమించువఱకు నేనిచటికి మఱలి రా"నని వక్కాణించెను.

---

## ముప్పదినాలుగవ అధ్యాయము.

### హిమాలయపర్యటనము; ఆళ్వారునగరము.

సర్వప్రపంచసంగనములను తృణలీల విసర్జించి, దేహాభిమానమును తగులఁబెట్టి, పరమేశ్వరైకార్పితజీవనసర్వస్వులగు నవ్వార లెచటికేగిన, నేమిచేసిన, నేమిపల్కిన, నదంతయు నమృతప్రాయముగా, మనోరంజకముగాఁ, గర్ణపర్వముగా నుండకుండునే?

అయోధ్యానగరమును వీడి, కాలినడకను, స్వామివివేకానందుఁడఖండానందునితోఁ గూడి నైనిటాల్ జేరి, బాబు రామప్రసన్న

భట్టాచార్యునింట నిర్వురు నతిథులైరి. ఒకనాఁడు వారు పయనించు మార్గమధ్యమున నొక వటవృక్షచ్ఛాయను, స్వామి పద్మాసనస్థుఁడై నిర్మలధ్యానమున నున్ని, సర్వమును మఱచి, కొంతసేపట్లుండి, మఱల లేచి, "గంగాధరా!" యని అఖండానందునిఁ బిల్చి, "ఈక్షణమే నా జీవితములో నత్యంత శ్రేష్ఠమయినది. నాజీవితపరమరహస్య మిచట నే నాకుఁ దెలిసినది. నాయల్పశరీరములో నశేషబ్రహ్మాండమును నేను దర్శించితి"నని వచించెను. అచటనుండి వా రాల్మోరాకు బయలుదేరిరి. స్వామి బడలికచే నీరసించి, భోజనము లేమి, కదలలేని స్థితియందుండి, నొకముసల్మానుమతమునొద్ద జతికిలఁబడెను. అఖండానందుఁడు నీరుతెచ్చుటకై వెడలెను. మతమునకుఁ జెందినముసల్మా నొకఁ డచటి కరుదెంచి తనయొద్దనున్న యొక దోసకాయను స్వామి కొసఁగెను. స్వామి, "నానోటిలోఁ బెట్టుము. కడునీరసముచే నా చేయిని నే నెత్తలే"ననెను. "అయ్యా! నేనొక్క మహమ్మదీయుఁడను. పనికివచ్చునా?" యని యాతఁడు ప్రశ్నింప, "మతేమియు భయములేదు. మన మందఱము సోదరులము కామా?" యని స్వామి వచింప, ముసల్మానాఫలమును స్వామినోటఁ బెట్టెను. స్వామి శ్రమసడలినవెనుక, 'ఈమానవుఁడు నాప్రాణములను కాపాడినాఁడు. ఇంత యలసట నే నెన్నఁడు పొందియుండలే"దని పల్కెను. ప్రపంచ వేదాంతమహాప్రవక్తయై, మాతృదేశమునకు స్వామి వివేకానందుఁడు మఱలి, ఆల్మోరాపౌరు లఖండస్వాగత మొసఁగ గుమిగూడినపుడు తనవైపు తొంగిచూచుచున్న ముసల్మానును జనమధ్యంబునఁ గాంచి, జనమునాపి, కృతజ్ఞతాప్రకటనప్రయత్నసంజాతబాష్పనేత్రుఁడై, ముసల్మానునిఁ జేరఁబిలఁచి, కొంతధనము నాతనికొసంగి, యావెనుక ముందునకరిగెను. స్వామిహృదయ మెంతకారుణ్యరసతరంగితమో, పాఠకులు గ్రహింతురా?

స్వామిసదానందుఁడు, స్వామిప్రేమానందుఁడును వచ్చి, తమ నాయకునిఁ గలసికొనిరి. అచట లాలాభద్రిషాయింట బసచేసియుండ నొకఁడువచ్చి, "ఇచ్చట నొక దేవతావేశముచే బాధపడుచున్న యొకఁడు గలఁడు రం"డనిపిలువ, లాలాభద్రిషాతోఁ గలసి స్వామికూడ వెడలెను అచ్చటనేకు లనేకమంత్రములు చదువుచు, వివిధోపాయములచే నాతని బాధ తొలఁగింపఁజూచిరి. కాని లాభము లేకపోయెను. తుదకు స్వామి యాతని సమీపించి,తనయిష్టదైవతమును తలఁచి, యాతనిఁ దనచేతితోఁ దాఁకినంతనే, రోగి లేచి కూర్చుండి స్వామికి మ్రొక్కెను.

తరువాత తనసోదరి కలకత్తాలో నపరిమితబాధ ననుభవించి, మరణించెనను దుఃఖవార్త తెలిసి, స్వామిహృదయము తుత్తునియలయ్యెను. కాని వెనుకకు మఱలుట కాతఁడు బూనుకొనక, సర్వసంబంధములఁ ద్రెంచుకొని, సాహసము జిక్కఁబట్టి, ముందుకుసాగి, కర్ణప్రయాగ, రుద్రప్రయాగలను దర్శించి, శ్రీనగరమును జేరెను. అచటనుండి తెహరీపట్టణముబోవుచు, మార్గమధ్యమునఁ జీఁకటిపడుటచే నొకచిన్నిగ్రామమున నాగిరి. అచ్చట భిక్షకై యింటింటఁ దిరిగిరి. కాని, యెవరును నిద్రనుండి లేవరైరి. తుదకు వారు సామమును విడిచి, యాఁకటిబాధ కోర్వలేక, గ్రామమధ్యంబున నిలఁబడి, దండములఁ ద్రిప్పుచుఁ బ్రజలను బెదరించిరి. ఆదృశ్యమును జూచి భయమంది, గ్రామస్థులలో బలమగువారలైదుగురు భోజనపదార్థములను బట్టుకొని వచ్చి స్వాములకొసఁగి వెడలిపోయిరి. భోజనములు సల్పి, స్వామి గ్రామస్థులను బిలఁచి, జ్ఞానోపన్యాసముల నొసఁగి, వారినానందమునఁ దేల్చి, యటనుండి, తెహరాకుఁబోయి యచట నఖండానందుఁ డస్వస్థుఁడుకా బ్రయాణము నాపి, ఢేరాధూనుకు నడచిరి. అచట స్వామి తురీయానందునిఁ గలసికొని, మూఁడు

వారములుండి, యఖండానందు నలహాబాదు వైద్యముకొఱకంపి, కృపానందుని వానికిఁ దోడిచ్చి, స్వామి హృషీకేశమున కేగెను.

అచటనొకగుడిసెను నిర్మించుకొని మధూకరవృత్తిచేఁ గొన్ని నాళ్లు జీవించి, యటనుండి బయలుదేరుసమయమునకు స్వామికి జబ్బు చేసినది. నాడి వెనుకకుఁబోయి, చెమటపట్టి, శ్వాస మందగించెను. నాయకుని కంత్యదినములు వచ్చెనని శిష్యులు భీతిల్లిరి. అంత నొక సన్యాసి యెచటనుండియోవచ్చి, నాయకుని నోటఁ గొంచెము తేనె పోసెను. దానితో నరేంద్రునిరోగము తగ్గి, బలముచేకూర, స్వామికి నమస్కరించెను. మఱల స్వామి యటనుండి బయలుదేఱ, మీరటు పట్టణము జేరెను. అచట బ్రహ్మానంద కృపానందస్వాములు స్వామినిఁ గలసికొనిరి. అఫ్ఘను అమీరు సంబంధియగు నొకసర్దా రచటికి వచ్చి వారిని దర్శించెను. ఒకనాఁడు స్వామి పట్టణగ్రంథనిలయమున కరిగి, సర్ జాన్ లుబ్బల్ అను గ్రంథమును తీసికొని, మఱుసటిదినమునకే తిరిగి యిచ్చివేసెను. అదిచూచి, భాండాగారకుఁడు, "స్వామీ! గ్రంథము నేలచదువవతే"దని ప్రశ్నింప, "నేను చదివితిని. నీకు సందియమున్నచో నీయిచ్చవచ్చినరీతిని పరీక్షింపు"మని స్వామి బదులు చెప్పెను. అంత నాభాండాగారకుఁడు ప్రశ్నించిన ప్రశ్న లన్నిటికి, స్వామి కంఠస్థముచేసినట్లు బదులుచెప్పుట గాంచి, "స్వామిజీ! నీవింత కొలఁదికాలములో నెట్లుచదువగల్గితి''వని ప్రశ్నింప, ''నేను పుస్తకమునందు ప్రతివాక్యమును చదివినచో నెన్నియేండ్లైనను పట్టును. కాని నాచదువు వేఱు. పుటలు త్రిప్పుటే నామార్గ"మని స్వామి పల్కెను.

మీరటులో మఱికొన్నినాళ్లుండి, వారు హరిద్వారము దర్శించుటకేగి, యచటి సాధుపుంగవులఁ గాంచిరి. స్వామి కీసమయమున నేకాంతవాసము ప్రీతిగొల్పినది. అనేకత్వమాతనికి శాంతిభం

గము కల్పించుటచే, శిష్యులను వెడలిపో నాజ్ఞాపించి, యొకనాఁడు 1891 వ వత్సరము జూన్ నెలలో ఢిల్లీకి, రహస్యముగా బయలు దేరెను.

ఢిల్లీనగరము, హిందూదేశమున కనాదినుండి ప్రధాననగరము. యావద్భారతదేశము నేకచ్ఛత్రముగ నేలిన సార్వభౌముల కది నివాస స్థానము. సురనగరసౌందర్యమును హసించు భవనములు, కోటలు, రాజమందిరములు, ఆలయములు, గోపురములు విదేశీయకరఘాత ములచే శిథిలములై, పురాతనభారతప్రౌఢిమను వేనోళ్ళఁ జాటు చున్నవి. దండకమండలములే తనయఖండైశ్వర్యముగా, కాషాయవస నధారియై, కాలినడకను, స్వామి హస్తినాపురవీథులం బ్రవేశించెను. శ్యామలదాస్ చెట్టి, డాక్టర్, హేమచంద్రసేనులు, వానినద్భుతముగా గౌరవించిరి. అచటఁ గొన్నినాళ్లుండి, యాతఁడు చారిత్రాత్మకములగు సమస్తప్రదేశముల దర్శించి, యవన్నియు శిథిలములయియుంటఁ జూచి నంతనే, యాతని హృదంతరముననున్న వైరాగ్యజ్వాల పై కుబికి, అశాశ్వతవైభవతత్త్వమును గుర్తించెను.

లోకమున శరీరసంబంధప్రేమబంధ మెద్దియు శాశ్వతమైనది కాదు. ఏబంధము భగవద్జ్ఞానసంబంధమై రచింపఁబడినదో, యదొ క్కటే నిత్యము. శ్రీరామకృష్ణునిశిష్యకోటిని పరస్పరప్రేమబద్ధ మొనర్చినట్టిది నిత్యప్రేమపాశమే. మీరటునగరమున స్వామి తన గురుభాయిలను తనతో రావలదని యాజ్ఞాపించి, తాను ఢిల్లీనగర మునకరుదెంచుసరికి వారు వియోగము నోర్వఁజాలక, స్వామిని వెం టాడి, ఢిల్లీవచ్చి కలసికొనిరి. కాని యాసమయమున స్వామిహృద యము, ప్రేమాతీతకఠినత్వమును దాల్చినది. ఏకాంతపర్యటనమే యాతఁడు త్రికరణశుద్ధిగాఁ గోరి యున్నాఁడు. గురుభాయిలతోఁ గలియుటాతనికి బంధకము గాఁగన్పట్టెను. ఆబంధము పవిత్రతమమైన

డైనను, దానినాతఁడు సహింపక, త్రెంపివేయు నిశ్చయించికొని, “నేనిప్పుడు ఢిల్లీని వదలవలెను. నన్ననుసరించువారును ప్రాణాపాయమును నిశ్చయించుకొనియే రావలెను. పరమాత్మ తోడ్పాటనిపోయిన తా నెట్టిదైన నచటికే పోయెద”నని యాతఁడు గురుభాయీలతోఁ జెప్పి, ఆల్వారునగరమునకుఁ బయనించెను.

ఆల్వారునగరము రాజపుత్రస్థానములో ముఖ్యమైనది. రాజపుత్ర నామము స్మరించినంతనే అకల్మషశౌర్యము, నప్రతిహతసాహసము, నతిమానుష స్వాతంత్ర్యము, వర్ణనాతీత పాతివ్రత్యము, నివి భారతభూమిని జన్మించిన ప్రతివ్యక్తిహృదయమునుండి, యావేశాగ్నిజ్వాలలను రగుల్కొల్పుటలేదా? రాజపుత్రపరిపాలనాధర్మమును తలఁచి, నేఁటి తుచ్ఛపరిపాలనాదౌష్ట్యమును కండ్లారఁజూచినఁ గన్నీరు మున్నీరై ప్రవహింపకుండునే? ఆరాజపుత్రశౌర్యాగ్ని యెన్నఁ డారునది కాదు. ఏలన నయ్యది శాశ్వతధర్మస్థాపితము సర్వజగద్భారధారణసూత్రబద్ధము అదియొకించుక నివురుచేఁగప్పఁబడినదే కాని, పూర్ణనాశనమొందలేదు. అవిగో జయజయధ్వనులు వినఁబడుచున్నవి. పెంపేదిన రాజపుత్రశౌర్యాగ్ని విస్ఫులింగములమీఁద, నహింసాత్మకభువనైకవందిత, ప్రతిపక్షవందిత దివ్యశాంతినాదముల నుచ్చరించు జగన్మోహనమారుత మందగతి వీఁచి, తెచ్చఁగొత్త లోకకల్యాణమును నిర్మింపఁ గంకణముకట్టుకొన్నది. ఆమహానాదమే ఓంకారప్రణవనాదము. ఆనాదముముందు, సమస్తయంత్రాయుధసంపత్తి భస్మీపటలమైపోవలసినదే. దానికెదురుట సమస్తపాశవిహింసాత్మకసామ్రాజ్యతుచ్ఛతృష్ణాపరంపరలు, మంటలో దూదిపింజవలెఁ, జురచురలాడిపోవకతీరదు. భారతీయులారా! ఆనాదమును గని, తన్నామస్మరణముచేయు భాగ్యోదయము లభించినందులకు, పరమేశ్వరాపారప్రేమసాగరమును నుతించి, కార్యరంగమును ప్రీతితో నాలింగనము చేయు

నేల సంశయించెదరు ? మీకిట్టి వేషకర్మ లవసరము లేదు. సృష్ట్యా దినుండియు, మీమీవంశములకు శాశ్వతము క్తిలోకనివానసిద్ధిసాధన మేతన్నాదచోదితకార్యరంగాలింగనమే !

1891 వ వత్సరము ఫిబ్రవరి మాసారంభమున, ఆల్వారురైలు స్టేషనునొద్ద దిగి, రాజమార్గమును బట్టి పురప్రవేశముచేసి, రాజవైద్యశాలగుమ్మమునొద్ద నిలఁబడియున్న వంగదేశబాబు నొకనినిఁ గాంచి, మాతృభాషలో నాతనిఁ బలుకరించి, సన్యాసులబస యెచ్చటయని ప్రశ్నించెను. ఆవంగదేశబాబు, మాతృభాషలో వాక్యములు విని చాలదినములగుటచేతను, స్వామి కీముఖావలోకనమాత్రన తన్నద్దియో యాకర్షించుటచేతను, ప్రేమప్రచలితాంతరంగుఁడై, విపణివీధిమధ్యముననున్న యొకమేడమీఁది గదిలోనికి స్వామిని దీసికొని వెడలి, యచటఁ బ్రస్తుతముండుమని చెప్పి, పురప్రాథమికపాఠశాలలోఁ దనమిత్రుఁడగు, మౌల్వీసాహేబును కలిసి, "మౌల్వీసాహేబ్ ! వంగదేశస్వామియొకఁడు వచ్చియున్నాఁడు. ఆతఁడొక మహాత్మునివలెఁ గన్పట్టుచున్నాఁ"డని వచించి, యిరువురు వెంటనే స్వామి బసఁ జేసిరి. వంగదేశబాబు గురుచరణలాష్కరు, మౌల్వీసాహేబు స్వామికి నమస్కరింపగనే, వారిని ప్రేమపూర్వకముగా స్వామి కూర్చుండఁబెట్టి, కొరానును గూర్చి విపులముగా వర్ణించి, వారిహృదయములను కరఁగించెను. అచటనుండి వారిద్వరు స్వగృహముల కేగుచు మార్గమధ్యమునఁ గనఁబడినవారితో నెల్ల "మహాత్ముఁడొకఁడు వచ్చియున్నాఁడు. ఆతఁడు సమస్తవిద్యాపారంగతుఁ"డని చాటించిరి. స్వామివార్త పట్టణమెల్ల వ్యాపించెను. జనులు గుంపులుగూడి వచ్చి, స్వామినిదర్శించి, వానివాక్యములకై యెదురుచూచుచుండిరి. వారికందఱకు స్వామి, విద్యాపతి, చండిదాస్, రామప్రసాదు మున్నగు యోగిపుంగవుల జీవితములను వర్ణించియు, వేదవేదాంత

శ్లోకములకర్థము చెప్పియు, పురాణములు, బైబిలుసూత్రములుందో్బధించియు, బుద్ధ, శంకర, రామానుజ, గురునానక్, చైతన్య, తులసీదాసు, కబీరు, రామకృష్ణుఁడు మున్నగు భక్తాగ్రేసరుల పరమాదర్శములఁ బ్రదర్శించియు, నత్యద్భుతముగాఁ బ్రసంగించి, శ్రోతలనానందవార్ధిలోఁ దేల్చెను.

స్వామిజీప్రభావ మాల్వారునగరము మూలమూలల వ్యాపించెను. ఎచ్చటశబ్దము లేచినను స్వామికీర్తనమే. తుట్టతుదకు స్వామిజీ బస ఆల్వారురాజ్యములో నిదివఱకు యింజనీరుగానున్న పండిత శంభునాథజీ యింటికి మార్చఁబడెను. అన్నివేళలఁ బ్రజలు స్వామిని వినుటకు వేచియుందురు. ఆతఁడు పక్షపాతములేక, సమానగౌరవముతో నందఱితోఁ బ్రసంగించి, ప్రేమపూర్వకముగా నాదరించువాఁడు. ఒకఁడు, "స్వామిజీ! నీవు కాషాయవస్త్రమేలధరించితి"వన, ఏలన నిది భిక్షుకులవస్త్రముగావున! నేను శుభ్రవస్త్రములు ధరించునెడ నన్ను బిచ్చగాండ్రు యాచించినయెడల, నేనును భిక్షుకుఁడనగుట వారికేమియు నీయఁజాలను. నాయశక్తి నాకుఁ గన్నీళ్లుదెచ్చును. అందుచే నేనును భైక్షుకరూపమును ధరించునెడ భిక్షుకులెవరును నన్ను యాచింప"రని స్వామి బదులుచెప్పి వారలనందఱను కడుపుబ్బ నవ్వించును.

స్వామికిఁగల మిత్రులందఱిలో మాల్వీసాహేబు ముఖ్యుఁడు. ఆతఁడు, స్వామికొకనాఁడైన, దనయింట నాతిథ్యమీయ నువ్విళ్లూరుచుండెను. స్వామికెట్టి యభ్యంతరముండదని యాతఁడెఱిఁగియు, శంభునాథజీ యంగీకరింపఁడని భయముంది, యొకనాఁడు వారిరువురసమక్షమున కరిగి, ముకుళితకరకమలుఁడై, "అయ్యా! రేపు, బాబాజీని మాయింట నతిథిగా నంగీకరింపుఁడు. బ్రాహ్మణులచేతనే వండించి, బ్రాహ్మణులచేతనే వడ్డింపఁజేసెదను స్వామిజీ

భుజించుచుండఁగా మాత్రి మాతని నొక్కసారి దర్శించి, తృప్తినందెద"నని సవినయముగాఁ బ్రార్థించెను. శంకరనాథజీ నవ్వి, "స్వామిజీ ముక్తసంగుఁడు. నీవిట్టియేర్పాటు చేసిన నిబ్బంది లే"దని వచించెను. మాల్వీసాహేబు స్వామిజీ కాతిథ్యమొసఁగి, తానుకృతార్థతనందినట్లు సంతసించెను.

ఆళ్వారుదివానగు మేజరు రామచంద్రాజీ స్వామినిఁగూర్చి విని, పాశ్చాత్యవ్యామోహముచేఁ బీడితుఁడగుచున్న రాజును మార్పఁగలశక్తి స్వామికిఁ గలదని గ్రహించి, రాజును రప్పించి, యిరువురును స్వామిని దర్శించిరి. మొదట రాజు, "స్వామిజీమహారాజ్! నీవు గొప్పపండితుఁడవని వినియుంటిని. నీ వుద్యోగపదవిని స్వీకరించు నెడ వలయునంత ధనమార్జింపఁగలవు. ఏల నీచభైక్షుకవృత్తిం జీవించెద"వని ప్రశ్నించెను. వెంటనే, "మహారాజా! ఏల నీవు నిత్యము పాశ్చాత్యసంఘముతోఁ గాలము పుచ్చి, వేటతోడనే తృప్తినంది, రాజధర్మమును విసర్జించుచుంటివో చెప్పు"మని స్వామి యెదుట ప్రశ్న వేసెను. సభ్యులు స్వామిజీ ధైర్యమునుగాంచి, రాజాతనిశిక్షించునని తలఁచిరి. కాని రాజు మౌనముగనే యూరకుండి, "ఎందుచేతనో నేను చెప్పఁజాలను. కాని యది నాకిష్టమే!" యని బదులు చెప్పెను. "అయినచో నేననుసరించుమార్గమును నాకిష్టమగుట చేతనేయని యెఱుంగు"మని స్వామి శీఘ్రముగ వచించెను

రా జడిగిన రెండవప్రశ్న, "బాబుజీ మహారాజ్! విగ్రహారాధనలో నాకు నమ్మకము లేదు. నాగతి యేమగు"ననెను మందస్మితాననుఁడై స్వామి, "నాతో నీవు హేళనచేయుచుంటివా?" యని పలుక, "కాదు స్వామిజీ! నిక్కముగా నేను ఱాయి, అప్ప, వీటినర్చింపఁజాలను. నాజన్మాంతరమున నిందుచే నేమైన లోటువచ్చునా?" యని మఱల రాజుతర్కించెను. అంత స్వామి, "ఎవరియిష్టము వారి"

దని గూఢభావముతో వచించెను. సభ్యులు నిర్విణ్ణులై స్వామిజీ విగ్రహారాధనము నేల సమర్థింపఁడని సంశయించుచుండిరి. వారి సంశయము దీర్ప, రాజుఛాయాపటము నొకదాసినిఁ దెప్పించి, స్వామి దివానును బిలఁచి, "దీనిమీఁద నుమియుము. ఎవరైననరే!" యని స్వామిపల్కెను. దివానునోట మాటవెడలలేదు. అతని హృదయము కంపించెను. దివానుదృష్టి రాజుముఖముమీఁదను, రాజు దృష్టి దివానుముఖముమీఁదను బడెను. ఏమిచేయుటయని దివాను తలక్రిందగుచుండెను "ఏమి? స్వామిజీ! నన్నేమిచేయుమనుచుంటి" వని యాతఁడు తీండ్రించెను. "ఇది మహారాజు పటము, దానిమీఁద నే నెట్లుమియఁగల"ననెను. "అట్లుఁగాక; మహారాజు శరీరముగాని, మాంసముగాని, రక్తముగాని, యెముకలుగాని, యీపటమందు లేవు గదా! ఈపటము రాజువలె మాటాడుటగాని, నడచుటగాని, లేదు. అట్లయినను మీరందఱు దీనిమీఁద నుమియుట మీరాజు నగౌరవపరచుటయని మీకుఁ దట్టిన"దని స్వామిజీ విషయము విశదముచేయుసరికి, దివానుమున్నగువారు, దీర్ఘనిశ్వాసముల నిగిడ్చి, యూరకుండఁగా, స్వామిజీ రాజువైపుతిరిగి, "మహారాజా! చూచితివా? ఈపటము నీవు కాకపోయినను, నీవే అయితివి. కావుననే నీసేవకులు దీనిమీఁద నుమియజంకిరి. ఈపటమును జూచుసరికి, వారిహృదయములో నీ విగ్రహము ప్రత్యక్షమయినది. పటము నొక్కసారి తిలకింప, నీ వందు దూరియున్నట్లు వారికిఁ గన్పట్టినావు. అందుచే వారు నిన్నెంతగౌరవముగాఁ జూచెదరో, పటమును నంతగౌరవముగాఁ జూడవలసివచ్చెను. ఱాళ్ళను, కఱ్ఱలను, విగ్రహములను, పూజించువారివిధ మిట్టిదే సుమీ! ఱాతివిగ్రహమునుగాని, కఱ్ఱబొమ్మనుగాని, చూచినంతనే, వారి వారి యిష్టదైవతములు వారిహృదయములకుఁ దట్టియఖండానందము నొడఁగూర్చును. అనేక స్థలములలో నేఁ దిరిగి

తినిగాని, "ఓ ఆయీ! ఓ లోహానూ!, ఓ కర్రా! నిన్ను నేఁ బూజించెదను. నాయభీష్ట మి"మ్మని ప్రార్థించినయొక్కవ్యక్తినైన నే నెన్నడు చూచియుండలేదు. ప్రతివిగ్రహారాధకుఁడు, విగ్రహరూపమునఁ, బరమేశ్వరు నుద్దేశించి ధ్యానించుచున్నాఁడు. ఎవ రెట్లర్చించిన నాపరమేశ్వరుఁడు వారికట్లే దర్శనమిచ్చును. ఐన నిది నాయభిప్రాయము. నీదికాకపోవచ్చు"నని రాజును బోధనాపూర్వకముగాఁ జీవాట్లుపెట్టెను. రాజామంగళసింగు హస్తములుజోడించి, "స్వామిజీ! నీవుచెప్పినవిధానము నాకు నచ్చినది. ఇఁక విగ్రహారాధన నాకిష్టమే" యని వచించి, స్వామిజీ! నన్ను దయతోఁ జూడుమని ప్రార్థింప, "సర్వేశ్వరుఁ డొక్కఁడే కారుణ్యపయోధి. ఆతనినే ప్రార్థింపుము. నీయం దనురాగ మాతఁడే చూపఁగలఁ"డని స్వామి వచించి, సభనుండిలేచి వెడలిపోయెను. రాజాతని నుండుమని బలవంతముచేసిన నుండుట కంగీకరించలేదు. అంతరాజు దివాన్జీతో, "నీయింటనుండ స్వామిని బ్రతిమాలు"మని వచించెను. రాజుకోర్కెతీర్ప, దివాను తనయింట మఱికొన్నివాళ్లుండుమని స్వామిని బ్రతిమాలెను. తన దర్శనమునకువచ్చు ధనికులను, నిరుపేదలను సమానస్వాగతముతో నంగీకరించు నెడలఁ దానుందుననెను. దివా నందుల కంగీకరించెను. ఈసమయమం దనేకులు స్వామిని దర్శించి, దర్శనమాత్రముచే జీవితముల మార్చుకొన్నవా రనేకులు గలరు.

ఆవచ్చినవారిలో నొకముదుసలి, స్వామిని దినదినము దర్శించి, మోక్షమార్గము బోధింపుమని యడిగియు, స్వామి యేమార్గమును సూచించినను, మెచ్చకుండ మఱియొకమార్గము బోధింపుమనియు నడుగుచుండువాఁడు. ఒకనాఁ డాముదుసలివచ్చి మాటాడ సరికి, స్వామి మౌనమును వహించి, యితరులకుఁగూడ నుత్తరమీయక యూరకుండెను. ఆవృద్ధుఁడనేకప్రశ్నలను గురిపించెను. కొన్నిగంటలుగడచెను.

స్వామి మాటాడ లేదు. విసిఁగి వేసారి, యావృద్ధుఁడు స్వామిని తిట్టి విడలి పోవుచుండఁగా స్వామి పక్కున నవ్వి యూరకుండెను. ఒక బాలుఁ డంత, "స్వామిజీ! ముదుసలి నల్లేల యవమానించి"రని ప్రశ్నించెను. అందుల కమందానందవిలసితవదనారవిందుఁడై "పుత్రులారా! మీ కొఱకు నా ప్రాణములనైన నాహుతిచేయ సిద్ధుఁడనై యున్నానని తెలి యుఁడు. నేను ప్రదర్శించు మార్గమును చేపట్టి వర్తింపుఁడు. మీకు శక్తి లేకపోలేదు. ఈముసలి తనజీవితమునంతను, తుచ్ఛవిషయభోగ ములకై వెచ్చించి, ఇప్పుడు భోగానుభవశక్తిగాని, జ్ఞానార్జనశక్తిగాని, లేమి, భగవద్దర్శనమడిగినంతమాత్రమున లభింపవలయునని కోరుచు న్నాఁడు. వలయునది పురుషకారమని యెఱుంగుఁడు. పురుషకారహీ నునిమీఁద పరమేశ్వరకటాక్షము ప్రసరించదు. పురుషకారహీనుఁడు తమోంధీభూతుఁడు. మానవత్వాధారభూతమైన పురుషకార్యమును వ్యర్థము చేయఁజూచిన యర్జునునకు, శ్రీకృష్ణుఁడు గీతావాక్యములుపదే శించి, యాత్మపారిశుద్ధ్యముచేతఁ, గర్మఫలానపేక్షత చేత, భగవదర్పిత కార్యాచరణచేత, స్వధర్మాచరణమునకుఁ బురికొల్పినాఁడు. కాఁబట్టి యువకులారా! బలము నార్జించుఁడు. క్రూరాగ్రేసరుఁడైనను బలో పేతుని నేను పూజించెదను. ఏలన వాఁడును తనక్రౌర్యమును విడ నాడి, స్వపరతంత్రతఁ బారద్రోలి, యథార్థజ్ఞానము నార్జించు దినము వచ్చి తీరు"నని స్వామి బోధించెను.

స్వామియొక్క గంభీరబోధనల విని, ఆళ్వారుయువకులు చాల మంది సంస్కృతము నభ్యసింప నారంభించిరి.

18 మార్చి 1891 వత్సరమున, పరివ్రాజక వినాదాహూతుఁడై యొకనాఁడు స్వామి బయలుదేరి వెడలిపోయెను.

---

## ముప్పదియయిదవ అధ్యాయము.

### ఖేత్రిమహారాజు, ఘూర్జరము, బొంబాయిరాజధాని.

స్వామి ఆళ్వారునగరమునుండి బయలుదేరి పాండుపోలుమీఁదుగా జయపురమున కరిగి, యచట మిత్రునిచేఁ బరివ్రాజకఛాయాపటము తీయఁబడి రెండువారములుండెను. స్వామి అఖండానందుఁడచట నాతనికలసికొని, స్వామికాగ్రహము కల్గించెను. అఖండానందుని రహస్యముగాఁబిలఁచి, మఱలఁ గన్పట్టినచో మరణప్రాప్తియగునని బెదరించెను. అఖండానందుఁడు తననాయకుని కాగ్రహకారణము ప్రేమహీనతకాదనియు నందు మహోద్దేశము లేకపోలేదనియు గ్రహించి వెడలిపోయెను.

అచట స్వామి యొకవ్యాకరణజ్ఞునియొద్ద పాణిని వ్రాసిన అష్టాధ్యాయి చదువనారంభించెను. మొదటిసూత్రమే పండితుఁడు మూఁడు దినములు ప్రయత్నించి బోధించలేక, "స్వామిజీ! స్వామిజీ! నీకు నేను బోధింపఁజాల"నని వచించెను. అందులకుస్వామి అభిమానగ్రస్తుఁడై, సూత్రమునైనె నేర్చితీరవలయునని నిశ్చయించికొని,బుద్ధి కేంద్రీకరించి మూఁడుగంటలలోనే స్వయముగాఁ దెలిసికొని, పండితునికిఁ దెల్పెను. పండితుఁ డాశ్చర్యభరితుఁడయ్యెను. ఈవిషయమే వివేకానందుఁడు "సర్వము దృఢనిశ్చయముతోఁగూడియున్నది. మానస మొకదానిమీఁదఁ గేంద్రీకృతమైనచో నదితెలిసి తీరు"నని బోధించియున్నాఁడు.

జయపురమునుండి, స్వామి 'ఆబు' పర్వతముమీఁది కరిగి యచట ఖేత్రిమహారాజురహస్యకార్యదర్శిచే మహారాజునొద్దకుఁ గొంపోఁబడెను. మహారాజాతని కుచితాసనమిడి, "జీవిత మననేమి" యని ప్రశ్నించెను. "అయ్యా! అణచివేయుచున్న పరిస్థితులలోఁ బరిణామముచే వృద్ధిబొందఁజూచు నొకవ్యక్తియొక్క అభ్యాసమార్గ"మని

స్వామి వచింప, స్వామివాక్య మర్థగర్భితమై యుంటఁగాంచి, రాజు మఱల "స్వామిజీ! విద్యయన నే"మని యడిగెను. "విద్య యనఁగా మానసముచేఁ గల్పితములయిన కొన్ని యభిప్రాయముల కూర్పు. అభిప్రాయము లపరిమితాభ్యాసముచే, నత్యంతపరిచితము లగుసందాఁక విద్యాభ్యాసము వ్యర్థ"మని స్వామి బదులిడెను. మఱియు స్వామి తన గురువగు శ్రీరామకృష్ణుఁడభ్యసించిన యథార్థవిద్యనుగూర్చి రాజునకు బోధించి, కామినీకాంచన జయమే సమస్తవిద్యామూలమని వర్ణించి, రాజును తన యమృతమయ వాక్కులచే మూర్ఛిలంజేసెను.

రాజు, స్వామిఁదోడ్కొని ఖేత్రిఁ జేరెను "స్వామిజీ! యథార్థ మన నే"మని యడిగెను. "మహారాజా! యథార్థమేకము, సర్వావృతమయినది. మానవుఁడా యథార్థమును, క్రమాంతమువులచే నభిలాషించుచున్నాఁడు యథార్థేతరమెద్దియు లే"దని విపులబోధచేయ, స్వామి పాదములకు సాఁగిలఁబడి జ్ఞానోపదేశమును తనకుఁజేయుమని రాజు దీనముగా వేడెను. స్వామి యాతనికి బ్రహ్మజ్ఞానబోధచేసెను. ఖేత్రీశ్వరుకు విలసిన వాత్సల్య మపరిమితము. అమెరికాలో నున్నపుఁడైన, స్వామి తన కార్యక్రమమునుగూర్చి వ్రాసిన లేఖలు, వారి పరస్పరప్రేమాతిశయముల వేనోళ్ళఁ జాటుచున్నవి.

స్వామి యచట పండితనారాయణదాస్ యొద్ద, పతంజలి మహాభాష్యమును చదువనారంభించెను. ప్రథమదినాంతముననే, పండితుఁడు, "స్వామిజీ! నీబోఁటిశిష్యులు లభించుట బహుకష్ట"మని వచించెను. పండితునికిఁ దట్టని ప్రశ్నలు స్వామి బయల్పఱచి, వానికిఁ దానే బదులు చెప్పుటఁ జూచి, పండితుఁడు, "ఇఁక నీకు బోధింపవలయున దెద్దియు లేదు. నాకుఁ దెలిసిన దంతయు నీకును దెలిసియే యున్న"దని వచించెను.

ఒకనాఁడు స్వామి భవనమందుఁ గూరుచుండి, యొకగ్రంథములోని పుటలు తిరుగవేయుచుండ, రాజుచూచి, "స్వామిజీ! అంతవడిగా నీవెట్లు చదువఁగల"వని ప్రశ్నించెను. "మహారాజా; బాలుఁడక్షరాభ్యాసకాలమం దొక్కొక్కమాటను నేర్చును. ఇంకను చదివిన వెనుక వాక్యమును చదువును. ఆవెనుకఁ జదువుచునే యర్థము గ్రహించును. ఇట్లే, యభ్యాసముచేఁ బుటలే చదువుటలోఁ గష్టములే"దని స్వామి వచించెను.

మహారాజునకు స్వామియందు గలభక్తి వర్ణనాతీతము. అర్ధరాత్రమున లేచి, యాతఁడు స్వామిపాదము లొత్తును.

మహారాజు పుత్రోదయాభావముచేఁ దనకొక పుత్రునొసంగు వరము ప్రసాదింపుమని స్వామిని వేడెను. స్వామియు నట్లే యని యాశీర్వదించెను. స్వామి యీవిధముగా మహారాజువలె మహారాజుభవనములోనే జీవించెనా? ప్రతిదినమాతఁడు దరిద్రనారాయణుల యిండ్లకరిగి, వారికి జ్ఞానము బోధించువాఁడు. మహారాజు నెంతగౌరవభావముతోఁ జూచునో, దరిద్రుల నంతగౌరవముతో నాదరించి, సర్వైక్యసూత్రమును సంతరించువాఁడు.

స్వామి ఖేత్రిమహారాజును వీడ్కొని, అజ్మీరు, అహమ్మదాబాదులమీఁదుగా వధ్వాను జేరి యచటఁ, బరపురుషస్పర్శ సహింపఁజాలక, ఆత్మహత్యనల్పి, వీరస్వర్గము నలంకరించిన, రాణిల్ దేవ్యాలయము దర్శించి, లింబ్దినగరమును జేరెను. అచట నొకసన్యాసుల యాశ్రమములో బసచేసెను. అందలి సాధువులు నీచదేవతారాధకులు. వారు, తుచ్ఛసిద్ధులకై, వచింపరాని రాక్షసకృత్యములు సల్పుదురు. ఆసంగతి గ్రహించి, స్వామి యచటనుండి వెడలనుంకింప, నాతని నచట బంధించి, బ్రహ్మచర్యమును విడిచి, స్త్రీసంగము చేయ నిర్బంధించిరి. శరీరము తునకతునకలుగ ఖండింపఁబడినను, కానట్టిమార్గ్య

మున కొడంబడరాదని నిశ్చయించుకొని స్వామి, యవతరణమార్గ మ న్వేషించుచుండెను.

మానస మొకనియమముమీఁదఁ గేంద్రీకృతమగుచో విఘ్న మెట్లు వాటిల్లును? మహాత్ములకు మోహాముండునే? ఒకబాలుఁడు దినదినమువచ్చి స్వామిని దర్శించువాఁడు. అతఁ డానాఁడా సమయము నకు వచ్చినంతనే, స్వామిరహస్యముగా నొకకుండపెంకుమీఁద, రక్షిం పు మని వ్రాసి రాజునకిమ్మనిపంపెను. వెంటనే రాజసైన్యము వచ్చి స్వామిని రక్షించెను. స్వామి విశుద్ధాగ్నిజ్వాల. అట్టి జ్వాలకే పరమే శ్వరకటాక్షము నతిసులభముగాఁ జూరఁగొనును.

స్వామి యటనుండి బయల్వెడలి, జునాగడమునకరిగి, యచట దివాను మేనేజరగు సి. హెచ్. పాండ్యాగారిచే గౌరవింపఁబడి, యీ విధముగా వర్ణింపఁబడెను. "స్వామియొక్క నిరాడంబరజీవనము, వివిధ కళాపాండితి, విశాలాదర్శభావము, వక్తృతాపాటవము, సత్కృష్టమతాభివేశము, జగన్మోహనరూపము లివన్నియు మమ్ము వివశ హృదయులఁ జేసెను. ఆతనిగాత్రగానము, వచనశక్తియునద్భుతములు.

స్వామి సర్వసంగపరిత్యాగియై యుండి, యేల మాటిమాటి కాతఁడు, మహారాజుల నాశ్రయించెనని తర్కింపవచ్చును. స్వామి కొక్కటేమతము. దుర్భరదారిద్ర్యముచే, నక్షరజ్ఞానశూన్యత్వముచే, నున్నతజాతిపదతాడనములచే, మానవత్వముఁ గోల్పోయి, దిక్కు లేక విలపించుచున్న దేశసోదరకోటి నుద్ధరించుటే. రాజులు, మహా రాజులు, ననేకలక్షలజనములమీఁద నాధిపత్యము గల్గియుంటచే, వారిహృదయమున ధర్మకాంక్ష, దైవభీతిఁ బుట్టింపఁబడినచో, వారు, హృదయములు మారి, తమ యైశ్వర్యముల, శక్తుల, నాధిపత్యముల, దీనజనోద్ధరణమందు వినియోగించుచో, లక్షలకొలఁది ప్రాణికోటి

రక్షింపఁబడుననునుద్దేశముతో స్వామి, రాజభవనములఁ దిరుగాడెను. మఱియు నాతఁడు నేఁడు మహారాజవాహనముతో నపరరాజన్యుల వలె విహరించిన మఱునటిక్షణముననే యాతఁడు, దరిద్రులగుడిసెలలో మహోల్లాసముతో బోధించుచుఁ గన్పట్టును.

స్వామి యచటనుండి బయలుదేరి, భూజనగరమున కరిగి, దివాను, రాజులకు మతాభినివేశము, కల్గించి, పోరుబందరు జేరెను. అచ్చట యాత్రకై, ధనసహాయము కోరివచ్చిన స్వామి త్రిగుణాతీతు నికి, ధనముకొఱకు సన్యాసులు ప్రవృత్తిమార్గము పట్టుట తగదని బోధించి, మఱెన్న డట్టిలోభిత్వము ప్రదర్శింపవలదని దూషించి, కొంతధన మాతని కొసఁగి పంపివేసెను.

ఒకనాఁడు మహారాజుతో స్వామి ప్రసంగించుచు, "మహా రాజా! నేను వ్యాప్తిచేయునగు సందేశమొకటిగలదు. దాని నెల్లె చ్చట ప్రారంభింపఁగలనో గోచరించుటలే"దని వచించెను. స్వామి హృదయము, హిందూధర్మసముద్ధరణాశయములతో నిబిడీకృతమై యుండెను. భారతదేశమున నాసమయమునఁ బ్రజానాయకులపేరట చేయుచున్న తీవ్రతమపాశ్చాత్యవేషదాస్యమును, సనాతనధర్మాధి కారులమని ధర్మమును, తగులఁబెట్టి, ధనలుబ్ధులై జీవించుచున్న ప్రాచీ నాచారపరాయణుల మాంద్యమును ఖండించి, లోకకళ్యాణనిర్మాణ బీజంబులు భారతభూమిఁ బుట్టియున్నవని, తనసోదరు లెఱుంగమికి, విచారించి, స్వామి, స్వదేశమోక్షసాధనములోఁ జానె ట్లుపకరింతు నాయని పరితపింప నారంభించెను.

ఇట్టి హృదయభారముతో స్వామి, శ్రీకృష్ణనిలయమగుద్వార కానగరమును జేరి, శంకరమఠమును దర్శించి, సనాతన భారతభాగ్య దశను గుర్తించి, కన్నీళ్ళు విడిచి, ఖాండ్వామీదుఁగా బరోడా కరిగి, యచట దివానుచేఁ బూజితుఁడై, వేదవేదాంతములఁ గూర్చి దీర్ఘ

బోధసల్పి, రామేశ్వరయాత్రయందే దృష్టినిడి ముందున కరుగఁ బయనమయ్యెను.

స్వామి తనయాత్రలలో నిరంతరముఁ గాంచినదేమి? పాడుపడిన దేవాలయములు, విస్మరింపఁబడిన మఠరాజములు, కాలగర్భగతములైన రాజభవనములు, తురుష్కాసిఘాతములచేఁ దుత్తునియలైన భారతశిల్పికల్పితదివ్యగోపురములు, దుర్జనదూషిత పవిత్రప్రదేశంబులు, ధర్మబాహ్యులై, జీవశక్తి విహీనులై, విషయభోగలంపటులై, తుచ్ఛపాశ్చాత్యనాగరికతావ్యామోహపీడితులై, యచేతనరూపులై, యజ్ఞానాంధీభూతులై, స్వయంవ్యక్తిత్వరహితులై శవాకృతిఁదాల్చిన భారత సోదరసోదరీబృందములను, స్వామి యెక్కడ కరిగిన, పరికించినది. ఆతనిదృష్టిలో సనాతన భారతదేశసౌందర్యము విజ్ఞానము, కళౌన్నత్యము, సాహసము, నౌదార్యము, ధర్మదీక్ష, యివన్నియుఁ గాంతిహీనములై, నిశ్చేష్టదగ్ధరూపంబులై కన్పట్టెను.

అట్లుగా నీరసించిన భారతీయుల సనాతన ధర్మసందేశముచే, స్వయంవ్యక్తిత్వ స్వయంప్రజ్ఞాప్రకాశములందలి, యఖండాత్మవిశ్వాసముచే, నాత్మశక్త్యభినివేశముచే, జాతీయాదర్శప్రకటనచే, చైతన్యయుక్తులంజేసి, స్వకీయపదతలబలాధిక్యంబుచే, లోకము నుద్ధరించు మహావీరుల నొనర్చుటే నిరంతరము, నిరాఘాటముగా, స్వామిహృదయమునఁ గొట్టుకొనుచున్న దివ్యవాంఛ. కాని, స్వామి యొకసన్న్యాసి. చేత నొకగవ్వయైనలేదు. నిజోదరపోషణమైన భైక్షుకవృత్తి లేనిదే గడువదు. ఆతనిమాట వినువాఁడెవఁడు? ఏకాకియై, ధనహీనుఁడై, యధికారశూన్యుఁడై, స్వామి చేయఁగల కార్యమెద్ది? ఈయాలోచనలతో స్వామిహృదయమున, భయతరంగము లువ్వెత్తుగ బయల్వెడలఁజొచ్చెను. కాని, శ్రీరామకృష్ణుఁడు తన్నుఁగూర్చి యేమి వచించియుండెను? "నేనొక ఫకీరునై, నాయనంతశక్తి ప్రభావములు

నీకర్పించితిని. వానిచే నీవు లోకము నుద్ధరింపఁగలవ”ని వచించి యుం డలేదా? ఈమాటదలఁచి స్వామి, మఱల ధైర్యము తెచ్చుకొని, “యావద్భారతదేశములో నైదువందలమంది, నానందేశము నర్థము చేసికొనఁగల్గువారలు లభించునెడ, దేశమును నేను ఘూర్ణిల్లఁజేయఁ గలన”ని వచించెను.

1892 జూలై, ఆఖరువారమున, స్వామి బొంబాయినగరము జేరి, యచటఁ గొన్నినాళ్ళుండి, పూనానగరమున బాలగంగాధర తిలక్ మహాశయునింట నతిథిగానుండి, యాతనితో వేదములఁగూర్చి చర్చించి, తృప్తినంది, యటనుండి, బెల్గాముచేరెను. అచట హరిపాద మిత్రునింట నతిథిగానుండి, వేదాంతప్రకృతిశాస్త్రములఁగూర్చి యుపన్యసించి, తాను చెప్పినదానిని వ్యతిరేకించు మూర్ఖులకు నీకథను చెప్పెను; “ఒకరాజు శత్రులు తనమీఁద దండెత్తి వచ్చుచున్నారని తెలిసి, సభచేసి, చేయవలయు మార్గములఁగూర్చి చర్చించెను. ఇంజ నీర్లందఱు కోటచుట్టు నొకగోడ కట్టవలయుననియు, వడ్రంగులు కఱ్ఱ లతో నాగోడఁ గట్టబడవలయుననియు, నదికాదు తోలుతో నగర ముచుట్టు నొక గుడారముకట్టిన మంచిదని మాదిగవాండ్రును, యిను పగోడయే శరణ్యమని కంసాలివారును, కాదు శత్రువులకడ కరిగి, న్యాయశాస్త్రప్రకటనము చేయవలయునని న్యాయవాదులును, మొట్టమొదట దైవమును తృప్తిచేయవలెనని యర్చకులును,నీవిధము గాఁ దర్కించుచుఁ గూరుచుండ, నరివర్గము నగరమును చుట్టుముట్టి, రాజును బంధించిర”ని స్వామి చమత్కృతితో వచించి, మూర్ఖవాద ముల ఫలమిట్లే యుండుననియుఁ, గార్యరంగమునఁ దిగి, కర్మ శూరత్వమును ప్రకటించు నవ్వారలే, పురుషవరేణ్యులనియు బోధిం చును.

తాను ధనము ముట్టనని తీవ్రనియమబద్ధుండై యుంటచే, నాతని కధిక మీయవలయునని ప్రయత్నించి, కొల్హాపురపురాణి రెండు కాషాయవసనములను, హరిపాదమిత్రుండు పాదరక్షలను స్వామిచే నంగీకరింపఁజేసిరి.

అచట, నిర్బంధముచే స్వామి హరిపాదమిత్రుని, భార్యను, శిష్యులగాఁ గ్రహించి, బ్రహ్మోపదేశమొనర్చి, మిత్రులనందఱ వీడ్కొని, రామేశ్వరమునకై బయల్వెడలెను.

---

## ముప్పదియాఱవ అధ్యాయము.

### కన్యాకుమారియొద్ద స్వామిధ్యానము.

స్వామి బెల్గాముపట్టణమువీడి, బెంగుళూరునకరిగి, యచట మైసూరురాజాదివానగు, సర్, శేషాద్రిఅయ్యరుచేగౌరవింపబడెను. సర్. శేషాద్రిఅయ్యర్ స్వామినిగూర్చి యిట్లు చెప్పియున్నాఁడు; "మాలోఁ జాలమందిమతమునుగూర్చి చదివియుంటిమి. కాని మాయెఱుక యెంత? నే నెఱిగినంతవఱకు నీబాలస్వామిని మించినవాని నెన్నఁడు చూడలేను. ఈతఁడాజన్మబ్రహ్మజ్ఞానియై యుండనోపు. లేకున్నచో నింత లేఁబ్రాయమున నెట్లతఁడు సమస్తవేదవేదాంతములు పరిపూర్ణముగా నెఱింగియుండ గలఁడు?"

ఈ బాలాచార్యునిప్రతిభ మైసూరురాజగు, చామరాజేంద్రవుడయర్‌నుగూడ నాకర్షించెను. మహారాజుకు స్వామికిఁ గుదిరిన ప్రేమబంధ మత్యద్భుతము ఒకనాఁడు మహారాజు నాయుద్యోగులఁ గూర్చి యేమితలఁచెదరని యడుగ, "మహారాజా! నీహృదయము ప్రేమపూరితమైనదని నే నెఱుంగుదును. కాని యుద్యోగు లుద్యోగులే

కదా!" యని స్వామి తన హృదయమునకుఁ దట్టిన సత్యమును నిర్భయముగా బ్రకటించెను. సభ్యులందఱాశ్చర్యనుగ్నులైరి. దర్బారు ముగిసిన వెనుక, రాజు స్వామిని తన రహస్యమందిరమునకుఁ దోడ్కొనిపోయి, "స్వామిజీ! సమయానుకూలత విడిచి, నీ వున్నదున్నట్లు పల్కుచో నీప్రాణములకు భంగముకూడఁ గలుగవచ్చును. విషముప్రయోగించి, నిన్నుద్యోగులు చంపవచ్చు"నని పల్కెను. కోపోద్రిక్తుఁడై, స్వామి "ఏమి? ప్రాణభంగభీతిచే నిక్కమగు సన్యాసి సత్యమాడనోపునే? మహారాజా! చెపు, నీపుత్రుఁడే 'నాతండ్రి యెట్టివాఁడని' ప్రశ్నించునెడ, నీకు లేనిగుణములను కల్పించి చెప్పెదననుకొనుచుంటివా? అనృతము నాకేటియవసరము? కీర్తించు టుద్యోగులపని, సత్యప్రకటనే సన్యాసులవిధి" యని యఖండసాహస ముట్టిపడ, రాజుకు ప్రత్యుత్తర మొసఁగెను. ఒకరోజున రాజు పండితసభ చేసి, స్వామినిఁ బిల్చి, వేదాంతమును గూర్చి యుపన్యసింపుమని పల్కెను. స్వామి, వేదాంతకేసరివలె లేచి, సభామధ్యంబున నిలఁబడి వేదాంతమును వివిధ భాగములుగా విమర్శించి చెప్పి, సూత్రములు కంఠస్థములొనర్చుట వేదాంతముకాదనియు, జీవితమును భగవన్మయము సల్పవలెననియుఁ, దన యపారవక్తృతాపాటవము నెఱుకపఱచి, యుపన్యసింప, సభ్యులాతనిని వేనోళ్ల గీర్తించిరి. స్వామిజ్ఞానమునకుఁ బ్రధానమంత్రి ప్రహృష్టాంతరంగుఁడై, తన కార్యదర్శినిఁ బిలచి, బజారుకు స్వామిని దోడ్కొనిపోయి, స్వామికివలయునదెంత విలువైనవస్తువునైనఁ గొని యిమ్మని యాజ్ఞాపించెను. స్వామి బజారుకరిగి, వస్తువులనన్నిటిని పరికించి "నాకొకమంచిసిగర్" కావలెనని కోరెను. కార్యదర్శి, నిర్విణ్ణుఁడై, స్వామికోర్కెఁదీర్చి, యాశ్చర్యముతో బ్రధానమంత్రికిఁ దెల్పెను. సన్యాసి, సత్యవ్రతుఁడైన నేమికావలయునని తలఁచి యూరకుండెను.

వేఱొకసారి రాజు స్వామినిఁబిలఁచి, "స్వామిజీ! నీకొఱకు నేనేమి చేయఁగల"నని వచించెను. స్వామి, తన వేదాంతసందేశము పాశ్చాత్యఖండములో వ్యాప్తిగాంచవలయుననియు, నట్లు చేయుభారము తనమీఁదనే యున్నదనియు మహోద్రేకముగా నుపన్యసింప, రాజు విస్మితుఁడై, "స్వామిజీ! నీకు విదేశప్రయాణములకు వలయు ధనము నేనొసంగెద"నని వచించెను. కాని, స్వామి, రామేశ్వరయాత్ర చేయఁ బ్రతిజ్ఞచేసి యుంటచే దానికంగీకరింపలేదు.

ఒకనాఁడు రాజు, "నిన్నుమఱువకుండ, నీమాటలను కొన్ని ఫోనోగ్రాఫులో నిమ్మని" యడిగెను. స్వామి యందులకంగీకరించి, కొన్ని యావేశపూరితములగు వాక్యములిచ్చియుండెను. అవి రాజుభవనములో నిప్పటికి గలవు.

స్వామి, కొచ్చిన్‌దేశముమీఁదుగా రామేశ్వరము చేరుకొనెను. రామేశ్వరమునకు దక్షిణకాశియని పేరు. తాను చాలకాలమునుండి కోరినయాత్ర సిద్ధించెనని స్వామి సంతసించెను కాని స్వామికి సంతసముగూర్చిన దాలయముకాదు, తీర్థపవిత్రత కాదు సముద్రతరంగసౌందర్యముకాదు. రామాయణ ధర్మప్రీతియుగాదు ఆశేతుశీతనగపర్యంతము, తాను సన్యాసియై యాత్రచేయు జన్మము లభించినదికదా యని యాతని సంతసము. యావద్భారతదేశ మహోన్నతాశయప్రపంచ మాతనిహృదయమున నిమిడి యాతని కఖండానందమొసఁగూర్చెను. స్వామి యిప్పుడు వంగదేశీయుఁడు కాఁడు ఆతఁడిప్పుడు పరిపూర్ణభారతీయుఁడయ్యెను.

తన యాత్రాప్రతిజ్ఞాపరిపాలనము పూర్తిచెందినందులకు, స్వామి భక్తిప్రపూర్ణుఁడై, ఆలయమునొద్ద పరమేశ్వరునకు సాష్టాంగప్రణామమొనర్చి, స్వకీయగురునామస్మరణము సల్పి, శ్రీరాముని, కాశీనాథ, నేకరూపులుగాఁదలంచి, ధ్యానపారవశ్యమునఁ బులకిత

గాత్రుఁడై, యచటనుండి బయలుదేరి, కన్యాకుమార్యగ్రమునకుఁ గాలినడకను బిచ్చమెత్తుకొనుచు నేగెను. కన్యాకుమారిఁ జేరినపు డాతనిచేత నొక కాసైన లేదు. మాతృదేవ్యాలయము, సాగరమధ్యమునఁగలదు. అచటకు నావమీఁదఁబోవలెను. నావనెక్కుటకు ధనమేది? కాని యాతఁడపరాంజనేయునివలె, మాతృనామస్మరణైక భాగ్యాధారుఁడై తటాలున సాగరమునఁబడి, రెండునిముసములలో నీఁదుకొనిపోయి, ఆలయమును జేరి, మాతృవిగ్రహముకడ సాష్టాంగ నమస్కారమొనర్చి, పంచేంద్రియపరికల్పితశరీరసౌధము పగుల్చుకొనిపోయి, చిత్తాహంకారాతీతవీధికి జివ్వననెగిరి, అఖండవిజ్ఞాన, అపరిమితకళాప్రపూర్ణ, అప్రమేయ భక్తివైరాగ్య సంపత్కలితయగు పురాతనభారతమాతం దర్శించి, తనజన్మము పావనమయ్యెనని, తన హృదయము నిష్కల్మషమయ్యెనని, తన యనేకజన్మార్జితకర్మరాశి దగ్ధమయ్యెనని, తలఁచి, ధన్యమూర్తియై లేచి, భారతవర్ష దక్షిణాగ్ర శిలాతలమ్మున నాసీనుఁడై, స్వామి ప్రస్తుతభావిభారతభాగ్యదశలనుగూర్చి, తలపోయ నారంభించెను. బాహ్యమున సాగర ముత్తుంగతరంగములచేఁ బ్రచలిత మగుచుండెను. కాని, సాగరాట్టహాసమును మితిమీఱి, యెట్టి యనంతభావతరంగసంఘట్టన మాతనిహృదయము నుఱ్ఱూఁతలూగించెనో యెవ్వరికెఱుక? ఆనిర్మలధ్యానముద్రావస్థలో గంటలుగంటలు గడచెను. మధ్యమధ్య నాతఁడా వేశాగ్నిజ్వాలోష్ణమును సహింపఁజాలక, దీర్ఘనిశ్వాసముల నిగిడ్చి, సాగరమును కంపింపఁ జేయును. ఆశిలాతలమ్మున నట్లు ప్రతిష్ఠితుఁడై, మాతృదేశోద్ధారణైకమార్గాన్వేషణనిమిత్తాచంచలవిగ్రహుఁడై, యున్న యాస్వామిమూర్తి కన్నులారఁగాంచి, యానందింపనియాజన్మమేల? శిలాగ్రమున శిలావిగ్రహమురీతి నిశ్చంచలుఁడై, గూరుచుండి, దృష్టి ద్రిప్పి, స్వామి మాతృదేశమునందలి ప్రతియంగుళము,

యొక్క మహాత్త్వమును తెలిసికొనుచున్నవానివలె, తెప్పవాల్చక చూచుచుండెను.

ఆసనముముందున స్వామి హృదయములో విచారించిన భావములను దెలిసికొని వర్ణించుట కొక వ్యాసుఁడో, కాళిదాసుఁడో యున్న నొకించుక సాధ్యమగునేమో? మహాసంస్కర్త, మహావిద్యాసక్తుల మహోద్దేశములు, ప్రపంచైకమహాజాతివిధాతయొక్క తీక్ష్ణాభివేశము, మనువ్యాసాదుల ధర్మశాస్త్రోద్ధారలత, శ్రీశంకరాచార్యబుద్ధభగవానుల తీవ్రతమధిషణామయకారుణ్యరసప్రవాహము, శ్రీకృష్ణ శ్రీచైతన్యుల దయాసాగరాంతరకేళీవిలాసోల్లాసములు మిళితములై స్వామిహృదయమునఁ బ్రత్యక్షమయ్యెను. భారతవర్షమును సృజించిన యాసృష్టికర్తయొక్క మహోద్దేశము నాతఁడు తర్కించెను ఆతఁడు వంగదేశమును, పంజాబుదేశమును, మహారాష్ట్రమును గూర్చి తలంపలేదు. పరిపూర్ణ భారతవర్షమును గూర్చియే యాతని ధ్యానము. అట్టి ధ్యానమును సల్పిన భారతవీరులసంఖ్య స్వల్పము. వర్షసహస్రంబుల వెనుకనుండి యెట్టియెట్టిమహాపుంగవులెట్టిత్యాగాగ్నికుండములలోఁ దమప్రాణధనములను వేల్చినారో, యెట్టి పతివ్రతాతిలకము లెట్టి తీవ్రతమదీక్షకు లోనై, కాయములను స్వయంపరికల్పితచితుల కర్పించిరో, యెట్టి మహాచక్రవర్తు లెట్టిస్వధర్మ, స్వదేశ, స్వపరివారరక్షణార్థమై సామ్రాజ్యములను గడ్డిపరకలవలె విసర్జించి ధనరాసులను మంటిముద్దలరీతి నిరీక్షించి, భోగభాగ్యములఁ బూదిలోఁగల్పి తమ జన్మముల నెట్లు సాఫల్యమొనర్చికొనిరో, యివన్నియుఁ దలఁచునప్పటికి స్వామిశరీరము కంపించి యాతని నేత్రములనుండి యశ్రుధారపరంపర లుబికి ప్రవహింపఁ జొచ్చెను అట్టితఱి స్వామికిఁ గల్గినకోర్కెయెద్ది? సనాతనధర్మదివాకరకరవ్యాప్తి కడ్డుపడుచున్న పాశ్చాత్యతుచ్ఛనాగరికతామేఘసంఘాతముల నద్వైతవేదాంతసందేశఝంఝూనిలముచేఁ

దుత్తునియలు చేసి, ప్రాచీనార్యప్రబోధిత ధర్మసూత్రములచేఁ బంచఖండములను బంధించి, ప్రవృత్తిమార్గలంపటులచేఁ బ్రబలిన దుర్నీతిసంజాత, కామక్రోధసముద్భూత, పరపీడనవాంఛాపరికల్పిత, దురహంకారమమకారభూతముల దగ్ధీభూత మొనర్చి లోకమును నిర్మల ప్రశాంతికన్యకాధీనము చేసి మోక్షోన్ముఖతకుం దోడ్కొనిపోవుటే స్వామి కోర్కె. హిందూజనసహస్రంబుల హృదయములలో భగవద్దర్శనమునకై పొంగిపొరలుచున్న దివ్యకాంక్ష, అప్రతిహతావేశము, నివియే హిందూమతమని స్వామి తలంచెను.

ప్రాచీనమహర్షివర్యులవలె స్వామియు ననేకములో నేకసూత్రమును జాతీయజీవనరహస్యము నద్భుతదృష్టిం దిలకింపఁ గల్గినను నాతని భావోద్రేకములన్నియు, నాతని మహాశయములన్నియు, దరిద్రమానవకోటిమీఁదనే కేంద్రీకృతములయ్యెను. సమస్తజ్ఞానానుభవములు సమస్తధర్మములు నెవఱికొఱకు? అదృష్టదేవతాశీర్వాదబలముచే భారతభూమినిఁ బాలింపసమకట్టిన వివిధదేశప్రభుహస్తములచే నిర్మితములయిన శాసనములన్నియు నెట్లు తన సోదరసహస్రంబులకు దినఁదిండి, కట్టగుడ్డ, నిలువఁదావు నక్షరపరిచితి లేకుండఁజేసి పాలితులనెడ నెట్టిఘోర మొనర్చినవో యాతఁడు తలంచి క్రోధఘూర్ణితమానసుఁడయ్యె నిక్కముచే మాతృదేశమున దారిద్ర్యదందహ్యమానులగుచు నధఃపతనప్రాప్తి నఱ్ఱులెత్తి యంగలార్చుచున్న సోదరబృందముల దుస్థితికిఁ బ్రధానహేతుభూతములు, అర్చకబృందతృష్ణ, వర్ణభేదకాఠిన్యము నివియే యని స్వామి దృఢముగా నమ్మెను. సనాతనధర్మశాఖ లనంబడు నీయంత్యజాతిసహస్రంబుల నస్పృశ్యులని మూలకుఁద్రోసి యభివృద్ధ్యవకాశములఁ దొలంగించి యణఁగద్రొక్కిన నీకారణములు దాటరాని కఠినశిలామయకుడ్యంబులై దేశసౌభాగ్యవినాశహేతువులై యుండెనని స్వామి తలంచెను.

వెంటనే స్వామిహృదయము స్వానుభవైకప్రవేగముచేఁ బయనమై అగ్రజాత్యహంకారతాడితులై దారిద్ర్యపిశాచపీడితులై తల్లడిల్లుచున్న సోదరకోటితోఁబాటు తల్లడిల్లి వారి యవమానము తనదిగా భావించి వారి దుర్భరదుఃఖసాగరమును తానే దిగమ్రింగి సనాతనధర్మరక్షణముపేర వారసులమని చెప్పికొనుచు జాతివిచక్షణాలు కల్పించి పరస్పరప్రేమలతను తెంపివైచిన పురోహితనామకదేశద్రోహకబృందమును స్వామి దూషించి "ఈయధఃపతితసోదరబృందము నుద్ధరింప మేము సన్న్యాసము స్వీకరించి యేమిచేసితి" మని యాత్మపరీక్షను చేసికొని "ఆఁకటిబాధచే నడలుచున్నవారికిఁ దత్త్వశాస్త్రమును బోధించుచుంటిమా? ఏమిపిచ్చిపని" యని తలఁచి అన్న మన్నమని యేడ్చువారలకు మతబోధచేయుట మూర్ఖ్యమని శ్రీకృష్ణభగవానుఁ డుచ్చరించుట న్యాయమని గ్రహించి ప్రథమమున వారి కుక్షింభరిత్వసాధనమును జూచినచో వెనుక వారే నూతనవేదసహస్రంబుల సృజించుకొనఁగలరని యెంచి, యట్టి నూతననిర్మాణసాధనమునకు వలయునవి, యొకటి జనము, రెండు ధనము నని స్వామి నిశ్చయించుకొనెను.

కాని, చేతఁ జిల్లిగవ్వయైన లేని సన్న్యాసి యేమిచేయఁగలఁడు? ఈమాట తలంపునకు రాగానే స్వామిచిత్తము విహ్వలత జెందెను. కాని హృదయాంతరాళమునుండి, ధైర్యోద్రేకములు బయల్వెడలి, "మదీయ గురుకటాక్షముచే నీకార్యమును నిర్వహించెదను. నాగురుకటాక్షకృపాతిరేకముచే, భారతదేశమందలి ప్రతిపట్టణమునుండి
చే, విద్యాభావముచే, మానవత్వము గోల్పోయి మల
నాసోదరకోటి నుద్ధరించుటకై, ప్రాణములను
ర్పింపఁ బర్వెత్తికొనుచువచ్చు వీరసహస్రాళి
మతిశీఘ్రముగావచ్చితీరును. కాని నేను ధన

మెచ్చట తేఁగలను? ఈజాతీయజీవనపునరుద్ధరణభారమును భుజముల పై నిడుకొని, యీమహోద్దేశముతో హృదయము చెక్కలగునట్లఱచుచు, నాశేతుశీతనగము తిరుగాడితిని ధనోన్నతుల గృహములకు, రాజాధిరాజుల ప్రాసాదములకు నేగితిని. ఎచ్చటకఁగినను శుష్కవచనములగ్రోలించుటేకాని, నిక్కముగు సహాయము లభించియుండలేదు. ఇఁక హిందూస్థానవాసులసహాయమునకై నీళ్లునిడ చెదను. ఇఁకనేను మాతృదేశమును విడచి, సాగరముదాటి, పశ్చిమఖండముల కరిగి, సోదరదరిద్రినారాయణసహస్రింబుల నుద్ధరింపుఁడని మొఱ్ఱపెట్టెదను. అచ్చట ధనము నార్జించి,తిరిగి, మాతృదేశమున కరుదెంచి, నాకార్యక్రమము ను కొనసాగించెదను. కొనసాగకున్నచో నీమహాప్రయత్నములోఁబడి చచ్చెదనుగాక" యనుమహాప్రతిజ్ఞాపూర్వక వాక్యములు స్వామినోట నుండి యుచ్చరింపఁజేసెను.

స్వామి తన స్వదేశయాత్రలో దరిద్రమానవకోటినిఁ దలంచుచు నెన్నియో నిద్రాహారశూన్యదినములు గడపియుండెను. ఆతని మనోద్రేకములన్నియుఁ గన్యాకుమారియొద్ద కేంద్రీకృతములైనవి. ఆతని భావిజీవితదృశ్య మాతనికిఁ గట్టెదుటఁ గన్పట్టెను. సాగరోపరి భాగమునుండి, బాష్పఝరీనికరపరిప్లుతమయినదృష్టి యాతఁడు వివిధదేశాంతరములకుఁ బరపెను. ఆతనిహృదయ మొక్కపెట్టున, కాళీమాతృపదారవిందములమీఁదికి, ధన్యోత్సాహముతోఁ దిరిగెను. ఆక్షణము మొదలిడి. నిక్కముగా స్వామిజీవితము, మాతృదేశమునందలి దరిద్రనారాయణులకై, అస్పృశ్యనారాయణులకై, అధఃపతిత నారాయణులకై సమర్పింపఁబడెను. ఆక్షణమున నాతనిదృష్టికి కల్పసమాధి,బ్రహ్మానందము నివి భ్రమలుగాఁదోఁచె... ద్భాగములో వారణఁగద్రొక్కఁబడినపుడు భ...
నాకొక్కడే నారాయణుఁడు గలఁడు. నాక్ర...

నాయధఃపతితనారాయణుఁడు, సర్వదేశములలోని నాదరిద్రనారాయణుఁడు వీరిని, నాప్రాణములర్పించి, యర్చించు మహాభాగ్యములభించునెడ, నెన్నివేల నీచాతినీచజన్మములైన నెత్తి, యెన్నిదుర్భరయాతనలనైన ననుభవింప సంసిద్ధుఁడ"నని స్వామి గంభీరాత్మోపన్యాసముచే నుద్దీప్తవదనుఁడై, ధ్యానమునుండి లేచెను. ఆక్షణమున స్వామికి మతమన ధర్మముగాదు. వేదములుగావు. ఉపనిషత్తులుగావు. ఋషిధ్యానములుగావు. ప్రజాహృదయము, వారిజీవితములు, వారి ఆశయములు, వారిదుఃఖపరంపరలు, యవమానములు, వారి యుచ్ఛ్వాసనిశ్వాసములు.

సమస్తవేదములు, సమస్తధర్మములు, ప్రజోద్ధరణసాధనేతరములైనచో నయ్యవి ధూళిరేణుతుల్యములేయని యాతఁడు తలంచెను. ఎద్దానినుండి వేదము లుద్భవించినవో, యెద్దానినుండి యాత్మ ప్రభవించినదో, యెద్దానినుండి మానిప్రవరు లావేశపూరితులైరో, యెద్దానినుండి, అవతారపురుషులు తమయనంతకారుణ్యరసామృతస్వీకృతిగంటిరో, అట్టి యప్రతిహతాద్యంతరహితశక్తి, స్వామిహృదయమం దాక్షణముననే ప్రవేశించెను. అట్టి యమోఘశక్తి, తననుండి వెలరేగి, సర్వప్రజాసంఘములఁ బురికొల్పి, నిర్విఘ్నముగా, నిరాఘాటముగా, భారతదేశపునరుద్ధరణమహాకార్యమునందుఁ బాల్గొను నట్లు చేయునని స్వామి దృఢముగా నమ్మెను. కన్యాకుమార్యగ్రిమునొద్ద, స్వామి, మహోత్కృష్టదేశభక్తుఁడు మహోన్నతమతప్రవక్త, వీరిస్థానముల నలంకరించెను.

ఇట్టిస్వామిధ్యానము శుష్కాభినివేశమా ? ఆతనిధ్యానము జీవాగ్నిజ్వాలాప్రదీప్తము." నాజీవిత మొసంగవలయు నందేశమిపుడు నాకు లభించినది. మాతృదేశ సంరక్షణార్థము,సర్వప్రపంచమోక్షము నిమిత్తము, పాశ్చాత్యఖండములకేగి, నేను సనాతనధర్మదుందు

భిని మ్రోగించెదను. లక్ష్మీసరస్వతీ వరప్రసాదములచే వెల్గొందుచున్న పశ్చిమప్రపంచము, ప్రాచ్యధర్మసందేశమును గుర్తించి తీరవలయును. అప్పుడు పాశ్చాత్యులఁగాంచి, ప్రాచ్యఖండము తిరిగి తన సహజాద్భుతజీవనౌన్నత్యమును గమనించి తీరవలెను. కావున ధర్మముకొఱకు, హైందవ దరిద్రనారాయణ సహస్రంబులకొఱకు, భారతభూమికొఱకు, నేను పశ్చిమఖండములకరిగి, మాతృదేశోద్ధరణావకాశములను సంగ్రహించి సనాతనధర్మసందేశోత్కృష్టతను ప్రపంచముచే నర్చింపఁజేసెద”నని స్వామి ప్రతిజ్ఞబూనెను.



సమాప్తము.





## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA118B182 |
| పుస్తకం పేరు | వివేకానందస్వామి జీవితము |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 269 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | II, 3 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Sowmya |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |